


రాహుకేతువుల పై పరిశోధన గ్రంథం - రాహుకేతువుల యోగం గ్రంథకర్త
ప్రముఖ అంతర్జాతీయ జ్యోతిష, వాస్తు, సంఖ్యా, ఆగమ,
ఖగోళ, గణితశాస్త్ర పండితులు
భక్తి TV, 6TV, ABN, TNN, V6TV, మా TV, ఈTV, NTV, CVR న్యూస్,
సహస్ర, పూజ TV మరియు వివిధ ఛానల్స్ ఉపన్యాసకులు

పండిత బ్రహ్మశ్రీ **డా॥ నాయకంటి మల్లికార్జున శర్మ**

M.A(ENG), M.A(Astrology), M.Sc(Maths),
PGD(Jyothirvaasthu), Ph.D



ప్రకాశకులు: ఫోన్ : **0883-2462565**

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హెూటల్ ఎదురుగా, కోటగుమ్మం,
**రాజమండ్రి - 1.**

Like us to Follow: **Face Book** / Mohan Publications
Find us on: **Google Play Android App..** Mohan Publications

 **2017** వెల : రూ॥లు **270-00**

రచయిత చిరునామా:

ప్రఖ్యాత జ్యోతిష, వాస్తు, సంఖ్యాశాస్త్ర పండితులు

వివిధ టి.వి. ఛానల్స్‌లో జ్యోతిష ప్రవచకులు

**పండిత బ్రహ్మశ్రీ డా॥ నాయకంటి మల్లికార్జున శర్మ**

M.A(ENG), M.A(Astrology), M.Sc(Maths), PGD(Jyothirvaasthu), Ph.D

ప్లాట్ నెం. 186, ఇంటి నెం. 3-14-101/2, జడ్జెస్ కాలనీ

(విజయశ్రీనగర్ కాలనీ)

చెరుకూరి అపార్టుమెంటు ఎదురుగా, సహారా ఎస్టేట్ దగ్గర, వనస్థలిపురం,

హైదరాబాద్-500070, తెలంగాణ

మరియు

3వ వీధి, 13వ రోడ్డు, బ్రాడీపేట, గుంటూరు, ఆంధ్రప్రదేశ్

ఫోన్ : 9849280956 / 9490319396 / 9000757587

(040) 65884956

వాట్సప్ నెం. : 9000085204

Website: www.mallikarjunasharma.com

www.nayakanti.com

Google : nayakanti mallikarjuna sharma

Email: naayakanti@gmail.com

nmksharma@hotmail.com

mallikarjunasharma@yahoo.com

Facebook: nayakantimallikarjunasharma.com

# శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర జ్యోతిషాలయం

(రి.నెం. 2153/10)

1. శాస్త్రీయ పద్ధతిలో జాతకములు
2. కంప్యూటర్ ద్వారా జాతకములు, పద్నాలుగు (14) భాషలలో లభించును. అవి:

   1. తెలుగు, 2 హిందీ, 3 ఇంగ్లీషు, 4) కన్నడము, 5) తమిళము, 6) మళయాళము, 7) ఒరియా, 8) మరాఠి, 9) గుజరాతి, 10) రాజస్థాని, 11) అస్సామి, 12. పంజాబి, 13) నేపాలి, 14) బెంగాళి
3. జాతక ఫలితములు, విశ్లేషణ
4. జాతకముల ద్వారా బాలారిష్టములు, ప్రేమ, భాగస్వామ్యం, వివాహం, సంతానం, విద్య, ఉద్యోగం, వ్యాపారము, విదేశీయానము, ప్రమోషన్, ఋణబాధలు, వ్యవసాయము, గృహయోగములు, స్థిరత్వము, ప్రమాదములు, కోర్టు వ్యవహారములు, వివాదాలు మొదలగు ఫలితములు ఇవ్వబడును.
5. సైంటిఫిక్ జాతకముల ఫలిత విశ్లేషణ.
6. వధూవరుల వివాహపొంతనములు.
7. ఉపనయనము, వివాహము, బారసాల, నామకరణము, అన్నప్రాసన, అక్షరభ్యాసము, కేశఖండనము, నిశ్చితార్థము, గర్భాదానము, శ్రీమంతము, దత్త స్వీకారము, షష్ఠిపూర్తి, ఉద్యోగములో చేరుటకు, వ్యాపారము ప్రారంభించుటకు, ఫ్యాక్టరీలు, సినిమాహాలు ప్రారంభించుటకు, గృహారంభము, గృహప్రవేశములకు, వ్యవసాయ పనులకు మొదలగు వాటికి సుముహూర్తములు నిర్ణయించబడును.
8. ఉపనయన వివాహలగ్న పత్రికలు వ్రాయబడును.
9. గోచార రీత్యా ఫలితాంశములు.
10. ప్రశ్న శాస్త్రము ద్వారా ఫలితములు.
11. సంఖ్యాశాస్త్రము ద్వారా ఫలితములు.
12. హస్తసాముద్రిక ద్వారా ఫలితాంశములు.
13. నాడీ శాస్త్రము ద్వారా ఫలితాంశములు.
14. స్థల నిర్ణయము, గృహ ఆయము (కొలత) వాస్తు శాస్త్రము ఆధారముగా గృహనిర్మాణము, అపార్టుమెంటులు ఫ్యాక్టరీలు (కంపెనీలు), ఆఫీసులు,

షాపులకు, సినిమా థియేటర్లు, ప్రభుత్వమునకు సంబంధించిన భవనములకు, స్టార్‌హోటల్స్, కాలేజీల మొదలగు నిర్మాణములకు వాస్తు నిర్ణయము మరియు వాస్తు ప్లాన్ వేసి ఇవ్వబడును. ప్లాన్ వేసినవి పరిశీలించడం జరుగును.

15. శాస్త్రీయమైన వాస్తు నిర్మాణమే కాకుండా సైంటిఫిక్ వాస్తు, కాస్మిక్ వాస్తు, చైనా వాస్తు కూడా చెప్పబడును. వ్యాపార సంస్థలకు, ఫ్యాక్టరీలు, సినిమాహాల్సు మొదలగు సంస్థలకు పూజలు చేయబడును.
16. శ్రీలక్ష్మీగణపతి, సుదర్శన, చండీ, రుద్ర, మహాలక్ష్మీ, కుబేర, వాస్తు మొదలగు హోమములు, శ్రీచక్ర, అష్టదిగ్భంధన, మత్స్య, వాస్తు, కుబేర మొదలగు యంత్రములు ప్రతిష్ఠించబడును. నాడీ శాస్త్రము ద్వారా భవిష్యత్తు చెప్పబడును.
17. ఆదిత్యాది నవగ్రహ జపములు, కుజ దోష నివారణ, శుక్ర గ్రహ దోష నివారణ, శనిదోష నివారణ, ఆదిత్యాది నవగ్రహదోష నివారణ అనంత, కులిక, వాసుకి, శంఖపాల, పద్మకాల, మహాపద్మకాల, తక్షక, కర్కోటక, శంఖచూడ, ఘటక, విషక్త, శేషనాగకాల సర్పదోషముల నివారణ, దృశ్యార్థ, అదృశ్యగోళార్థ కాల సర్పదోషముల నివారణ, కాలసర్ప పాశుపతాస్త్ర రుద్రాభిషేకములు చేయబడును.
18. సుందరకాండ, సప్తశతి పారాయణము, మన్యుసూక్త పారాయణం, రుద్రపారాయణము, మొదలగు పారాయణములు చేయబడును.
19. సుబ్రహ్మణ్యస్వామి అభిషేకము, ధనలక్ష్మీ సరస్వతీ పూజలు, అన్నిరకముల వ్రతములు చేయబడును.
20. హస్త సాముద్రికము ద్వార జనన వివరణ లేనివారు జాతకుని భవిష్యత్ గురించి తెలుసుకోనవచ్చును. ఆగమశాస్త్ర ప్రకారము దేవాలయ నిర్మాణ విధానం ఇవ్వబడును.
21. దేవాలయ స్థల నిర్ణయము, దేవాలయ ఆలయముల కొలతలు, సశాస్త్రీయ పద్ధతిలో దేవాలయ శంఖుస్థాపన, విగ్రహ ప్రమాణముల ప్రకారము దేవాలయ నిర్మాణము దేవాలయము నిర్మాణమును బట్టి ధ్వజస్థంభ ఎత్తు నిర్ణయము, పీఠము నుండి ధ్వజ స్థంభము మధ్య కొలత నిర్ణయము, ఆగమశాస్త్ర ప్రకారము విగ్రహములు ఉంచు స్థలములు దేవాలయ నిర్మాణము పూర్తి అయిన తరువాత దేవాలయ ప్రతిష్ఠ జరుగును. శైవ, శాక్తే, పాంచారాత్ర, వైఖానస మొదలగు ఆగమ శాస్త్రములు ప్రకారముగా ప్రతిష్ఠలు చేయబడును. కాలసర్పయోగము గల వారికి ప్రతిష్ఠలు చేయబడును.
22. మీకు కలిగిన సందేహాలను ప్రశ్నాశాస్త్రము ద్వారా తెలుసుకోగలరు.
23. సంఖ్యాశాస్త్రము ద్వారా జాతకము తెలుసుకొనగలరు. జన్మతేది లేనివాళ్లు పేరు ద్వారా కూడా ఫలితములను తెలుసుకొనవచ్చును.

24. స్వచ్ఛమైన మహిమగల రుద్రాక్షలు, మహిమాన్వితమైన జాతి నవరత్నములు, దైవాంశగల సాలిగ్రామములు, స్ఫటికములు, స్ఫటిక డాలర్లు.
25. అత్యంత మహిమాన్వితమైన సమస్త స్ఫటిక దేవతా విగ్రహములు, మహిమ గలిగిన దక్షిణావృత వామావృత శంఖములకు హాతాజోడీలకు.
26. విశిష్ఠ మహిమగల, సూర్యకాంతశిల, చంద్రకాంతశిల, మరకత, పాదరస, పగడ, బాణలింగములు మొదలగునవి.

*మా దగ్గరికి వచ్చిన వాళ్లకి ఎలాంటి సమస్యలైన పరిష్కారం చేయబడును.*

*శుభం*

**జ్యోతిష విభూషణ, జ్యోతిషరత్న, వాస్తురత్న, సంఖ్యా శిరోమణి, హస్తసాముద్రిక పండిత, రత్నరుద్రాక్ష నిపుణులు, త్రికాలజ్ఞాన విభూషణ, స్వర్ణఘంటా కంకణ గ్రహీత, కనకాభిషేక సన్మానిత, బి.వి.రామన్ అవార్డు గ్రహీత, భవిష్య సింధు చీఫ్ ఎడిటర్**

**పండిత బ్రహ్మశ్రీ డా॥ నాయకంటి మల్లికార్జున శర్మ**

M.A(ENG), M.A(Astrology), M.Sc(Maths),

PGD(Jyothirvaasthu), Ph.D

**ప్లాట్ నెం. 186, ఇంటి నెం. 3-14-101/2, జడ్జెస్ కాలనీ (విజయశ్రీనగర్ కాలనీ)**
**చెరుకూరి అపార్టుమెంటు ఎదురుగా, సహారా ఎస్టేట్ దగ్గర, వనస్థలిపురం,**
**హైదరాబాద్-500070, తెలంగాణ**
**ఫోన్ : 9849280956 / 9490319396 / 9000757587**
**(040) 65884956**

# కాలసర్పయోగ చంద్రిక
## విషయసూచిక

# 1. కాలసర్పయోగ విశేష సంకల్పము

మమ సహకుటుంబానాం సపుత్రీ సపుత్రకస్య సభాతృకస్య సభాందవస్య సాశ్రిత వర్గస్య క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషార్థ ఫల సిద్ధ్యర్థం.

కాలసర్పదోష, అసంపూర్ణకాల సర్పదోష సవ్యకాల సర్పదోష, అపసవ్యకాల సర్పదోష, లగ్న సవ్య కాలసర్పదోష, లగ్న అపసవ్యకాల సర్పదోష, అనులోమకాల సర్పదోష, విలోమకాల సర్పదోష, గోచారకాలసర్పదోష, మిశ్రమకాలసర్పదోష, అర్ధకాలసర్పదోష, ప్రకాశిత కాలసర్పదోష, అనంతకాలసర్పదోష, కుళికకాల సర్పదోష, వాసుకీకాలసర్పదోష, శంఖపాలకాలసర్పదోష, పద్మకాలసర్పదోష, మహాపద్మకాలసర్పదోష, తక్షకకాలసర్పదోష, కర్కోటకకాలసర్పదోష, శంఖచూడ కాలసర్పదోష, పాతఃకాలసర్పదోష, విషక్తకాలసర్పదోష, శేషనాగ కాలసర్పదోష, ఐరావత కాలసర్పదోష, ధనంజయ కాలసర్పదోష, దృశ్యగోళార్ధ కాలసర్పదోష, అన్యదృశ్యగోళార్ధ కాలసర్పదోష, అదృశ్యగోళార్థ కాలసర్పదోష, అన్యఅదృశ్య గోళార్థ కాలసర్పదోష, వివిధ కాల సర్పయోగ దోష నివారణార్థం సర్పదోష నివృత్యర్థం.

మమ జన్మనక్షత్ర వశాత్ జన్మరాశి వశాత్ నామరాశివశాత్ నామాంశ వశాత్ జన్మాంశవశాత్ జన్మలగ్నవశాత్ గోచార వశాత్ అంగగ్రహవశాత్ భావగ్రహ వశాత్, కాలచేష్టానైసర్గిక దిగ్బలవశాత్ మారక గ్రహ వశాత్ భూతగ్రహ వశాత్ సంవత్సర బలవశాత్ మాసబలవశాత్ పక్ష బలవశాత్ దినబలవశాత్ మాత్రాది షోడశస్వర బలవశాత్ లగ్న హోర ద్రేక్కాణ చతుర్థశాంశ సప్తమాంశ నవాంశ దశమాంశ ద్వాదశాంశ షోడశాంశ వింశాంశ సప్తవింశాంశ చతుర్వింశాశ సప్తవింశాంశ త్రింశాంశ ఖవేదాంశ అక్షవేదాంశ షష్ఠాయంశ అనులోమ విలోమ వర్గోత్తమ మహాదశాంతర్దశ సూక్ష్మదశ ప్రాణదశ వక్ర స్థంబాది సర్వగతి వశాత్ షడ్బలవేధ వశాత్.

జన్మత్రిజన్మ సాంఘాతిక సాముదాయక వేధవైనాశిక మానస లత్తో పగ్రహ వేధ వశాత్ దుష్ఠ తిధి వారనక్షత్ర యోగ కరణ ముహూర్త లగ్న వశాత్ సర్వతోభద్ర చక్రరాశి గ్రహోపగ్రహ వశాత్ గోచార అష్ఠక వర్గాది జీవరూపాది బలైశ్వర్యామళ ప్రోక్తవశాత్.

ఇహజన్మని జన్మాంతరేషు జ్ఞానతో అజ్ఞాన మయాకృత సకల దుర్ధోష పాప పరిహారార్థం. కామక్రోధలోభమోహా మదమాత్సర్యాది దైవ, మాతృ, పిత్రు, గురు వివిధ శాప ఆదివంద్యాది దశవిద వంద్యాదోష అష్ఠనాగదోష, నవనాగదోష, ద్వాదశనాగదోష, సర్పదోష, దేవబ్రాహ్మణ శాపదోష, గురు వృద్ధ గోబ్రాహ్మణ,

శిశు, స్త్రీ, పతి (భర్త) హింసాయుత గర్భపాతనిమిత్తౌషధ దానేనవ గృహ దహనేనవా సంభావిత ప్రతి భంధనివారణార్థమ్.

రాహు కేతు మధ్యస్థిత జనిత గ్రహణ దోష ఛాయాగ్రహ దోష ఆదిత్యాది నవగ్రహదోష శుకశారీరకా మార్జాలాది హింసయావాదోష.

మమజన్మాంతర సూచిత సర్పదోష చామరాది తోరణసింహాసన గజ తురగ ఖడ్గ కుంతల ఛురికాదిగ్భల ప్రవర్తక్ దశాఙ్క రాహు చక్రాది నరపతి చతుష్పతి చక్రవశాత్ ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక, తాపత్రయ, భూమ్యాంతరిక్ష, దివ్య, మహోత్పాత, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవిక, తాపత్రయ, భూమ్యాంతరిక్ష, దివ్య, మహోత్పాత, జనిత దుస్వప్న, దుశ్శకున దుర్నిమిత్త సూచిత, సూచ్యమా భూత భవిష్యత్ వర్తమాన కాలత్రయేషు, పరకీయమంత్ర తంత్ర యంత్ర విషప్రయోగ అభిచార క్రియాది సంభవిత సకల దుష్టారిష్ఠ నివృత్తి ద్వారా ఇష్ఠదేవతా కులదేవత కాలసర్పదోష నివారణద్వారా మమక్షేమ స్థైర్య ధైర్య విజయాభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్యర్థం ఇష్టకామ్యార్థ సిద్ద్యర్థం చింతిత సమస్త మనోరథ ఫల ప్రాప్యర్థం సకల శత్రుబాధా నివారణార్థం సర్వశత్రూ ఫలాయన సిద్ధి ద్వారా రాజద్వారే, రాజముఖే, సర్వదా దిగ్విజయార్థం, సర్వశత్రూన్, మిత్రత్వ సిద్ధి ద్వారా సర్వకార్య అనుకూల్యతా సిద్ధ్యర్థం.

అన్యోన్య దాంపత్యవృద్ధిద్వారా గృహేశాంతి పూర్వక ఆయుష్యాభివృద్ధ్యర్థం, అనయోర్ దంపత్యోః పరస్పర మనోవైకల్య ద్వారా పరస్పరాన్యోన్యతాతిశయ సిద్ధిద్వారా సుఖజీవన సంతాన సాఫల్యతా సిద్ధి ద్వారా సుఖేన జీవనౌనంద సిద్ధ్యర్థం మమ గృహే అలక్ష్మీ పరిహార ద్వారా శ్రీమహాలక్ష్మీ పరిపూర్ణతా ఫలసిద్యర్థం ధన కనక వస్తు వాహన ధేను కాంచనాభి వృద్యర్థం.

నిజకులా చారానుష్ఠాన తాత్పర్య పుత్ర మిత్ర కళత్ర (భాతృ భాంధవ దాసాదాసీ జన సహిత విమల విజ్ఞాన సంపన్న నానావిధ సౌఖ్యానుభవ సిద్యర్థం. స్థూల సూక్ష్మ కారణ తను త్రయాధిష్ఠిత కార్మిక మాయి కాణవోత్థిత కాయక వాచిక మానసిక త్రయగుణిత శేషపాప నివృత్యర్థం అనేక జన్మ సహస్రానుభూయమా ఆధ్యాత్మిక భౌతిక దైవిక దుఃఖత్రయ నివృత్యర్థం.

ధర్శ్యపూర్ణమా సాగ్నిష్టోమాతిరాత్రాప్తోర్యామ! పౌండరీకా వాజపేయాది శతాధ్వర సంపూర్ణ సకలఫలావాప్యర్థం కోటిసువర్ణదాన పంచసహస్ర గజదాన దశ సహస్ర సువర్ణ శృంగాలంకృత ధేనుదాన నవత్సకోటి సుశీల గోదాన సర్వాలంకార సంయుక్త సహస్రాశ్వదాన సువస్త్ర స్వర్ణా భరణాంచిత దశకోటి కన్యాదాన ప్రధానోత్తరోత్తరానేక కాలపర్యంత దివ్యపభోగ స్వర్గలోకా వ్యాప్యర్థం

యేయే(గ్రహ శుభస్థానేషు స్థితాఃతేషాం గ్రహాణాం అత్యంత శుభఫలావ్యాప్యర్థం యేయే(గ్రహా అరిష్ఠస్థానేషు స్థితః క్రియ మాణ కరిష్యమాణ సూచిత భావిత ఆగామివర్తమాన వర్తమాన వర్తిష్యమాణ దుష్టారిష్ఠ పరిహార ద్వారా సతతం శుభఫలా వ్యాప్యర్థం సూర్యాదీనాం నవానాం గ్రహాణాం అనుకూల్యతా ఫలసిద్ధ్యర్థం. సర్వేగ్రహాం తత్ గ్రహశుభఫల ప్రాప్యర్థం, సంపూర్ణ జన్మ సాఫల్యతా సిద్ధ్యర్థం, నాగదేవతా అనుగ్రహ సిద్ధ్యర్థం, అష్ఠ, నవ, ద్వాదశ, నాగ దేవతా ప్రీతయే మమ యధోక్త కాలసర్ప యోగదోష శాంతిహవనం గత్వేన ఆదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థం శాంత్యర్థం అభ్యుదయార్థంచ మహాజన్పైహ స్వస్తిః పుణ్యాహవాచనం కరిష్యే ఆదౌ నిర్విఘ్నేన శ్రీమహాగణాధి పూజాంచ కరిష్యే.

## 2. సరియైన కాలసర్పయోగములు

1. జాతక చక్రంలో రాహు, కేతువుల మధ్య అన్య గ్రహములు ఉండి రాహుకేతువులు తన స్వంత నక్షత్రము (ఆరుద్ర, స్వాతి, శతభిషం, అశ్విని, మఖ, మూల)లలో రాహువు లేక కేతువులు ఉండి మరియు రాహువు లేక కేతువులు జన్మలగ్నము నుండి చతుర్ధ, పంచమ, సప్తమ, అష్టమ, దశమ స్థానములలో ఉండి ఆ స్థానములు త్రికస్థానములు అయిన పాప దృష్టి ఉండి లేక ఎక్కువ గ్రహములు ఉచ్ఛస్థానములలో లేకపోవుట దీనిని బలమైన కాల సర్పయోగము అందురు.
2. రాశి చక్రములో రాహు కేతువుల మధ్య సప్త గ్రహములు ఉండి రాహువు త్రిక స్థానములలో ఉండి రాహువుకు శత్రు గ్రహములైన రవి, చంద్ర, కుజులతో కలిసి ఉండి తను పంచమ, నవమ దృష్టులకు ఏ గ్రహాన్ని అయినా చూస్తున్నా మరియు రాహువు మహర్ధశ జరుగుతుంటే కాలసర్పయోగం అవుతుంది.
3. రాశి చక్రములో రాహు కేతువుల మధ్య సప్త గ్రహములు ఉండి కేతువు త్రిక స్థానములలో ఉండి కేతువుకు శత్రుగ్రహములైన శుక్ర శనులతో కలిసి ఉండిన కేతువు మహర్ధశ జరుగుతుంటే కాలసర్పయోగం అవుతుంది.
4. జన్మ జాతక లగ్నంలో రాహువు ఉండి సప్తమ స్థానంలో అన్యగ్రహములున్న కాల సర్పయోగము అవుతుంది.
5. జన్మకుండలిలో రాహు కేతువులమధ్య సప్తగ్రహములు ఉండి ఆ సప్తగ్రహములు త్రిక స్థానములలో ఏ ఒక్క గ్రహము కూడా ఉచ్ఛ స్థానంలో ఉండకూడదు మరియు శుభయోగములు (గజకేసరి, లక్ష్మీ, చంద్రమంగళ మొ॥నవి) కూడా ఉండకూడదు. దానిని సంపూర్ణ కాలసర్పయోగము అందురు.

6. జాతక చక్రములో రాహు కేతువుల మధ్య ఆరు గ్రహములు (రవి, కుజ, బుధ, గురు, శుక్ర, శని) ఉన్న క్షీణ చంద్రుడు బయట ఉన్నా (లేక) చంద్రుడు, రాహువు అంశకంటే తక్కువగా ఉంటే విషమ కాల సర్పయోగము అనబడును.
7. రాశిచక్రంలో రాహువు, కేతువుల మధ్య అన్య గ్రహములు ఉన్న దానిని కాల సర్పయోగము అందురు.
8. జన్మ చక్రములో రాహు కేతువుల మధ్య సప్త గ్రహములు ఉండి నవగ్రహములు త్రిక (దుష్ట-నీచ-శతృ) స్థానములలో ఉన్న విపరీత కాల సర్పయోగము అగును.
9. రాశిచక్రంలో లగ్నంలో కేతువు ఉండి సప్తమ స్థానంలో అన్య గ్రహములున్న కాల సర్పయోగము అగును.
10. జన్మకుండలిలో రాహు కేతువుల మధ్య సప్తగ్రహములు ఉండి రాహువు లేదా కేతువుకు కుడివైపున గాని లేదా ఎడమ వైపున గాని సప్త గ్రహములు (రవి, చంద్రుడు, కుజ, బుధ, గురు, శుక్ర, శని) బంధింపబడి ఉంటే కాలసర్పయోగం అవుతుంది.

### 3. కాలసర్పయోగముల రూపము-విశ్లేషణ

1. జన్మలగ్నంలో రాహువు సప్తమంలో కేతువు ఉన్నను దానిని అనంత కాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| | | రాహువు లగ్నం | కుజుడు |
| | అనంత కాలసర్పయోగం | | రవి బుధ శుక్ర శని, చంద్ర |
| | | | |
| | కేతువు | గురు | |

2. జన్మలగ్నం నుండి ద్వితీయంలో రాహువు అష్టమంలో కేతువు ఉన్నను దానిని కుళిక కాలసర్ప యోగము అందురు.

| | | లగ్నం | రాహువు |
|---|---|---|---|
| | కుళిక కాలసర్పయోగం | | చంద్ర |
| | | | శని |
| గురువు కేతువు | రవి | బుధుడు శుక్రుడు | కుజ |

3. జన్మలగ్నము నుండి తృతీయంలో రాహువు నవమంలో కేతువు ఉన్నను దానిని వాసుకి కాలసర్పయోగము అందురు.

| శని | లగ్నం | కుజుడు గురువు | రాహువు |
|---|---|---|---|
| శుక్రుడు చంద్రుడు | వాసుకీ కాలసర్పయోగం | | |
| రవి బుధుడు | | | |
| కేతువు | | | |

4. జన్మలగ్నము నుండి చతుర్థంలో రాహువు దశమంలో కేతువు ఉన్నను దానిని శంఖపాల కాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| రవి<br>శని, రాహు | | | |
| చంద్ర | శంఖపాల | | |
| శుక్ర | కాలసర్పయోగం | | |
| లగ్నం | బుధుడు | | కేతువు<br>కుజ<br>గురువు |

5. జన్మలగ్నము నుండి పంచమంలో రాహువు ఏకాదశంలో కేతువు ఉన్నను దానిని పద్మ కాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| | | | రాహువు |
| | పద్మకాల | | గురు<br>చంద్ర |
| | కాలసర్పయోగం | | రవి<br>కుజ<br>లగ్నం |
| కేతువు | | శని | శుక్రుడు<br>బుధుడు |

6. జన్మలగ్నము నుండి షష్ఠమంలో రాహువు ద్వాదశంలో కేతువు ఉన్నను దానిని మహాపద్మకాలసర్పయోగము అందురు.

| రాహువు | | | |
|---|---|---|---|
| చంద్ర | మహాపద్మ కాలసర్పయోగం | | |
| గురు శుక్ర | | | |
| రవి | బుధ | లగ్నం శని, కుజ | కేతువు |

7. జన్మలగ్నము నుండి సప్తమంలో రాహువు లగ్నంలో కేతువు ఉన్నను దానిని తక్షక కాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| రాహువు | తక్షక కాలసర్పయోగం | | |
| చంద్ర | | | లగ్నం కేతువు |
| కుజుడు | | రవి శని బుధుడు | గురువు శుక్రుడు |

8. జన్మలగ్నము నుండి అష్టమంలో రాహువు ద్వితీయంలో కేతువు ఉన్నను దానిని కర్కోటక కాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| | | | |
| | కర్కోటక<br>కాలసర్పయోగం | | రాహువు |
| రవి, బుధ,<br>శుక్ర,<br>శని,<br>కేతు | | | చంద్ర |
| లగ్నం | కుజ | గురువు | |

9. జన్మ లగ్నము నుండి తృతీయంలో కేతువు నవమంలో రాహువు ఉన్నను దానిని శంఖ చూడకాలసర్పయోగము అందురు.

| | | | |
|---|---|---|---|
| | | రాహువు | |
| | శంఖచూడ<br>కాలసర్పయోగం | | |
| | | | |
| | కేతువు | కుజుడు<br>గురువు<br>శుక్రుడు | లగ్నం<br>బుధుడు |

10. జన్మలగ్నము నుండి చతుర్థంలో కేతువు దశమంలో రాహువు ఉన్నను దానిని పాతక కాలసర్పయోగము అందురు.

<table>
<tr><td>రాహువు</td><td>బుధుడు</td><td>చంద్ర</td><td>రవి<br>శని, లగ్నం</td></tr>
<tr><td></td><td colspan="2" rowspan="2">పాతక<br>కాలసర్పయోగం</td><td>గురువు</td></tr>
<tr><td></td><td>కుజుడు<br>శుక్రుడు</td></tr>
<tr><td></td><td></td><td></td><td>కేతువు</td></tr>
</table>

11. జన్మ లగ్నము నుండి పంచమంలో కేతువు ఏకాదశంలో రాహువు ఉన్నను దానిని విషక్త కాలసర్పయోగము అందురు.

<table>
<tr><td>శుక్ర</td><td>చంద్రుడు<br>లగ్నం</td><td>రవి<br>శని</td><td>బుధ<br>గురు</td></tr>
<tr><td>రాహువు</td><td colspan="2" rowspan="2">విషక్త<br>కాలసర్పయోగం</td><td>కుజ</td></tr>
<tr><td></td><td>కేతువు</td></tr>
<tr><td></td><td></td><td></td><td></td></tr>
</table>

12. జన్మ లగ్నము నుండి షష్ఠమంలో కేతువు ద్వాదశంలో రాహువు ఉన్నను దానిని శేషనాగ కాలసర్పయోగము అందురు.

| | | | రాహువు |
|---|---|---|---|
| | శేషనాగ కాలసర్పయోగం | | లగ్నం చంద్రుడు |
| | | | శని |
| గురువు కేతువు | రవి | బుధుడు శుక్రుడు | కుజుడు |

## 4. కాలసర్పయోగ తీవ్ర పరిణామములు

1. జాతక చక్రములో పన్నెండు రాశులు ఉండును. అవి మేషం, వృషభము, మిథునము, కర్కోటకం, సింహం, కన్య, తుల, వృశ్చికం, ధనస్సు, మకరం, కుంభం, మీనం ఇవియే లగ్నములు ఒక్కొక్క రాశి ఒక్కొక్క లగ్నము అవుతుంది. ప్రతి లగ్నము ఒక్కొక్క భావము కలిగి ఉంటుంది. ఇక్కడ భావము అనగా మనకు జరిగే ఫలితము. అప్పుడు పన్నెండు లగ్నములను ద్వాదశ భావములు అని అందురు. ఆ భావములు వరుసగా తను, ధన, సోదర, మాతృ, సంతానము, శత్రు, కళత్ర, ఆయుర్ధాయం, పితృ, వృత్తి, లాభము, వ్యయ భావములు ఉన్నాయి. కాలసర్పయోగం ఏ వ్యక్తికైతే ఉంటుందో ఆ వ్యక్తి ఎన్నో ఇబ్బందులు పడవలసి వస్తుంది. గ్రహణ సమయంలో సూర్య, చంద్రులు ఎలా ఉంటారో అలాగే మనిషి జీవితం కొద్ది సమయాలలో (రెప్పపాటు కాలం) దుర్భలమైన నిర్ణయాలు తీసుకుంటారు. మనిషి యొక్క స్పర్శ లేకుండానే ఒక మాయలాగా వచ్చి దురదృష్ట సంఘటనలను కలుగ జేస్తుంది. దీనివల్ల పురాణంలో రాహు కేతువుల సంఘటనలు బట్టి వీటిని మాయా గ్రహములు లేక ఛాయా గ్రహములు అని అందురు.

| వ్యయం<br>పాపం | తను<br>మనస్సు | ధన<br>సంపత్తి | సోదర<br>పరాక్రమ |
|---|---|---|---|
| లాభం<br>పుణ్యం | లగ్న కుండలి | | మాతృ<br>భోగ |
| రాజ్య<br>వృత్తి | | | సంతానం<br>విద్య |
| పితృ<br>భాగ్యం<br>ధర్మము | ఆయుః<br>మృత్యు | భార్య<br>భాగస్వామి | రోగ<br>ఋణ<br>శతృ |

మేష లగ్నము నందు రాహువు ఉంటే ఏడవస్థానమగు తులలో కేతువు ఉండును. ఆ రాహు కేతువుల మధ్య సప్త గ్రహములు ఉండవలెను. అలాగే మేషలగ్నం నుండి ద్వితీయంలో రాహువు అష్టమస్థానంలో కేతువు ఉన్న కాలసర్పయోగము ఏర్పడును.

ఇదే పద్ధతి ప్రకారము పన్నెండు లగ్నములలో పన్నెండు విధాలుగా కాలసర్పయోగము ఏర్పడును. 12లగ్నములలో 12 విధాలుగా కాల సర్పయోగము ఏర్పడుట అనగా మొత్తం 12 ను 12తో గుణించగా 144 కాలసర్పయోగములు ఏర్పడును.

ఇలాగే మేష లగ్నమునందు కేతువు ఉంటే తులాలగ్నమందు రాహువు ఉండివ మిగతా గ్రహములు రాహువు కేతువుల మధ్య ఉంటే కాలసర్పయోగము ఏర్పడును. ఇదే విధంగా మేషలగ్నము నుండి ద్వితీయంలో కేతువు ఉంటే వృశ్చికమందు రాహువు ఉన్న కాలసర్పయోగము ఏర్పడును. పై పద్ధతి ప్రకారం 12 లగ్నములలో 12 విధాలుగా ఏర్పడుట వలన మొత్తం 144 కాలసర్పయోగములు ఏర్పడును. రాహుకేతువుల పరంగా మొత్తం 288 కాలసర్పయోగములు సంభవించును.

| రాహువు | రాహువు | రాహువు | రాహువు |
|---|---|---|---|
| కేతు | సవ్య కాలసర్పయోగ కుండలి | | రాహువు |
| కేతు | | | రాహువు |
| కేతు | కేతు | కేతు | కేతు |

| కేతు | కేతు | కేతు | కేతు |
|---|---|---|---|
| రాహువు | అపసవ్య కాలసర్పయోగ కుండలి | | కేతు |
| రాహువు | | | కేతు |
| రాహువు | రాహువు | రాహువు | రాహువు |

పై రాశి చక్రములను బట్టి లగ్నంలో రాహువు ఉంటే సప్తమంలో కేతువు వున్న కాలసర్పయోగం ఏర్పడును. ద్వితీయంలో రాహువు అష్టమంలో కేతువు 3-9, 4-10, 5-11, 6-12, 7-1, 8-2, 9-3, 10-4, 11-5, 12-6, ఇదే విధంగా పన్నెండు కాలసర్పయోగములు కలుగును. అదే విధంగా లగ్నంలో కేతువు ఉంటే సప్తమంలో రాహువు ఉన్న కాలసర్పయోగం ఏర్పడును. ద్వితీయంలో కేతువు అష్టమంలో రాహువు 3-9, 4-10, 5-11, 6-12, 7-1, 8-2, 9-3, 10-4, 11-5, 12-6 ఇదే విధంగా పన్నెండు కాలసర్పయోగములు కల్గును. మొత్తం (2×144). సరియైన కాలసర్పయోగములు ఏర్పడును. మొత్తం కలిపి 288 కాలసర్పయోగములు ఏర్పడును.

జాతక చక్రంలో రాహు కేతువుల మధ్య మిగతా గ్రహాలు ఉంటే దానిని కాలసర్పయోగముగా నిర్వచించారు. ఈ సర్పయోగము వల్ల వ్యక్తి జీవితంలో దుష్ఫలితాలు అనుభవించక తప్పదు. సర్పయోగ జాతకుడు సిరిసంపదలు ఉన్న ను సుఖజీవనం సాగింపలేడు. ఈ దోష ప్రభావం వల్ల వివాహము, సంతానము, ఆరోగ్యము, సంపదల విషయంలో జాగ్రత్త అవసరము. మరణానంతరము కూడా

వ్యక్తిపై ఈ సర్పదోష ప్రభావము ఉంటుంది. ఈ కాలసర్ప దోషము వంశపారం పర్యంగా వచ్చే అవకాశాలు ఉన్నాయి. జాతకునికి అభివృద్ధి లేకపోవుట ఎంత కష్టపడినను ఫలితంలభించక పోవుట మధ్యలో ముందంజ లేకపోవుట కలహప్రియ భర్త లేక కలహప్రియ భార్య లభించటం జరుగును. అనుమానపు భార్య లేక భర్తలు దొరుకును. వైవాహిక జీవితంలో ఇబ్బందులు కలుగును. సంతృప్తిలేని జీవితాన్ని గడుపుతారు. ఋణబాధలు ఏర్పడును. విపరీతమైన వ్యాధులు కల్గును. శస్త్రచికిత్స వల్ల మరణం, అకాలమరణం, విష జంతువుల వల్ల ప్రాణహాని, వాహన ప్రమాదములు, స్త్రీలు శిశువును ప్రసవించటం లేక మరణమును పొందుట, సంతానము లేకపోవుట, స్త్రీ సంతానము కలుగుట లేక అంగ వికలాం గులు జన్మించుట భార్య భర్తల మధ్య సఖ్యత లేకపోవుట జరుగును.

**ఈ కాలసర్పయోగముల వల్ల కలుగు మరికొన్ని తీవ్ర పరిణామములు:**

1. జ్ఞాన దృష్టి లేకపోవుట లేక మెదడు ఎదగకపోవటం వల్ల అనుమానాలు (లేక) అపార్ధములు చేసుకొనుట.
2. జన్మించిన సంతానమునకు బుద్ధిమాంధ్యము కలుగుట.
3. గర్భములో శిశువు మరణించుట
4. భార్యా భర్తల మధ్య సఖ్యత లేకపోవుట (లేక) వైవాహిక జీవితంలో అసంతృప్తి.
5. మరణించిన శిశువులను ప్రసవించుట
6. గర్భము నిలువకపోవుట
7. విచిత్రమైన రోగాలు కలగడం
8. అంగవైకల్యంతో సంతానము కలుగుట
9. వాహన ప్రమాదములు
10. శస్త్రచికిత్సలు విఫలమై మరణించుట
11. వృషణముల వ్యాధులు ఏర్పడుట
12. వ్యసనములకు బానిసకావడం
13. నపుంసకత్వము ఏర్పడుట
14. వీర్యకణములు నశించుట
15. ఎయిడ్స్, క్యాన్సర్, సిఫిలిన్, హెర్నియా, వరిబీజము మూత్ర సంబంధ రోగములు కలగటం
16. కుటుంబంలో ప్రేమాభిమానాలు తగ్గుట
17. వంశ వృద్ధి లేకపోవుట
18. మొండి పట్టుదల

19. శత్రువుల వలన మృతి చెందుట
20. జన్మించిన సంతానం శత్రువులుగా మారడం
21. మానసిక శాంతి లేకపోవటం
22. విషజంతువుల వల్ల మరియు జలప్రమాదముల వల్ల మరణం కలగడం
23. అవమానాలు (లేక) అపనిందల వల్ల మృతి చెందుట
24. ఋణగ్రస్తులు అగుట మరియు హామీలు ఉండటం
25. పరస్త్రీల సంపర్కము.

## 5. వివిధ రకాల కాలసర్పయోగములు, ఫలితములు

**1. అనంత కాలసర్పయోగము:**

జన్మలగ్నం నుండి సప్తమ స్థానం వరకు లేక తను భావము నుండి కళత్రత భావం వరకు రాహువు, కేతువుగ్రహములమధ్య మిగతా గ్రహములు ఉంటే దానిని  అనంత కాలసర్పయోగము అందురు. జన్మలగ్నంలో రాహువు ఏడవ స్థానంలో కేతువు ఉండాలి.

**ఫలితము:** అనంత కాలసర్పయోగము వలన వైవాహిక జీవితంలో అసంతృప్తి మానసిక శాంతి లేకపోవడం అనారోగ్య సమస్యలు వ్యాపారములో నష్టాలు కలుగుతాయి.

**2. కులిక లేక గుళికా కాలసర్పయోగము:**

జన్మలగ్నాత్ ద్వితీయ స్థానం నుండి అష్టమ స్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని కులిక లేక గుళిక కాలసర్పయోగము అందురు రెండవ స్థానంలో రాహువు ఎనిమిదవ స్థానంలో కేతువు ఉండాలి.

**ఫలితము:** గుళికా కాలసర్పయోగము వలన ఆర్థిక సమస్యలు, కుటుంబంలో కలహాలు, అనారోగ్యము పరస్త్రీలతో సంబంధం, సంతాన సుఖం ఉండదు మిత్రుల విరోధములు కల్గును.

**3. వాసుకి కాలసర్పయోగము:**

జన్మలగ్నాత్ తృతీయ స్థానం నుండి నవమ స్థానం వరకు రాహువు కేతువు గ్రహముల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని వాసుకి కాలసర్పయోగము అందురు. మూడవ స్థానంలో రాహువు తొమ్మిదవస్థానంలో కేతువు ఉండాలి.

**ఫలితము:** వాసుకి కాలసర్పయోగము వలన సోదరుల వలన మరియు బంధువుల వలన సమస్యలు ఎక్కువగా ఉంటాయి. ఉద్యోగములో బాధలు పదోన్నతిలో ఆటంకములు, ఉద్యోగములు ఊడుట, గృహస్థ జీవనములో కాఠిన్యత, హామీలు, నాస్తికత్వములు కలిగి ఉండును.

**4. శంఖపాల కాల సర్పయోగము:**

జన్మలగ్నాత్ చతుర్థ స్థానంనుండి దశమ స్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని శంఖపాల కాలసర్పయోగము అందురు. నాల్గవ స్థానంలో రాహువు పదవ స్థానంలో కేతువు ఉండాలి.

**ఫలితము:** శంఖపాలకాలసర్పయోగము వలన తల్లి లేక తండ్రి ద్వారా తీవ్ర వేదన గృహ,వాహన సమస్యలుఅనారోగ్యము, విద్యలోఆటంకములుఉద్యోగ ములో వ్యాపారములలో లాభం లేకపోవుట కల్గును.

**5. పద్మ కాలసర్పయోగము:**

జన్మలగ్నాత్ పంచమ స్థానం నుండి ఏకాదశ స్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని పద్మ కాలసర్పయోగము అందురు. ఐదవస్థానంలో రాహువు పదకొండవ స్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** పద్మకాలసర్పయోగము వలన సంతానము వల్ల బాధలు లేక సంతానం లేకపోవుట విచిత్రమైన వ్యాధులు రావడం వ్యసనముల వల్ల భారీ నష్టములు, భార్యా భర్తల మధ్య అనుమానాలు తలెత్తుట, ధనము ఖర్చు కావడం, శత్రువుల వలన కష్టములు, జైళ్ళలలో ఉండవలసిన పరిస్థితి కలుగును. బాల్యం నుండే బాధలు కలుగుతాయి.

**6. మహాపద్మకాలసర్పయోగము:**

జన్మలగ్నాత్ షష్ఠమ స్థానం నుండి ద్వాదశ స్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని మహా పద్మ కాలసర్పయోగము అందురు ఆరవ స్థానంలో రాహువు పన్నెండవ స్థానంలో కేతువు ఉండును.
**ఫలితము:** మహాపద్మకాలసర్పయోగము వలన శత్రువుల వల్ల సమస్యలు భార్య అనుకూలత లేకపోవడం (లేక) భర్త అనుకూలత లేకపోవడం జీవితాంతము రోగముల వలన బాధ నిరాశ ఎక్కువగా ఉండును. ప్రేమాభిమానాలు లేకపోవడం, వృద్ధాప్యంలో కష్టములు కలగటం శత్రువులతో పోరాడటం కలుగుతుంది. గృహము నందు అసంతృప్తి కలుగను.

**7. తక్షక కాల సర్పయోగము:**

జన్మలగ్నాత్ సప్తమ స్థానంనుండి లగ్నం వరకు లేక కళత్ర భావం నుండి తను భావంవరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని తక్షక కాల సర్ప యోగము అందురు. ఏడవ స్థానంలో రాహువు జన్మ లగ్నంలో కేతువు ఉండును.

**ఫలితము:** తక్షక కాలసర్పయోగము వలన ధనం నష్టం వ్యాపారంలో చిక్కులు పిత్రార్జితమును ఖర్చుచేయుట, పుత్ర సంతానం లేదని బాధపడుట, జీవిత భాగస్వామితో సమస్యలు వ్యసనముల, పరస్త్రీ సంగమము శతృపీడ అనారోగ్యములు కలుగును.

**8. కర్కోటక కాలసర్పయోగము :**

జన్మలగ్నాత్ అష్టమ స్థానం నుండి ద్వితీయ స్థానం వరకు లేక ఆయుర్ధాయ భావంనుండి ధనభావం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్తగ్రహ ములు ఉంటే దానిని కర్కోటక కాలసర్పయోగము అందురు. ఎనిమిదవ స్థానంలో రాహువు రెండవ స్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** కర్కోటక కాల సర్పయోగము వలన ప్రమాదాలు జరగడం, వివాహ జీవితంలో అశాంతి కారణమైన వాతావరణం అకాల మరణం మోసాలకు గురి అగుదురు. దీర్ఘ రోగములు, శస్త్రచికిత్సలు, ఎంత కష్టపడినా ఫలితం లభించదు. జీవితంలో అన్ని ఆలస్యంగా జరుగుతాయి. మంచి ఉద్యోగము దొరుకుటకు చాలా శ్రమ చేయవలసి వచ్చును. విపరీత ధననష్టం కలుగును.

**9. శంఖచూడ లేక శంఖ నంద కాలసర్పయోగం:**

జన్మలగ్నాత్ నవమ స్థానం నుండి తృతీయ స్థానం వరకు లేక భాగ్యస్థానం నుండి భ్రాతృస్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని శంఖచూడ లేక శంఖనంద కాలసర్పయోగము అందురు. తొమ్మిదవ స్థానంలో రాహువు మూడవస్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** శంఖ చూడ కాలసర్పయోగము వలన దేవుని యందు భక్తి లేకపోవుట, పెద్దల యందు గౌరవం లేకపోవుట, వ్యాపారము, ఉద్యోగము, వ్యవసాయముల యందు అధికంగా శ్రమించినా నష్టములు కలుగును. అవమానములు, గృహములో బాధలు ధనము నందు అసంతృప్తి కలుగును. తండ్రి, గురువులతో విరోధములు కలుగును.

## 10. ఘటక లేక పాతక కాలసర్పయోగము:

జన్మలగ్నాత్ దశమ స్థానంనుండి చతుర్థ స్థానం వరకు లేక రాజ్య భావం నుండి మాతృ భావం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని ఘటక లేక పాతక కాల సర్పయోగము అందురు. పదవ స్థానంలో రాహువు నాల్గవ స్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** ఘటక లేక పాతక కాలసర్పయోగము వలన వ్యాపారములో మిత్రద్రోహం ఉద్యోగంలో అసంతృప్తి, వ్యాపార లావాదేవులలో నష్టం, తల్లి దండ్రులకు దూరంగా నివాసము చేయుట, సంతాన దోషములు.

## 11. విషక్త లేక విషదాన కాలసర్పయోగము:

జన్మలగ్నాత్ ఏకాదశ స్థానం నుండి పంచమ స్థానంవరకు లేక లాభ స్థానం నుండి పుత్రస్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని విషక్త కాలసర్పయోగము అందురు. పదకొండవ స్థానంలో రాహువు ఐదవ స్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** విషక్త కాలసర్పయోగము వలన వ్యాపారంలో చిక్కులు, నేత్ర, చెవి సంబంధ రోగములు సోదరులు మరియు మిత్రులతో వివాదాలు గృహమును విడిచి పరదేశంలో నివాసంచేయుట, కోర్టు వ్యవహారములలో తలదూర్చటం రహస్యమైన విషయాలు గోప్యంగా ఉంచటం జరుగును.

## 12. శేష నాగ కాలసర్పయోగము:

జన్మలగ్నాత్ ద్వాదశ స్థానం నుండి షష్ఠమ స్థానం వరకు లేక వ్యయస్థానం నుండి శత్రుస్థానం వరకు రాహువు, కేతువు గ్రహముల మధ్య సప్త గ్రహములు ఉంటే దానిని శేష నాగ కాలసర్పయోగము అందురు. పన్నెండవ స్థానంలో రాహువు ఆరవ స్థానంలో కేతువు ఉండును.

**ఫలితము:** శేషనాగ కాలసర్పయోగము వలన శతృవుల పీడ, అనారోగ్యము, కోర్టు వివాదాలు అవమానాలు ప్రాణభయం అధిక ఖర్చులు అగును.

## 6. కాలసర్పయోగ ప్రస్తావన మరియు అసంపూర్తి కాలసర్పదోష ఫలితములు

జాతకచక్రంలో గ్రహముల విశేషస్థితి వల్ల కాలసర్పయోగము ఏర్పడును. భూమి, చంద్రుడు భ్రమణ కక్ష్యలో రాహుకేతువులు స్పర్శబిందువులు ఈ రెండు గ్రహాల మధ్యన ఉన్న ఆరు రాశుల్లోకి అనగా మధ్యన విభిన్న గ్రహములు వస్తే

కాలసర్పయోగము ఏర్పడును. ఇది మహా అనిష్టకర యోగము ముఖ్యంగా కాలసర్పదోష ప్రభావము వల్ల జాతకునికి తన శుభకర్మల ఫలం లభించదు. జన్మకుండలి కేంద్రంలో ఏ స్థితిలోనైనా ఒకటే గ్రహము లేక కేవలం పాపగ్రహమే ఉండి శుభయోగం లేదా శుభగ్రహదృష్టి లేకపోతే జీవితంలో అసంతృప్తి, నిరాశలు మిగులుతాయి. మన ధార్మిక గ్రంథాల్లో, శాస్త్రాల్లోను వివిధ సర్పయోగముల గురించి వివరించారు. ధర్మశాస్త్రంలో కుండలిని శక్తి జాగృతమైనప్పుడు సర్పాకారంలో ఉంటుంది. పతంజలి యోగదర్శన ప్రకారం వైజ్ఞానిక సంపూర్ణత్వానికి ఉపాదీయమైన కుండలిని మూలాధార చక్రంలోను సర్పాకారంలో సుషుప్తి స్థితిలో ఉంటుంది. జ్యోతిషశాస్త్రంలో రాహువును కాలం అని కేతువుని సర్పము అని ఈ గ్రహములతో ఏర్పడే యోగమును కాలసర్పయోగము అందురు. ఈ యోగం బాధాకరము దుఃఖదాయకమైంది. ఈ యోగము 12 రాశులల్లో రాహుకేతవులు వివిధస్థితుల్లో ఉన్నప్పుడు 288 కాలసర్పయోగములు ఏర్పడును.

ప్రపంచముల్లోని అన్నిదేశాలలో దాదాపుగా సర్పపూజ ఆచారముగా ఉన్నది. మన ధర్మశాస్త్రాల్లో నాగపూజకు విశేష ప్రాధాన్యతనిచ్చారు. వరాహమిహి రుడు 'జాతకనభసంయోగ' సంహితలోను, జైనజ్యోతిషగ్రంథాల్లోను, కాలసర్ప యోగము గురించివ్రాసినారు. అనేక నాడిగ్రంథాల్లో కూడ కాలసర్పయోగ ప్రస్తావనఉంది.

**ఫలితములు:**

1) పనులలో ఆలస్యము 2) ధననష్టం 3) వ్యాపారంలో అభివృద్ధి లేకపోవటం

4) మనఃశాంతి 5) తీర్థయాత్రలకు వెళ్ళటం 6) వివాహములు జరగటం

7) శుభకార్యక్రమములకు ధనం చేకూరటం.

## 7. వివిధ యోగములపై కాలసర్పయోగం, అసంపూర్ణ కాలసర్పదోషము ప్రభావం

రాహువు, కేతువుల మధ్య సప్తగ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. మానవ పుట్టుక నుండి మరణము దాకా అనగా మానవశరీరము, వ్యక్తిత్వం, జీవితముపై గ్రహముల ప్రభావము ఉంటుంది. మానవ జీవితము నవగ్రహముల పై ఆధారపడిఉంటాయి. ఈ రాహువు కేతువులతో సూర్యచంద్రులకు గొప్ప అనుబంధము ఉంది.

ఇక సూర్యచంద్రులకు గొప్ప అనుబంధము ఉంది. ఇక సూర్యచంద్రుల గురించి తెలుసుకుందాము. ఈ మొత్తము జగత్తుకు ఆత్మకారకుడు సూర్యుడు ఈ చరాచర

సృష్టికి అవసరమైన శక్తిని ప్రసాదించే గ్రహంసూర్యుడు. ఈ సూర్యుని వల్లే సృష్టి జరిగింది. సూర్యుడులేని జీవితాన్ని. ఊహించడము అసంభవము ఇలాగే చంద్రుడు భూమికి ప్రకృతిని ప్రసాదించే ఉపగ్రహము. సూర్యుని వెలుగుతో ప్రకాశిస్తూ తన చల్లటికాంతితో భూమికి చల్లదనాన్ని ప్రసాదిస్తుంది. ఇది మానవుల మనస్సుకు, మేథస్సుకు కారణము నియంత్రణను కూడా కలిగి ఉంటుంది. సూర్యుడు శక్తికి, చంద్రుడు మనస్సునకు కారకులు. సూర్యచంద్ర మార్గాలను విభజించే ప్రతిచ్ఛేదన బిందువులు రాహుకేతువులు. ఈ గ్రహముల వలన సూర్యచంద్రుల స్వభావము గుణములో మార్పు కలుగుతుంది.

ఈ కారణంగానే అనేక పురాణాలలో రాహుకేతువులకు విశిష్ఠ స్థానము ఇవ్వబడింది. రాహువు స్థితుడై ఉన్న రాశి నుండి 7వ రాశిలో అంశాత్మక స్థితిలో కేతువు ఉంటాడు. రాహుకేతువుల సూర్యచంద్రుల కక్ష్యల సంధిబిందువు ఖగోళశాస్త్ర జ్ఞులు దీనిని చంద్రపాతమని అందురు ఈ రెండు గ్రహాలకు ప్రతిబింబం లేని కారణంగా ఛాయాగ్రహరూపంలో ఉన్నా మానవ జీవితాన్ని ఎక్కువగా ప్రభావితము చేస్తాయి.

**జాతకములో కాలసర్పయోగప్రభావాన్ని అధికముచేసే జ్యోతిష యోగములు కూడా కలవుఅవి.**

1. జన్మకుండలిలో రాహువు, గురువులు ఏ స్థితిలోనైనా కలిసి గురు చండాల యోగము ఏర్పడినచో కాలసర్పయోగము ప్రభావము ఎక్కువగా ఉండును.
2. జాతకచక్రంలో శుక్రుడు రాహువు కలవడము వల్ల అభోత్వకయోగము ఏర్పడును. ఈ యోగమువల్ల కూడా కాలసర్పయోగం అధికము అవుతుంది.
3. జన్మకుండలిలో కుజుడు, రాహువులు కలవడం వల్ల అంగారక యోగము కలిగి(జాతకంలో)ఉండిదీనివల్లకూడాకాలసర్పయోగముఅధికము అవుతుంది.
4. జాతకకుండలిలో శని, రాహువులు కలయికవల్ల నందీయోగము ఏర్పడి ఆ జాతకంలో కాలసర్పదోషము ఉన్నచో దీర్ఘకాలిక రోగములు కల్గును.
5. జాతకంలో అమావాస్య దోషము ఉన్నచో కాలసర్పదోషప్రభావము ఎక్కువగా ఉండును.
6. గ్రహణ సమయంలోను మరియు చంద్రునితో పాటు రాహుకేతువులతో కేముద్ర యోగము ఏర్పడి కాలసర్పయోగము కాకుండా ఉంటే ఆ కాలసర్పయోగము అధికప్రభావమును చూపును. అనగా గ్రహణము

యోగము లేక కేముద్ర యోగము ఉండి కాలసర్పయోగము ఉంటే కాలసర్ప యోగము అధికప్రభావము చూపును.

**జాతకములో కాలసర్పయోగము ఉండి ఈ క్రింది యోగములు ఉన్నప్పుడు ప్రభావము తక్కువ అవుతుంది అవి:**

1. జాతకంలో బలమైన గజకేసరియోగము ఉన్నచో.
2. జాతకంలో హంసయోగము ఉంటే
3. జాతకంలో భద్రయోగము, మాలవ్యయోగము, నౌక యోగము, ఛత్రయోగములు ఉన్నచో కాలసర్పయోగము ప్రభావము స్వల్పము.
4. ఇక్కడ నౌకాయోగము అనగా జన్మలగ్నము నుండి సప్తమ స్థితి వరకు ప్రతిస్థితిలోనూ ఏదో ఒక గ్రహం స్థితుడై ఉంటే నౌకాయోగము ఏర్పడును.
5. ఇక్కడ ఛత్రయోగము ఉంటే జన్మ కుండలిలో సప్తమ స్థితి నుండి జన్మలగ్నము వరకు ప్రతిస్థితిలోనూ ఏదోఒక గ్రహస్థితుడై ఉండి ఏ స్థితీలేకుండా ఖాళీగా ఉండే ఛత్రయోగములో దీని ప్రభావము తగ్గును.
6. అంగారకుడు కేంద్రంలోగాని మేష, వృశ్చిక, మకరరాశులలో ఉంటే కాలసర్పయోగప్రభావము తగ్గును.
7. శుక్రుడు బలంగా ఉంటే కూడా కాలసర్పయోగము ప్రభావము తగ్గును.

**అసంపూర్ణ కాలసర్పదోష నిర్వచనము మరియు ఫలితములు:**

**నిర్వచనము:** రాహుకేతువుల మధ్య 6 గ్రహములుండి ఏడవ గ్రహముబయట ఉంటే దానిని అసంపూర్ణ కాలసర్పదోషము ఏర్పడును.

**ఫలితములు:**

1. అన్ని పనులు ప్రారంభము అయి మధ్యలో ఆగిపోవడం.
2. దీర్ఘకాలిక వ్యాధులు రావడం.
3. మానసిక అశాంతి, భయము కలుగును.
4. వైవాహిక సమస్యలు.
5. సంతాననష్టము.
6. వ్యాపారంలో నష్టము.

7. ఎంతకి ఉద్యోగం దొరకకపోవడం.
8. వివాహము కాకపోవడం.
9. ఆర్థికంగా కృంగిపోవడం.
10. మోసం చేయడం.
11. నమ్మినవారు మోసం చేయడం.
12. విద్యా విఘ్నములు.
13. వ్యసనములకు బానిసకావడం.
14. భూవివాదములు, కోర్టులు.
15. పోలీస్‌స్టేషన్లకు వెళ్ళడం.
16. చీటికి మాటికి వివాదములు కలగడం.

## 8. 288 కాలసర్పయోగములు

రాహుకేతువుల మధ్య సప్తగ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. మొత్తము కాలసర్పయోగము 288 అందులో రాహువును ఆధారంగా ఏర్పడేవి 144 కేతువును ఆధారంగా ఏర్పడేవి 144 మొత్తం కలిపి 288 అవుతాయి. ముఖ్యంగా మేషలగ్నమునకు రాహువును అనుసరించి ఏర్పడేవి 12. ఇలాగే పన్నెండు లగ్నాలు రాహువునను సవరించి ఏర్పడేవి. 12×12=144 ఇలాగే మేషలగ్నమునకు కేతువుననుసరించి ఏర్పడేవి 12 ఇలాగే పన్నెండు లగ్నాలు కేతువుననుసరించి ఏర్పడేవి 12×12=144 అగును. మనకు మొత్తం కాలసర్పయోగములు 12 కలవు అవి:

అనంత, కుళిక, వాసుకి, శంఖపాల, పద్మ మహాపద్మ, తక్షక, కర్కోటక, శంఖచూడ, ఘటక, విషక్త, శేషనాగ కాలసర్పయోగములు కలవు మొత్తం జాతక చక్రంలో 288 కాలసర్పయోగములలో ఈ క్రింది విధంగా ఉంటాయి.

1. అనంత కాలసర్పయోగములు-24
2. కుళిక కాలసర్పయోగములు-24
3. వాసుకి కాలసర్పయోగములు-24
4. శంఖపాల కాలసర్పయోగములు-24
5. పద్మ కాలసర్పయోగములు-24
6. మహాపద్మ కాలసర్పయోగములు-24

7. తక్షక కాలసర్పయోగములు–24
8. కర్కోటక కాలసర్పయోగములు–24
9. శంఖచూడ కాలసర్పయోగములు–24
10. ఘటక కాలసర్పయోగములు–24
11. విషక్త కాలసర్పయోగములు–24
12. శేషనాగ కాలసర్పయోగములు–24

**1. మేషలగ్నమునకు రాహువు ననుసరించి**






మేషలగ్నము ఆధారంగా రాహువు వివిదరాశులలోకి ప్రవేశిస్తాడు.

**2. వృషభ లగ్నమునకు రాహువు ననుసరించి**






వృషభ లగ్నము ఆధారంగా రాహువు వివిదరాశులలోకి ప్రవేశిస్తాడు.

**3. మేషలగ్నమునకు కేతువు ననుసరించి**







మేషలగ్నము ఆధారంగా కేతువు వివిధ రాశులలోకి ప్రవేశిస్తాడు.

**4. వృషభ లగ్నమునకు కేతువు ననుసరించి**







వృషభ లగ్నము ఆధారంగా కేతువు వివిధరాశులలోకి వెళ్ళతాడు.

పై విధంగా వివిధ లగ్నములు రాహుకేతువులను అనుసరించి 288 కాలసర్పయోగములు ఏర్పడును.

## 9. దృశ్యార్థము (Above the Horizon)

సప్తమము నుండి జన్మలగ్నము వరకు గల భాగమును దృశ్యార్థము అని అందురు. జన్మలగ్నములో రాహు లేక కేతువు ఉండును. ఆ రాహు, కేతువుల మధ్య మిగతా గ్రహములు ఉంటే దానిని దృశ్యార్థ కాలసర్పయోగము లేక దృశ్యార్థగోళార్థకాలసర్పయోగము అని అందురు. రాహుకేతువుల మధ్య గ్రహముల వలన ఇతరులకు తనపై గల అభిప్రాయములను కీర్తి, అధికారములను తెలుపును.

శుక్లపక్ష చంద్రుడు దృశ్యార్థమున నున్నచో మిగిలిన గ్రహములిచ్చు ఫలితము లన్నియు రెట్టింపుగానుండును. రవి చంద్రులు ఇద్దరును ఉన్నచో దృశ్యార్థము నున్నచో ఇతర గ్రహములిచ్చు చెడ్డ ఫలితములు రెట్టింపుగా యోగించును.

సప్తమమున దృశ్యార్థమున గురు, శుక్ర, బుధ గ్రహములలో ఒకరు ఉన్నచో కోరికలన్నియు ఫలించును.

దృశ్యార్థకాలసర్పయోగము అనగా సప్తమము నుండి అష్ఠమ, నవమ, దశమ, ఏకాదశ, ద్వాదశ, లగ్నమువరకు రాహుకేతువుల మధ్య ఈ భావములు ఉండి వాటిలలో మిగతా గ్రహములు ఉంటే దానిని దృశ్యార్థ కాలసర్పయోగము లేక దృశ్యగోళార్థ కాలసర్పయోగము అందురు.

### 10. అదృశ్యార్థము (Below the Horizon)

జన్మలగ్నము నుండి సప్తమము వరకు గల రాశి చక్రము అదృశ్యార్థము. జన్మలగ్నములో రాహువు లేక కేతువు ఉండి సప్తమంలో కూడా ఈ రాహు లేక కేతువు ఉండును. ఆ రాహుకేతువుల మధ్య మిగతా గ్రహమములు ఉంటే దానిని అదృశ్యార్థకాలసర్పయోగము అందురు. జన్మలగ్నము నుండి ధన, సోదర, మాతృ, సంతాన, శతృ సప్తమము వరకు రాహుకేతువుల మధ్య గ్రహములు ఉంటే దానిని అదృశ్యార్థ కాలసర్పయోగము లేక అదృశ్యగోళార్థకాలసర్పయోగము అందురు.

### 11. కాలసర్పయోగమునకు దుర్గా గణపతుల ప్రాశస్త్యము

కాలసర్పదోష జాతకులు శ్రీమహాగణపతిని పూజించవలెను. దానికి కారణం వినాయకుడు కాలస్వరూపుడు. రాహువుకు అధిష్టానదేవత దుర్గాదేవి కేతువుకు అధిష్టానదేవత గణపతి అనగా అమ్మవారి రూపం ఏదైనా రాహుకేతువుల దేవతలు సామాన్య భాషలో లక్ష్మీగణపతి, అనగా తల్లి కొడుకులు. అదే రాహుకేతువుల దేవతల అనుబంధము. మన సంవత్సర మొదట్లో వచ్చే భాద్రపద మాసంలో గణపతినవరాత్రులు, "నవానాం రాత్రీనాం సమాహారః నవరాత్రమ్." అని శ్లోకం ద్వారా గణపతి నవరాత్రకాలంలో వినాయకుడు మనలని అనుగ్రహించి తరువాత తల్లితగ్గరికి పంపిస్తాడు. అవే శరన్నవరాత్రములు అని గ్రహిస్తాము. గణపతి అంబికల అనుగ్రహానికి పాత్రులయ్యాక ఆ ఇద్దరు దేవతలు దేవుడి దగ్గరికి పంపిస్తారు అదే మాఘమాసంలో వచ్చే మహాశివరాత్రి.

శ్లోకం॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

పై శ్లోకము గణపతిని ప్రార్థిస్తూ చదివే శ్లోకం ఇది మనము శ్లోకమునకు అర్థం తెలుసుకుందాం. ఈ శ్లోకములో విష్ణువు యొక్క పేరు శుక్లాం బరధరం

అనగా తెల్లని వస్త్రాలు ధరించువాడు, శశివర్ణం అనగా చంద్రుడి వలె తెల్లగా ఉ ండటం. చతుర్భుజమ్ అనగా నాలుగు చేతులు కలవాడు ప్రసన్నమైన ముఖంతో ఉండేవాడు అయిన శ్రీహరిని సర్వ విఘ్నాలూ తొలగాలని ప్రార్థిస్తున్నాను అని అర్థము. మరి వినాయకుని ముందు శ్రీహరిని ప్రార్థించుట ఏమిటి? దీనిలో అంతరార్థము ఏమిటి?

ఇక్కడ తెల్లని వస్త్రాలు ధరించువాడు శ్రీహరికాదు. వినాయకుడు కాదు, శ్రీహరి పీతాంబరుడు. (పచ్చని పట్టువస్త్రాలు ధరించేవాడు) వినాయకుడు ఎర్రని వస్త్రములు ధరిస్తాడు. అలాగే చంద్రునిలా తెల్లగా ఉండేవాడని శ్లోకంలో ఉ న్నది. కాని శ్రీహరి నీలమేఘశ్యాముడు మరియు వినాయకుడు శరీరచ్ఛాయ ఎరుపు మరి ఈ శ్లోకము విష్ణువుది కాక గణపతిది కాక ఎవరిది?

ఇక్కడ అసలు అర్థము ఏమిటంటే శుక్లాంబరధరమ్ అనగా తెల్లని వస్త్రాలని ధరించినవాడనేది అర్థంకాదు ఏ పృధివ్యాపోతేజోవాయు అనే నాలుగు ఏ ఆకాశం నుండి వచ్చాయో అలాంటి ఆకాశాన్ని ధరించిన వాడని దీని అర్థం అంటే పంచ భూతాలమీద అదుపు కలవాడు అన్నమాట అని అర్థము.

శశివర్ణము అనగా శశి అంటే కుందేలు. దాన్ని తనలో కలవాడు చంద్రుడు. ఆ చంద్రుని లక్షణం. పదిహేనురోజులు పెరుగుదల, పదిహేనురోజులు తరుగుదల మరియు చతుర్భుజమ్ అనగా నాలుగుచేతులు అని అర్థం కాదు రోజులు, పక్షము (15రోజులు) నెలలు, సంవత్సరాలు ఈ నాల్గింటిని మరియు ప్రసన్నవదనమ్ అనగా ఏనుగులన్నిటికీ శ్రేష్ఠమైన ఏనుగు ముఖం కలవాడైన మరియు సర్వవిఘ్నోప శాంతయే అనగా అన్ని అడ్డంకులు తొలగించే వాడు అని అర్థము. విఘ్నములు తొలగించుపని విష్ణువుది కాదు. వినాయకుడిది అనగా పై శ్లోకమునకు అర్థము ఏమిటంటే చేతులను కాలస్వరూపంలాగ, ఏనుగుముఖం కలిగి ఉండటం. విఘ్నములు తొలగించడం, పంచభూతముల మీద అదుపు కలిగి ఉండటం. శ్లోకంలో విష్ణువు పేరు ఉండటం. అనగా పై విషయములలో శ్రీహరికి, వినాయ కుని ఏమైన సంబంధము ఉన్నదేమో అని అనుమానము వస్తుంది.

వాస్తవంగా ఇక్కడ శ్రీహరి, వినాయకుడు ఇద్దరూ ఒకరే. శ్రీహరి ఎలా కాలస్వరూపుడో, వినాయకుడు కాలస్వరూపుడే. విఘ్నమనేది వచ్చేది కాలానికే. అంటే కాలనుగుణంగానే అందుకని ఈశ్లోకం వినాయకుని రూపంలో ఉన్న విష్ణువుకే లేదా విష్ణురూపంలో ఉన్న వినాయకునికీ సంబంధించిందన్నమాట ఈ ఇద్దరు ఒకటే కాబట్టి లక్ష్మీగణపతికి గల సంబంధము. ఇలాంటి వినాయకుడిని ప్రార్థిస్తే విఘ్నాలుతొలగడం, విష్ణురక్షణని పొందడం, విశేషించి పార్వతీ పరమేశ్వ

రుల అండదండలతో సిద్ధిస్తాయి. అందువల్లే రాహువు కేతువులు కాలస్వరూపులు కాబట్టి కాలస్వరూపములకు అధిపతులు, అమ్మవారు, గణపతి. అందువల్లే కాలసర్పయోగ పూజావిధానములో దుర్గా, గణపతులను పూజించవలెను.

## 12. దృశ్యగోళార్థ కాలసర్పయోగము

రాహువు, కేతువుల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని కాలసర్పయోగము అందురు. జన్మలగ్నములో రాహువు సప్తమంలో కేతువు ఉండి అష్టమ, నవమ, దశమ, ఏకాదశ, ద్వాదశ (8,9,10,11,12) భావములలో మిగతా గ్రహములు ఉంటే (అక్కడ మాలికాయోగము ఏర్పడును) దానిని దృశ్యగోళార్థ కాలసర్ప యోగము అని అందురు.

| లగ్నం రాహువు | | | |
|---|---|---|---|
| రవి | దృశ్యగోళార్థ కాలసర్పయోగ స్వరూపము | | |
| శని | | | |
| గురువు శుక్రుడు | బుధ, కుజ, చంద్ర | | కేతువు |

ఈ రకమైన దృశ్యగోళార్థ కాలసర్పయోగము వలన సంఘంలో పేరుప్రతిష్ఠలు గౌరవమర్యాదలు కల్గును. వీటితోపాటు ధన, ధాన్య సమృద్ధికలుగుట రాజకీయం లోకి ప్రవేశం మానమర్యాదలు కీర్తి, పెద్దల మన్ననలు ఆశీర్వాదము కూడా లభించును. ప్రజలకు ఉపయోగపడే కార్యక్రమాలు చేయును. ఏకార్యక్రమములు మొదలుపెట్టిన సాఫల్యతను సాధించును. ఈ జాతకునికి ఐశ్వర్యంతోపాటు ఎక్కువ మంది శత్రువులు కూడా పెరుగుతారు. అలాగే ఖర్చులు కూడా ఎక్కువగా ఉండును. కష్టములు, దీర్ఘవ్యాదులు కలుగును. గురుదేవుల, పండితుల మన్ననలు పొందుతారు మరియు మరొకవిధమైన దృశ్యగోళార్థ కాలసర్పయోగము కూడా ఉంది. అది రాహువు ద్వాదశ భావములో కేతువు షష్టమ భావములో ఉండి మిగతా సప్తగ్రహములు అష్టమ, నవమ, దశమ, ఏకాదశ (8,9,10,11) భావములలో అనగా ఆయుష్య, భాగ్య, కర్మ లాభ భావములలో ఉంటే దానిని కూడా దృశ్య గోళార్థ కాలసర్పయోగము అందురు.

| రాహువు | లగ్నం | | |
|---|---|---|---|
| | దృశ్యగోళార్థ కాలసర్పయోగ స్వరూపము మరొక విధంగా | | |
| | | | |
| | | | కేతువు |

ఈ విధమైన కాలసర్పయోగము వలన జాతకునికి అభివృద్ధి ఎక్కువగా ఉండును. మంచి ఉద్యోగము వృత్తియందు అంకిత భావం. వృత్తిలో నైపుణ్యత, కార్యదీక్ష పట్టుదల, సాహసం చేయగల సమర్థులగుదురు. వ్యాపారంలో నిపుణత, మంచి ఆలోచనాసరళి ఉన్నత శిఖరాలను అధిరోహించుట కీర్తి, గౌరవం, ఆనందం, సౌఖ్యము, సంపత్తి, ఐశ్వర్యం, భూమి, వాహనాలు, భవనాలు మొదలైన అన్ని సుఖాలను అనుభవిస్తారు. సమాజంలో కీర్తిప్రతిష్ఠలు, గౌరవం అభిమానం లభిస్తుంది. అడుగడుగున అదృష్టం వస్తుంది. ఇతనికి పట్టిందల్లా బంగారము అవుతుంది. దైవకార్యములందు ఆసక్తి యజ్ఞములు, దానములు, పరోపకారములు చేయుట ఆధ్యాత్మిక కార్యక్రమములలో పాల్గొనుట శత్రువులు ఉండటం. వాహన ప్రమాదములు వ్యాపారములో హఠాత్తుగా నష్టము రావడం, మళ్ళీ కోలుకోవటం ఇవన్నీ కూడా వెనువెంటనే జరుగుతుంటాయి. ధార్మిక జ్ఞానము మరియు ధర్మము వల్ల నిబద్ధత. ఈ వ్యక్తిలో ఉండును. శత్రువుల వలన విపరీతబాధలు, నిత్యసంఘర్షణ హఠాత్తుగా మరణము ఈ జాతకుని జీవితంలో పూర్వార్థంలో ధనము కలుగుట ఉత్తరార్థంలో దానధర్మాలు సమాజసేవ, దైవిక, ధార్మిక కార్యక్రమములలో పాల్గొనును.

## 13. అదృశ్య గోళార్థ కాలసర్పయోగము

జన్మలగ్నము నుండి పంచమంలో రాహువు ఏకాదశంలో కేతువు ఉండి ద్వాదశ, తను, ద్వితీయ, తృతీయ, చతుర్థ (12, 1,2,3,4) భావములలో సప్తగ్రహములు ఉంటే దానిని అదృశ్యగోళార్థ కాలసర్పయోగము అందురు.

| | కేతువు | గురు శని, శుక్ర | లగ్నం |
|---|---|---|---|
| | అదృశ్యగోళార్థ కాలసర్పయోగము స్వరూపము | | బుధ చంద్ర |
| | | | |
| | | రాహువు | రవి కుజ |

ఈ కాలసర్పయోగము ఉన్న జాతకులు ఆర్థిక అవసరాలు తీరక అప్పులు చేయుట దనకొరత, సంపాదన తక్కువ ఖర్చు అధికము శ్రమకు తగిన ఫలితము లభించక చాలాకష్టములు అనుభవించును. ఋణ బాధలు, ఖర్చులు ఈ జాతకునికి సంతానము వల్ల కష్టములు ఇతనికి సంతానము వల్ల ప్రయోజనం లేకపోవటం కలుగును.

దీనిలోనే మరొకవిధంగా కూడా అదృశ్య గోళార్ధ కాలసర్పయోగము ఉన్నది. రాహువు శత్రుస్థానములో ఉండి వ్యయస్థానములో కేతువు ఉన్న దానిని మరియు అన్ని గ్రహములు లగ్నము, ద్వితీయం, తృతీయం, చతుర్థ, పంచమ భావములలో ఉండును. ఈ విధంగా మాలికా యోగము ఉండును.

| కేతువు | లగ్నం గురువు | శుక్ర | శని |
|---|---|---|---|
| | అదృశ్యగోళార్థ కాలసర్పయోగము మరో విధంగా | | చంద్ర కుజ |
| | | | రవి బుధ |
| | | | రాహువు |

ఈ యోగము వల్ల నిరంతరము పోరాటం జీవితాంతం సంఘర్షణలను ఎదురుకొనుట సమాజసేవ సంఘంలో పేరు పేదవారికి సహాయం చేయుట ప్రజలకు ఉపయోగ కార్యక్రమములు నిరంతర పోరాటములు అధికారులతో

గొడవలు వాదోపవాదనలు. సమాజం దృష్టిలో మంచివాడుగా గుర్తింపు పొందును. ఆత్మ సంతృప్తి కలుగును.

## 14. కాలసర్పదోషమునకు నిజమైన రెమెడీస్

రాహుకేతువుల మధ్య సప్తగ్రహములు బంధించి ఉంటే దానిని కాలసర్ప యోగము అందురు. ఈ కాలసర్పయోగము గురించి చాలామంది మేము పూజలు చేసామండి మరి మాకు ఫలితం కనిపించలేదు. మేము పవిత్రమైన క్షేత్రములలో చేసాము మాకు ఫలించలేదు. అని చాలా మంది అంటున్నారు మరికొంతమంది ఆ దేవాలయాలలో స్థలమహత్యము ఉంటుంది అనుకొని పూజలు చేసాము మాకు పనులు నెరవేరలేదు ఏమిటికారణం? చాలామందికి వస్తున్న సందేహము? అసలు విషయం ఏమిటి? అనగా వాస్తవంగా కృత, త్రేత, ద్వాపర, కలియుగాలలో ఎంతోమంది మహర్షులు ఎంతో దీక్షతోటి చాలా సంవత్సరములు అరణ్యంలో తపస్సు చేసుకొనేవారు ఎంతో నిష్ఠగా ఉండి ఘోరతపస్సు చేసిన రావణబ్రహ్మకు కూడా పరమేశ్వరుని మెప్పించటానికి చాలా రోజులు పట్టింది. అలాంటి ఏదో దేవాలయాలకి వెళ్లి గోత్రనామాలు చెప్పి కాలసర్పదోషనివారణ చేయండి అని చెపితే సరిపోతుంది అని అనుకుంటారు.

అక్కడ స్థలమహత్యము ఉంటుంది కదా అని కొంతమంది ప్రశ్న మరి స్థల మహత్యము అయితే అక్కడకు వెళ్లిన ప్రతి వారికి దోషనివారణ జరుగుతున్నదా. కొంతమందికి జరుగుతున్నది. మరికొంత మందికి జరగదు. దీనికి కారణం వాస్తవంగా సరియైన పద్ధతిలో సత్‌బ్రాహ్మణులతో రాహుకేతువుల జపములు ముఖ్యమైనవి మరియు రాహుమంత్రము 18వేలు కేతుమంత్రము 7 వేలు సార్లు ఉచ్ఛారణ లోపం లేకుండా చేయాలి. ప్రతిరోజు జంట సర్పములకు అభిషేకములు, హోమములు, మహన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకము మొదలుగున్నవి. శాస్త్రీయ పద్ధతిలో చేయించవలెను మరియు బ్రాహ్మణోత్తములే కాక చేపించుకొనే యజమాని కూడా నిష్ఠగా ఓపికతో ఉండవలెను. యజమాని పూజ చేసే రోజులలో మంధు, మాంసములను విసర్జించవలెను.

ఈ రాహుకేతువుల జపములు 25 వేలసార్లు చేయాలంటే దాదాపుగా నాల్గు రోజులు అవుతుంది. ఈ నాల్గురోజులు బ్రాహ్మణుల సంఖ్యను బట్టి ఉంటుంది. బ్రాహ్మణులు ఎక్కువమంది తక్కువ రోజులలో పూర్తి అవుతుంది. నాల్గు, ఐదురోజులలో పూర్తి అయిపోయే దానిని దేవాలయములలో గంటలో పూర్తికావడం అనేది జరగదు. ఎంతో నిష్ఠగా భక్తిగా ఆచరించాలి. ఈ కాలసర్పయోగం గురించే

కాదు. ఏపూజ అయిన చేస్తే నిష్ఠగా భక్తితో ఆచరించాలి. లేకపోతే మానివేయడం మంచిది. ధనము వృథా, కాలము వృధా అవుతుంది. అంత ధనము ఉ పయోగించాము అంటే అంతఫలితమును పొందవలెను. ఇవ్వన్నీ క్యూద్వారా వచ్చి గోత్రనామాలు చెప్పి ఒక గంటలో పూర్తి చేసి నాకు కాలసర్పయోగము పోయిందిలే అని అనుకుంటే పొరపాటు. అలాగే శాస్త్రీయపద్ధతిలో నాగప్రతిష్ఠ చేయుట కాలసర్పయోగము ఉన్నవారు ఈనాగప్రతిష్ఠ దేవాలయములలో గాని, నదీతీరసమీపంలో గాని, అశ్వర్థమూలమునందు అనగా రావి వేపచెట్టు ముందర గాని చేయవలెను. గృహములో కూడా పూజలు నిర్వహించి దేవా లయంలో గానీ నదీ తీరముల యందుగాని నాగప్రతిమలను ఉంచవచ్చు. నాగప్రతిష్ఠ విధిగా చేయవలయును. సర్పసంస్కారము చేసి నాల్గవరోజున సర్పబలి ఎనిమిది మంది బ్రాహ్మణోత్తములచే పురుషసూక్తముచే పూజించుట మొదలుగునవి చేయవలెను. మొదటగా హోమము బ్రాహ్మణ పూజ, భోజనము, పాయసబలి, కలశస్థాపన, కలశపూజ, దానమును కలశ వస్త్ర, ప్రతిమ దానమును, బ్రాహ్మణ సమారాధన చేయడం మంచిది. ఈ ప్రకారముగా చేసిన కాలసర్పదోషము తొలగును. అశ్వర్థ వివాహము చేసిన తర్వాత నాగప్రతిష్ఠ చేయవలెను. అశ్వర్థము అనగా రావిచెట్టుకు, వేపచెట్టుకు వివాహము చేసిన అశ్వర్థము అనబడును. వివాహము కాని అశ్వర్థము నందు నాగప్రతిష్ఠ చేయరాదు మరియు కాలసర్పయోగములలో 12 రకములైన కాలసర్పయోగములు గలవు ఒక్కొక్క కాలసర్పయోగమునకు ఒక్కొక్క విదముగా పూజలు ఉంటాయి. పూజల విధానములలో మార్పులు ఉంటాయి. ఉదాహరణకు అనంతకాలసర్పయోగమునకు పూజా విధానము వేరు మరియొక కాలసర్పయోగమునకు పూజా విధానము వేరుగా ఉంటుంది. దీనితో బాటు జాతక చక్రములలో మిగతాగ్రహములను నక్షత్రములను దశలను పరిశీలించ వలెను. సరియైన విధానము తెలియకుండా పూజలను నిర్వహించినచో ఫలితము లను పొందలేరు.

నాగ దోషములకు కూడా జాతకమును అనుసరించి వివిధ రకముల పూజలుంటాయి. కేవలం ప్రతిదానికి నాగప్రతిష్ఠనే కాదు దానికి మరికొన్ని పద్ధతుల ప్రకారంగా పూజలు నిర్వహించవలెను.

కాలసర్పయోగము యొక్క పరిహారమునకు శాస్త్రీయ పద్ధతిలో పూజలను చేసి ఆ తరువాత దేవాలయములలో పూజలు చేసుకొనవలెను.

## 15. కాలసర్పజాతకులు రాహువు మహర్ధశలో పూజించు దేవతలు

1. కాలసర్పదోషము ఉన్న వారు రాహువు మహర్ధశలో రాహు అంతర్ధశ జరుగు చున్నప్పుడు జాతకులు భ్రమరాంభికాష్టకము, దుర్గాస్తోత్రములు, రాజరాజేశ్వరి కవచము, సంకటనాశన గణేషస్తోత్రము, హనమద్బడబానల స్తోత్రములు శ్రీమానసాదేవినాగస్తోత్రములు రాహుజపం, రాహుస్తోత్రములు చదవవలెను.

2. రాహువులో గురువు అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు గురువు జపం, గురువుకి సంబంధించిన వేదోక్తమంత్రాలు, శ్లోకములు, పాదరస శివలింగమునకు శివాభిషేకములు, శివునికి సర్పపాశుపతాస్త్ర అభిషేకములు మన్యుసూక్తపారాయణములు దత్తాత్రేయ స్తోత్రములు, షిర్డిసాయి బాబా అష్టోత్తర శతనామావళి చదవలెను.

రాహువులో శని అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్ప జాతకులు శనిజపం, శనియొక్క మంత్రములు, శ్లోకములు, స్తోత్రములు, మహన్యాస రుద్రాభిషేకములు, శివపంచాక్షరి జపం, శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రపారాయణము. సర్ప అష్టోత్తర శతనామావళి చదువ వలెను.

రాహువులో బుధ అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్ప జాతకులు బుధ జపం బుధుడు యొక్క వేదోక్త మంత్రములు, శ్లోకములు, శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణము శ్రీమానసాదేవి స్తోత్రము యుధిష్టర కృతాదుర్గ స్తవనమ్, చదువవలెను.

రాహువులో కేతువు అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు. రాహువు, కేతువుల జపము కవచస్తోత్రములు, మూలమంత్రములు. దుర్గా, గణపతి అష్టోత్తర శతనామావళి, గణపతి సూక్తము రుద్ర కవచమ్, మన్యుసూక్తమ్, సర్పసూక్తములు, శ్రీమహిషాసుర మర్దినీ స్తోత్రము, సుబ్రహ్మణ్య భుజంగ స్తోత్రమ్, నాగదోష నివారణ జపమంత్రములు శ్రీసుబ్రహ్మణ్య అష్టకము చదువవలెను.

రాహువులో శుక్ర అంతర్ధశ జరుగుచున్నప్పుడు. కాలసర్పజాతకులు శు క్రజపం, శుక్రుని యొక్క వేదోక్త మంత్రములు, స్తోత్రములు కనకధార స్తోత్రము ధనంజయ కృత శ్రీదుర్గా స్తుతి, నాగేశ్వర స్తుతి, శ్రీదుర్గాదేవి బీజాక్షర స్తోత్రములు, గకార గణపతి అష్టోత్తర శతనామావళి, భ్రమరాంభిక అష్టకము, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము చదువవలెను.

రాహువులో రవి అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాల సర్పజాతకులు రవిజపం, రవి యొక్క వేదోక్త మంత్రములు, స్తోత్రములు సూర్యనమస్కారములు, ఆదిత్య

హృదయము, నాగ అష్టోత్తర, శతనామావళి మానసాదేవి స్తోత్రము, సర్పసూక్తము, రాజరాజేశ్వరి కవచము, రుద్రాభిషేకములు, శ్రీవినాయక బీజాక్షర అష్టోత్తర శతనామావళి చదువవలెను.

రాహువులోని చంద్ర అంతర్ధశయందు జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు చంద్రజపం, చంద్రుడుకు సంబంధించిన వేదోక్తమంత్రములు, స్తోత్రములు వివిధ గణపతుల అష్టోత్తర శతనామావళి శ్రీ మానసాదేవి నాగస్తోత్రము, మన్యుసూక్తం, శ్రీ సుబ్రహ్మణ్య భుజంగస్తోత్రమ్, ధనంజయ కృత శ్రీదుర్గాస్తుతి, శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రపారాయణము గణపతి సూక్తమ్ చదువవలెను.

రాహువులోని కుజ అంతర్ధశయందు జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు కుజజపం, కుజుడుకు సంబంధించిన వేదోక్త మంత్రములు, స్తోత్రములు, శ్రీసుబ్ర హ్మణ్య సహస్రనామావళి, శ్రీసుబ్రహ్మణ్య స్తోత్రము, మన్యుసూక్తం, బ్రమరాంభికాష్ట కము, మానసాదేవి నాగస్తోత్రము, శ్రీరుద్రకవచమ్, హనుమద్బడబానల స్తోత్రము, శ్రీసుబ్రహ్మణ్యకవచమ్, శివాభిషేకం సర్పసూక్తం, గణపతి సూక్తమ్, భ్రమరాంభి కాష్టకమ్, శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమం, కనకధారాస్తోత్రమ్. శ్రీసుబ్రహ్మణ్య అష్టకము పఠించవలెను.

## 16. కాలసర్ప జాతకులు కేతువు మహర్ధశలో పూజించు దేవతలు

1. కాలసర్ప దోషము ఉన్నవారు కేతువు మహర్ధశలో కేతువు అంతర్ధశ జరుగు చున్నప్పుడు జాతకులు కేతువు జపం, కేతువు యొక్క వేదోక్త మూలమంత్ర ములు, స్తోత్రములు, భీజాక్షర శ్రీవినాయక అష్టోత్తర శతనామావళి సంకటనాశన గణేషస్తోత్రము, భ్రమరాంభికాష్టకము, మన్యుసూక్తపారాయణ ములు, శ్రీసుబ్రహ్మణ్య కరావలంభాష్టకము, సర్పసూక్తమ్ (పరిశిష్టము) ధనంజయ శ్రీదుర్గాస్తుతి చదువవలెను.

2. కేతువులో శుక్ర అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు శుక్రజపం, శుక్రునికి సంబంధించిన వేదోక్త మంత్రాలు, శ్లోకములు. కనకధారస్తోత్రమ్, స్త్రీసూక్తం, లక్ష్మీస్తోత్రమ్, గకార శ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, శ్రీమానసా దేవి నాగస్తోత్రము, నాగదోషనివారణ జపమంత్రములు, శ్రీసుబ్రహ్మణ్య కవచస్తోత్రము, ధన పాశుపతాస్త్ర అభిషేకములు చేయవలెను.

3. కేతువులో రవి అంతర్ధశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు రవిజపం, రవికి సంబంధించిన వేదోక్తమంత్రాలు, శ్లోకములు, ఆదిత్యహృదయము, వివిధ గణపతుల అష్టోత్తర శతనామావళి, శ్రీసుబ్రహ్మణ్య షోడశనామ

స్తోత్రము, శ్రీరుద్రకవచమ్, దుర్గాసూక్తమ్, హనమద్బడబానలస్తోత్రము, నాగ అష్టోత్తర శతనామావళి, శ్రీమహిషాసుర మర్దినీస్తోత్రము చదువవలెను. అరుణహోమం జరిపించుకొనవలెను.

4. కేతువులో చంద్ర అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్ప జాతకులు చంద్ర జపం, చంద్రుని సంబంధించిన వేదోక్త మంత్రాలు, శ్లోకములు, నాగేశ్వరస్తుతి, యుధిష్ఠర కృత దుర్గాస్తవనమ్, శ్రీమహాగణపతి గాయత్రి మంత్రాలు, వివిధ రకాల గణపతి భీజాక్షర మంత్రములు, శ్రీసుబ్రహ్మణ్య సహస్రనామావళి, పురుషసూక్తం చదువవలెను.

5. కేతువులో కుజ అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు కుజజపం, కుజునికి సంబంధించిన వేదోక్త మంత్రములు, శ్లోకములు శ్రీసుబ్రహ్మణ్య షోడసనామ స్తోత్రము, నవగ్రహ గాయత్రి మంత్రములు, గణపతి సూక్తమ్, శ్రీమానసాదేవి స్తోత్రము, శ్రీమహాగణపతి గాయత్రిమంత్రములు, నాగేశ్వర స్తుతి, నాగదోష నివారణ జపమంత్రములు, శివపంచాక్షరి, భ్రమరాంభికా ష్టకము చదువవలెను.

6. కేతువులో రాహువు అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు రాహువు జపం రాహునికి సంబంధించిన వేదోక్త మంత్రములు, శ్లోకములు, శ్రీసుబ్రహ్మణ్య సహస్రనామావళి, ధనంజయకృత శ్రీదుర్గాస్తుతి, సంకట నాశన గణేష్ స్తోత్రము, శ్రీసుబ్రహ్మణ్య కవచమ్, పాదరస శివలింగముతో సర్పసూక్త రుద్రాభిషేకం, పురుషసూక్తం, విష్ణుసహస్రనామ స్తోత్ర పారాయణము, నాగదోష నివారణ జపమంత్రములు, శ్రీదుర్గాదేవి భీజాక్షర మంత్రములు పఠించవలెను.

7. కేతువులో గురు అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్ప జాతకులు గురుజపం, గురునికి సంబంధించిన వేదోక్త మంత్రాలు, శ్లోకములు, వివిధరకాల గణపతి బీజాక్షర మంత్రములు, యుధిష్ఠర కృత దుర్గాస్తవనమ్, మన్యుసూక్తమ్, సర్పసూక్త (పూర్వవర్గమ్) నాగేశ్వరస్తుతి, శ్రీసుబ్రహ్మణ్య కవచస్తోత్రము, దత్తాత్రేయస్తోత్రము, షిర్డిసాయిబాబా స్తోత్రములు, చదువవలెను.

8. కేతువులో శని అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు శనిజపం, శనికి సంబంధించిన వేదోక్తమంత్రములు, శ్లోకములు గణపతిసూక్తమ్, శ్రీరుద్రకవచమ్, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము, శ్రీమానసాదేవి నాగ

స్తోత్రము, నాగేశ్వరస్తుతి, సర్పసూక్తంతో రుద్రాభిషేకం, హనుమద్బడబానల స్తోత్రము శ్రీమహిషాసురమర్ధిని స్తోత్రములు పఠించవలెను.

9. కేతువులో బుధ అంతర్దశ జరుగుచున్నప్పుడు కాలసర్పజాతకులు బుధజపం, బుధునికి సంబంధించిన వేదోక్తమంత్రములు, శ్లోకములు గకారశ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము, గణపతి సూక్తమ్, స్త్రీసూక్తం, పురుష సూక్తం, శ్రీమానసాదేవిస్తోత్రమ్, శ్రీదుర్గాదేవి బీజాక్షర మంత్రములు, శ్రీమహాగణపతి గాయత్రి, భ్రమరాంభిక అష్టకము, శ్రీసుబ్రహ్మణ్య అష్టకము, విష్ణుసహస్రనామస్తోత్ర పారాయణము పఠించవలెను.

## 17. కాల అమృతయోగము నిర్వచనము విశేషములు

జాతక కుండలిలో అగ్రభాగంలో రాహువు క్రిందభాగం కేతువు ఉండి రాహువు కేతువుల మధ్య సప్తగ్రహములు బంధించబడి ఉంటే దానిని కాలసర్ప యోగము అని అంటారు. ఇది కాలసర్పయోగము యొక్క నిర్వచనము దీనికి వ్యతిరేకంగా ఉన్న యోగమును కాల అమృతయోగము అని అందురు. వ్యతిరేకత అంటే అగ్రభాగంలో కేతువు క్రిందభాగంలో రాహువు ఉండి సప్తగ్రహములు కేతువు రాహువుల మధ్య బంధించబడి ఉంటే దానిని కాల అమృతయోగము అని అందురు. ఇక్కడ కాల అమృత యోగములో జన్మలగ్నాన్ని లెక్కలోకి తీసుకోకూడదు. ఇక్కడ జన్మలగ్నము అవసరము లేదు. ఈ కాల అమృతయోగము వలన అనేక దీర్ఘకాలిక వ్యాధులు సంభవించును. కండరాల, ఎముకల వ్యాధులు, నరముల వ్యాధులు, పక్షవాతం, సంతాననష్టం వీర్యకణముల లోపాలు. ఈ యోగము వలన రోగము వస్తే డాక్టర్లకు కూడా అంతుపట్టదు ఎంతోమంది వైద్యులు దగ్గరకు వెళ్ళిన పరిష్కారము కాదు. కాళ్లు నొప్పులు, కీళ్ళ వ్యాధులు, ఉదర సంబంధమైన వ్యాధులు ఎంతకు పరిష్కారము కాని వ్యాధులు వస్తాయి.

ఇక్కడ శారీరక వ్యాధులను రాహువు కలిగిస్తాడు. మానసిక వ్యాధులను కేతువు కలిగిస్తాడు. వీటికి సరియైన శాస్త్రీయపద్ధతిలో తగు నివారణలు చేసుకొనవలెను.

## 18. సర్పవేష్టిత జన్మము

1. జన్మలగ్నము అశుభస్థానమై ధన, లాభ స్థానములందు శుభాలుండి, చంద్రుడు కుజ ద్రేక్కాణములందు ఉండిన ఆ జాతకుడు సర్పవేష్ఠితుడగును.
2. జన్మలగ్నము నందు శనికాని, కుజుడుకాని ఉండి ఆ లగ్నము మేష, వృషభ, సింహరాశులలో ఒకటియైన మరియు జన్మకాల నవాంశసంబంధమైన రాశి ఏ అవయవమందుండునో ఆ అవయవము నాళవేష్ఠితమై ఉండును.

3. చతుష్పాదరాశులైన మేష, వృషభ, సింహ, ధనూర పూర్వార్థ, మకరపూర్వార్థ ముల యందు రవి ఉండి మిగిలిన గ్రహములు వేర్వేరు సమన్వితులయి ద్విస్వభావరాశులు అయినను ఒకే గర్భమందు జంతువులు రెండు జన్మించును.

4. చతుర్ధ లగ్నాధి పతులు లగ్నచతుర్థములయందున్న చతుష్పాద జంతు జననము అగును.

5. జన్మలగ్న చతుర్ధాదిపతులు రాహువుతో గాని, కేతువుతో గాని సంయోగము అయినను చతుష్పాద జంతుజననము సంభవము.

## 19. రాహువు ఆరాధనలో దుర్గాదేవి ప్రాశస్త్యము

రాహు దోషము తొలగాలంటే రాహువుకు అధిష్ఠాన దేవత 'దుర్గాదేవి' రాహువు గ్రహముతో పాటు దుర్గాదేవి అనుగ్రహము పొందటం కూడా ముఖ్యము దుర్గాదేవి గురించి తెలుసుకుందాము. ఈ క్రింది శ్లోకము గురించి ఆలోచించుదాము.

శ్లో॥ భవాని స్తోత్రం త్వాంప్రభవతి చతుర్భిర్నవదనైః
ప్రజానా మీశాన స్త్రిపుర మథనః పంచభిరపి
నషడ్భిస్సేనానీర్దశ శతముఖై రప్యహిపతిః
తదాన్యేషాం కేషాకథయ కథ మస్మిన్నవసరః॥

పై శ్లోకము ఆనందలహరిలో శ్రీశ్రీశ్రీ జగద్గురు ఆదిశంకరాచార్యులు వారు అమ్మవారి గురించి వ్రాసినశ్లోకం. పై శ్లోకము అర్ధము ఏమిటి అంటే అమ్మా! భవానీ! సృష్టికర్తయైన బ్రహ్మ నాలుగు ముఖములు ఉన్నాయి. పరమేశ్వరుడికి ఐదుముఖములు ఉన్నాయి. షణ్ముఖుడు కుమారస్వామికి ఆరుముఖములు ఉన్నాయి. నాగరాజైన ఆదిశేషుడికి వెయ్యి ముఖములు ఉన్నాయి. కానీ ఆదిశేషుడికి వెయ్యి ముఖములకు రెండు వేల నాలుకలు ఉంటాయి. నాల్గునాలుకల బ్రహ్మ మొదలు రెండువేల నాలుకలున్న ఆదిశేషుడి వరకు గల అందరూ నీమహిమలను వర్ణించలేరు గదా వారే వర్ణించలేకపోతే నేను మానవ మాత్రుణ్ణి నేనేమని వర్ణించ గలను తల్లీ! అని అనెను. రాహుదోషమునకు అమ్మవారి అనుగ్రహము కావాలి అష్టకష్టాలు అన్నీ ఆపదలు తొలగి సుఖశాంతులతో ఉంటారు. అందుచేత దుర్గాదేవి ముప్పైరెండు నామాలను పఠించవలెను.

దుర్గా దుర్గార్తి శమనీ దుర్గాపద్వినివారిణీ
దుర్గమచ్ఛేదినీ దుర్గ సాధినీ దుర్గనాశినీ

దుర్గతోద్ధారిణీ దుర్గనిహంత్రీ దుర్గమాపహా
దుర్గమజ్ఞానదా దుర్గదైత్య లోకదవానలా
దుర్గమా దుర్గమాలోకా దుర్గమాత్మ స్వరూపిణీ
దుర్గ మార్గప్రదాదుర్గమవిద్యా దుర్గ మాశ్రితా
దుర్గమజ్ఞాన సంస్థాన దుర్గమధ్యాన భాసినీ
దుర్గమోహా దుర్గమగా దుర్గమార్ధ స్వరూపిణీ
దుర్గమాసుర సంహంత్రీ దుర్గమాయుధ ధారిణీ
దుర్గమాంగీ దుర్గమాతా దుర్గమ్యా దుర్గమేశ్వరీ
దుర్గభీమా దుర్గభామా దుర్గభా దుర్గ ధారిణీ
నామావళి మిమాం యస్తు దుర్గయా మమ మానవః
పఠేత్సర్వ భయాన్ముక్తో భవిష్యతి న సంశయః

పై మంత్రమును 108 సార్లు ఈ దుర్గాస్తవమును పారాయణ చేస్తే కోరికలు నెరవేరుతాయి. పారాయణము చేసినతర్వాత ఎర్రనిపూలతో అమ్మవారిని పూజించాలి.

**ఉపాఖ్యానము:**

విధాత్రీ ధర్మాణాం త్వమసి సకలామ్నాయ జననీ!
త్వమర్ధానాం మూలం ధనద, నమనీ యాంఘ్రికమలే!
త్వమాది కామానాం జనని! కృత కందర్ప విజయే!
సతాం ముక్తేర్భీజం త్వమసి పరబ్రహ్మ మహిషీ!

పైన వ్రాసిన దుర్గాదేవి ఉపాఖ్యానము విన్న వారికి విపత్తులు తొలగిపోతాయనీ శివపురాణం చెబుతోంది. అందువల్ల రాహుదోషము తొలగాలంటే రాహువుకు విరుగుడు దుర్గాదేవి.

## ౨౦. కేతువు ఆరాధనలో గణపతి ప్రాశస్త్యము

కేతువుకు అదిష్ఠానదేవత శ్రీమహాగణాధిపతి ముందుగా శ్రీమహాగణాధిపతిని తెలుసుకొందాము. వేదాలలో పురాణాలలో గణపతి యొక్క ప్రాముఖ్యతను వివరించారు. మనకు వేదాలు ముఖ్యము అలాగే పురాణాలు కూడా అన్ని యుగాలలో అనగా 1) కృతయుగము 2) త్రేతాయుగము 3) ద్వాపర యుగము 4) కలియుగములలో గాని గణపతి యొక్క ప్రాముఖ్యత తెలుసు. అలాగే వేదాలు అవి: 1) ఋగ్వేదము 2) యజుర్వేదము 3) సామవేదము 4) అధర్వణవేదము ఈ వేదములను ఋగ్వేదాన్ని పైలుడుకీ, యజుర్వేదాన్ని జైమినికీ, సామవేదాన్ని వైశంపాయనుడికీ, అధర్వణవేదాన్ని సుమంతుడికీ బోధపరిచాడు. ఈ వేదాలలో

గణపతి గురించి వివరించారు. అలాగే పురాణాలలో కూడా వివరించారు. మన భారతీయ విజ్ఞానం సరస్వమూ ఈ పురాణాల్లోనే నిక్షిప్తం అయి ఉన్నది. వ్యాసుడు రచించిన మనకు వారసత్వ సంపదగా అందించిన మహా పురాణాలు 18 అవి 1) బ్రహ్మపురాణము 2) పద్మపురాణము 3) విష్ణుపురాణము 4) వాయుపురాణము 5) భాగవతపురాణము 6) నారదపురాణము 7) మార్కండేయ పురాణము 8) అగ్నిపురాణము 9) భవిష్య పురాణము 10) బ్రహ్మవైవర్త పురాణము 11) లింగపురాణము 12) వరాహ పురాణము 13) స్కాందపురాణము 14) వామన పురాణము 15) కూర్మపురాణము 16) మత్స్య పురాణము 17) గరుడ పురాణము 18) బ్రహ్మాండ పురాణము.

ఈ 18 పురాణాలకు మరో 18 ఉపపురాణాలు కూడా ఉన్నాయి. అవి 1) ఆదిపురాణము 2) నరసింహ పురాణము 3) స్కాంద పురాణము. 4) శివపురాణము 5) దూర్వాస పురాణము 6) నారద పురాణము 7) కపిల పురాణము 8) వామన పురాణము 9) జాశన పురాణము 10) బ్రహ్మాండ పురాణము 11) వరుణ పురాణము 12) కౌశిక పురాణము 13) మహేశ్వర పురాణము 14) శాంబపురాణము 15) సౌతపూరాణము 16) పరాశర పురాణము 17) మారీచ పురాణము 18) భాస్కర పురాణము.

ఈ 18 ఉపపురాణాలకు మరో 18 జాషపురాణాలు కూడా ఉన్నాయి. అవి 1) సనత్కుమార పురాణము 2) ఆదిత్య పురాణము 3) బృహన్నాందీయ పురాణము 4) సూర్య పురాణము. 5) నందికేశ్వర పురాణము 6) కార్మపురాణము 7) భాగవత పురాణము 8) వశిష్ఠ పురాణము 9) భార్గవ పురాణము 10) ముద్గల పురాణము 11) కల్కిపురాణము 12) దేవీ పురాణము 13) మహాభాగవత పురాణము 14) బృహద్ధర్మ పురాణము 15) పరానంద పురాణము 16) వహ్నిపురాణము 17) పశుపత్ని పురాణము 18) హరివంశ పురాణము.

వీటిలో లేని విషయము లేదు మనకు అవసరమయినవీ ఉపయోగపడేవి అన్నీ శాస్త్రాలనూ సకలధర్మాలనూ వీటిలో పొందుపరిచారు.

మహాగణపతి దేవగణాలందరికీ అధిపతి అనేది అలా ఉంచితే 'గ' అనేది జ్ఞానానికి సూచిక 'ణ' అనేది నిర్వాణవాచకం. మోక్షాన్ని సూచిస్తుంది. అందుచేత జ్ఞానమోక్షమార్గాలు రెండింటికి కూడా అధిపతి అయినవాడు గణపతి

ఓమ్ నమస్తే గణపతయే
త్వమేవ ప్రత్యక్షం తత్వమసి
త్వమేవం కేవలం కర్తాసి

త్వమేవ కేవలం హర్తాసి
త్వమేవ సర్వం ఖల్విధం
బ్రహ్మాసి త్వం సాక్షాదాత్మాసి నిత్యమ్ ఋతం వచ్మిసత్యం వచ్మి

పై మంత్రము గణపత్యధర్వషీర్షోపనిషత్‌లోనిది కుండలిలలోని మూలాధారం దగ్గరగా ఉండేవాడు గణపతి. ఆ గణపతిని ఉపాసిస్తే బుద్ధిరూపమైన మూలాధార శక్తి జాగృతం అవుతుంది. మనము గణపతిని ఉపాసన చేస్తే సిద్ధి, బుద్ధి, బలం, ఐశ్వర్యం అన్నీ సిద్ధిస్తాయి. శత్రువుల నిర్మూలనకు గ్రహబాధలకు, వివాహాము రోగాలకు సంతానమునకు గణపతిని పూజించుట మంచిది.

శివపురాణంలోనూ, లింగ, స్కంధ, బ్రహ్మవైవర్త, వరాహ, గణేశ, ముద్గల పురాణాలలో కూడా శ్రీమహాగణపతి విశ్వరూపాన్ని వివరించారు.

భూతాధిపం భూతగణాధిసేవితం
కపిత్థ జంభూ ఫలాది సారభక్షితం
ఉమాసుతం శోకవినాశకారకం
నమామి విఘ్నేశ్వర పాదపంకజం

గణపతి మోక్ష జ్ఞాన మార్గానికి అధిపతి ఈ కేతువు కూడా జ్ఞానానికి అధిపతి అందువల్లే కేతువుకు అధిష్ఠానదేవత గణపతి ఋగ్వేదంలోనూ యజుర్వేదములోనూ అధర్వణవేదంలోను శ్రీమహాగణాధిపతి మంత్రములు కూడా ఇచ్చారు.

శ్లో॥ ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే
కవింకవీనా ముపమశ్రవస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత అనశ్శృణ్వ
న్నూతిభి స్సీదసాదనమ్॥

పైమంత్రము యజుర్వేదంలో ఉన్న గణపతి మంత్రం సర్వవిఘ్నాలను శాంతింపజేయగల శక్తివంతుడు వినాయకుడు ఈ మంత్రార్థము ఏమిటి అంటే దేవగణాలకు అధిపతి గణపతి ఆదికాలము నుంచీ గణపతిని పూజించడం ఉంది గణాలకు అధిపతి గణపతి గణాలంటేనే విద్య విద్యను పరబ్రహ్మ స్వరూపంగా పేర్కొన్నాయి.

స్వామి నువ్వు మేధావులలో మేధావి ప్రధానులైన వారందరిలో ప్రధానుడవు వేదాలకు నాయకుడు శ్రేష్టులయిన వారిలో అందరి కంటే శ్రేష్టుడవు సాటిలేని ఖ్యాతి గడించిన వాడివి మమ్ములను రక్షించవయ్యా గణనాథా అని కీర్తించడము ఈశాన్య రాష్ట్రంలోని నాగాజాతి వారు పూజించే గణపతికి పదితలలున్న ఆదిశేషుడు పడగనీడనిస్తూంటాడు.

నమోవ్రాతపతయే నమో గణపతయే

నమఃప్రమథపతయే నమస్తేస్తు లంబోదరాయైకదన్తాయ

విఘ్ననాశినే శివసుతాయ వరదమూర్తయే నమః

శ్రీమహాగణాధిపతిని బంగారముతో పూజిస్తే తలుచుకున్న పనులు అవుతాయి. వెండితో పూజిస్తే ఆయుష్యవృద్ధి అవుతుంది. రాగితో పూజిస్తే ఐశ్వర్యం వస్తుంది.

కేతుగ్రహ బాధల నుండి విముక్తి పొందుటకై ఇసుక, రాయితో చేసిన వినాయకుడిని మరియు శ్వేతార్క గణపతిని పూజించాలి.

గణపతి అనగా గ అంటే విద్య, వివేకం, విజ్ఞానం. 'ణ' అంటే మోక్షం, బుద్ధి, పతి అంటే అధిపతి అని అర్థము బ్రహ్మాండ పురాణం ఉత్తర ఖండంలోని లలితా సహస్రనామాలలో కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా అంటూ గణపతి గురించి చెప్పబడింది. విఘ్నాలు తొలగించడానికి, కలిగించడానికి స్వామికి విఘ్నాధిపత్యం ఇచ్చినట్లు లింగ, స్కాంద, వామన, అగ్ని, శివ పురాణాలు చెప్పబడినవి. గణపతిని బ్రహ్మగా వర్ణించాయి ఉపనిషత్తులు, గణపతి సాక్షాత్తూ శ్రీమన్నారాయణుని మూర్తి అని విష్వక్సేన సంహితలో ఉంది.

ప్రతి చతుర్థినాడు వినాయకుని పూజ చేయాలని బోధాయాన గుహ్యాసూత్రాల్లో చెప్పారు. పంచరాత్ర, నవత్కుమార, ఈశ్వర నారదీయ సంహితల్లో వినాయకుని ప్రస్తావన ఉంది. గణపతి గురించి గాయత్రీ మంత్రం తైతరీయంలో చెప్పబడింది. గణపతి జ్ఞానానికి ప్రతీక 'జ్ఞాత్వా కుర్వీత కర్మాణీ' అనేది ఉపనిషత్ వాక్యం ఈ మహాగణపతి శతసహస్ర నామధేయుడు, బహురూపధారి అని శివపురాణం, స్కాంధపురాణం, ముద్గలపురాణాలలో శ్రీమహాగణపతి రూపురేఖల్ని బట్టి ఎన్నో పేర్లు ఉన్నాయి. గణపతిలో ఒకరూపము ఉచ్ఛిష్ఠ గణపతి ఈగణపతిని పూజించటం వల్ల సుఖశాంతులు, ధనదాన్యవృద్ధి, ఆరోగ్యము, ముక్తి కలుగును. 'కలౌచండి-వినాయకౌ' సూక్తిని అనుసరించి గణపతి ఉపాసన శీఘ్రఫలం ప్రసాదిస్తుంది. అందువల్లే ఉచ్ఛిష్ఠ గణపతిపూజ సర్వోత్తమం.

శ్లో॥ యత్రాస్తి భోగోవతు తంత్ర మోక్షఃయంత్రాస్తి మోక్షోనతు తత్ర భోగః।

ఉచ్ఛిష్ఠ విఘ్నేశ్వర పూజానాం, భోగశ్చమోక్షశ్చ కరస్థ ఏవ॥

బుద్ధి, సిద్ధి, సుఖ, సౌభాగ్యాలు ప్రసాదించే వాడు గణపతి. అలాగే శ్వేతార్క గణపతిని కూడా పూజించవలెను. పుష్యమి నక్షత్రముతో కూడి ఆదివారము (రవి పుష్యయోగం) లేక గురువారము (గురుపుష్యయోగం)రోజున వృక్ష మూలంతో చేసిన (తెల్లజిల్లేడువేరు) గణపతిని పూజించటం వల్ల ధనధాన్యవృద్ధి కలుగును, సుఖశాంతులు కల్గును, ఆరోగ్యం, రక్షణ, వశీకరణ, భాగ్యవృద్ధి కల్గును.

రవి పుష్యయోగము లేక గురు పుష్యయోగము ఉన్న రోజున కమల పత్రాన్ని నాభిపైన, శ్వేతార్క మూలం కుడి భుజానికి ధరించటం వల్ల సౌభాగ్యవృద్ధి జరుగుతుంది. ఈ యోగములు ఉన్న సమమయంలో శ్వేతార్క మొక్కను ఇంటి ద్వారానికి లేదా ద్వారప్రవేశానికి వెళ్ళే దారిలో ఉంచాలి. ఈ మొక్క వలన అధివ్యాధులు, దృష్టిదోషాలు, గ్రహదోషములు భూతప్రేత పిశాచ బాధలు తొలగి పోవును. ఈ మొక్కను మెడలో ధరించటం వల్ల శరీరానికి రక్షణగా ఉంటుంది. దృష్ఠిదోషం వంటి బాధలు కలగవు. అందులోని చిన్నముక్కని తాయెత్తు యంత్రం వంటి వాటిలో చుట్టించి, ధరించాలి. దీనివల్ల బాధలు తొలగిపోతాయి.

ఓం గణానాం త్వా గణపతి హవామహే
ప్రియాణాం త్వా ప్రియపతిహవామహే
నిదీనాం త్వా నిధిపతి హవామహేవసో
మమ ఆహమజాని గర్భధమాత్వం జాసి గర్భధమ్॥
ఓం గం గణపతయే నమః ద్యానం। సమర్పయామి॥

పైన శ్లోకములో 'ఓం గం గణపతయే నమః' అను మంత్రమును పగడపుమాలతో జపము చేసిన కోరిన కోరికలు సిద్ధించును.

పాదరస గణపతిని పూజించటము వల్ల అన్నీ శుభములు జరుగుతాయి. 'సిద్దరసీ కరిష్యే నిర్ధారిద్ర్యమగధం జగత్' ప్రపంచముతో పాదరసం లభించటం దారిద్ర్యం, తీరని రోగం, సంసార బాధల నుండి విముక్తులైనట్లే ఈమాట 'రసరత్న సముచ్ఛయ' గ్రంథం చెబుతుంది.

పాదరసం 'రసరాజం' సిద్ధరసం' అని పిలిచే సర్వశ్రేష్ఠదాతువు ఇది పరమేశ్వరుని శక్తి రూపం. మంత్రాలతో అభిభూతమైన స్వర్ణగ్రాసయుక్తమైన పాదరస ప్రతిమస్వతః చైతన్యవంతం అది ఉండటమే సంపూర్ణత్వాన్ని సూచిస్తుంది. అసలు పాదరసము అనగా పరమేశ్వరున.ఇ వీర్యము (SEMIN) అని అర్థము. ధరణీధర సంహితప్రకారం స్వేద, మర్ధన, మూర్ఛన, ఉత్థాపన, పాత్తన, రోధన, బోధన, గగన, గ్రాస (అభ్రక లేదా స్వర్ణ భక్షణ) చారణ, గర్భదుతి, బ్రహ్మద్యుతి, జారణ రంజన, సారణ, క్రమణ, వైధ – సంస్కారాల తర్వాతే పాదరసం సహజమైన రూపంగా వస్తుంది.అలాంటి పాదరసపు గణపతిని పూజించటం వల్ల సర్వ సౌఖ్యాలు, ధనధాన్యవృద్ధి, ఆరోగ్యం,విద్యలభించును. అందువల్లే కేతువుకు విరుగుడు గణపతియే.

## 21. నాగదేవతా కుండలినీ శక్తి

మన పురాణములలో నాగజాతికి విశిష్ఠమైన ప్రాధాన్యత కలదు. మనము నాగరాజును భక్తిశ్రద్ధలతో కొలుస్తాము. సృష్ట్యాదిలోనే నాగజాతి ఆవిర్భవించినది.

దక్షప్రజాపతి తన పదముగ్గురు కుమార్తెలగు అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహక, ముని, కపిల, వినత, కద్రువ, క్రోధ, పాధ, క్రూరలను కశ్యప ప్రజాపతికి ఇచ్చి వివాహము చేశారు. కశ్యప ప్రజాపతి భార్య ద్రువ ఒకరోజున భర్తను ఒక కోరిక కోరింది. అగ్ని వంటి తేజస్సు, ధీరుడు, పొడవైన శరీరం గల్గిన వెయ్యిమంది పుత్రులు ఇమ్మని భర్తను కోరింది. అందువలన కశ్యపమహర్షి చాలా సంవత్సరములు తపస్సునొనర్చి మరియు పుత్రకామేష్ఠి యాగము చేసినారు. ఆ యాగఫలితముగా కద్రువకు వెయ్యి సర్పాలు జన్మించినవి అవే వాసుకి, తక్షక, కర్కోటక, తక్షక, పద్మ, మహాపద్మ, కుళిక, శంఖపాల, శంఖనంద, విషక్త, ఆదిశేష, అనంత మొదలగు సర్పాలు జన్మించినవి వినతకు, అనూరుడు, గరుత్మంతుడు జన్మించినారు.

గరుత్మంతుని ఆభరణాల్లో కంకణంగా ఆదిశేషుడు, యజ్ఞోపవీతంగా వాసుకి మొలనూలుగా దక్షుడు మాలికగా కర్కోటకుడు, కుడిచెవి కుండలంగా పద్ముడు ఎడమచెవి కుండలంగా మహాపద్ముడు కేశాలంకారంగా శంఖపాలుడు, కుడి భుజానికి కుళికుడు, అలంకారాలుగా అష్ట నాగాభరణాలతో ఉంటాడు. సూర్యుని రథానికి పగ్గం సర్పము, శ్రీ మహావిష్ణువు శేషపాన్పుపై పవళిస్తాడు. ఈశ్వరుడు నాగాభరణుడు గణపతి యజ్ఞోపవీతము నాగరాజు.

నాడులతో నిండి ఉన్న మానవుని వెన్నెముకను వెన్నుపాము అంటారు. అందులో కుండలినీ శక్తి మూలాధార చక్రంలో పాము ఆకారంలో ఉంటుంది. అది మానవ శరీరంలో నిద్రిస్తున్నట్లు నటిస్తూ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాల విషరూపంలో ఉండి మనిషిలోని సత్వగుణాన్ని హరిస్తూ ఉంటుంది. నాగదేవతను ఆరాధించడం వల్ల మానవునిలోని విషము హరింపబడుతుంది.

బ్రహ్మ పురాణము ప్రకారము చంద్రవంశపు రాజు శూరిసేనుడు భార్యతో కలిసి సంతానము కోసము చాలా రోజులు తపస్సు చేశాడు. ఆ తపస్సు ఫలము వలన వారికి సర్పము జన్మించినది. అది సర్పమైన మాట్లాడేది. తనకు ఉపనయనము, వివాహము చెయ్యమని తండ్రిని కోరింది. సర్పమునకు ఉపనయనము చేసి మరియు వంశాచారము ప్రకారము ఒక ఖడ్గాన్ని పంపి రాకుమార్తెతో పెళ్లి జరిపించారు. ఆ అమ్మాయి అత్తవారింటికి వచ్చాక తన భర్త పాము అని తెలుసుకొంది. అయినా భయపడలేదు. సర్పరూపంలో ఉన్న భర్తతో స్నేహం చేసింది. భర్త ఎలాంటివాడైనా స్త్రీకి దైవసమానుడు అని భావించి శివుని శాపము వల్ల తాను సర్పరూపములో ఉన్నాను అని చెప్పి భార్యతో కలిసి గౌతమీ నదిలో స్నానము చేసి సర్పవిమోచనము పొంది మానవరూపము ధరించాడు.

రాహు,కేతువుల దోషాలు ఉన్నవారు, సర్పదోషము, కాలసర్పదోషము ఉన్నవారు, కుజదోషము ఉన్నవారు మరియు వివాహమము కాని వారు, సంతానము

కల్గనివారు, సంసార బాధలలో ఉన్నవారు. దీర్ఘకాలిక రోగాలు ఉన్నవారు సర్పము లను పూజించవలెను. సంతానము కలగకపోయినా, పుట్టిన పిల్లలు చనిపోతున్నా నాగప్రతిష్ఠ చేస్తే ఉత్తమ ఫలితాలు వస్తాయి అని భవిష్య పురాణములో చెప్పబడింది.

## 22. నాగారాధన రహస్యము

నాగారాధన భారతీయ సంప్రదాయములో విశిష్ఠమైన స్థానము ఉన్నది. సర్పములను పూజచేయుటవలన వంశాభివృద్ధి కల్గును. మంచి సంతానము కల్గును. ఇవేకాక రాహుకేతువుల ద్వారా వచ్చే దోషములు కుజదోషము, చెవిసంబంధించి వ్యాధులు, వివాహముల గురించి, మనఃశాంతికి మొదలగు విషయములకు నాగదేవతలను పూజించవలెను.

"నతేషాం సర్వతో వీరభయంభవతి కుత్ర చిత్"।

సర్వపాప వినిర్ముక్త స్సర్వాన్ కామాన్ నమశ్నుతే॥

పై శ్లోకముననుసరించి సర్పపూజ చేసిన వారికి సర్పభయం ఉండదని నాగారాధన వల్ల సమస్త పాపములు తొలగును.

**1. సర్పగాయత్రి మంత్రములు:**

1) " ఓం నాగకులాయ విద్మహే విషదంతాయ ధీమహి
తన్నో సర్ప ప్రచోదయాత్"

2) "నాగరాజాయ విద్మహే పృథ్వీధరాయ ధీమహి
తన్నో నాగ ప్రచోదయాత్"

**2. నవనాగ మంత్రము:**

అనంత, వాసుకీం, శేషం, పద్మనాభం, కంబళం,
శంఖపాలం, ధృతరాష్ట్రం, తక్షకం, కాళీయం తథా
ఏతాని నవనామాని నాగానంచ మహాత్మనే
సాయంకాలం పఠేనిత్యం, ప్రాతఃకాలే విశేషతః
తస్స విషభయం నాస్తి సర్వత్ర విజయీభవేత్

జనమేజయుని సర్పయాగములో సర్పజాతి అంతరించిపోతుందేమో అని సర్పదేవతలు బ్రహ్మను శరణువేడగా బ్రహ్మదేవుడు వారిని కరుణించగా మీకు ఆస్తిక మహర్షి ద్వారా మీకు ముప్పు తప్పుతుందని అని వరము ఇచ్చాడు. ఈ వరము వల్ల భూలోకవాసులు నాగదేవతలను పూజిస్తారు. ఆరాధిస్తారు. పండుగలు జరుపుకుంటారు. నాగదేవతలు షోడశోపచారములతో పూజించుతారు. సర్ప అభిషేకములు చేస్తారు అని బ్రహ్మ వరము ఇచ్చాడు.

సర్వాభీష్ట సిద్ధికీ, సకలపాపములు తొలగుటకు, ఆందోళనలు తొలగుటకు ప్రతిరోజు ఈ క్రింది మంత్రములను పఠించవలెను. మన దేశంలో ముఖ్యంగా శ్రావణమాసములో వచ్చేపంచమి మరియు కార్తీకమాసములో వచ్చే నాగుల చవితి ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. నాగుల చవితి ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. శ్రావణమాసంలో వచ్చే పంచమిని నాగపంచమి అని మరియు గరుడపంచమి అని వెనుకటి రోజు నాగచతుర్థి అని పిలుస్తారు. ఈ నాగ పంచమి విష్ణు సంబంధమైనది. ఇక కార్తీకమాసములో వచ్చే నాగులచవితి శివ సంబంధమైనది. ముఖ్యంగా నాగదోషము వలన సంతానానికి అవరోధములు ఏర్పడును. నాగదేవతను ప్రసన్నమును చేసుకొనుట వల్ల సర్వకష్టములు తొలగును.

నాగారాధన గురించి దాని పూజావిధానమును ఫలితములను భవిష్యత్ పురాణమునందు వ్రత చూడామణి ప్రభాసఖండము నందు వ్రాయబడినది. ప్రతిరోజు కూడా సర్పములను ప్రార్థించవలెను. ఈ క్రింది విధముగా

**1. శ్లో॥** కర్కోటకస్య నాగస్యదమయంత్యా నలస్యచ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥

**2. శ్లో॥** సర్పాపసర్ప భద్రం తే దూరం గచ్ఛమహావిష।
జనమేజయ యాగాంతే ఆస్తిక వచనం స్మర॥

అనంతాయ నమస్తుభ్యం సహస్ర శిరసే నమః।
నమోస్తు పద్మనాభాయా నాగానాం పతయే నమః॥
అనంతో వాసుకిః శేషః పద్మనాభశ్చ కంబళః।
శంఖకపాలో ధార్తరాష్ట్రః తక్షకః కాళియు స్తథా॥
ఏతేషాం నవ నామాని నాగానంచ మహాత్మనామ్।
సాయంకాలే పఠేన్నిత్యం ప్రాతఃకాలే విశేషతః।
విషాస్తస్య భయం నాస్తి సర్వత్ర విజయీ భవేత్॥

3 శ్లో॥ పాహి పాహి సర్పరూప నాగదేవ దయామయ।
సత్సాంతాన సంపత్తిం దేహిమే శంకరప్రియే॥
అనంతాది మహా నాగరూపాయ వరదాయచ।
తుభ్యం నమామి భుజగేంద్ర సౌభాగ్యం దేహిమే సదా॥

## 23. నాగపురాణము

నాగవంశములో ముఖ్యంగా ఆదిశేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, పద్మడు, మహాపద్మడు, శంఖపాలుడు, కుళికుడు అను ఎనిమిది నాగులు శ్రేష్ఠులు, వీరిలో ఇద్దరు నాగులు బ్రాహ్మణులు, ఇద్దరు క్షత్రియులు, ఇద్దరు వైశ్యులు, ఇద్దరు శూద్రులు, ఈనాలుగు వర్ణముల నాగులకు క్రమముగ, వెయ్యి, ఎనిమిది వందలు, ఐదువందలు, మూడువందల పడగలు ఉంటాయి. వీరి వంశమున ఐదు వందల నాగులు పుట్టిరి వారి నుండి పుట్టిన వారు అసంఖ్యాకులు. సర్పములు ఫణి, మండలి, రాజిలము అని మూడు విధములు. ఇవి వరుసగ వాత, పిత్త, కఫ ప్రధానములు ఇవికాక వ్యంతరము, దోషమిశ్రమము, దర్వీకరము యని జాతి గల సర్పములు కూడా ఉన్నవి. వీటిపై చక్రము, హలము, ఛత్రము, స్వస్తికము, అంకుశము వీటి చిహ్నములుండును.

సాధారణంగా సర్పములు నూట ఇరువది సంవత్సరములు జీవించును శేషాది సప్తనాగులు వరుసగ సూర్యాది వారములకు అధిపతులు ఈ ఆధిపత్యము పగలు, రాత్రి కూడా ఉండును. శేషాది సప్తనాగులు తమతమ వారములలో ఉదయించును. కాని కుళికుడు అన్నిటి సంధికాలమునందు ఆవిర్భవించును. లేదా మహాపద్మ, శంఖపాలులతో పాటు ఉదయించును. మహాపద్మ, శంఖపాలుల మధ్య నున్న రెండు గడియలకాలమున కుళికోదయమగునని మరొకమతము కుళికోదయ మతము అన్ని కార్యములకు నిషిద్ధము సర్పదంశము ప్రధానముగ అశుభము, కృత్తికా, భరణి,స్వాతి, మూల, పూర్వ ఫల్గుణి, పూర్వాషాఢ, పూర్వాబాద్ర, అశ్వని, విశాఖ, ఆరుద్ర, ఆశ్లేష, చిత్త, శ్రవణము, రోహిణి, హస్త నక్షత్రములు, శని మంగళవారములు, పంచమి, అష్టమి, షష్ఠి, రక్త చతుర్థీ, నవమి, చతుర్థలు తృతీయ తిథి సర్పదంశమువ నింద్యములు పంచమి, చతుర్దశి, తిథులలో సర్పదంశము విశేషించి నిందితము, నాలుగు సంధ్యలయందును దగ్ధరాశులయందును సర్పము కరచినచో అది అనిష్ఠకరమగును. ఈ సర్పములు దేవాలయము, శూన్యగృహము, పుట్ట ఉద్యానము, చెట్టుతోర్ర, రెండు మార్గముల సంధి, స్మశానము, నదీసాగర సంగమము, ద్వీపము చతుష్పదము, రాజప్రసాదము, గృహము, కమలవనము గృహము, పర్వతశిఖరము, బిలద్వారము, జీర్ణకూపము, జీర్ణకుద్యము సిగ్రు, శ్లేష్మాతక, అక్ష, జంభూ, ఉదుంబర, వేణువన, వట, వృక్షములందును జీర్ణప్రాకారాదులందును సర్పములు నివసించును. ఇంద్రియ రంధ్రములు, ముఖము, హృదయము, కక్షములు, కంఠమూలము, తాలువు లాలాటము, కంఠము, శిరస్సు, గడ్డము, నాభి, చరణములు ఈ అంగములపై సర్పదంశము అశుభకరము.

## 24. హస్త సాముద్రిక పరంగా రాహువు

హస్తరేఖలలో రాహువు స్థితి స్పష్టంగా తెలుస్తుంది. రాహుక్షేత్రము సుస్పష్టంగా, సమతలంగా ఉంటే మంచి ఆలోచనపరుడు, బుద్ధిమంతుడు, పరోపకారి, దయామయుడు, దేశభక్తుడు, ఉదారుడు అవుతాడు. ఈ క్షేత్రంలో సంక్రమణ చేసే భాగ్యరేఖ భాగ్యవృద్ధి చేస్తుంది. కార్యక్రమములు విజయవంతము అవటానికి సమాజంలో కీర్తిపొందాలంటే ఈ రేఖవల్ల కలుగుతుంది. అసలు మన హస్తములో రాహువు ఎక్కడ ఉంటాడు. అరచేతి మధ్యలో, మస్తకరేఖ క్రింద నెప్ట్యూన్, చంద్ర, శుక్ర, కుజ మొదలైన క్షేత్రాలలో ఆవరింపబడిన దానిని రాహువు క్షేత్రంగా, చూసేందుకు వికారంగా, విస్తారంగా, భంగంగా ఉంటే ఆ వ్యక్తికి బాధలు కలుగుతాయి. భాగ్యరేఖ ముక్కలు అయితే శక్తిహీనంగా ఉంటే బాగాలేకపోతే మరియు ఈ క్షేత్రంలో ద్వీపం లేక అసుందర చిహ్నాలతో ఉంటే ఆపదలు వస్తాయి.

రాహు క్షేత్రము వికారంగా ఉండి లోతుగా, అరచేతిలో నొక్కినట్లుగా ఉంటే విఫలతను నిరాశను పనులు నెరవేరకపోవటము జరుగును. ఇలాంటి పరిస్థితిలో భాగ్యరేఖ శక్తిహీనము కూడా అయితే ఎలాంటి శుభములు ఇవ్వడు. ఈ స్థానము ద్వీపాలతో కప్పబడి భాగ్యరేఖ ముక్కలైతే యవ్వనదశలో స్త్రీలతో కలహములు, అధిక ఖర్చులు, బాధలు వ్యంగ్య మాటలు, సంతానము తక్కువ స్త్రీలు ఆచారహీనత, అసంస్కారులుగా మిగలటం జరుగును మరియు భాగ్యరేఖ మస్తక రేఖపై ఉంటే యవ్వనదశలో బాధలు కల్గుతాయి. కలలు విఫలము అవుతాయి. అవమానములు, కుటుంబంలో కలహాలు మంచివాళ్లు, చెడ్డవాళ్లుగా మారటము జరుగును. రాహుక్షేత్రంపై మంగళగ్రహరేఖలు ఉబ్బెత్తుగా, సరిగా లేకపోతే ధననష్టము, అప్పులు, పతనమువైపు వెళ్లటము జరుగును. రాహు క్షేత్రము నుండి స్వాస్థ్యరేఖ వెళ్లితే ఆ జాతకుడికి దీర్ఘకాలిక రోగములు, మానసిక వేదనలు, రోగము వలన మరణము కల్గును. కొన్ని సందర్భాలలో ఉన్మాదిగా మారును.

పాశ్చాత్య సాముద్రికములు దీనిని కుజ మండలము అంటారు.(ప్లేస్ ఆఫ్ మార్స్) కాని మనవారు రాహుక్షేత్రముగా వర్ణించారు. ఈ రాహుక్షేత్రమును బట్టి ఆ జాతకుని యొక్క స్థితిగతులను నిర్ణయించవచ్చు. రాహుక్షేత్రము లోతుగా గుంతగా ఉంటే వ్యక్తికి ఎన్ని తెలివితేటలున్నా పైకి రాలేడు. అదృష్టము వరించదు.

రాహువు ఉండే స్థానము స్పష్టంగా బాగా కనిపిస్తే ఆ వ్యక్తికి మంచి హృదయము, ఇతరులకు సహాయము చేయుట, దేశం మీద గౌరవము, ఈస్థానము లోతుగా అస్పష్టంగా కనపడితే అన్ని విషయాలలో వైఫల్యాలు అభివృద్ధి చెందకపోవటము, చాలా ఇబ్బందులు కలగటం ధనము ఖర్చు అవటము. ఈ రాహుస్థానములో ఎక్కువలోపాలు లేక ద్వీపాలు ఉంటే ఆర్థిక ఇబ్బందులు సంపాదన కంటే

ఖర్చు అధికము. స్త్రీలతోకలహములు కలుగుతాయి. ఈ రాహు స్థానంలో కలిసే భాగ్యరేఖ బాగుగా ఉన్నచో సకల ఐశ్వర్యము కలుగును. కీర్తి ప్రతిష్టలు రాజకీయాలలో విజయం సాధిస్తారు. ఈ రాహు స్థానము బాగోలేక దానితోపాటు భాగ్యరేఖ కూడా ముక్కలు ముక్కలుగా ఉంటే ధననష్టము ఆపదలు కలుగును. రాహుస్థానమును ద్వీపములు రకరకాల చిహ్నాలు ఉంటే ఆపదలు కలుగును. భాగ్యరేఖ మస్తక రేఖపై ఆగిపోతే చిన్నవయసులో బాధలు కలుగును. శత్రువులు అధికముగా ఉంటారు. అవమానాలు కలుగుతాయి. కుటుంబములో అనాచారము అవమానములు జరుగును. రాహు స్థానము కుజునితో లోపలికి వస్తే దరిద్రము, బాధలు కలుగును. రాహువు పై నుండి ఆరోగ్య రేఖపోతే దీర్ఘకాలిక రోగములు వచ్చును.

## 25. హస్తసాముద్రిక పరంగా కేతువు

హస్తము క్రింద భాగము మణికట్టు ప్రాంతాన్ని కేతువు స్థానము అవుతుంది. మణి బంధరేఖలపై చిహ్నాలు చాలా ముఖ్యము. ఈ బంధము దృఢముగా ఉంటే సకల ఐశ్వర్యం విద్యా, వాహనములు అన్నీ సముకూరుతాయి. ఈ మణికట్టు ప్రాంతము దృఢముగా లేకపోతే జీవితములో అనేక కష్ట నష్టములు ఎదురుకుంటారు. శుక్ర, చంద్రులు కప్పిన ఉబ్బివుండే భాగన్నే కేతుక్షేత్రము అంటారు. ఈ కేతు క్షేత్రము సరిగా లేకపోతే ఎన్ని తెలివితేటలు వున్నా జీవితంలో అభివృద్ధి సాధించలేరు. అవమానాలు, దరిద్రము, ఆరోగ్య సమస్యలు, వివాహ సంతాన సమస్యలు కలుగును. ఈ స్థానంపై అడ్డగీతలు ఉంటే జ్ఞానమును కోల్పోతారు. బుద్ధి వికసించదు. దేవుడి మీద విశ్వాసము ఉండదు. అజ్ఞాన అంధకారములతో జీవిస్తారు.

## 26. రాహుగ్రహ మంత్రార్థము విశ్లేషణ

**రాహుగ్రహ మూలమంత్రము:**

ఓంకయానశ్చిత్ర ఆభువదూతీ సదా వృధస్సఖా కయా శచిష్ఠయా వృతా॥

**ప్రతి పదార్థము:** సదావృధః = ఎప్పుడు వృద్ధి నొందుచుండువాడు, చిత్రః = చయన కర్మానుష్ఠానముచే పూజింపబడదగినవాడు, సఖా=మిత్రుడు అగు ఇంద్రుడు, కయా = ఏరూపము కల, ఊతీ = ఊత్యా తృప్తి కరమగు కర్మానుష్ఠానము,చేత నః=మమ్ములను ఉద్దేశించి, ఆభువత్=అభిముఖముగా నగును. శచిష్ఠయా ప్రజ్ఞా సహితముగా అనుశీలము ఆచరించబడు కయా=వృతా= ఏవర్తనముచే, ఆ-భువత్=మనకు అభిముఖుడగును.

భావము:

ఇంద్రుడు సర్వకాల సర్వావస్థల యందు నిరంతరం అభివృద్ధినొందువాడు అందరకు మిత్రుడుగా ఉండువాడు అట్టి ఆ ఇంద్రుడు మేము ఏ కర్మలను ఆచరించి తనను తృప్తి పరచుదమో ఏ విదముగా ప్రజ్ఞాపూర్వక విచారణముతో మేము వర్తించు ఏ వర్తనము చేత ప్రసన్నుడై మా విషయమున ఇష్టుడై (అభిముఖ్యమును) మమ్ము అనుగ్రహించును. అట్లు అతనిని ఆరాధించుదుము. మనకు అభిముఖుడగు నట్లు ప్రవర్తింతుము.

**రాహుగ్రహ అధిదేవత (గో దేవత) :**

ఓం ఆయంగౌః పృశ్నిరక్రమీ దస నన్మా తరం పునః।

పితరంచ ప్రయంత్సు వః॥

**ప్రతి పదార్థము:** గౌః = గమన స్వభావము గలవాడును, పృశిః= ప్రాప్త తేజస్కుడు అనగా అదికమగు తేజస్సు పొందిన అయం ఇతడు అనగా ఈ సూర్యభగవానుడు ఆ–ఆక్రమీత్= ఆక్రమించెను, ఉదయా చలనమును చేరిన వాడు అయ్యెను, ఆవిధముగా పొంది, పునః= ఎట్ట ఎదురుగా పూర్వ దిశ యందు, మాతరం = సర్వభూతములను నిర్మించునదియగు పృధివీం=భూమినీ, అసదత్ అనీదతి = ఆశ్రయించుచున్నాడు తరువాత పితరం=సంరక్షకుడు అగు దానిని ద్యులోకమును అనగా భూలోకమున చ= మరియు అంతరిక్షలోకమునను కూడ, ప్రయాన్=ఎక్కువ వేగముగా పయనించచూ, త్సువః= శోభనమగు గమనము గలవాడు లేదా ఇక్కడ పితరం అనగా స్వర్గలోకమని ప్రయన్ అనగా పయనించుచున్నవాడు.

భావము : నిరంతరము గమనస్వభావము మరియు వివిధ వర్ణములు కల్గి అదికతేజస్సుతో విరాజిల్లుతున్న సూర్యభగవానుడు తూర్పు దిక్కున ఆక్రమించి సర్వభూతములతో నిర్మితమైన భూలోకమును ఆశ్రయించుచున్నాడు. దానికి పాలకుడై మిక్కిలి శ్రీఘముగా అంతరిక్షలోకమును వ్యాపించుచు పయనించును.

**రాహుగ్రహ ప్రత్యధిదేవత (సర్పములు) :**

ఓం నమో అస్తు సర్పేభ్యో యే కేచ పృథివీమను।

యే అంతరిక్షే యే దివితేభ్య స్సర్పేభ్యో నమః॥

**ప్రతిపదార్థము:** సర్పేభ్యః=సర్పముల కొరకు, నమః= నమస్కారము, అస్తు= అవటం, యేకేచ=ఏవి ఏవి అయినవో, పృథివీమను=భూమిని అనుసరించిలేక ఆశ్రయించిఉన్నాయో, యే=ఏసర్పములు, అంతరిక్షే=ఆకాశలోకము యందు లేక

యక్షగంధర్వాదిలోకమునందు ఉన్నాయో యే=ఏసర్పములు, దివి=ద్యులోకము నందు లేక భూలోకమునందు ఉన్నవో, తేభ్యః= అటువంటి, స్సర్పేభ్యోనమః = సర్పములు మీకు నమస్కారములు.

## 27. కేతుగ్రహ మంత్రార్థ విశ్లేషణ

**కేతుగ్రహ మూలమంత్రము:**

ఓం కేతుం కృణ్వన్న కేతవే పేశో మర్యా అపే శసే।

సముషద్భిరజాయథాః॥

**ప్రతిపదార్థము:**

హేమర్యాః= మరణశీలురగు మానవులారా! ఈ ఆశ్చర్యకరమగు విషయము; అయం=ఆదిత్య రూపుడైన ఈ ఇంద్రుడు; అకేతవే=రాత్రి పూట నిద్రపోతూ తెలివిలేకయున్నవాడును; అపేశసే=చీకటితో తనరూపము కనపడకుండా ఉన్న ప్రాణికి; కేతుం= తెలివిని; పేశః=రూపమును; కృణ్వన్=కలిగించుచు; ఉషద్భిః= మండేశక్తికల కిరణాలతో; లేక ప్రతిరోజు ఉషస్సులతో; సం=కలసి; అజాయథాః= జనించుచున్నాడు; లేక ఉదయించుచున్నాడు.

**భావము:** మరణశీలురగు మానవులారా! ఈ ఆశ్చర్యకరమగు విషయము ఉన్నది. అది ఏమనగా ఆదిత్య రూపుడగు ఈ ఇంద్రుడు రాత్రియందు నిద్రచే తెలివి మరుగున పడియున్న మానవులకు (ప్రాణులకు) తెలివిని కలిగించుచు. చీకటిలో మరుగునపడి తన రూపము కనబడకయున్న ప్రాణికి రూపమును కలిగించుచు కాల్చివేయుశక్తి కలకిరణములతో ప్రతిరోజు ఉషస్సులతో కలిసి ఉదయించుచున్నాడు.

**కేతుగ్రహ అధిదేవత (చిత్రగుప్తుడు):**

ఓం సచిత్ర చిత్రం చితయం తమస్మే చిత్ర క్షత్ర చిత్రతమం వయోధామ్।

చంద్రంరయిం పురువీరం బ్రహంతం చంద్ర చంద్రాభిర్గృణతే యువస్వ॥

**ప్రతిపదార్థము:**

హేచిత్ర=చయనము అను యాగ విశేషముల చేత పూజించబడదగిన వాడా! చిత్రక్షత్ర=విచిత్రమైన బలము కలవాడా, చిత్రక్షత్ర=విచిత్రమైన బలము కలవాడా, చంద్ర= ఆహ్లాదము కలిగించువాడు అగ్నీ, సః= అటువంటినీవు, చంద్రాభిః= ఆనందము కలిగించు, స్తుతిభిః=స్తుతివచనములచేత గృణతే= నిన్నుస్తుతించు, అస్నే=మాకొరకు, దాతుం=ఇచ్చుట, చిత్రం=చయనము, చితయంతం=అందర

కుసుమమ్ము అనగా వీరు ధనవంతుడా, గొప్పవాడుగా తెలియజేయునది, చిత్రతమం = మిగిలిన విషయం ఆశ్చర్యకరము వయోధాం= అన్నమును మాకు కలిగించు, చంద్రం = ఆహ్లాదమును కలిగించునదియు, పురువీరం=అనేక మంది పుత్ర పౌత్రాదులతో సుఖముపొందునట్లుచేయునదియు, బ్రహంతం= అధికపరి మాణము కలదియు, రయిం=ధనమును, యువస్వ=వేరుగా తీసియుంచుము.

***భావము:*** ఓ అగ్ని నీవు పూజనీయుడవు, చయనము అను యాగ విశేషములచేత ఆరాధించబడదగినవారు, మీరు విచిత్రమగు బలము అందరికి ఆహ్లాదము కలిగించువాడవు ఇలాంటి నిన్ను మేము నీకు ఆహ్లాదకరమగు స్తుతివచనములతో స్తుతించుచున్నాము, మేము అనగా జనులందరు నిన్ను ఉద్దేశించి చేయుపూజలు అందుకొని, నీవు మాకు ధనమును, కీర్తిని, చాల ఆశ్చర్యకరమును మాకు శక్తిని పుష్ఠిని కలిగించి, అన్నసమృద్ధిని ఆహ్లాదమును కలిగించి అనేకులు అగు పుత్ర పౌత్రాదులతో సుఖముగా ఆనందముతో ఉండుటకు మాకు కావలసిన ధనమును వేరుగా తీసి ఉంచుము.

**కేతుగ్రహప్రత్యధిదేవత (బ్రహ్మ):**

ఓం బ్రహ్మదేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషోమృగా ణామ్।

శ్యేనో గృధ్రాణాగ్ం స్వధితిర్వనానాగ్ం సోమఃపవిత్ర మత్యేతిరేభన్॥

**ప్రతిపదార్థము:** సోమదేవుని గుణములను వివరించాడు, దేవానాం=యజ్ఞముల చేయు ఋత్వికులలో, బ్రహ్మ=బ్రాహ్మప్రధాన ఋత్విక్కుడు, దేవానాం=దేవత లందరిలో, బ్రహ్మ=బ్రహ్మ అవుతాడు, కవీనాం=క్రాన్తదర్శులు అయ్యే మేధావులలో, పదవీః=తోట్రుపాటుపడే పదములను మంచిరూపములతో కూర్చి వారికి అందజేయు మహాప్రజ్ఞావంతుడు; విప్రాణాం= మేధావులందరిలో, ఋషిః=మంత్రద్రష్టః లేక మునివర్యులు, మహిషో మృగాణాం=మృగములన్నిటిలో మహాబలమైన మృగరాజము శ్యేనోగృధ్రాణాం= గృధ్రములు అను జాతికి చెందిన పక్షులలో ప్రశంసించదగిన పక్షిరాజము, స్వధితిర్వనానాం=హింసించు సాధనములలో గండ్ర గొడ్డలి అను ఉపకరణము అవుతుంది, సోమః=ప్రతిభావంతు డైన సోముడు, రేభన్ = మంచిధ్వని చేయుచు పవిత్రమత్యేతి = పవిత్రమైన గంగాజలము, దర్భలమొదలగు ద్రవ్యసమూహమును అతిక్రమించుచున్నాడు.

***భావము:*** సోముడు అను దేవతకు కల గొప్పతనము ఇటువంటిది, అదే ఏమిఅనగా ఆ దేవుడు యజ్ఞములు చేయు ఋత్విజులందరిలో బ్రహ్మప్రధానఋత్విక్కుడు (లేదా) దేవతలందరలో బ్రహ్మ ప్రజ్ఞావంతులలో తోట్రుపడుపదములను సాదురూపములతో కూర్చివారికి స్ఫురింపజేయు ప్రజ్ఞాశాలి ఇతను మేధావు

లందరిలో మంత్రద్రష్ఠ ఋషి మృగములన్నిటిలో మహాశక్తి కల్గిన మృగరాజు, గృథజాతి పక్షులన్నిటిలోను ప్రశంసనీయమగు పక్షిరాజము, హింసించు సాధన ములలో గండ్రగొడ్డలి అను ఉపకరమువలే ఇటువంటి మహాప్రజ్ఞాశాలి సోముడు. ఉత్తమధ్వని అంటే ఉత్తమ శబ్ధము పవిత్ర శుద్ధికి హేతువును అగు గంగాజలము దర్భల మొదలగు సకలద్రవ్యములను మించిన సోముడు అతి పవిత్రుడుగా ఉ న్నాడు.

## 28.గత జన్మరహ్యాము

పూర్వజన్మ కర్మల ఆధారంగా జీవి పుట్టుక జరుగుతుంది. మానవజన్మ అన్నిజన్మలకంటే ఉత్తమమమైనది. మానవజీవితం సుఖదుఃఖాల చక్రభ్రమణము కొంతమంది అనేకమైన ఇబ్బందులకులోనై జీవితమును వ్యర్థము చేసుకుంటు న్నారు. మరికొంతమంది మహారాజుల వలె అనేక సుఖభోగములతో జీవిస్తున్నారు. ఈ సుఖదుఃఖాలకు కారణం పురాకృత కర్మలు, వంశానుగతకర్మలు, తత్కాలకర్మలు అనే ఈ మూడు కర్మల ఫలితమే మానవజీవితము. పూర్వ జన్మనందు శుభకర్మలను చేసినందు వల్లనే శుభయోగములందు జననం. పాపకర్మలను చేసినందువల్లనే అశుభయోగములందు జననం. పూర్వ జన్మలలో చేసిన పాపపుణ్యము ఫలితములు ఈ జన్మలో మనం అనుభవించే తీరవలసిందే. ప్రస్తుతము మనము అనుభవిస్తున్న శుభాశుభములు పూర్వపుణ్యమును బట్టి మాత్రమే పొందగలము. ఈ కర్మల ఫలితములబట్టి శిశువు భూమి మీద జననమును కర్మఫలితాలకు అనుగుణంగా జాతక చక్రంలో గ్రహములు ఏర్పడుతాయి. పూర్వజన్మలో ఉండే కర్మఫలితములు ఈ జన్మలో మధ్య వయస్సులో పూర్తి అయిపోతే మళ్ళి మంచి చెడు ఫలితములు మనం చేస్తే ఈ జన్మలో కొంతవరకైనా మనం ఖచ్చితంగా అనుభవిస్తాము. పూర్వజన్మలో మనము చేసే పాపపు పనులు చేయటం వల్ల అవి శాపాలుగా మారి జననమున జన్మకుండలి శాపకుండలిగా మారును, వివిధ శాపాల ద్వారా సర్పదోషము ఏర్పడును.

స్థూలదేహాన్ని విడిచిపెట్టిన జీవుడు తన సూక్ష్మదేహంతో నరకయాతనలు అనుభవించినతరువాత జీవుడు సంచిత కర్మలు అయిపోయిన తరువాత ప్రారబ్ధ కర్మఫలాలను అనుభవించటానికి తిరిగి లోకంలో జన్మించాలి. దైవనిర్ణయాను సారంగా ఆజీవి పురుషుడు స్త్రీతో కలిసినప్పుడు ఆసమయంలో పురుషుని వీర్యం (SEMIN) స్త్రీలోపలికి వెళ్లినప్పుడు ఆలోపలికివెళ్లిన వీర్యంలోకి జీవి ఆత్మ ప్రవేశిస్తుంది. అయితే ఇక్కడ ఒక విషయం గమనించాలి. ఆ వీర్యంలోకి రెండుజీవి ఆత్మలు ప్రవేశిస్తే కవలలు జన్మిస్తారు. ఆ రెండు జీవి ఆత్మలు పోటీపడి ప్రవేశిస్తే వికలాంగులుగా పుడుతారు.

ఇలా జన్మించటం కూడ కర్మల ఆధారంగా దైవనిర్ణయము ప్రకారము జరుగుతుంది. ఇక్కడ దైవనిర్ణయము అంటే ఏకర్మ చేసాడో ఆ కర్మఫలితమును అనుభవిస్తాడు.

వీర్యంలోకి జీవుడు ఆశ్రయించి వీర్యకణాలు స్త్రీ అండాన్ని తోలుచుకొని లోపలికివెళ్లి దానితో కలిపి పిండంగా ఏర్పడును. ఆపిండం పెరిగి శిశువుగా తయారువుతుంది. ఆ పిండం శిశువు తయారయ్యేలోపల జీవుడు నరకయాతన అనుభవిస్తాడు. ఒక్కొక్కనెల పిండము ఎదుగుతూ అన్ని అవయవములు ఏర్పడుతాయి. తల్లి గర్భంలో పెరుగుతున్న పిండము ఏడురోజులనీటి బుడగలా ఏర్పడటం, 15 రోజులకు పిండంగా ఏర్పడి శిరస్సు ఏర్పడును, 2వనెల కాళ్లు, చేతులు. 3 నెల ఎముకలున్న, చర్మము, వెంట్రుకలు, గోళ్లు, 4వ నెల నడుము, కడుపు, సప్తధాతువులు, 5వ నెల జీర్ణాశయంలో ఆకలి, దాహం, వెనుముక, 6వ నెల కళ్ళు, ముక్కు, చెవులు, 7వ నెలలో ప్రాణం కలుగుతుంది. 8వనెలలో అన్ని అవయువాలు ఏర్పడతాయి. ఆశిశువు కడుపులో ఉన్నప్పుడు ఆ మలమూత్రములలో ఆశిశువు ఉండి కొన్ని సూక్ష్మక్రిములు అతిసున్నితమైన దేహాన్నికుడుతూ ఉంటాయి. శిశువు ఎంతోబాధను అనుభవిస్తాడు. తల్లితీసుకొనే ఆహారాన్ని బట్టి కూడా శిశువు బాధపడుతుంటాడు. ఆ ఇరుకుగా ఉండే కడుపులో అవయవాలను స్వేచ్ఛగా కదిలించలేక ముడుచుకొని ఉంటుంది. 9వ నెలలో అన్ని తెలుసుకుంటాడు అనగా పూర్వజన్మ గురించి విషయములు గుర్తుకువస్తాయి. కలలాగా వస్తాయి. ఆ మత్తులో నిద్రలో అన్ని విషయములు జ్ఞప్తికి వస్తాయి. పూర్వజన్మ స్మృతికలుగుతుంది. పూర్వజన్మలలో చేసిన మంచిపనులు, చెడుపనులు గుర్తుకు వస్తాయి.

నేను అనేక స్త్రీల కడుపులలో ఉన్నాను అన్ని రకాల ఆహారాలను భుజించాను అనేకస్తనముల పాలు త్రాగాను. ఎన్నోరకాల జంతువులయందు కీటకముల యందు స్త్రీగాను పురుషుడిగాను పుట్టాను. ఎన్నోసార్లు జన్మించినాను, ఎన్నోసార్లు మరణించినాను, గర్భంలో నివసించటం మహాదుఃఖం ఎన్నోకష్టాలను అనుభవించాను. శిశువు కడుపులో ఉన్నప్పుడు మలమూత్రాలతో నిండిన గుంతలో తల్లిగర్భంలో ఉన్నాను. దుర్గంధమైన మలిన కూపంలో ఎంతో మగ్గిపోతుంది. ఎప్పుడు బయటపడతానా అని శిశువు ఆలోచిస్తుంది. నేను ప్రతిజన్మలోను కర్మలు చేస్తున్నాను. అనేక పాపాలుచేశాను నావాళ్లకోసం ఎన్నో చెడ్డపనులు చేశాను. కడుపులో ఉండే శిశువు ఎంతో వేదన అనుభవిస్తుంది.

పూర్వం నాభార్య నాబిడ్డలు అనుకుంటూ నావాళ్ళందరికొరకు నేను అనేక పాపకర్మలు చేశాను. అనేక చెడు మార్గముల ద్వార ధనము సంపాదించాను.

అనేక పాపాలు చేశాను. ఇప్పుడుకర్మలయొక్క ఫలితాలను ఇదిగో ఇలా అనుభవిస్తు న్నాను నావల్ల చాలామంది ప్రయోజనము పొందిన వారంత వారిదారి వారు చూసుకొన్నారు. నేను పూర్వము భయము లేకుండా అనేక పాపాలు చేసాను. అన్యాయముగా ధనము సంపాదించి అందరికి పంచాను వారు హాయిగా అనుభవిస్తున్నారు. నేను మాత్రము పాపకర్మను అనుభవిస్తున్నాను. నాకుజ్ఞానోదయము కావాలి అని జీవి అనుకొంటాడు.

శ్లో॥ సంసార శృంఖల దిగ్ధిక్ ఆచార్యా జ్ఞానమాప్నుయాం।

యది యోన్యాః ప్రముంచామి సాంఖ్యయోగం సమాశ్రయే॥

పై శ్లోకముననుసరించి ఈగర్భనరకము నుండి నేను బయటకు వచ్చిన తరువాత గురువునకు ఆశ్రయించి జ్ఞానాన్ని పొందుతాను. ఈగర్భము నుండి బయటపడితే చాలు నేను సాంఖ్యయోగాన్ని ఆశ్రయిస్తాను. ఈదుఃఖభరితమైన గర్భమునుండి బయటపడిన తరువాత మోక్షాన్ని పొందడానికి సర్వేశ్వరుడైన పరమేశ్వరుడిని ఆశ్రయిస్తాను. సర్వశక్తివంతుడైన రుద్రుడు, పశుపతి మహాదేవుడు జగద్గురువు అయిన పరమేశ్వరుని శరణుపొందుతాను. అలాగే మహావిష్ణును హృదయంలో ధ్యానిస్తాను హే పరమేశ్వర నన్ను ఈ దుఃఖము నుండి నన్ను బయటకు పంపించు. నేను బయటపడిన తరువాత సర్వకర్మలకు స్వస్తిచెప్పి పరమాత్మ ధ్యానంలోనే కాలం గడుపుతాను పూర్వము నాకు అనేక జన్మలకు అవకాశము కల్పించావు నేను వాటిలను వినియోగించుకోలేకపోయాను. గురువులు, పెద్దలు బోధించిన వినలేదు ఎగతాళి చేసాను తల్లిదండ్రులను సరిగా చూసుకోలేదు వారికి తిండిపెట్టలేదు ధనము రాగానే గర్వంగా తయారు అయ్యాను. తనవాళ్లను గౌరవించలేదు.

ఎన్నో సంవత్సరములు కలిసి ఉన్న స్నేహితులను నేను గర్వము, ధనమధముతో దూరముచేసాను. సంపదలే శాశ్వతము అని అనుకొన్నాను కాని ఏవి సంపదలు ఏవిభోగాలు నావెంట తెచ్చుకున్నవి ఏమిలేవు పాపాలు మాత్రమే. దుర్భర దుఃఖాన్ని మరియు మరణము గురించి అనేకపాపాలను నెమరువేసుకుంటు పలుమార్లు గుర్తు చేసుకుంటూ జీవివైరాగ్యాన్ని పొందుతాడు. గర్భంలో భరించలేని దుర్గంధాన్ని భరించాను. దానిలో ఇటు అటు తిరగలేక బయటపడలేక విలవిల్లాడిపోతున్నాను.

ఈజీవిని ప్రసూతివాయువులోపలి నుండి బయటకు నెట్టడంతో తలక్రిందులైన జీవుడు అతికష్టంతో భూమిపైన పడిపోతాడు. దానితో పూర్వజన్మల స్మృతి మరిచి పోతాడు. దానితో పూర్వజన్మల స్మృతి మరిచిపోతారు, సర్వమూ స్మృతిపథంలో నుంచి తొలగిపోతాయి. భూమిపై పడ్డ జీవుడు రక్తమలమూత్రములతో కాళ్లు

చేతులతో కదిలిస్తుంటాడు. అప్పుడు వైష్ణవ మాయచే కప్పబడియుంటాడు. ఎప్పుడైతే భూమిస్పర్శ తగలడంతోటే మనిషి జ్ఞానాన్ని మరుస్తాడు. జలంతో కడిగిన తర్వాత దృష్టిదోషము తొలగును. జన్మించిన తరువాత మళ్లీ పాపాలు చేయటం ప్రారంభిస్తాడు. మానవజన్మను వ్యర్థం చేసుకొంటాడు. ధనంకోసం వెంపర్లాడుతుంటాడు. అందరిని కష్టపెడ్తూంటాడు. శాస్త్రాలను, ఇతిహాసాలను లెక్కచేయడు. ఎవరు చెప్పినా వినడు. ఇప్పటికైన తెలుసుకొని దుఃఖాలకు కారణం పూర్వజన్మ కర్మయేనని తెలుసుకొని మళ్ళీ మళ్ళీ జన్మలు కలగకుండా జన్మరాహిత్యానికి మోక్షమార్గాన్ని తెలుసుకొని మంచి మార్గములో పయనించవలెను.

కర్మలు మూడువిధాలుగా ఉంటుంది. అనేక జన్మాంతరముల నుండి పెరిగిన కర్మజాలమును సంచిత అని సంచితకర్మ నుండి ఈ జన్మము నందు అనుభవించ వలసిన కర్మను ప్రారబ్ధం అని ఈ జన్మయందు చేయబడి ముందు జన్మలందు అనుభవించవలసిన కర్మను ఆగామి అని అందురు. మనము ఏపనిచేసిన వృథాకాదు. మనము చేసే మంచి చెడుకు ఫలితము ఉంటుంది. ఈ ఫలితాలన్ని మానవుడు అనుభవిస్తాడు. కొన్ని ఫలితాలు అప్పుడే అనుభవిస్తాడు. మరికొన్ని కర్మఫలితాలు ఈ జన్మలో అనుభవించలేని మరుజన్మలో అనుభవిస్తాడు. మరణించినా కర్మఫలం నశించదు అది జీవాత్మను వాసన రూపంలో అంటిపెట్టుకొని ఉంటుంది. అందుచేత అనేకజన్మలలో మిగిలిపోయిన కర్మల కోసము మానవుడు మరొక జన్మలో జన్మించేటట్టు చేస్తుంది. ఈ జన్మలో మొదలయిన కర్మ మానవ శరీరము అంతరించేవరకు ఉండేకర్మను ప్రారబ్దకర్మ అని అందురు. ఈ జన్మజీవుడు కొన్ని కర్మలు చేస్తాడు. ఆకర్మఫలాలలో కొన్నింటిని అనుభవించాక ఇంకా కొన్ని మిగిలిపోతాయి. మళ్లీ ఆ మిగిలిన కర్మలు అనుభవించటానికి మరొక జన్మలో జన్మించవలసి వస్తుంది. పాతకర్మల అనుభవాలు తరగిపోతుంటే కొత్తవి పెరుగుతాయి. ఇదొక నిరంతర చక్రము దీనికి అంతములేదు. మానవుడు జనన, మరణ పరంపర అనే చక్రంలో పడి తిరుగుతూ ఉంటాడు. దీనిని Law of Conservation of Energy తో పోల్చారు. శక్తి నశించదు. రూపాంతరం చెందుతుంది. ఇదే కర్మసిద్ధాంతము. మానవుని ఆత్మ రెండువిధాలుగా ప్రయాణిస్తుంది.

1) దేవయానం (లేదా) ఉత్తరాయణమార్గం

2) పితృయానం(లేదా) దక్షిణాయనమార్గం

శ్రేయమార్గంలో జీవితాన్ని గడుపుతూ తనువు చాలిస్తే వారు ఉత్తరాయాన్ని సూర్యచంద్రులను దాటి పయనిస్తాడు. అక్కడ మానవుడు కాని పురుషుడు ఉంటాడు అతను ఆత్మను బ్రహ్మలోకంలోకి తీసుకొనిపోతాడు. అక్కడ నుండి

తిరిగిరావటం కుదరదు ఇక జన్మ ఉండదు. ముక్తి, మోక్షం కలుగుతుంది. అదే దేవయానం ప్రేమమార్గంలో జీవితాన్ని గడుపుతూ తనువు చాలిస్తే దక్షిణాయాన్ని దాటుతూ అక్కడనుండి వారు పితృలోకంలోకి ప్రవేశిస్తారు దాని నుండి ఆకాశంలోకి అక్కడ నుండి చంద్రునిలో ప్రవేశిస్తాడు. ఆ చంద్రలోకంలో పుణ్యకర్మఫలం. హరించిపోయే వరకు ప్రేతలు నివసిస్తాయి. మళ్లీ తిరుగు ప్రయాణము ప్రారంభ మవుతుంది. మొదట ఆకాశంలోకి, ఆ తరువాత వాయుమండలంలోకి ప్రవేశిస్తారు. వాయువుగా మారి, తరువాత దూమంగా, మేఘంగా, వర్షంగా మారి భూమిపైకి దిగుతారు. వరిధాన్యంగానో, వయధాన్యంగానో, ఔషధీలతలుగానో, వృక్షాలుగానో, తిలలుగానో, చిక్కుడు అంకురాలగానో జన్మిస్తారు. ఆధాన్యాలను భుజించిన ప్రాణులలో రేతస్సుగా మారి తిరిగి జన్మిస్తారు. ఈ జనన మరణ చక్రము నుండి విముక్తి కావాలంటే కర్మఫలమును విడిచిపెట్టాలి. అని శ్రీకృష్ణపరమాత్మ గీతలో చెప్పాడు.

శ్లో॥ "త్వక్త్వ కర్మఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః

కర్మణ్యభిప్రవతోపి నూళిఐవంకించిత్వరోతిసః"

పై శ్లోకమననుసరించి ఎవరైతే కర్మఫలాల పట్ల ఆసక్తిని త్యజించి, నిరంతము తృప్తుడుగా, దేన్ని ఆశ్రయించకుండా ఉంటాడో అతడు కర్మలు చేస్తున్నప్పటికీ కర్మ చేయనివాడు అవుతాడు.

శ్లో॥ "నహిదేహ భృతోశక్యం, త్వక్తుం కర్మాణ్యశేషతః

యస్తు కర్మఫలత్యాగీ, సత్యాగీదసభిధీయతే ॥

పై శ్లోకమననుసరించి దేహి అయినవాడు కర్మలను త్యజించండం సాధ్యం కాదు. త్యజించవలసినది కర్మలుకాదు. వాటిఫలాలను అనగా కర్మ ఫలాన్ని విడిచిపెట్టినవాడే త్యాగి అవుతాడు.

శ్లో॥ "కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషుకదాచన

మా కర్మఫల హేతుర్భుర్మాతే సంగోస్త్వకర్మణి"

పై శ్లోకము ననుసరించి నీకు కర్మ చేయడానికే అధికారము ఉంది కాని కర్మ ఫలితాన్ని ఆశించడానికి అధికారము లేదు అలాగాని కర్మలను మానరాదు. అని పరమాత్మ అయిన శ్రీకృష్ణభగవానుడు చెప్పినాడు. ఇదే కర్మసిద్ధాంతము.

## 29. రాహుకేతుగ్రహ సమస్యలు

రాహుకేతువులని ఛాయాగ్రహమని మరియు కార్మికప్లానెట్లు అని మరియు రాహువుని డ్రాగన్స్ హెడ్ (DRAGON'S HEAD) అని కేతువును డ్రాగన్స్

టైల్ (DRAGON'S TAIL) అని మరియు ఈ రాహుకేతువులను సాడౌప్లానెట్లు (SHADOW PLANETS) అని అంటారు. రాహుకేతువులు రెండు ఛాయాగ్రహాలు రెండిటి ప్రవర్తనా ప్రభావం కుడి ఎడంగా ఒకేలా ఉంటుంది. ఎందుకంటే ఒకరు తల అయితే మరొకరు తోక గనుక కొందరు వాటిని భూమి తాలూకు ఛాయలుగానే పరిగణిస్తారు. ఉత్తరధృవ ఛాయను రాహువనీ, దక్షిణ ధృవఛాయను కేతువనీ అందురు. రాహుకేతువుల ప్రభావము మానవజీవితంపై ప్రభావము చూపును. ముఖ్యంగా రాహువు గురించి చెప్పాలంటే చంద్రుడు రాహువు నుండి ఎంత దూరము ఉన్నాడో లెక్కించి దానిని లగ్నానికి కలపండి. ఈ లబ్ధము మంచి భావాలలో పడటం వలన మంచి ఫలితాలను రాహువు ప్రసాదిస్తాడు. ఈ లబ్దము 6,8,12 భావాలలో పడితే మంచి జరగదు.

**రాహుగ్రహము:**

రాహువు అనగా అనుకోకుండా అడ్డంపడేవాడు. అంతా సజావుగా సాగిపోతోంది కాదా అని సంతోషించేలోపే ఆపదలు వస్తాయి. కాలప్రవాహాన్నికి ఎదురీదే శక్తి మానవునికి లేదు. మానసిక ఏ సమస్యలూ లేవకనప్పుడు అర్ధంత రంగా 'సడన్‌బ్రేక్' వేసేవాడు రాహువు. జాతక చక్రంలో రాహువు సక్రమంగా లేకపోతే కొన్ని నిమిషాలలోనే ఓడలు బళ్ళువుతాయి. ఒక్కపూటలో పువ్వులమ్మిన చోట కట్టెలమ్మాల్సి వస్తుంది. కోరికలు తీరటంలో తత్సారము, మందకొడితనం, ఏ పనులు సాగకపోవటము. కడుపు బాగానికి సంబంధించిన వ్యాధులు, ఊపిరి తిత్తులు, చర్మరోగాలు, పాముకాటుకు గురి అవటం మొదలగు విషయములను రాహువు కలిగిస్తాడు మరియు మానసిక సమస్యలు, పొత్తికడుపు భాగములో బాధలు, ఆర్థిక ఇబ్బందులు, కుటుంబ జీవితంలో చిక్కులు, చికాకులు వృత్తి ఉ ద్యోగాలలో ఒడుదుడుకులు భార్యభర్తల మధ్య కీచులాటలు, బతుకంతా చీకూ, చింతా చీకటే తప్ప మరొకటి ఉండదు. జాతకచక్రంలో రాహువు గనక బలంగా ఉంటే (చెడుగా) మనిషికి రోగాలు తప్పవు న్యాయవాద వృత్తిలో రాణించలేక, కోర్టువ్యవహారాలలో నెగ్గలేక రాజకీయరంగంలో చిక్కులు, చట్టవ్యతిరేకకార్య క్రమాలు చేసేవారు. అసాంఘిక కార్యకలపాలు చేయటము, ప్రభుత్వశాఖలలో పనులు పూర్తికాక పోవటము తరుచూ ప్రమాదాలు వ్యాపారంలో నష్టాలు, జీవితంలో ఆటుపోట్లు ఉంటాయి.. శత్రువులు ఎక్కువగా ఉండటం. విధిబలమైనది మానవుడు బలహీనమైనవాడు.

**కేతుగ్రహము:**

కేతుగ్రహము వలన విచారము కలగటం, దరిద్రము, సంతాననష్ఠము, ధైర్యం లేకపోవటము, ప్రేతాత్మల వలన బాధలు, సంక్షోభాలు కలగడం, కోర్టులకు

వెళ్లడం, జైళ్లలలో శిక్షలు అనుభవించడము. అంతుపట్టని రోగాలు అనుకోని ప్రమాదాలు, కనిపించని శత్రువులు, వ్యసనములకు బానిసలు కావటము, గుర్రపందాలు, పేకాట, షేర్ మార్కెట్‌లలో నష్టము జరగడం. తరుచూ జ్వరములు, కంటిబాధలు, చర్మ రోగాలు, మలబద్ధకము, ఊపిరితిత్తుల వ్యాధులు.

## ౩౦. వివిధ వంధ్యా దోషవివరములు

స్త్రీలకు వంధ్యాదోషము శాపములాంటిది సర్పదోషము వలనైనను ఈ వంధ్యత్వం కలుగుతుంది. దశవిధ వంధ్యాదోషములలో ఏవిధముగనైనను ఈదోషము సంభవించవచ్చును. స్వయంకృతాపరాధమువలన కూడా ఈ వంధ్యాదోషము కలుగ వచ్చును. ఈ వంధ్యాదోషము వలన స్త్రీలు సంతాన హీనులగుదురు. ఈ విధంగా సంతానహీనులగు స్త్రీలకు ఆదివంధ్య, గర్భవంధ్య, గర్భేవంధ్య, మృతవంధ్య, కదళీవంధ్య, కాకవంధ్య, దైవవంధ్య, రజోవంధ్య, స్త్రీ వంధ్యా భర్తృవంధ్య అను ఈ దశవిధవంధ్యలు సంతాన హీనదోషప్రదమైనవిగా గుర్తించబడినవి. ఈ వంధ్యత్వం పూర్వజన్మ కర్మ ఫలితము వలన సంభవించును.

శ్లో॥ స్త్రీలక్షణ హీనాయా ఆదివంధ్యా ప్రకీర్తితాః।

శ్లో॥ గర్భవంధ్యా ద్వితీయస్యా ద్గర్భభంగ కరీహిసా।

పై శ్లోకముల ప్రకారము సంతానము కలుగదని తెలుస్తున్నది. స్త్రీలు మైలవస్త్రములను చెట్లలో వేయటం వలన మంచివృక్షాలను లేక దేవతాసంబంధమగు మొక్కలను తాకుటవలన సంతానయోగమును హరిస్తుంది. గృహమందలి వంటచేయు సందర్భములో జీవహింసఫలితంగా అశుచిగా నుండి దినచర్యలోపము చేత గర్భవిచ్ఛిత్తి జరుగును. ఇలాగ తెలిసి తెలియని చేసిన పాపమువలన సంతాన దోషములు కలుగును. ఈ సంతాన దోషమునకు నాగదేవతాపూజా విధానము వలన సంతానం కలుగును.

**వంధ్యాత్వ దోషనివారణకు రెమెడీస్:**

1) రాహుకేతువుల పూజ

2) జాతకచక్రంలో పంచమాధిపతి పంచమస్థానంలో నుండే గ్రహము వాటి దృష్టి గురించి విచారించి ఆయాగ్రహమములకు జపములు దానములు హోమములు చేయుట.

3) నాగ ప్రతిష్ఠ చేసుకొనుట.

4) తొలిచూలు ఆవుపాలతో నాగకేసరముల చూర్ణమును ఋతుస్నానతయైన తర్వాత వారంరోజులు తీసుకున్నా సంతానము కలుగును.

5) తెల్ల మోదుగ విత్తనములు 5 తులముల చూర్ణమును ఋతుస్నాతమైన తరువాత రోజుకు 1 తులము చూర్ణమును ఆవుపాలతో 5 రోజులు వాడిన గర్భధారణ జరుగును.

6) నల్ల దంతెన చెట్టును సమూలంగా తెచ్చి నీటితో శుభ్రపరచి చూర్ణించి వెన్నతో కలిపి ఋతుకాలం మొదలు కుంకుడు గింజ ప్రమాణం వెన్నతో వారం రోజులు ప్రతీరోజు తీసుకున్న గర్భవతి అగును.

## 31. వివిధ శాపగ్రస్తులు

జాతక చక్రంలో జీవితంలో మనకార్య వ్యవహారాలు, ఆచరణలు, విద్య, మరణం, ఉద్యోగము, వివాహము, సంతానము, రుణాలు మొదలగు అన్ని కూడా జాతక చక్రము వివరిస్తుంది. జాతకచక్రంలో గ్రహస్థితి పరిశీలన వల్ల పూర్వ జన్మ విషయాలన్ని అవగతమౌతుంది. పరాశర మహర్షి తన "బృహత్పరాశర హోరాశాస్త్రంలో "పూర్వజన్మ శాపద్యోతక' అనే శీర్షికలో అంతర్గత భాగంగా ఎనిమిది విధాలైన శాపాలను వివరించినారు. అవి. 1) సర్పశాపం 2) పితృశాపం 3) మాతృశాపం 4) భ్రాతృశాపం 5) మాతులశాపం 6) బ్రహ్మశాపం 7) భార్యశాపం 8) ప్రేతశాపం.

**పరాశర మహర్షి వివరించిన శాపాలు:**

దేవదేవ జగన్నాథ శూలపాణే వృషవాహ।

తేనయోగేన మర్త్యానాం జాయతే శిశునాశనం॥

తత్సర్వమత్ర యోగేన బ్రూహి మే శశిశేఖర।
శాప మోక్షం చకృపయాప్రాణినామల్పమేథనామ్

పార్వతిదేవి పరమేశ్వరుడిని ఇలా అడుగుతుంది హే। వృషవాహనా, శూలపాణీ, జగన్నాయకా! ఏ యోగం చేత మర్త్యలోకంలో సంతానహాని కలుగుతుంది? శశిశేఖరా! తమరు సిద్ధయోగులు అజ్ఞానములైన మానవుల శాపాన్ని నివారించగల ఉపాయమును చెప్పండి అని అడిగెను. అప్పుడు పరమశివుడు దేవి నీవు మంచి ప్రశ్న అడిగావు వివరిస్తాను వినుము. అన్ని శాపముల గురించి పరమేశ్వరుడు వివరించాడు.

## 32. వివిధ లగ్న భావానుసార కాలసర్పయోగములు

1. ప్రథమ భావములో అది మేష, వృశ్చికలగ్న జాతకుడు వృత్తిలో అసంతృప్తి, ఉద్యోగంలో, వాపారంలో ఆందోళనలు ఆత్మవిశ్వాసం తగ్గటం, అనేక గందరగోళ సమస్యలలో ఉండును. ఆశతో జీవించును.

2. వృషభ తులాలగ్న జాతకులు భయాందోళనలు, ఉద్యోగం గురించి (లేక) వృత్తి అనగా వ్యాపారంలో అభద్రతాభావం కలిగి ఉండటం. అనుకున్న కోరికలు నెరవేరకపోవటం. కొన్ని సంఘటనలు జీవితంలో మరుపురానివిగా మిగిలిఉండటం జరుగును.

3. మిధున కన్యాలగ్న జాతకులు జీవన భృతికోసం ఎన్నో పనులు చేయును అవి: కిరాణా జనరల్‌స్టోర్సు, పుస్తకాలషాపులు, స్టేషనరి, మధ్యవర్తిత్వం, హోటల్స్, రెస్టారెంట్సు, క్రయ, విక్రయములు, రైస్‌మిల్స్, గృహోపయోగ సామగ్రి వంటిపనులలో అనుకూలత ఎక్కువగా ఉండును. ధనము సంపాదించును.

4. కర్కాటక లగ్న జాతకులు ఎంత సాహసమైన కార్యక్రమములు చేస్తారు. కాని వృత్తిలో ఏకాగ్రత ఉండదు. ఉద్యోగం, వాపారము విషయాలలో ముందుచూపు ఉండదు. వీరు ఎంతధనము సంపాదించిన, పేరుప్రతిష్ఠలు సంపాదించిన కుటుంబంలో సుఖముండదు. వీరిలో డాక్టర్లు, లాయర్స్, టీచర్స్, ఉపన్యాసకులు, జ్యోతిష్యులు, కళాకారులుగా, ఐస్‌క్రీం, బేకరి, రెస్టారెంట్స్, కూల్‌డ్రింక్స్, వాటర్‌బాటిల్స్ ఉద్యోగ మరియు వ్యాపారాలలో స్థిరపడతారు.

5. సింహలగ్న జాతకులు సంచారము చేస్తూంటారు. వీరికి పట్టుదల ఎక్కువ, వ్యవసాయమునకు మక్కువ చూపుతారు. ఎదురు దెబ్బలు తింటారు. దృఢమైన నిర్ణయంతో ఉంటారు.

6. ధనస్సు మరియు మీనలగ్న జాతకులు వీరు ఎంతో గొప్పగా బతుకుతారు. వీరు స్వాభావికంగా సంకోచనీయులు మరియు తన దగ్గర ధనమును పోగొట్టుకొంటారు. వీరు సన్మానించబడుదురు.

7. మకర, కుంభలగ్న జాతకులు విదేశాలకు వెళ్లడం, భార్యపిల్లల వల్ల అశాంతి, మానసిక అశాంతి పనులలో ఆలస్యం, చికాకులు కల్గును.

## 33. భావ కుండలిలో కాలసర్పయోగము

1. **అనంత నామకాలసర్పయోగము:** ప్రథమభావంలో రాహువు మరియు సప్తమభావంలో కేతువు ఉండును. ఇలా ప్రథమ, సప్తమ భావంలో రాహుకేతువులు ఉంటే అనంత భావానుసార కాలసర్పయోగము అని నిర్వచించవచ్చు. దీనివల్ల తను నమ్మిన వాళ్లు సొంతవారే ద్రోహము చేస్తారు. విపరీతమైన దీర్ఘరోగములు అన్యస్త్రీలతో సంపర్కము చేయును. నిలకడలేని మాటలు, జీవితంలో అన్ని విషయాలలోను నిధానంగా జరగడం, వైవాహిక జీవితంలో అపశ్రుతులు కలుగును.

2) **కుళిక భావానుసారకాలసర్పయోగము:** ద్వితీయ భావంలో రాహువు మరియు అష్టమభావంలో కేతువు ఉండును. ఈ భావంలో జన్మించిన వారు ధన, పరివార మరియు గుప్తరోగగ్రస్త శరీరము అవుతుంది. వీరికి మిత్రులు ఎవరో శత్రువులు ఎవరో తెలుసుకొనలేరు. ఎంతో ఆనందంగా జీవిస్తూ ఎదుటివారిని ఆనందంగా జీవించేలా ఉపయోగపడుతారు. వీరిమీద దుష్ట జనులు చెడు దృష్టితో ప్రభావితమగును. వీరి పరాక్రమము వీరిని గెలిపించును. గృహములో కష్టములు కరుకైన మాటలు, వీరిలో ధన సంచప్రవృత్తి మెండుగా ఉండును.

3) **వాసుకి భావానుసార కాలసర్పయోగము:** తృతీయ భావంలో రాహువు మరియు భాగ్యభావంలో కేతువు ఉండును. ఇలాంటి భావంలో జన్మించిన వారు వీరు తమకు సంబంధించిన కష్టములను ఎవరితో చెప్పకుండా దాచిపెడతారు. వీరికి ధనప్రాప్తి మరియు సన్మానములు కలుగును. సోదరులతో విరోధములు కలుగును. తరుచుగా అదృష్టం చే జారును దానివల్ల చికాకులు ఎదురగును. సత్యాచరణ యందు మక్కువ కలవాడు అవుతారు. వీరికి గృహయోగము గురించి ఆందోళన చెందుతారు. పెద్దపెద్ద కార్యక్రమములను సాధించడం. జీవితంలో విచిత్రమైన సంఘటనలు జరుగును.

4) **శంఖపాల భావానుసార కాలసర్పయోగము:** మాతృపితృ భావంలో అనగా చతుర్ధ మరియు దశమ భావంలో రాహువు మరియు కేతువులు ఉంటారు. వాహనముల యందు ప్రీతి కలవారై ఉందురు. దూరప్రాంతములో నివసించడం తల్లిదండ్రులకు దూరంగా ఉండడం వీరునమ్మకం కోల్పోవడం, ఏ వ్యాపారము సరిగ్గా చేయకపోవడం. వీరి మనసులో కుటిలమైన ఆలోచనలు కలిగి యుండడం చాల విషయములు తన మనస్సులో దాచుకొని వ్యధ చెందడం. సంభోగ కోరికలు అధికంగా ఉండడం. సంపాదన నిలకడ ఉండకపోవడం. సంతానము వలన కష్టములు అపఖ్యాతి కలగడం జరుగును. గౌరవాన్ని కాపాడుకోలేకపోతారు.

5) **పద్మకాలభావానుసార కాలసర్పయోగము:** రాహువు పంచమభావంలోను కేతువు లాభభావంలోను తమ అంతరాళంలోనే ఉండి అన్ని గ్రహాల సర్పభ్రాంతి కుండలిలో ఉండును. ఈ జాతకుడు శ్రమించడం పేరుప్రతిష్ఠలు సంపాదించడం స్నేహశీలి అగును. వీరి నిర్ణయములు తనకంటే ఇతరులకు ఎక్కువగా ఉపయోగపడును. తన కన్నా ఉన్నతమైన వారితో సంబంధాలు పెట్టుకుంటారు. వారితోనే గొడవలు పెట్టుకొంటారు. ధన సంపాదన చేయాలి అని అకాంక్షతో, విశ్వాసముతో ఉండును. పుత్రరూపంలో ప్రథమస్థానము

కష్టకారకమగును. భోగలాలసుడై అధికంగా ధనముతో పాటు అపకీర్తి కష్టములు కలుగును.

6) **మహాపద్మకాల భావానుసార కాలసర్పయోగము:** రాహువు రోగభావమందు మరియు కేతువు వ్యయ భావములో ఉండును. ఈ జాతకుడికి అపరిమితమైన కోరికలు కలుగును జీవితంలో కష్టాలు కలుగును. ఆ కష్టాలను మానసిక శారీరకంగా కష్టాలను ఎదురుకొంటారు. వేరేవారు వీరికి సహాయం చేసినచో వారికి మనస్సులో కృతజ్ఞతలు తెలుపుకుంటారు. రోగములు వస్తాయి. రోగముల వలన ధనముఖర్చు అవుతుంది.

7) **తక్షక భావానుసార కాలసర్పయోగము:** వివాహస్థానంలో రాహువు మరియు తను స్థానంలో కేతువు ఉండును. ఈజాతకుడు ధన, పరివార, స్వాభిమానము కొరకు జీవితంలో సంఘర్షణ చేస్తుంటారు. ఎవరి మీద విశ్వాసము ఉంచునో వారే మోసము చేయుదురు. విద్యార్థి దశనుండి ఎదిగి ఉన్నతమైన స్థానంలో శిఖరమును చేరుకుంటారు. దైవానుగ్రహము లేక తిరిగి మొదటకి వస్తారు. మనస్సులోని బాధను దిగమింగుకుంటారు. భార్యభర్తల మధ్య విరోధములు కలుగును మనస్సు నిలకడగా లేకుండా ఉంటుంది.

8) **కర్కోటక భావానుసార కాలసర్పయోగము:** అష్టమభావంలో రాహువు మరియు ద్వితీయంలో కేతువు ఉండి అన్యభావములలో మిగిలిన గ్రహములు ఉండును. జీవితములో విషమపరిస్థితిలో ఉండి ఏ నిర్ణయము తీసుకోలేడు. విపరీతమైన కష్టములను ఎదురుకొనడం ధనము కోసం బాగా కష్టపడటం, ధనము సంపాదించడం, సంబంధములను నిలుపుకోలేకపోవడం, మత్తుపదార్థాలు సేవించడం, సంతానము యందు ప్రేమ, జనేంద్రియ రోగాలు, దీర్ఘకాలిక రోగములు వచ్చును.

9) **శంఖనందన భావానుసార కాలసర్పయోగము:** భాగ్యభావంలొ రాహువు పరాక్రమములో కేతువు ఉండును. ఈ యోగములో సర్పము యొక్క బలి అగును. ఇది భాగ్యము మరియు కర్మపక్షము యొక్క ఉత్తమమమైన ఏదో ఒక కష్టము కలుగును. వీరికి శత్రువులు ఎక్కువ వీరికి పేరు ప్రతిష్ఠలు వచ్చినా తనే స్వయంగా, తన నాశనానికి కారణమగును వీరిని ఉపయోగించు కొని వదిలేస్తారు. వీరుచేసిన తప్పులు మనస్సులో బాధను కలిగిస్తాయి. శత్రువులు ప్రతీకారం తీర్చుకొంటారు.

10) **పాతఃకాల భావానుసార కాలసర్పయోగం:** వృత్తి భావంలో రాహువు మరియు మాతృభావంలో కేతువు ఉండును వాహనముల యందు ప్రమాదములు, వృత్తియందు అనుకూలత లేకపోవటం పితృసంపాదనను నష్టపరచడం

కాలగమనంలో అనేకచిక్కులు సంతానము మరియు కర్మఫలము ఒకే సమయంలో ప్రాప్తించును. వైవాహికజీవితంలో అపశృతులు వ్యాపార సంబంధ సమస్యలు ఎదురగును. శ్వాసకోశ హృదయ సంబంధ వ్యాధులు కల్గును. అప్పులు అవుతాయి.

**11) విషక్త భావానుసార కాలసర్పయోగము:** భాగ్యభావంలో రాహువు మరియు సంతానభావంలో కేతువు ఉండును. వీరికి దయాగుణము స్వల్ప సంతానము. గర్భస్రావాలు, విద్య, ధనము మరియు సంతానము వీటిల్లో ఏదో ఒకటి పొంది సంతృప్తిపడును. ఇతరులకు సహాయం చేయడం సోదరులవల్ల కష్టాలు. ఎవరియందు అయినా దయ చూపడం. దీర్ఘరోగాలు, శరీరంలో గాయాలు, మధుమేహం, రక్తపోటులాంటివి వస్తాయి. వీరికి ఉదారత్వము ఉండును. వీరి కుటుంబంలో కలతలు కల్గును.

**12) శేషనాగ భావానుసార కాలసర్పయోగము:** వ్యయభావంలో రాహువు మరియు రోగభావంలో కేతువు ఉండి అన్ని భావాలలో మిగితాగ్రహములు ఉండునో అప్పుడు ఈ యోగము కలుగును. ఈ జాతకుడు ఎలాంటి పరిస్థితులనైనా ఎదురుకోంటారు వీరికి దైవభక్తి ఎక్కువగా ఉండును. శతృవులు, తాంత్రిక పీడలు, కష్టములు కలిగించును. రోగము విషయంలో జాగ్రత్త అవసరం ధనము విషయంలో ఆందోళనలు ఋణ బాధలు ఎక్కువగా ఉంటాయి.

## 34. రాహుకేతువుల వ్యాధులు

రాహువు వాయుతత్వ కారకుడు కాబట్టి మన శరీరంలోని వాయుసంబంధ వ్యాధులను కలుగ జేయును. కడుపునొప్పి, కాళ్లనొప్పులు, జీర్ణక్రియసరిగా లేకుండుట, ఉదర సంబంధ వ్యాధులు టైఫాయిడ్, మలేరియా, వైరస్ జ్వరములు మశూచి, రాహువు, శుక్రులు కలిస్తు చర్మ వ్యాధులు, రాహువు కన్యా రాశిలో ఉంటే కడుపులో పురుగులు చేరును.

రాహువు పరిస్థితిని బట్టి శరీరంలో రోగనిరోధక శక్తిని తగ్గించి బ్యాక్టీరియా క్రిములను ఆహ్వానించును. నడుము నొప్పి, పక్షవాతం, కీళ్లవాతం, కాళ్ల పగుళ్లు కలుగును.

ఈ రాహువు వలన బుద్ధి మాంధ్యము, మూర్ఖత్వము, కోర్టు వ్యవహారములలో చిక్కుట, అధికార దుర్వినియోగం. అకస్మిక మరణాలు, విషజంతువుల వలన బాధలు ఎలక్ట్రికల్ లేదా ఎలక్ట్రానిక్స్ వస్తువుల ద్వారా నష్టములు, పిల్లల కిడ్నాప్ కాలుష్యాలవల్ల ప్రమాదములు, పోలీసుల కేసులలో చిక్కుకొనుట, కాంట్రాక్టు సంబంధ నష్టాలు, ఈ రాహువు కుజునితో కలిస్తే గాయాలు తగులుట, అకస్మిక

ప్రమాదములు, ఈ రాహువు గురువునితో కలిస్తే సద్భావన ఉన్న తప్పనిసరి పరిస్థితుల్లో తప్పులు చేస్తారు, రహస్యంగా పనులు చేయుట పరువుకు భంగం కలుగుట ఈ రాహువు శనితోకలిస్తే తీవ్రమైన అనారోగ్యము కలుగును. రవితో కలిస్తే తండ్రితో గొడవలు సంబంధాలు దెబ్బతినుట చంద్రునితో కలిస్తే బుద్ధి మాంథ్యము, మెంటల్ ప్రవర్తన కలుగును. కేతువు వలన కలుగు వ్యాధులు అతి విచిత్రంగా ఉంటాయి. వైద్యులు కూడ సరిగా నిర్ధారణ చేయలేని గందరగోళ పరిస్థితి కలుగును.

కంటిశుక్లాలు, దీర్ఘరోగములు, కడుపునొప్పి, కడుపులో పురుగులు చేరుట అమీబియాసిస్ కలుగును. ఈగ్రహముతో శని చేరి జన్మలగ్నము నుండి అష్టమంలో ఉండి రాహువు శుక్రుల దృష్టి ఉంటే వరిబీజము, హెర్నియా, గొంతుసంబంధ వ్యాధులు ఈ గ్రహమమునకు బుధుని దృష్టి ఉంటే నరాల నొప్పులు, పక్షవాతములు కల్గును, మశూచి, మానసిక వ్యాధులు దురదలు, మెంటల్ ఎఫెక్ట్, ఉన్మాదం హిస్టీరియా రోగాలు, కురుపులు, రహస్యంగా చెడు పనులు చేయుట, మత మార్పిడీలు, అపనిందలు, అధికారులవలన అవమానములు, దైవసంబంధక్రియల్లో విఘ్నములు, అకస్మిక సంఘటనలు, అనాచారము, వ్యాపార నష్టాలు, కిరోసిన్, మంచినూనే, నువ్వులనూనెలు, పెట్రోల్, డీజిల్, అయిల్‌వల్ల నష్టాలు లేదా ప్రమాదములు, జంతువుల వలన నష్టాలు కలుగును.

## 35. సర్పయోగములు

జాతక చక్రములో పంచమస్థానాన్ని అనుసరించి సర్పయోగమును నిర్ణయించ వలెను. సంతాన సమస్యలు, వివాహ, ఉద్యోగ, ఆర్థిక, వ్యాపార మొదలగు సమస్యలు వస్తాయి. ఈ పంచమ భావ దోషకారకాలను సర్పయోగములుగా జ్యోతిషశాస్త్రం అభివర్ణిస్తుంది.

1) జాతకచక్రంలో పంచమమైన సంతానస్థానంలో రాహువు ఉండి, ఆ రాహువుతో కుజుడు కలిసినను (లేక) దృష్టి కలిగితే సర్పదోషము ఏర్పడును.

2) మేషరాశి మరియు వృశ్చిక రాశులలో రాహువు ఉంటే సర్పదోషము అవుతుంది.

3) పంచమస్థానము నందు శని ఉన్నచో మరియు శనిగ్రహము చంద్రునితో కలిసినా సర్పదోషము ఏర్పడును.

4) పంచమస్థానాధిపతి రాహువుతో కలిసినా సర్పదోషము అవుతుంది.

5) పంచమాధిపతి దుర్భలుడైనా సర్పదోషము అవుతుంది.

6) పంచమాధిపతి దుష్టస్థానంలో నీచ, శత్రురాశిలో ఉండి జన్మలగ్నంలో రాహువు ఉంటే సర్పదోషము అవుతుంది.

7) పంచమస్థానంలో రవి, కుజ, బుధ, గురు, శని, రాహువులుండి, పంచమ, లగ్నాధిపతులు బలహీనులైనా సర్పదోషము ఏర్పడును.

8) జన్మలగ్నాధిపతితో కుజుడు కలిసిననూ సర్పదోషము ఏర్పడును.

9) కుజాంశలో కుజుడున్నా సర్పదోషము ఏర్పడును.

10) కుజుడు, రాహువు కలసినా సర్పదోషము ఏర్పడును.

11) గురువు, కుజుడుతో కలసినా నాగదోషము ఏర్పడును.

12) గురువు, రాహువుతో కలిసినా సర్పయోగము అవుతుంది.

## 36. పునర్ జన్మ వృత్తాంతము.

మానవుడు మరణించిన తరువాత జీవి ఆత్మ దేహమును విడిచిపెట్టిన తరువాత 49 రోజుల వరకు మనచుట్టూ తిరుగుతుంది. వాళ్ల బంధువులచుట్టూ ఆత్మతిరుగుతుంది. మన ఆచారము ప్రకారము చనిపోయిన రోజులలో గరుడపురాణము చదువుతారు. టిబెట్‌లో తాళపత్రగ్రంథము పేరు 'బుక్ ఆఫ్ డెత్' (Book of Death) మరణించిన రోజులలో చదువుతారు అసలు ఆత్మ ఎక్కడికి వెళ్లుతుంది. 14 రోజుల పాటు చాల నరకయాతన అనుభవిస్తుంది. ఆత్మ జీవి మరణించినది అని మనము ఏడుస్తుంటే మనల్ని ఓదార్చాలని ఆత్మ పరితపిస్తుంది. కాని అప్పటికే మానవ సంబంధాలు తెగిపోతాయి. మనకు దగ్గరగా రావాలని ఆత్మ క్షోభిస్తుంది. కాని రాలేదు. చివరకు 49 రోజుల వరకు లౌకిక ప్రపంచమును అది గమనిస్తూ ఉంటుంది. ఆత్మ ఎక్కడికి వెళ్లాలి అని ఆలోచిస్తూంటుంది. పూర్వజన్మ జ్ఞాపకాలు రకరకాల జన్మల గురించి నెమరు వేసుకుంటుంది. ఆశ్రయించే పదార్థము కోసము వెతుకులాట ప్రారంభిస్తుంది. ఆత్మ గందర గోళపరిస్థితిలో ఉంటుంది. పాపాలు చేసిన వాళ్లు నరకానికి మంచి చేసిన వాళ్లు స్వర్గానికి వెళ్లతారు. నరకానికి వెళ్ళేవాళ్లు 14 రోజులపాటు నరక మార్గములో పయనిస్తారు. నరకానికి 86 యోజనాల దూరము (లేక) 7లక్షల కిలో మీటర్ల దూరము వెళ్లవలసి వస్తుంది.

ఈ నరక మార్గములో నీళ్లు దొరకక సింహములు, పులులు, పాములు ఆత్మకి అడ్డుపడుతుంటారు విషజంతువులను తప్పించుకొని వెళ్లడం వాటితో చాల బాధలు అనుభవిస్తుంటారు. 16 యమనగరాలు కనబడతాయి. వైతరణి నది (మొట్టమొదటగా) కనబడును. దానిలో మంటలు, పొగలు, జంతువులు ఉంటాయి.

దానిలో కొన్ని శిక్షలు నరకయాతన అనుభవిస్తుంటారు. స్వర్గము, నరకమునకు 7దార్లు 7లక్షల కిలోమాటర్ల పయనము. పాపాలను బట్టి నరకంలో శిక్షలు ఆత్మను జంతువులు గాయపరుస్తాయి. సౌత్ఆఫ్రిక(South Africa)లో చాల విచిత్రమై ఆచారాలు ఉంటాయి. జీవి శరీరమును గుడ్డలు కట్టి కొండల దగ్గర గుహలలో గట్టుల దగ్గర దాచిపెడ్తారు. తరువాత రోజులలో బందువులందరు చనిపోయిన వాళ్ల గురించి గుట్టల దగ్గర ప్రసంగిస్తారు. ప్రసగించి పార్థివ శవాలను తీసి తిరుగుతారు. మళ్లి 4,5 గుడ్డలు కట్టి గుట్టల దగ్గర పెడతారు. జీవితో అవినావభావ సంబంధము కలిగి ఉంటారు. అప్పుడు ఆత్మలు శాంతిస్తాయి. అని వారి విశ్వాసము. ఆత్మ నరకము శిక్షలు అన్ని అనుభవిస్తుంది. 365 రోజుల తరువాత భూమితో సంబంధము తెగిపోతుంది.

మళ్లీ వాళ్ల కర్మను బట్టి ఆత్మ జీవిలోకి ప్రవేశిస్తుంది. కర్మసిద్ధాంతము ప్రకారము ఇదంత జరుగుతుంది. భూమి నుండి ఆత్మ ప్రవేశించేటప్పుడు జంతువుగా ఎన్ని దుఃఖాలు కలుగుతాయో ఆవిషయములన్నీ ఆలోచిస్తుంటుంది. భూమినుండి ఆత్మ బయలు దేరిన తరువాత బాధపడుతుంది. మళ్లీ గర్భంలోకి ప్రవేశించిన తరువాత కూడా కష్టము పడుతుంది. జీవి తరువాత భూమి మీదకు వచ్చిన తరువాత కూడా మానవునికి కష్టాలే.

మానవ జీవితము ఎందుకు ఉత్తమమైనది అంటే జంతుజన్మకంటే నయము కాబట్టి. భూలోకములో మానవులు చేసే తప్పులు పైలోకంలో శిక్షపడక తప్పదు. సర్పదర్శనం కూడా జరుగును. అంధకూపం, కుంభీపాకం, క్రిమిభోజనం మొదలగు ఇలాంటి శిక్షలు తప్పకుండా అనుభవించవలెను. మరికొంతమంది ప్రమాదంలో చనిపోయినతరువాత కొన్ని గంటలలోనే ఆత్మ గర్భములోపలకి ప్రవేశిస్తుంది. ఇది అతి తక్కువగా జరుగుతుంది. అందువలనే జగద్గురు ఆదిశంకరాచార్యులు అన్నారు. పునరపి జననం పునరపి మరణం  కూడా అన్నారు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో వివరించినారు. అందువల్లె పాపములు చేసినచో సర్పదోషరూపములో పీడించును. ఈ సర్పదోషములు జన్మజన్మాంతరములు పీడించును. సర్పములు వధించుట వల్ల కూడా సర్పదోషము కల్గును. అందుకు పరిహారములు చేసి నాగేంద్రస్వామి అనుగ్రహము పొందవలెను.

భూలోకంలో మానవులు చేసే తప్పులకు పై లోకంలో శిక్ష తప్పదు మానవులు 28 నరకాలలో శిక్షింపబడుతారు. ఒక్కొక్క నరకంలో బ్రాహ్మణులను, భక్తులను, సన్యాసులను వధించినవారు ఈ నరకానికి వెళ్లుతారు. ఈ నరకము పాములు, తేళ్లు, పులులు ఎలుగుబంట్లు, తేళ్లు, క్రిమికీటకాదులతో నిండి ఉంటుంది. ఇలాగే అంధతామిస్రం అనే నరకంలో భార్యభర్తలో ఎవరు ఎవరిని మోసం చేసినా ఈ

నరకానికి వెళ్లుతారు. ఇక్కడ యమభటులు పాపం చేసిన వాళ్లను తాళ్లతో కట్టేస్తారు. ఆహారం కోసం పశుపక్ష్యాదులను వధించేవాళ్లు ఆ జంతువుల మీద ఎన్ని వెంట్రుకలు ఉంటాయో అన్ని సంవత్సరాలు బాగా మరిగే నూనెలో ఉంచుతారు. ఈ నరకాన్ని కుంభీపాకం లేక పితృతీర్థం అంటారు. పాపము చేసిన వారు పుణ్యలోకాలకు పోకుండా అడ్డగించి ప్రవహించేనది వైతరణి అది ఒక లోకం, క్రిమికీటములను తినిపించటం వాటిచే కరిపించడం చేస్తే ఆ నరకమును క్రిమిభోజనం (లేక) కృమిభోజనం (లేక) క్రిమిశం అని అంటారు నీటి అడుగు భాగాన ఉండే నరకాలలో ఉండే నరకం తాల. ఇలాగే ప్రాణ రోధ, మహాజ్వాల, మహారౌరవం, రక్షోభక్షం, రోధం, రౌరవం, వజ్రకంటకసాలి, వాటరోధం, విలోహితం, శుచిముఖం, సందంశం, సారయేయాశనం, సూకరం, సూకరముఖం, స్వభోజనం, అంధతామిశ్రం, అప్రతిష్ఠం, అప్రాచి, కాలసూత్రం, దారుణం, పరావర్తనకం, లవణం, లాలాభక్షం.

పైన రకాలతోపాటు పుత్తు అనే నరకం కూడా కలదు. సంతానము లేని వాళ్లు ఈ నరకానికి వెళ్లుతారు అని ప్రయాణం. దీనినుంచి రక్షించేవాడే పుత్రుడు రస, క్షేత్రజం, దత్తకృతిమ, గూఢోత్పన్న, అపవిద్ధ, కానీన, సహోఢ, క్రీతక, పౌనర్భవ, స్వయందత్త, శౌద్ర (పారశవ) భేదాలతో కొడుకులు పన్నెండురకాలు. మానవుడు జన్మించిన తరువాత పాపపు కర్మలు చేసిన తరువాత మనిషి మరణించిన పిమ్మట ఆత్మ పైకివెళ్లి శిక్షింపబడును కాని శరీరానికి సంబంధం లేదు. శరీరము శిక్షించబడాలి అంటే, జన్మ ఎత్తవలసినదే. జన్మ ఎత్తిన తరువాత శరీరము శిక్షింప బడును. ఇదే పూర్వ జన్మలో ఉండే కర్మల ఫలితము శరీరము అనుభవిస్తుంది. శిక్షలో మిగులు భాగము ఆత్మ కూడా అనుభవిస్తుంది. అందువల్లే పూర్వజన్మలో ఉండే కర్మల ఫలితములు ఆధారంగానే జాతకంలో గ్రహాలు ఏర్పడి ప్రతికూల అనుకూల ఫలితములు ఏర్పడుతాయి.

పూర్వజన్మలో ఉండే కర్మల ఫలితాల ఆధారంగానే గ్రహాలు మానవున్ని పీడింపబడుతాయి. సర్పమును చంపడంవల్ల అని, పుట్టలు త్రవ్వటంవల్ల కాక మానవుడు పూర్వజన్మలో ఉండే కర్మల ఆధారంగా గ్రహాలు సర్పరూపంలో పీడిస్తాయి. కేవలం సర్పవధ వల్లే కాకుండా. కర్మలు సర్పరూపంలో ఉంటాయి. వంశానుగత కర్మలు సర్పదోషరూపంలో పీడిస్తాయి. కొంతమంది అనుకొంటారు. సర్పమును వధించటం వల్లే సర్పదోషము కలుగుతుంది. అనుకుంటారు. అదికాదు పూర్వజన్మ కర్మలవల్ల కూడా గ్రహములు సర్పరూపంలో పీడిస్తాయి. జన్మజాతకంలో కాలసర్పయోగం, సర్పయోగములు ఏర్పడుతాయి.

ఎప్పుడైతే ప్రాణి మరణిస్తాడో వారి యొక్క ప్రతి అంగము నిర్వీర్యం అయిపోతుంది. శరీరంలో ప్రతి అవయవము నిశ్చేష్టమైపోతాయి. ఇంద్రియములు,

గ్రహణశక్తులు క్రమక్రమంగా నశించిపోతాయి. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అయిన పంచవేద ప్రాణవాయువులు విడిపోయి వాటి వాటి స్థానములోకి వెళ్లిపోతాయి. ఈ విధంగా అపానము మరియు ఉదానవాయువు యొక్క తారతమ్యములు ఏర్పడటం వల్ల ప్రాణవాయువుకి అవరోధం ఏర్పడుతుంది. ఈ అవస్థనే మనం మృత్యువు అందురు.

అందువల్లనే పితృతర్పణములు చేయవలెను. పితృశ్రార్ధముల వలన వారు సంతుష్టులౌతారు. శ్రద్ధతో చేసేది శ్రార్ధము పితృదేవతలకు వారి ఉద్దేశం ప్రకారం వారి ఇష్టమైన భోజన పదార్థములను బ్రాహ్మణులకు శ్రద్ధపూర్వకముగా సమర్పించి బ్రాహ్మణుల ఆశ్శీసులు పొందవలెను. బ్రాహ్మణులు భుజింపజేసినభోజనం సూక్ష్మరూపంలో అత్యంత విస్తృతమైపోయి లోకాలోకాలను దాటి స్వర్గాన్ని చేరుతుంది.

పంచమహాభూతల యొక్క కలయిక వలన భూమండలములోకి రావటమే జన్మము మరియు దాని నుండి విముక్తుడై లోకాంతర గమనము చేయడాన్నే 'మృత్యువు' అందురు. ఈ స్థూలదేహాన్ని విడిచిపెట్టి ఎప్పుడైతే జీవాత్మ పరమాత్మలోకి వెళ్లిపోతుందో అప్పుడు కూడా అక్కడ 17 తత్వములతో ఉన్న సూక్ష్మశరీరముతో జీవాత్మకు సంబంధం ఉంటుంది.

వాక్కు మొదలైన పంచకర్మేంద్రియాలు, శ్రవణాది పంచ జ్ఞానేంద్రియాలు, పంచప్రాణులు, అకాశం మొదలైనటువంటి పంచమహాభూతాలు, మనస్సు, బుద్ధి, చితము, అహంకారాత్మకమైన అంతఃకరణలు, చతుష్టయము మరియు ఆవిద్య, కామకర్మలు ఈ 27 తత్వాతలో నిర్మితమైనటువంటి ఈ దేహము స్థూలముగా పంచమహాభూతాలు, స్థూలమైనటువంటి కర్మేంద్రియాలను విడిచిపెట్టి మిగిలిన 17 తత్వాలతో తయారు చేయబడిన ఈ సూక్ష్మశరీరము ఎన్నో శాపములకు గురి అవుతుంది. మాత పితృల, గురువు, దేవుడు, పితృదేవతలు, బ్రాహ్మణుల, వివిధ పశుపక్ష్యాది, సర్పముల శాపముల వలన శరీరరమునకు రోగములు, మానసిక సంఘర్షణలు ఏర్పడి శరీరము పాడు అయిపోయి ఆత్మ శరీరమును విడిచి జీవాత్మ, పరమాత్మలో కలియును.

## 37. రాహువు రూపము

పైరనీస గోత్రీకుడైన శూద్రుడైన గ్రహము రాహువు. ఈ రాహువు మళయాలదేశానికి రాజు. ఈ రాహువు రంగు ధూమ్రవర్ణము వీని వాహనము సింహము వీరి వస్త్రములు ధూమ్రవస్త్రములు, వీరు బాణము వర, శూలము, ధనస్సు చేతులలో ఉంటాయి. రాహువుకు యముడు అధిదేవత అయితే ప్రజాపతి ప్రత్యధిదేవత అవుతాడు. రాహువు స్వరూపము పొగరూపము, వనవాసి, భయంకర

ఆకారము వాయు ప్రధాన ప్రకృతి, బుద్ధిమంతుడు. రాహువు సంకర వర్ణాల ఆదిపత్యము వృక్ష, నిధి ఫలాలు ఉండే అభక్ష్య లేక గ్రహాలతో ఏగ్రహరాశిలో ఉంటే అగ్రహ వృక్షాల అధిపతి రాహువు స్థానములు బిల, భూమి గతస్థానము, గుఫా, గొయ్యి, బావి, గూరస్థానము మరియు రాహువుకు పొగరూపములో ఉండే వస్త్రాలు, ఈగ్రహము యొక్క ధాతువు అద్దము.

## 38. కేతువు రూపము

జైమనీ గోత్రీకుడైన శూద్రుడైన గ్రహము కేతువు. ఈ కేతువు కుశద్వీపానికి స్వామి కేతువు చిత్రమైన రంగు, వికృతమైన ముఖము గ్రద్ధ వాహనము చిత్రవర్ణమైన వస్త్రాలు, కేతువు చేతుల్లో వరముద్ర, గధ ఉంటాయి. కేతువు సంకర వర్ణాల అధిపత్యం పొందుతారు. ఈ రాహువు కేతువులు కృష్ణపక్షములో, దక్షిణాయనంలో రాత్రివేళ బలవత్తరమవుతాయి. కేతువుకు అధిదేవత చిత్రగుప్తుడైతే ప్రత్యధిదేవత బ్రహ్మ అయినాడు.

## 39. కారకాంశ రాహుకేతువులు

1) కారకాంశయందు రవిరాహువులు ఉంటే సర్పదోషము కల్గును (లేక) సర్పమువలన మరణము కలుగును.
2) కారకాంశయందు రవిరాహువులు ఉండి శుభగ్రహసంబంధం ఉన్నచో సర్పదోషము కలగదు. విషవైద్యుడు అవుతారు.
3) కారకాంశయందు రవిరాహువులకు శుక్రదృష్ఠి ఉంటే ఇళ్లు దహనముకావు.
4) కారకాంశయందు రవిరాహువులకు కుజదృష్ఠి కల్గినను ఇళ్లకు నిప్పు అంటించును.
5) కారకాంశయందు రవిరాహువులకు గురుదృష్ఠి కలిగితే సమీపగృహములు కాలును.
6) కారకాంశయందు రాహువు ఉన్నచో లోహయంత్ర జీవనము, విషవైద్యులు, ధనుర్ విద్యావేత్తలు అవుతారు.
7) కారకాంశ రాశికి చతుర్ధమున రాహు శని ఉన్నచో రాతిఇల్లు కల్గును.
8) కారకాంశ రాశికి నవమమున రాహువు శని ఉన్నచో గురుద్రోహము చేయును
9) కారకాంశ రాశికి నవమమున రాహువు గురువున్నచో గురువులయందు అవిశ్వాసము కల్గును.
10) కారకాంశ రాశికి నవమమునకు గురు సంబంధ దృష్టులు ఉన్నచో పరస్త్రీలోలుడు అవుతారు.

11) కారకాంశ రాశికి నవమమున రాహువు దృగ్యోగము కల్గినను దననాశనము కల్గును.

12) కారకాంశ రాశికి చతుర్ధమున రాహువు ఉన్నను దృష్ఠి కల్గినను ఇనప వ్యాపారము జేయును.

13) కారకాంశంలో కేతువున్నచో దొంగతనాలు చేయును.

14) కేతువుతో కలిసిన కారకాంశమును శుక్ర దృష్ఠి కల్గినను యజ్ఞదీక్షితుడు అవుతారు.

15) కారకాంశంలో కేతువు ఉండి శని దృష్ఠి కల్గితే తపస్వి యదార్ధవాధి అవుతాడు.

16) కేతు సహితమైన కారకాంశమునకు బుధ శని దృష్ఠి కలిగితే నపుంసదోషం కల్గును.

17) కారకాంశ రాశికి ద్వాదశమున కేతువున్నచో ధర్మమార్గం, మోక్షము కల్గును.

18) కారకాంశరాశిలో రవికేతువులున్నచో శివభక్తుడు అవుతాడు.

19) కారకాంశరాశికి చతుర్ధమున చంద్రుడు ఉండి మరియు కేతువు దృష్ఠి కలిగితే కుష్ఠువ్యాధి వచ్చును.

20) కారకాంశ రాశికి చతుర్ధమందుగాని పంచమమందు గాని కేతువు సంబంధం కలిగితే జలరోగము (DEHYDRATION) జలోదరము (DROPSY) రకరకాల రోగములు కల్గును.

21) కారకాంశరాశికి చతుర్ధమున కేతువున్నచో గడియారములు రిపేరు చేసేవాడు అవుతారు.

22) కారకాంశరాశికి పంచమమునకు కేతుసంబంధం ఉన్నా గణితంలో ప్రావీణ్యుడు అవుతారు.

23) కారకాంశ రాశికి ద్వితీయమున కేతువు ఉండి పాపదృష్ఠి కల్గినను నత్తివాడు అవుతాడు.

24) కారకాంశ రాశి యందు కేతువు ఉన్నచో గణపతి అనుగ్రహం కల్గును.

ఈ కేతువు వలన రహస్యంగా చెడు పనులు చేయుట, మతమార్పిడీలు, అపనిందలు, అధికారులవలన అవమానములు, దైవసంబంధ క్రియల్లో విఘ్నములు, అకస్మిక సంఘటనలు, అనాచారము వ్యాపార నష్టాలు కిరోసిన్, మంచినూనె, నువ్వుల నూనెలు పెట్రోల్, డీజిల్ ఆయిల్ వల్ల నష్టాలు లేదా ప్రమాదములు జంతువుల వలన నష్టాలు కలుగును.

## 40. రాహు బల నిరూపణము

శ్లో॥ వృషయేషాలికులీరేషుటరాశి సమన్వితే బలీరాహుః।
చంద్రార్కయోగకాలే పరివేషే రాశినినిర్గము బలవాన్॥
(హోరాసార)

పై శ్లోకమును ననుసరించి మేషము, వృషభము, కర్కాటకము, వృశ్చికము, కుంభరాశులలో ఉన్నప్పుడు, రవిలేదా చంద్రునితో కలిసినప్పుడు, రాశ్యంతము లోను, పరివేషకాలమందు ఉన్నప్పుడు రాహువు బలవంతుడు అయినాడు. ఇక్కడ పరివేషము అనగా సూర్యచంద్రుల చుట్టూ ఉండే తేజోవలయం (Halo) మరియు రాహువు సదా వక్రగతిలో చరించే గ్రహము. రాశ్యంతము అనగా రాశీప్రారంభ భాగాలుగా పరిగణించవలెను దశమస్థానమందున్నప్పుడు రాహువు బలవంతుడు.

## 41. కేతువు బల నిరూపణము

శ్లో॥ చాపాపరార్థమీనే కన్యావృష మోర్బలాన్వితః కేతుః।
కేతోర్థర్శనకాలే శుక్ర ధనుర్ధర్శనే చ రాతౌచ॥

పై శ్లోకము ననుసరించి ధనస్సురాశి ఉత్తరార్థమునందు, మీన, కన్య, వృషభ, ధనస్సు రాశుల యందు రాత్రిపూట, ఉల్కాపాతములు, ఇంద్రధనస్సు సమయంలో కేతువు బలవంతుడు అగును.

## 42. రాహుకాలము (సైంటిఫిక్ పరంగా) విధానము

రాహు కాలము అనగా రాహువు ఏ సమయంలో ఎంతసమయంలో ఉ ంటుందో ఆకాలమును రాహుకాలము అని నిర్వచించుతారు. ఈ రాహు కాలమును తమిళదేశస్థులు పాటిస్తారు. ఈ రాహుకాలము సూర్య మానస్థులైన దక్షిణాది వాసులకు మాత్రమే ఇది రాహుకాలము తమిళరాజ్యంలో ఉద్భవించినది ఈ రాహుకాలమును చాంద్రమానస్తులు కూడా పాటిస్తున్నారు. కాని ఇది సరియైన నిర్ణయము కాదు. చాంద్రమానస్తులు రాహుకాలము పాటించాలి అని ఏ ప్రమాణిక గ్రంథములలో కూడా లేదు. ఆగ్రంథాలు అయిన ధర్మసింధు నిర్ణయసింధు, నారదసంహిత, భృగు సంహిత గర్గసంహిత, వశిష్ట సంహిత, కాలమృతము ముహూర్త చింతామణి, ముహూర్త మార్తాండము మొదలగు గ్రంథాలలో కూడా లేదు. ఇది ముఖ్యంగా భారతదేశంలో ఉద్భవించినదే ఈ రాహు కాలము ఆదివారము నుండి శనివారము దాకా ఉండే ఏడు రోజులు అవుతుంది. ప్రతిరోజు 1 గంటన్నర (1-30) ప్రమాణము ఉంటుంది. రాహుకాలములో (2) రెండు పద్ధతులు కలవు. అవి:

**1) మొదటి పద్ధతి :**

సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు ఉండే సుమారు 12 గంటల ప్రమాణమును ఎనిమిది (8) భాగాలు చేస్తే ఒక్కొక్కభాగమునకు 1 గం॥ 30 నిమిషాలు పడుతుంది. ఏరోజున రాహుకాలము గురించి తెలుసుకోవాలంటే ఆరోజు వారమును బట్టి రాహుకాలమును నిర్ణయము చేస్తారు. వారము యొక్క భాగము నిర్ణయించిన ధృవాంశతో పెంచి సూర్యోదయంతో కలిపితే రాహు కాలప్రారంభ సమయము వస్తుంది.

వారముల యొక్క ధృవాంశము గురించి తెలుసుకొందాము. అవి:

1) ఆదివారము - ధృవాంశము-7

2) సోమవారము - ధృవాంశము-1

3) మంగళవారము-ధృవాంశము-6

4) బుధవారము - ధృవాంశము-4

5) గురువారము - ధృవాంశము-5

6) శుక్రవారము - ధృవాంశము- 3

$\Rightarrow y = x_1 + 7(x_2) = 6.30 + 7(1-30)$

7) శనివారము - ధృవాంశము- 2

ఉదాహరణ:

**1. ఆదివారము రాహుకాలము తెలుసుకొందాము**

జవాబు: దీనికి సుమారు సూర్యోదయ కాలమును 6.30 నిమిషాలకు తీసుకుందాము. సూర్యోదయ ప్రారంభకాలము సుమారుగా $x_1$= 6.30 గం॥ ని॥

సూర్యోదయ ప్రారంభకాలము= $x_1$ అనుకొందాము

భాగప్రమాణము = 1-30 గం॥ నిమిషాలు = $x_2$ అనుకొందాము

ఆదివార ధృవాంశము = 7

$\therefore x_1 = y - 7(x_2)$

6.30 + 7 × 1-30

= 6.30 + 10.00 = 16.30

అవుతుంది.

సాయంత్రము

ఆదివారము రాహుకాలప్రారంభము = 4.30 నుండి

\+ 1.30 = 6.00 వరకు ఉండును.

పై విధంగా గణితశాస్త్ర పరంగా లెక్కించవలెను.

**2వ ఉదాహరణ:**

మనము ముందుగా ఒక పంచాంగమును తీసుకొందాము. భారత ప్రభుత్వ ఆమోద గణిత ధృక్ సిద్ధాంత పంచాంగము తీసుకొందాము.

ప్రముఖ పంచాంగమైన (దృక్సిద్ధాంత) చిత్రాల గురుమూర్తి గుప్త సిద్ధాంతిగారి పంచాంగము తీసుకొందాము.

జనవరి ఒక రోజు సూర్యోదయము = 6గం-39 నిమిషాలు

అదే రోజు సూర్యస్తమయము = 5 గం-52 నిమిషాలు

సూర్యోదయము + సూర్యస్తమయము = మొత్తము

6-39+5-52 = 12-31 నిమిషాలు

= 720+31=751 నిమిషాలు

భాగాలు చేయగా ఒక్కొక్క భాగానికి = 93 నిమిషాలు

= 1-33 నిమిషాలు

సూర్యోదయ ప్రారంభకాలము = 6-39 నిమిషాలు

సూర్యోదయ ప్రారంభకాలము = $_1$ అనుకొందాము

ఒక్కొక్క భాగానికి సమయము = 1-33 నిమిషాలు= $_2$ అనుకొందాము

బుధవారము ధృవాంశము=4

అనగా బుధవారము రాహుకాలప్రారంభము=12-51 నిమిషాలు

ఇక్కడ ప్రారంభము

12-51+1-30=13-81=2-21

రాహుకాలము=12-51 నుండి 2-21 నిమిషాలవరకు ఉంటుంది. ఇది ఖచ్చితమైన సమయము.

చైనా జ్యోతిష శాస్త్రంలో కూడా రాహు దిశ గురించి కూడా విశిష్టస్థానము ఉంది.

= 6.39+6.12=12.51

మనము భవన, దేవాలయ, జలాశయ నిర్మాణములో పునాదులు త్రవ్వేటప్పుడు రాహువుకి నాలుగవ స్థానముపై త్రవ్వకము చేయాలి. త్రవ్వకము చేసేటప్పుడు (డాగన్)ను సురక్షితంగా ఉంచి త్రవ్వకము ప్రారంభించాలి మనము ముందుగా భవన నిర్మాణము పరిశీలిద్దాము.

**రాహువు నివాసము**

| రాహు దిశ | ఈశాన్యం N.E | వాయువ్యం N.W | నైరుతి S.W | ఆగ్నేయం S.W |
|---|---|---|---|---|
| సూర్యుడు ఏ రాశిలో ఉంటే | సింహం కన్య తుల | వృశ్చికము ధనస్సు మకరము | కుంభము మీనం మేషము | వృషభము మిథునము కర్కాటకము |
| త్రవ్వే దిశ | ఆగ్నేయం S.E | ఈశాన్యం N.E | వాయువ్యం N.W | నైరుతి S.W |

పునాదులు త్రవ్వేటప్పుడు రాహువు అంటే శేషనాగు (చైనాభాషలో డ్రాగన్)ను రక్షితంగా ఉంచి త్రవ్వకం ప్రారంభించవలెను. ఇక్కడ రాహువరహ అంటేశేషనాగు ముఖ్యమైన నాల్గుదిశలలో మధ్యకోణాలలో ఉంటాడు. వీ కర్ణంలో ఉంటాడు. ఎప్పుడు రాహువుకి నాల్గవ స్థానములో త్రవ్వకము చేయాలి గడియారానికి విపరీతదశ.

ఈ రాహుకాలము ఉత్తరభారతదేశములో చౌఘడియ అని, పశ్చిమ బెంగాలులో యమార్ధ అని పిలుస్తారు. ఇక్కడ జరిగిన విషయము ఏమిటి అంటే చాంద్రమాన ములో త్యాజ్య(వర్జ్య)ము ఎంతటి నిషిద్ధముగా ఉంటున్నదో, సౌరమానస్థులయిన దాక్షిణాత్యులకు రాహుకాలము అంతటి నిషిద్ధముగా ఉంటున్నది. తమిళనాడు వారికి ఈ రాహుకాలమును విధిగా పాటించుచున్నారు. త్యాజ్యసమయమైన శు భకార్యములు చేస్తారు. రాహుకాలము మాత్రము తెలుగునాడు రాష్ట్రము వారికి అవసరములేదు. వీరికి త్యాజ్యమే (వర్జ్యము) ప్రధానము తెలుగువాళ్లు వ్యాపారము నిమిత్తమై మద్రాసుకు రాకపోకలవల్ల వాళ్ల రాహుకాలమును మనము అనుసరిస్తున్నాము మన వర్జ్యమును వాళ్లు మాత్రమే పాటించట్లేదు.

ఈ రాహుకాలము రోజుకు ఒక దిక్కున ఉంటుంది. వారములను పరిశీలిద్దాము

1) సోమవారము – ఉత్తరదిశలో రాహువు

2) మంగళవారము – పడమర దిశలో రాహువు

3) బుధవారము – నైఋతి విదిశలో రాహువు

4) గురువారము – దక్షిణదిశలో రాహువు

5) శుక్రవారము – అగ్నేయవిదిశలో రాహువు

6) శనివారము – తూర్పుదిశలో రాహువు

7) ఆదివారము – ఉత్తర దిశలో రాహువు

ప్రయాణము చేసే రోజున రాహువు ఉన్న దిశలో వెళ్లకూడదు. ఇది రాహుకాలములో మాత్రమే వెళ్లకూడదు. ఈ రాహుకాలము ప్రారంభమై 3-45 ఘడియా విఘడియల ప్రమాణముతో ఉంటుంది. ఏకవింశతి మహాదోషాలలో కూడా రాహుకాల ప్రసక్తిలేదు ముహూర్తదర్పణాంతర్గతమైన ముహూర్తదీపికలో షడ్వర్గు క్రమము చెప్పిన తరువాత రాహుకాలమును గురించి ఈ విధముగా చెప్పబడి ఉన్నది ఈ రాహుకాలమును తమిళరాజ్యమునకు సంబంధించినది అని కూడా ఈగ్రంథములో చెప్పబడలేదు.

విధుసౌరిభృగుసుతజ్ఞ జీవభౌమార్కాః।

త్రిపాద త్రీణి వృద్ధిః॥

పై శ్లోకము ప్రకారము రాహుకాలము ఘడి 3-45 విఘడియలు కాలప్రమాణముగా చెప్పబడినది. ఇది ఇంచుమించు త్యాజ్య ప్రమాణ కాలమునకు సమానముగా ఉంటుంది. స్త్రీల ఋతుక్రమ దోషము కూడ యీ చతుస్సంఖ్యాక ప్రమాణముతో ఉంటున్నది. త్యాజ్యమూ, స్త్రీల ఋతుకాలమూ మూడు మహాదోషములుగ శాస్త్రములలో చెప్పబడినవి.

**రాహుకాలము:**

| | గం.-ని. | | గం.-ని. | **ఘడియలు-విఘడియలు** |
|---|---|---|---|---|
| ఆదివారము | 4-30 | నుండి | 6-00 | 26-25 |
| సోమవారము | 7-30 | నుండి | 9-00 | 3 - 45 |
| మంగళవారము | 3-00 | నుండి | 4-30 | 22-30 |
| బుధవారము | 12-00 | నుండి | 1-30 | 15-00 |
| గురువారము | 1-30 | నుండి | 3-00 | 18-00 |
| శుక్రవారము | 10-30 | నుండి | 12-00 | 11-25 |
| శనివారము | 9-00 | నుండి | 10-30 | 7-30 |

పైవిధముగా తమిళదేశీయులు నిత్యమూ ఆచరిస్తున్నారు.

రాహుకాలమునకు అవి ఆది(8) సోమ(2) మంగళ(7) బుధ(5) గురు(6) శుక్ర(4) శని(3) ఇవి వార ముహూర్త సంఖ్యలు.

ఈ రాహుకాలము సమయంలో దోషములు తొలగి పోవాలంటే ఈ క్రిందివి పాటించవలెను తాత్కాలితముగా మాత్రమే.

1. సుందరకాండను పారాయణము
2. దుర్గాదేవి అభిషేకము, దుర్గాసప్తశతి పారాయణము
3. శనివారమురోజున శతచండీపూజ, రుద్రాభిషేకము రాహుజపము, భైరవపూజ చేయవలెను.
4. ఆంజనేయస్వామికి అభిషేకము, జపము చేయవలెను.

5. సర్పప్రతిమగల వెండి ఉంగరమునకు పూజచేసి రాహుమంత్రముతో పూజించవలెను.
6. 18 శనివారములు రాహుమూలమంత్రముతో జపము చేసి రాహువు ప్రతిమను వెండితో చేసి దానికి దూర్వలు వేసిన నీటితో అభిషేకమును చేయాలి.
7. దుకార అష్టోత్తరముతో దుర్గను పూజించవలెను.

<u>రాహుకాల విశేషాలు మరికొన్ని</u>

1. రాహుకాలము పగలు మాత్రమే ఉంటుంది.
2. రాహుకాలములో యాత్ర, ప్రవాసము, రాజదర్శనము, చేయరాదు
3. రాహుకాలంలో దుర్గాదేవిని ఆరాధించుట
4. వివాహముహూర్తముల (వివాహాది తదితర ముహూర్తముల)కు రాహుకాలముతో సంబంధంలేదు.
5. రాహువు కాలంలో రాహువు జపము మరియు సర్పదోషపూజలు చేయుట మంచిది.

## 43. గణితపరంగా కేతుకాలము విధానము

రాహుకాలము వలే కేతుకాలము కూడా ఉంది. మనకు తెలిసిన యమగండ కాలమునే కేతుకాలము అని అందురు. కేతుకాలములో కేతువును పూజించటం వల్ల కేతుదోషములు తొలగును. ఈ కేతుకాలములో కేతువు ప్రతిమకు లేక విగ్రహమునకు గంగాజలముతో పంచామృతముతో మరియు కేతువుకు ప్రీతికర మైన ఉలవలతో అష్టోత్తర శతనామములతో పూజించవలెను. ఉలవలతో చేసిన పదార్థములను నైవేధ్యముగా పెట్టవలెను. ఈ కేతుకాలములో మహాగణపతిని పూజించటము వల్ల కేతువు బాధించదు. ఈ కేతుకాలములో సంకటహర గణపతి వ్రతము ఆచరించడము వల్ల కష్టములు తొలగిపోవును. సుఖసౌఖ్యాలు, సంతో, సౌభాగ్యాలతో వర్ధిల్లుతారు. ఆదివారము లేక బుధవారము రోజున గణపతిని, కేతువును పూజించడము వల్ల జీవితములో అనేక ఆటంకములు తొలగును. ఈ కేతువుకాలములో శ్రీలక్ష్మీగణపతి హోమము లేక కేతువు హోమము చేసినచో మంచిజరుగును. తొమ్మిది లేక పదకొండు డొప్పలలో నెయ్యివేసి దీపారాధన చేయవలెను. ఈ కేతువుకాలములో దేవాలయములో కేతువు విగ్రహమునకు సర్పసూక్త రుద్రనమక చమకములతో అభిషేకము చేయవలెను. ఈ కాలములో సంకటహరగణపతి స్తోత్రపారాయణము చేయటమువల్ల కూడా మంచి ఫలితములు ఉంటాయి.

కేతుగ్రహ పీడా పరిహారానికి శ్రీమహాగణాధిపతి ఉపాసన చేసి 41రోజుల అవుపాలతో శ్రీమహాగణపతికి చతురావృత్తి తర్పణము చేయడం వల్ల ఆటంకములు అన్నితొలగును. కేతుగ్రహశాంతి ప్రక్రియలలో ముఖ్యమైనది కేతుగ్రహపాశు పతాస్త్రము, లేక గణపతిపాశుపతము. ఇంటిలో కేతుగ్రహపాశుపత అభిషేకము, హోమము చేయడం వల్ల కేతుగ్రహ శాంతి కలిగి కార్యవిజయం కలుగును, మేధావృద్ధి కలుగును జ్ఞానము ప్రకాశిస్తుంది. గణపతి పాశుపతహోమము కూడా మంచిది. కేతుగ్రహమునకు గరికలేక దర్భలతో కూడా పూజించవలెను. కేతుకాలమునకు వారముల యొక్క ధృవాంశము గురించి తెలుసుకొందాము అవి

1. ఆదివారము - ధృవాంశము - 4
2. సోమవారము - ధృవాంశము - 3
3. మంగళవారము - ధృవాంశము - 2
4. బుధవారము - ధృవాంశము - 1
5. గురువారము - ధృవాంశము - 0
6. శుక్రవారము - ధృవాంశము - 6
7. శనివారము - ధృవాంశము - 5

పై ధృవాంశము ఆధారంగా రాహుకాలము నిర్ణయించిన విధంగానే కేతుకాలమును కూడా నిర్ణయించవచ్చు.

కేతుకాల ముహూర్తసంఖ్యలు కూడా ఉన్నవి అవి ఆది(5) సోమ(4) మంగళ(3) బుధ(2) గురు(1) శుక్ర(7) శని (8) వారముహూర్త సంఖ్యలు

కేతుకాలములో గణపతి పాశుపత అభిషేకము కూడా మంచిది.

**కేతుకాలము సమయములు:**

| | గం.-ని. | | | గం.-ని. |
|---|---|---|---|---|
| **ఘడియలు-విఘడియలు** | | | | |
| ఆదివారము | 12-00 | నుండి | 1-30 | 15-00 |
| సోమవారము | 10-30 | నుండి | 12-00 | 11-25 |
| మంగళవారము | 9-00 | నుండి | 10-30 | 7-30 |

| బుధవారము | 7-30 | నుండి | 9-00 | 3-45 |
|---|---|---|---|---|
| గురువారము | 6-00 | నుండి | 7-30 | |
| శుక్రవారము | 3-00 | నుండి | 4-30 | 22-30 |
| శనివారము | 1-30 | నుండి | 3-00 | 18-00 |

కేతుకాలములో గాని రాహుకాలములలో గాని మహామృత్యుంజయ పాశుపత అభిషేకం (లేక) హోమము, రోగపాశుపత అభిషేకము ఏరోగము అయితే ఉంటుందో దానికి సంబంధించిన పాశుపతము చేయాలి మరియు సర్పసూక్త పాశుపత అభిషేకము చేయాలి.కేతుకాలములో కేతు దోషములు తొలగిపోవుటకు తాత్కాలికముగా దోషములు తొలగుటకు ఈ క్రింది విషయములు పాటించవలెను.

1. కేతుయంత్రముపై 18 మంగళవారములు పంచామృతముతో అభిషేకము చేసేముందు కేతువు జపము చేయవలెను.
2. ప్రతిరోజు (నెలరోజులవరకు) సంకష్ట చతుర్థీవ్రతమును చేయవలెను.
3. 41 రోజులు రావిచెట్టుకు ఇరైవ ఒక్క ప్రదక్షిణలు చేయవలెను.
4. శుక్లపక్ష చవితిరోజున గణపతి మరియు సర్పపూజ చేయవలెను.
5. గకార అష్టోత్తరముతో గరికతో గణపతికి పూజచేయవలెను.

**కేతు కాలములో చేయగూడని విషయములు:**

1. ముఖ్యంగా ప్రయాణములు చేయగూడదు
2. ఎవరితో గొడవలకు దిగవద్దు
3. మాట అదుపులో ఉంచుకొనుట
4. నదిలోకి దిగగూడదు
5. వాహనాల యందు వేగము వద్దు
6. కరెంటు విషయంలో జాగ్రత్త అవసరము

పైవి తప్ప మిగితా కార్యక్రమములు అన్ని చేసుకోవచ్చును.

## 44. రాహువు గ్రహ కారకత్వములు ( The Dragon's head)

**కారకత్వములు:**

రాజ్యములు, బలము, వైద్యవిద్య, వక్రత్వము, జూదము, అడవి, పెనుగాలి, నైరుతిదిక్కు, చెడుమాట్లాడటం, దొంగతనములు, ఇంద్రజాల విద్యలు, గొడుగు మరకతము, నాగపూజలు, దుష్టస్త్రీలతోడి, పశువులతో సాంగత్యము, జ్వరము, భ్రమించుట,ఊపిరి, క్రూరస్వభావము, కుష్టురోగము, దోమలు, నల్లులు, వాయువు, బయటప్రదేశము, అశూచి, అనాచారము, దగ్గు, కఫము తండ్రి తాత, నీచత్వము, విషయములచే తయారు చేయబడిన మందులు, ఎడమచేతితో వ్రాయుట, దుర్గాదేవిపూజ, మూర్ఛ, దేశాటనము, క్షుద్రవ్యాధులు, గజ్జి, తామర, కీటకములు, క్షుద్రవ్యాధులు, గుడ్లగూబలు, మాతామహి, ప్రేతములు, భూతములు రాహువు యొక్క వృక్షము, మాతామహసంబంధములు, ఛత్రం, వ్యవసాయము, వివాహము, బలాత్కారము,చెరువులు, ఉద్యానవనములు, సన్మానములు, వ్యయము, వ్యాపారము, సీసములు, ఎముకలు, సంకోచము, యుద్ధము, బొగ్గు, చామరం, రత్నపరీక్ష, ధూమపానము, నీచజీవితము, విసనకఱ్ఱ, గారడి విద్య, లాటరీలు, ఏకఛత్రాధిపత్యం, స్వదేశ విదేశగమనము, పాపస్త్రీవల్ల ధనలాభం, ఖండన, దండన, ప్రచండ కాలసర్ప, మ్లేచ్ఛ, ధైర్య, ప్రతాప ధూమస్మశాన, తస్కర, ఖేద, విదవా, వ్యవహార, శిలాకుట్టన, మట్టన, రంధ్ర, గర్త వల్మీక, నాడిబంధము, చర, కణ్వా, కిణ, వృక్ష, పర్వత,ఘోరామయ, మహోత్పాత, అపస్మార,విషూచి,సంకోచ, దేశాటన, వైరాగ్య, బలత్కార, భ్రష్ఠత్వ, మిశ్రమహారణ్య ఘోరయుద్ధ, ధనార్జన, పితృ, మాతృ, ఖర్మ, సుఖ, కష్ఠ, కారకుడు, ఇతరులకు బాధకలుగునట్లు, మాట్లాడుట, మతవ్యతిరేకత, జూదము, ఉదరవ్యాధి, పొడుగుతనము, ప్రయాణము, వాహనము, నీచవిద్య, అధికారము.

## 45. కేతు గ్రహకారకత్వములు ( The Dragon's Tail)

**కారకత్వములు:**

గంగాస్నానము, గణపతి ఆరాధన, జడత్వము, మంత్రశాస్త్రము, దేవాలయముల దర్శనము, వికారము, జ్వరం తపస్సు, స్నేహము, చపలత్వము, మోక్షము మోసము, భక్తి, బ్రహ్మజ్ఞానము, శత్రువుల పీడ, ఆకలి, బంధన, చండి, ఈశ్వరుడు, ఉపాసన, కిరాయిహంతకులు, కోడి, గ్రద్ధ కడుపునొప్పి, వికారము, గ్యాస్ట్రబుల్స్, రక్తపీడ, వాహనములు, దత్తతతీసుకొనుట, పిల్లివలన భయము, కర్మరాహిత్యము, అద్దెకు ఉండటం గృహంలో, పితామహుడు, కేతువు యొక్క వృక్షము, నిద్ర,

స్వప్నము, ఉదర, నేత్రములు, చంచలత్వం, వైద్యము, మూఢభక్తి, మట్టివస్తువులు, ఆలస్యం, ప్రవాసము. వివిధ వర్ణములు గాజువస్తువులు, దైవభక్తి, వైరాగ్యము, లోభత్వం, జ్ఞానము, శైవదీక్ష, కపాలము, పితమహాది సంబంధములు, అల్పహార ములు, అన్యభాషలయందు ఆసక్తి, మిత్రులతో విబేధములు, మతము విషాదము, బ్రహ్మవిద్య, మత, వైరాగ్య, మూఢభక్తి, పూండ్రచిహ్న, దంభనటన, వ్రతారణ, తీర్థాటన, భిక్షాటన, లోభ, పైశున్య, కలహాలు, మిత్రబేధ, వికార, పైత్తిక, జ్ఞాన, విప్లవ, శైవదీక్ష, పర్యాయకర్మ, గృహప్రవేశ, నిద్యంజన, సాధన, చిత్ర కర్మకీర్తి ప్రతాప, కుక్షిభరత్వ, మిశ్రాభరణ, కాపాలిక, కర్తాంతిక, శాకినిక, చికిత్సా, మోక్షకారకుడు, డాక్టరు, కుక్కలు, కోళ్లు, గంగాస్నానము, మంత్రశక్తి, మౌనవ్రతము, వేదాంతము, ఐహికసుఖము, అదృష్టము, ప్రాపంచిక సుఖము నుండి దూరముగా నుండుట, ఉదరరోగము, వ్రణములు, అరెస్టులు, వారంటులు, ఆర్థులను తిరస్కరిం చుట, హీనజాతులతో కలిసి తిరుగుట.

## 46. కాలసర్పయోగ వివరణ

జ్యోతిష్యశాస్త్రంలో కాలసర్పయోగమనేది ఉంది. రాహుకేతువుల మధ్య సప్తగ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. ఈ కాలసర్పయోగ ప్రస్తావ ప్రామాణికంగా వ్రాసిన గ్రంథాలలో ఉన్నవే చదవడంకాదు దానిమీద పరిశోధన ఉండాలి. కొత్త అంశాన్ని వెలుగులోనికి తీసుకొని రావాలి. ఎంతోమంది వ్యక్తుల జాతకముల పరిశీలన చేయాలి ఇక్కడ ఏం జరుగుతుంది. ఒక వ్యక్తి M.Sc (Maths) చదువుతాడు అతను అంతటితోటి ఆగక Ph.D చేస్తాడు అక్కడ Ph.Dలో కేవలం Ph.D పుస్తకాలను అనుసరించడం కాదు. మ్యాథ మాటిక్స్‌లో, కొంతవిషయాన్ని కనిపెట్టడం అది రీసెర్చ్, ఉదాహరణకు ఇంటర్ చదువుతున్న విద్యార్థి త్రికోణమితి ( Trigonametry) లోని లెక్కలు చేస్తుంటే కేవలం ఆలెక్కలు I.I.Tలో రావు త్రికోణమితిలోని లెక్కలను ఆధారంగా చేసుకొని మెదడుకు మేత పెట్టే విధంగా రీసెర్చ్‌లెవల్లో ప్రశ్నలు సంధిస్తారు. కేవలం ఆ చాప్టర్‌లో ప్రశ్నలు అడగడం బట్టిపట్టి రాయడం కాదు I.I.T స్థాయిలో ప్రశ్నలు ఉంటాయి. ఎన్నో షార్ట్‌కట్స్ మెథడ్స్, లెక్చరర్స్ విద్యార్థులకు చెప్పని ప్రశ్నలు I.I.T పేపర్లలో ఉ ంటాయి. ఈ విషయాన్ని ఎందుకు చెబుతున్నాను అంటే కేవలం ప్రామాణిక గ్రంథాలే తీసుకొని కొత్తగా వచ్చినవి తప్పు అనటం సరికాదు ఎంతో అడ్వాన్స్‌డ్ టెక్నాలజీ పెరిగింది. దానిని అనుసరించి వెళ్లాలి అలా అని ప్రామాణిక గ్రంథాలు తీసుకోగూడదని కాదు అవి ప్రామాణిక గ్రంథాలు అనుసరించాలి. వాటి మీద పరిశోధన చేసి క్రొత్తవిషయాలను కనిపెట్టాలి. కాలసర్పయోగం దేశాల మీదేకాదు

వ్యక్తులమీద కూడా ప్రభావము చూపును. జాతకంలో కాలసర్పయోగము ఉండి బలమైన యోగములు అనగా గజకేసరి, బుధాదిత్య యోగం, చంద్రమంగళ యోగము, అమలయోగం, లక్ష్మీయోగం మొదలగు శుభయోగములు (లేక) వివిధ భావములలో శుభగ్రహములు ఉన్నచో ఆజాతకునికి కాలసర్పయోగము ప్రభావము తగ్గును. కొంతమంది ఎక్కువగా జాతకం శుభయోగములు ఉంటే కాలసర్ప యోగము నిర్వీర్యము అవుతుంది. కొంతమంది అడుగుతుంటారు. మాజీ ప్రధాని కీర్తిశేషులు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జాతకంలో కాలసర్పయోగం ఉందికదా, సర్దార్‌వల్లభాయ్ పటేల్, మాజీ అధ్యక్షుడు జార్జిబుష్, ధీరూబాయ్ అంబానీ, ప్రముఖ ఆధ్యాత్మిక యోగి మహేష్‌యోగి బాబర్‌చక్రవర్తి, హర్షద్‌మెహతా, సామ్రాట్ అక్బర్, మురారిబాపు, సిన్యోర్‌ముసోలిన్, ప్రముఖ చలనచిత్రనటుడు సుప్రీంస్టార్ మెగాస్టార్ చిరంజీవికి ఇలాంటి వారందరు కాలసర్పయోగ జాతకులే కాని ఒక విషయం ఇక్కడ జాగ్రత్తగా గమనించాలి. వీరందరికి కాలసర్పయోగం ఉంది కదా అందరికి మంచి హోదాలోఉన్నారు కదా ఏమైనది. కాలసర్పయోగం వారిపై ప్రభావం చూపలేదు కదా అన్ని ప్రశ్నలు ఉత్పన్నం అవుతాయి. అసలు విషయం ఏమిటి అంటే వారి జాతకములను పరిశీలిస్తే జన్మకుండలిలో శుభయోగములు మరియు వివిధ భావములలో శుభగ్రహముల కారణంగా కొన్ని జాతకములలో కాలసర్పయోగ ప్రభావము తగ్గింది మరియు అపసవ్య కాలసర్పయోగములు కూడ కలవు.

కొన్ని జాతకములలో కాలసర్పయోగ నిర్వీర్యము అయింది. ఇంకొకప్రశ్న కూడా ఉంది. అసలు కాలసర్పయోగ రూపము ఏమిటి రాహుకేతువుల గ్రహముల మధ్య సర్పగ్రహములు ఉండటమే కాకుండా రాహువునకు ముందు, కేతువునకు వెనుక మాత్రమే గ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. ప్రతియొక్క సిద్ధాంతి రాహుకేతువుల మధ్య సప్తగ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు అని తెలుసు గాని రాహువుకు ముందు, కేతువునకు వెనుక మాత్రమే గ్రహములుంటాయి. అని జాతకమునను పరిశీలించడం లేదు.

## 47. రాహువు రెమెడీస్

1) మినుములు $1\frac{1}{4}$ దానం ఇవ్వడం

2) గోమేధికం దానం ఇవ్వడం

3) గొడుగు, పాదరక్షలు దానం ఇవ్వడం

4) ముల్లంగి దుంపలు దానం ఇవ్వడం
5) నాగప్రతిమ దానం
6) చెల్లని నాణెములను ప్రవహించే నీటిలో వదలడం
8) యవలను పాలల్లో కడిగి ప్రవహించే నీటిలో వేయాలి.
9) చిన్న వెండి పాత్రను బ్రాహ్మణులకు దానం చేయండి
10) ఇనుముతో పాముబొమ్మ చేయించి నైఋతిలో పాతిపెట్టడం.
11) ప్లాస్టిక్ సామానులు ఎక్కువ వాడండి.
12) గోమేధికం ధరించండి.
13) వెండితో చేసిన అయస్కాంతపు ఉంగరాన్ని ధరించండి
14) రాహువు జపం బ్రాహ్మణులచే చేయించండి.
15) గోధుమలు, బెల్లం, ఇత్తడి కలిపి దానం ఇవ్వండి.
16) వెండితో ఏనుగు బొమ్మ చేయించి ఇంటిలో ఉంచండి.
17) కొబ్బరికాయను ప్రవహించే నీటిలో వేయండి.
18) వెండి గ్లాసులో పాలుత్రాగండి.
19) ఇంటిలో దంతంతో చేసిన వస్తువులు పెట్టకండి
20) దుర్గాదేవి ఫోటో ఈశాన్యంలో ఉంచి పూజించండి.
21) మసూరపప్పు 2కిలోలు దానం చేయండి.
23) వెండి జంటసర్పాలు శనివారం గాని, ఆదివారం గాని, చవితిరోజునగాని, పంచమిరోజునగాని, పుట్టలో వేసి, ఆవుపాలు పోయిండి.
24) రాగిజంటసర్పాలు, ఆరుద్రనక్షత్రము రోజునగాని, స్వాతినక్షత్రము రోజున గాని, శతభిషనక్షత్రము రోజునగాని పుట్టలో వేసి, ఆవుపాలు పోయండి.
25) బంగారు జంటసర్పాలు చవితిరోజునగాని, పంచమి రోజున గాని బ్రాహ్మణులకు దానం ఇచ్చి, తమ శక్తికొలది ధనము ఇవ్వండి.
26) గోమేధికం, కొబ్బరి, ముల్లంగి, చెల్లని నాణేలు, బొగ్గు ఇవి శనివారమురోజున కుష్టు రోగికి దానం చేయాలి.
27) పాలలో బార్లిగింజలు వేసి నదిలో వేయుట
28) ఆవు మూత్రముతో నోరు శుభ్రపరుచుట
29) గొడుగు, గవ్వలు, ఏనుగు, గోమేధికం దానం చేయవలెను.
30) ఆవాలు లేక నువ్వులు లేక అలచందలు మరియు గోమేధికము లేక నీలము రాయిని పనిమనిషికి దానము చేయవలెను.
31) ఎరుపురంగు పప్పు స్వీపర్‌కు దానం ఇవ్వాలి.

32) 4 కిలోల సీసం మరియు ఒక కొబ్బరికాయ నదిలో వేయాలి.

33) నైఋతిలో మట్టిపాలికలో (పాత్రలో) లేక పింగాణీ పాత్రలో క్రాస్ బ్రీడ్ మొక్కలను పెంచండి.

34) మినుములు నదిలో వేయండి.

35) మినుములు బ్రాహ్మణులకు దానం చేయండి.

36) శివపురాణం, స్కాందపురాణం, సుబ్రహ్మణ్యస్వామి గురించి 41 రోజుల పారాయణము చేయవలెను.

37) కాలసర్పయోగ పుస్తకములు నలుగురికి దానము చేయుట

38) కాలసర్పయోగము పుస్తకములు దానముచేయుట

39) మినపగారెలు, మినుములతో వండిన వంటకాలతో ఆదివారం రోజున బ్రాహ్మణులకు భోజనము పెట్టి దక్షిణతాంబులాదిలతో సత్కరించవలెను.

40) దున్నపోతు (మహిష)ను దానం ఇవ్వడం

41) దర్బలతో ఆవునెయ్యి, మినుములు, తేనతో హోమం చేయించగలరు.

42) గోధుమరంగు, ధ్రూమవర్ణం, నీలిరంగు వస్త్రాలు దానం ఇవ్వడం.

43) ఆవు మూత్రములో శుద్ధి చేసిన బాల్లింజలు ఇంటిలో గాని జేబులో గాని ఉంచుకొనుట మంచిది.

44) రోగమున్న వ్యక్తి అతని బరువులో పావువంతు (   ) మినుములు దానము ఇవ్వాలి.

45) నల్లకుక్కను ఇంటిలో ఉంచుట గృహంలో కిటికీలకు నలుపురంగు వేయుట సీసం గుండ్లను ఇంటిలోగాని జేబులోగాని ఉంచుట.

46) వ్యాపారం మంచిగా జరగాలంటే ఆ వ్యాపారస్తుని బరువులో పావు వంతు (   ) బరువు గల బొగ్గులను నదిలో వేయాలి.

47) శనివారం రోజున శనిహోరలో రాహువు అభిషేకము చేసి అనంతరము మినుములు, పట్టు పంచె దానము ఇవ్వవలెను.

48) బుధవారం లేక శనివారం రోజున జీవి ఆకులో అన్నం, పాలు, గరికెపోచలు వేసి ఆ జీవి ఆకు చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణ నమస్కారం చేసి దానిని

ఇంటివద్దనే నైఋతి దిశలో పెట్టవలెను. దీనిని ఎవరు తొక్కని చోట పెట్టవలెను. అది ఉదయం 6గం॥ నుండి 7 గం॥లగాని మధ్యాహ్నం 1గం॥ నుండి 2 గం॥లోపున ఈ సమయంలో పెట్టడం వల్ల రాహుదోషం అగును.

49) కొబ్బరి బొండమును నదిలో వేయుట.

50) నీలంబట్టలు ఎవరైనా ఇస్తే తీసుకోవద్దు

51) వెండిమేక ప్రతిమదానం చేయండి

52) రజిత శివలింగము దానము చేయండి

53) శ్వేత గోధానం చేయండి.

54) గృహమునకు నీటికుండ వాయువ్యంలో ఉంచండి.

55) మెట్లక్రింద వంటపనికి రాదు

56) లేడిని (జింక)ను పెంచండి.

57) ప్రతిసంవత్సరము 8 సీసంనాణాలు 42 సం॥వయస్సు వరకు నదిలో వేయాలి.

58) గరికను దానం చేయండి లేదా నదిలో వేయండి

59) గుడ్డమును, కంబళి, నూనె, పంచలోహములు దానం చేయుట.

60) సాంబ్రాణి, కస్తూరీ, నువ్వుచెట్టు ఆకులు, ఏనుగు దంతము (దొరికితే) లేకపోతే పైన మూడింటితో ఈ వస్తువులను నీళ్లలో వేసి ఆనీటితో స్నానము చేయవలెను.

61) గేదె కొమ్ముతో చేసిన పాత్రయందలి నీటిలో గుగ్గిలము, ఇంగువ, హరిదళము, మనశ్శిలలతో కలిపి ఆనీటితో స్నానము చేయవలెను.

62) రాహుగ్రహము దగ్గర 18 వత్తుల దీపారాధన చేసి గోధుమరంగు లేక నీలమురంగు, లేక ధూమవర్ణరంగు వస్త్రము దానము ఇవ్వవలెను.

63) అశ్వర్థ వృక్షమునకు ప్రదక్షిణలు చేయుట.

64) అమావాస్య ఆదివారం రోజు అయినప్పుడు గాని, గ్రహణం రోజునగాని, బంగారు గాని వెండి సర్పప్రతిమను బ్రాహ్మణులకు దానం చేయండి.

65) సుబ్రహ్మణ్యస్వామి దేవాలయములలో, దుర్గాదేవి దేవాలయములలో గాని పేదలకు మంగళవారం గాని శనివారం గాని అన్నదానంగాని లేక ప్రసాదం గాని పంచవలెను.

66) 18 శనివారములు ఉపవాసము ఉండి చివరి శనివారము రాహువుకు అభిషేకం దుర్గాదేవికి కుంకుమార్చన జరిపించాలి.

67) శనివారం రోజున రాహువు మంత్రమగు ఓంభ్రాం భ్రీం భ్రౌం సః రాహవేనమః అను మంత్రమును 40 రోజులలో 18 వేలు జపము పూర్తి చేసి 41వ రోజున మినుములు నల్లని వస్త్రంలో వేసి దానము చేయవలెను.

68) రాహుయంత్రము తీసుకొని యంత్రమునకు ఓం భ్రాం, భ్రీం, భ్రౌం సః రాహవే నమః మంత్రముతో 36వేల జపమును ధారపోసి మెడలో గాని, ఇంట్లోగాని ఉంచవలెను.

| | | |
|---|---|---|
| 13 | 8 | 15 |
| 14 | 12 | 10 |
| 9 | 16 | 11 |

రాహుయంత్రము

పై రాహుయంత్రాన్ని ఓం క్రోం క్రోం హూం హూం టం టంక ధారిణే రాహవే రం హ్రీం శ్రీం బైం స్వాహా అను మూల మంత్రాన్ని 18వేలు జపించి యంత్రానికి దారపోసి శనివారం రోజు శనిహోరలో ధరించవలెను.

69) గోమేధికమును దరించవలెను.

70) శ్వేతచందనము, నీలిదారము, తేనె, మినుములు, ఎండుద్రాక్ష దానం ఇవ్వండి.

71) సప్తముఖిలేక అష్టముఖి రుద్రాక్షలను ధరించండి.

72) సప్తముఖిలేక అష్టముఖి రుద్రాక్షలను ధరించండి.

73) గరికను నదిలో వదలండి.

74) తేనెరంగు వస్త్రం, మినపసున్నిండలు దానము చేయండి.

75) వరాహపురాణం చదవండి.

76) పంచలోహములతో ఉంగరం చేయించుకోండి.

77) ఆవాలు కేజింపావు బ్రాహ్మణులకు దానం చేయండి. మినపగారెలు నైవేద్యం పెట్టండి.

78) దేవి నవరాత్రులలో ఉపవాసము చేయడం.

79) శాక్తీయ పురాణం చదవడం.

80) దుర్గా పారాయణము.

81) దేవి నవరాత్రులలో దుర్గాహోమం లేక చండీయాగము చేయడం.

82) తూర్పువైపునగాని, ఉత్తరాభిముఖంగా గాని అమ్మవారి ఫోటో పెట్టడం

83) ఎర్రని వస్త్రం ధరించడం

84) భృగు సంహిత ప్రకారము రాహు యంత్రము ఈ క్రింది యంత్రాన్ని ఓం క్రోం హుం టుం టం టంక ధారీ రాహవే రం హ్రీం శ్రీం భౌం స్వాహా అనే మంత్రాన్ని 72,000 జపం చేసి క్రింది యంత్రానికి ధారపోయాలి.

భృగు సంహిత ప్రకారం

మంత్రం ఓం క్రోం క్రీం హుం టుం టం టంకధారీ రాహవే
రం హ్రీం శ్రీం భౌం స్వాహా

రాహు వస్తువులు 1) గాజువస్తువులు 2) ఆవనూనె 3) నువ్వులు 4) కంబళి 5) చేపలు 6) కత్తి 7) గుర్రము 8) నీలంరంగు బట్టలు 9) గోమేధము 10) నల్లరంగు పుష్పాలు.

**రాహుయంత్రం**



మంత్రజపం 72,000 ప్రతిదినం 1000 జపంచేసి 72 రోజులలో పూర్తిచేసి యంత్రానికి ధారపోసి ఈ యంత్రాన్ని బుధ శుక్రవారాలలో ఏదో ఒక రోజు ఒక సన్యాసికి దానం ఇచ్చేయాలి. అలా చేస్తే రాహు దోషం పోతుంది.

స్నానం: కస్తూరీ, ఏనుగుదంతం, సాంబ్రాణి వీటిని కలిపి మరిగించిన నీటితో స్నానం చేస్తే రాహుదోషం పోతుంది.

## 48. కేతువు రెమెడీస్

1) ఉలవలు $1\frac{1}{4}$ దానం ఇవ్వండి.

2) వైఢూర్యం దానం ఇవ్వండి

3) చిత్రవర్ణ వస్త్రం దానం ఇవ్వండి

4) ఉలవలను ప్రవాహనదిలో వేయండి

5) వెండిపాత్రలో తేనె ఉంచండి

6) తొమ్మిదిరోజులు 9 నిమ్మకాయలు నదిలో వేయండి

7) వెండిపాత్రలో తేనెను ఉంచండి

8) తొమ్మిది రోజుల 9 బొగ్గులు నదిలో వేయండి

9) గణపతిని పూజించి ఉపవాసము ఉండి, అరటిపళ్లను దానం చేయండి.

10. తెలుపుదిగాని, నలుపుదిగాని, చిత్రవర్ణంగాని దుప్పటి దానము చేయండి.

11. ఖర్జూరపండ్లు, కొబ్బరికాయలు దానం చెయ్యండి.

12. దర్భ నదిలో వదలండి.

13. మంగళవారము రోజు కుజహోర కాలములో కేతువుకు అభిషేకము చేసి ఉలవలు, చిత్రవర్ణవస్త్రం బ్రాహ్మణులకు దానం చేయండి.

14. బియ్యపు పిండి తాటిబెల్లంతో కలిపి ప్రతిరోజు ఉదయం మరియు సాయంత్రం సమయంలో కేతుస్తోత్ర పారాయణము చేసి చీమలు మొదలగు క్రిమికీటకాలకు నివేదన చేయవలెను.

15. వైఢూర్యము ధరించడం.

16. మంగళవారము రోజున బ్రాహ్మణులకు ఉలవలతో చేసిన వంటకాలతో భోజనము పెట్టి దక్షిణతాంబూలాదులతో సంతృప్తి పరచవలెను.

17. అష్టముఖి లేక నవముఖి రుద్రాక్షలు ధరించవలెను.

18. దానిమ్మపండ్లను దానం చేయవలెను.

19. పదితలల వెండి సర్పమును దానం చేయవలెను.

20. సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, ఏనుగుదంతము, మేకమూత్రము, మారేడుపట్ట, వీటిని నీళ్లలోవేసి వేడిచేసి ఆనీటితో స్నానము చేయవలెను.
21. ఉలవలు, వైఢూర్యము, నూనె, శాలువ, కస్తూరి దానము చేయవలెను.
22. ఖడ్గమృగము కొమ్ముతో చేయబడిన పాత్రలో నీరు పోసి పర్వతముల యందు పందికొమ్ముచే త్రవ్వబడిన మట్టి, మేకపాలు కలిపి ఆనీటితో స్నానము చేయవలెను.
23. మంగళవారము రోజున ఓం ప్రాం స్రీం స్రౌం సః కేతవేనమః అను మంత్రమును 40 రోజులలో 7 వేలు జపము చేసి చిత్రవర్ణము వస్త్రములో ఉలవలు దానము ఇవ్వవలెను.
24. చిత్రవర్ణవస్త్రంలో కేజింపావు $1\frac{1}{4}$ ఉలవలు మరియు చిత్రవర్ణవస్త్రంలో తొమ్మిది సర్పప్రతిమలుంచి తొమ్మిది మంది బ్రాహ్మణులకు దానము ఇవ్వవలెను.
25. ఎండుఖర్జూరఫలాలు 70 మంది బ్రాహ్మణులకు దక్షిణ సహితంగా దానము చేయాలి.
26. ఉలవలతో ప్రసాదము చేసి శ్రీమహాగణపతికి ప్రసాదము నివేదన చేయవలెను.
27. ఉలవలు, నువ్వులు, అరటికాయలు, చింతపండు, ఉల్లిపాయలు, వెల్లుల్లి బ్రాహ్మణులకు దానం చేయండి.
28. తెల్లజిల్లేడుతో చేసిన గణపతిని ప్రార్థించండి.
29. కంచుపాత్రలు, ఇనుముపాత్రలు దానం చేయాలి.
30. గుమ్మడి పండును, వెండిగుర్రమును అశ్వని, మఖ, మూల నక్షత్రములలో దానము చేయాలి.
31. కుడుములు, పులిహోర, గుగ్గిళ్ళు గణపతికి నైవేద్యం నివేదన చేసి అందరికి పంచండి.
32. తెలుపు వస్త్రం (పంచె) బ్రాహ్మణులకు దానం చేయండి.
33. శ్రీ గణేశ పురాణం చదవండి.
34. తొమ్మిది మందికి సీతాఫల పండ్లను పంచండి.
35. మేకను, అశ్వని, మఖ, మూలనక్షత్రములలో దానం చేయండి.
36. లేడి(జింక) ప్రతిమను దానం చేయండి.

37. ఆవు లేక గేదెను దానం చేయండి.
38. నూనె కుండను దానం చేయండి.
39. కేతువు ఆకారంలో వెండితో బొమ్మ చేయించుదానం చేయాలి.
40. విదేశాలకు వెళ్లేవారు ఆపని సఫలం కావాలంటే ఉత్తరాభాద్రనక్షత్రం రోజున ప్రారంభించి కేతుమంత్రమును 32 రోజులుపాటు రోజుకి 1008 సార్లు జపము చేయవలెను.
41. రక్తపోటుతో బాధపడుతుంటే కేతుమంత్ర జపం చేయండి 39వేలు. సుబ్రహ్మణ్య స్వామి పూజ చేయండి.
42. కేతువు జపం బ్రాహ్మణులచే చేయించండి.
43. 7 మంగళవారములు ఉపవాసము ఉండి చివరి మంగళవారం కేతువుకు అభిషేకం, గణపతికి సహస్రనామములతో పూజ జరిపించాలి.
44. గృహములోఉత్తరదిక్కునగాని తూర్పు వైపునగాని శుభదృష్ఠి గణపతి ఉండాలి.
45. మంగళవారము రోజున కేతువు మంత్రము ఓం స్రాం స్రీం స్రౌం సౌ కేతవే నమః అను మంత్రమును 11 రోజులలో 7 వేలు జపము పూర్తి చేసి 12వ రోజున ఉలవలు చిత్రవర్ణ వస్త్రంలో వేసి దానము చేయవలెను.
46. కేతు మంత్రము తీసుకొని యంత్రమునకు ఓం స్రాం స్రీం స్రౌం సః కేతవే నమః మంత్రముతో 14వేల జపమును ధారపోసి మెడలోగాని, ఇంట్లోగాని ఉంచవలెను.

| | | |
|---|---|---|
| 14 | 9 | 16 |
| 15 | 13 | 11 |
| 10 | 17 | 12 |

కేతుయంత్రము

పై కేతు యంత్రాన్ని ఓం హ్రీం క్రూం క్రూర రూపిణే కేతవే విసౌంస్వాహా అనుమూల మంత్రాన్ని 7 వేలు జపించి యంత్రానికి దారపోసి మంగళవారం రోజు కుజహోరలో ధరించవలెను.

47. గణపతి నవరాత్రులలో ఉపవాసము చేయడము.
48. చిత్రవర్ణవస్త్రం ధరించడం
49. శివపురాణం (లేక) గణపతికి సంబంధించినవి చదవడం.
50. తూర్పువైపునగాని, ఉత్తరాభిముఖంగా గాని శుభదృష్టి గణపతి పెట్టడం.
51. భృగుసంహిత ప్రకారము కేతుయంత్రము ఈ క్రింది యంత్రాన్ని ఓంహ్రీంక్రూం క్రూర రూపిణే కేతవే విసౌం స్వాహా అనే మంత్రాన్ని 54,000 జపం చేసి క్రింది యంత్రానికి ధారపోయాలి.

కేతువుకు ఒకే ఒక్క రెమెడీ పని చేస్తుందని లాల్‌కితాబ్ చెబుతోంది. అది గణపతిపూజ, కేతవు కుజునికి సమానం అందువలన గణపతిబొమ్మ ఇంటిదక్షిణపు గోడకి పెట్టి ఉత్తరంవైపు ముఖం ఉండేలా అమర్చడం. ఈ బొమ్మ లోహంతో చేసినదై ఉండకూడదు. మట్టి లేక ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసినదై ఉండాలి. కర్రది కూడా పనికిరాదు. శ్వేతార్క గణపతి కూడా పెట్టవద్దు. కేతువు వలన బాధలు వస్తే గణపతి ఆరాధన నిత్యం చేయడం మంచిది. భృగు సంహిత ప్రకారము:

**కేతు యంత్రం**




మంత్రం ఓం హ్రీం క్రూం క్రూర రూపిణే కేతవే

ఐం సౌం స్వాహా

జపం : 28,000 జపం చేసి పై యంత్రానికి ధారపోయాలి.

ఇతర మంత్రాలు : 1) ఓం కేం కేతవే నమః

2) పలాశపుష్ప సంకాశం తారకాగ్రహమస్తకం

రౌద్రం రౌద్రాత్మకం ఘోర తం కేతుం ప్రణమామ్యహమ్

## 49. రాహువుగ్రహ ఆరాధనా రహస్యాలు

జ్యోతిష్య శాస్త్రంలో రాహువుకు ప్రత్యేక ప్రాధాన్యత సంతరించుకున్నది. ఈ రాహువు అన్ని గ్రహములు రవి వలన అస్తంగతులైతే, సూర్యచంద్రుల సహితం నిస్తేజులుగా చేయగలిగిన వాడు సమర్ధుడు రాహువు అందువల్లనేమో ఈయన స్తోత్రంలో 'చంద్రాదిత్య విమర్ధనం' అని మర్ధించే శక్తి రాహువుకు కలదని తెలుస్తుంది. సృష్టిలో అతిశక్తివంతమైన అగ్నిగోళము ప్రాణశక్తికి కారకుడైన సూర్యుని మనోశక్తి కారకుడైన చంద్రుని మర్ధించేశక్తి కూడా రాహువుకు కలదు. 'శనివత్ రాహుః' అని శని ఫలితాలు రాహువు ఫలితాలు సమానము. శనివలె రాహువు కూడ కర్మగ్రహం పూర్వజన్మ కర్మలు అన్ని అతివిద్ధూరంగా అనుభవింప చేయ గలడు. దుష్ట స్వభావం కలవారిని అందలం ఎక్కడానికి సాహస కార్యక్రమాలు చేపట్టే వారికి చేయూత నివ్వడానికి ఈ రాహుగ్రహం బాగా సహకరిస్తాడు. ఇలాగే రాహు మహాదశ బాగులేనివారు పడేపాట్లు చాలాఉన్నవి మరియు ఈమహ ర్ధశ జరుగుతున్నప్పుడు పితృకర్మలు చేయిస్తాడు. ఒక కుటుంబంలో ఇద్దరు ముగ్గురకు రాహుదశకాని, అంతర్ధశకాని జరుగుతున్నప్పుడు తండ్రి, తాత, తల్లి అమ్మమ్మలో ఒకరికి ప్రమాదాలు సంభవించే అవకాశాలు ఉన్నవి. అలాగే అల్లులను కూడా అందలం ఎక్కించే స్వభావం కూడా కలదు. విదేశాలకు వెళ్ళటం, గొప్పవ్యక్తులతో పరిచయాలు కాని అలవాట్లు అనుభూతులు, అబద్ధాలు, అల్లకల్లోలాలు, కొత్తఅలవాట్లు, కొత్త వేషభాషలు కల్గించడంలో ఈ గ్రహం గారడీ చేయించే శక్తి కలవాడు. అలాగే, కొత్త వస్తువులు రకరకాల వింత జబ్బులు, వింతపోకడలు, వింతప్రవర్తనలు కల్గించడంలో ఈ రాహుగ్రహం సిద్ధహస్తుడు.

## 50. కేతుగ్రహ ఆరాధనా రహస్యాలు

జ్యోతిష్య శాస్త్రంలో "సర్పశిర్షా కృతిం కేతుః" అన్నారు. సర్పతల ఉన్నవారు కేతువు ఈ కేతువు విద్యామోక్షకారకుడు. వీరికి అధిష్ఠాన దేవత శ్రీమహాగణాధిపతి విఘ్నములకు అధిపతి గణపతి ఈ గణపతిని ఆరాధించటం వలన కేతుగ్రహ ప్రభావం తగ్గును. ఈ గ్రహానిది పైఠీనస గోత్రము నపుంసక స్వభావం కలది. ఇతడు కీలకనామసంవత్సర మార్గశీర్ష బహుళ అమావాస్య మంగళవారము మూలనక్షత్రము నందు జన్మించారు. ఈ నవగ్రహాలలో వాయువ్య స్థానములో ఉండటం ధ్వజాకారమండలము నందు ఉపనిష్టుడై ఉంటాడు. "కుజవత్ కేతుః" అని కుజుని ఫలితాలు కేతువు ఫలితాలు సమానము ఈ గ్రహ ప్రభావితుడైన వ్యక్తి పొట్టిగా, సన్నని శరీరముతో స్వరం పెద్దగాను, ఎఱ్ఱని నేత్రములు కలిగి ఉ

ంటారు. ఈగ్రహము మోక్ష విద్యాకారకుడు తన భావాలన్నియు చిత్రవిచిత్రమైన రీతులను అనుసరించును. ఈ గ్రహము కల్గించే అరిష్టాలు అతిదారుణంగా అత్యంత విచిత్రంగా ఉంటాయి. మూలానక్షత్ర జాతకులపై కేతువు ప్రభావం అధికంగా ఉంటుంది. అధ్యాత్మికంగా మూలధార చక్రాన్ని కేతువు ప్రతీకగా పాలిస్తాడు మానవునిలో దాగియున్న దైవశక్తి ఇక్కడనుంచే ప్రారంభమగును. కాబట్టే జ్యోతిషశాస్త్రంలో కేతువును మోక్షకారకునిగా నిర్ణయించారు. ఈగ్రహము నిర్ణయములను తారుమారుచేయగలడు. నలుపు, తెలుపు మిశ్రమ వర్ణము కుజునికి మిత్రునిగా వ్యవహరిస్తాడు. ఈగ్రహప్రీతికై కుక్కలకు ఆహారము తినిపించవలెను. ఆధ్యాత్మికోన్నత జీవనము, ఆకాశగమనము, యోగ, పక్షులు వార్తలు, దైవోపాసన, మంత్ర జపతపములు ఆధ్యాత్మిక ప్రసంగములు, వాయు సంబంధమైనవి మొదలైన వాటిపై తన ప్రభావాన్ని చూపిస్తాడు. ఈ గ్రహము శుక్రుడికి సహకారిమిత్రుడు, పాతాళము తత్వములు కలిగి ఉంటాయి. ఈ కేతువు బ్రహ్మమానసపుత్రికయైన మృత్యువు యొక్క సంతానమే ఇతని తల్లి సాక్షాత్తు మృత్యుదేవత దీర్ఘరోగములు, వివిధరకాల ధారుణాలు కల్గించును. ఈ గ్రహం కల్గించే అరిష్టాలు అతి దారు ణంగా అత్యంత విచిత్రంగా ఉంటాయి. మూలాధార చక్రానికి ఆధారము కేతువు మరియు ఈ మూలాధార చక్రానికి అధిదేవత గణపతి అందువలన గణపతిని కొలచిన కేతువు గ్రహ ప్రభావం తగ్గును. ఈ కేతువు చంద్రునితో కలిస్తే మానసిక ఆందోళనలను కలిగిస్తాడు. బుధునితోకలిస్తే బుద్ధి మాంద్యము కల్గును శుక్రునితో కలయిక వలన గర్వము చెడుప్రవర్తన కలుగుట. జీవితంలోఅసహనము కలుగును.

## 51. నాగదోషము వివరణ

సృష్టియందు నాగజాతికి ప్రత్యేకస్థానము ఉన్నది. పదునాలుగులోకములలో పాతాళలోకము ఒకటి ఈ పాతాళలోకము ఈ జాతికి జన్మస్థానము. ఈ పాతాళలోక వాసులు నాగరూపమును కలిగి ఉందురు.

ఈనాగ జాతికి మూల పురుషులు ఎనిమిది మంది వారు 1. అనంతుడు 2) వాసుకి 3) తక్షకుడు 4) కర్కోటకుడు 5) పౌంద్రకుడు 6) పద్మడు 7) మహాపద్మడు 8) శంఖపాలుడు అని మరికొన్ని పురాణముల యందు మొదటి పక్షము వారు 1. అనంతుడు 2) వాసుకి 3) తక్షకుడు 4) శంఖపాలుడు 5) కుశికుడు 6) పద్మడు 7) మహాపద్మడు 8) కర్కోటకుడు రెండవపక్షమువారు 1) వాసుకి 2) తక్షకుడు 3) విరావతుడు 4) ధనంజయుడు 5) కర్కోటకుడు 6) శంఖపాలుడు 7) అనంతుడు 8) శేషుడు అని కొంతమంది మరోకవిధంగా 1) అనంతుడు 2) కులికుడు 3) వాసుకి 4) శంఖపాల 5) పద్మ 6) మహాపద్మ7)

తక్షకుడు 8) కర్కోటకుడు 9) శంఖనందుడు 10) పాతక 11) విషక్తుడు 12) శేషుడు ఇంకొకవిధంగా 1) అనంతుడు 2) కర్కోటకుడు 3) వాసుకి 4) శంఖపాల 5) పద్మ 6) మహాపద్మ 7) తక్షకుడు 8) కుళికుడు 9) శంఖనందుడు 10) పాథక 11) విషక్తుడు 12) శేషనాగుడు ఈ విధంగా ఉన్నాయి.

వీరిలో అనంత,వాసుకి, శేషులు సత్వగుణం, ఐరావత, ధనుంజయ, శంఖ పాలుడు, శంఖనందుడు రజోగుణము తక్షకుడు, కర్కోటకుడు తమోగుణము కలిగి ఉందురు. ఈనాగదేవతలే మిగతా సర్వ నాగజాతికి మూలము. వీరికి రజోగుణ స్వభావం కోపము అధికము దయ, ప్రేమ కూడా అధికంగా ఉండును. ఈ నాగదేవత అనుగ్రహిస్తే సంతానము లేనివారికి సంతతి కలుగును. ఈ నాగదేవతారాధన మగవారికన్న స్త్రీలు ఎక్కువగా పూజిస్తారు. దాంపత్యలోపములు, పిల్లల చెవులకు, కంటి వ్యాధులకు నాగదేవతను కొలుస్తారు. అందువల్లే ప్రతి దేవాలయమునందు. విశేషముగా నాగప్రతిమలు ఉంచుదురు. శివాలయమునందు విశేషముగా నాగప్రతిమలు ఉంచుదురు. శివాలయములలో రావిచెట్లు, మొదళ్ళు, ఆరామప్రదేశాలు, నదీతీరములు, మొదలగు స్థలములలలో శ్రీనాగదేవతలను ప్రతిష్ఠించుతారు. నాగదేవత విగ్రహములను ప్రతిష్ఠించి. నిత్యార్చనలతో ఆరాధిస్తారు. కొంతమంది వంశమువారు. నాగదేవతలను పూజచేయకుండ ఏ శుభకార్యములు చేయరు. ఈ నాగులు తమను ఆదరించు ఉపకారము చేయువారి మీద విశేష అభిమానం కలిగి ఉంటారు. తమకు, తమ జాతికిఅపకారముచేసే వారియందు ద్వేషమును పెంచుకొని పగను సాధించు కొనును.

ఈ సర్పములు ప్రతిరోజు స్వేచ్ఛగా తిరగవు ఆదివారం రోజు తక్షక జాతి'కి చెందిన సర్పములు విషపూరితమైన భూమి మీద తిరుగును. సోమవారం రోజున శంఖపాల జాతి సర్పములు మంగళవారము రోజున కర్కోటక జాతి సర్పములు నల్లరంగు, జన్మమాసం వైశాఖం, మాసాధిపత్య సూర్యుడు 'అర్యమ' నామంతో వృషభ రాశి వాయుతత్వం అధిష్టానదేవత లక్ష్మీదేవి, వాసుకి జాతి సర్పములు కపిల వర్ణము, జన్మమాసం జ్యేష్ఠ, మాసాధిపత్య సూర్యుడు 'ధాత' నామంతో మేషరాశి, అగ్నితత్వం అధిష్టాన దేవత సుబ్రహ్మణ్యస్వామి అలాగే.కర్కోటక జాతి సర్పములు నల్ల రంగు, జన్మమాసం వైశాఖం, మాసాధిపత్య సూర్యుడు 'అర్యమ' నామంతో వృషభరాశి వాయుతత్వం అధిష్టానదేవత లక్ష్మీదేవి, వాసుకి జాతి సర్పములు కపిలవర్ణము, జన్మమాసం జ్యేష్ఠమాసాధిపత్య సూర్యుడు మిత్రనామంతో మిథున రాశి పృథ్వీతత్వం కలిగి ఉంటారు.

అధిష్ఠాన దేవత విష్ణువు శంఖపాల జాతిసర్పములు తెలుపురంగు జన్మమాసం ఆషాడము మాసాధిపత్య సూర్యుడు వరుణ కర్కాటక రాశి జలతత్వం అధిష్టాన దేవత గౌరిదేవి తక్షకజాతి సర్పములు త్రాచుపాముజాతి జన్మమాసము ఆశ్వీజము మాసాధిపత్య సూర్యుడు పూష తులారాశి పృథ్వితత్వం అధిష్టాన దేవత శ్యామలాదేవి. ఇదేవిధంగా ధనుంజయ ఎరుపురంగు, ఐరావతము చిత్రవర్ణము లేదా భూడిదరంగును కలిగి ఉంటాయి. ఈనాగదోషము వంశానుగతముగా ప్రాప్తించును. ఇవ్వని కూడా కర్మల ఆధారంగా జరుగును.

కర్మల గురించి వివరణాత్మకంగా బ్రహ్మశ్రీ డాక్టర్ నాయకంటి మల్లికార్జున శర్మగారు రచించిన కాలసర్పయోగ గ్రంథములో ఉంది.

శ్లో॥ "హసనం తాడనం చైవ బంధనం హింసనం తథా।
సర్పదోషం భవేర్యస్తు వంశానుక్రమ సంభవమ్॥"
"జ్ఞానతోఽజ్ఞానతశ్చైవ ప్రత్యక్షం చ పరోక్షకైః।
హింసయా మారణం చైవ నాగదోషం భవేన్నరః॥"

శ్లో॥ "సజాతి సర్పహసనం తాడనం హింసనం కుర్యా।
ద్వంశ వృద్ధిం నజానాతి దోషైర్బహు భిర్యుతమ్॥ (కర్మవిపాకం)

శ్లో॥ జ్ఞానతో కర్తాకారయితా చైవప్రేరకశ్చాను మోదకః।
సుకృతం దుష్కృతం చైవ చత్వారస్సమభాగినః॥ (నిర్ణయ కౌమది)

పై శ్లోకములను అనుసరించి ప్రత్యక్షంచగ గాని, పరోక్షంగా గాని సర్పములకు హాని తలపెట్టిన అందుకు సహకరించినా సర్పదోషము కల్గును.

సర్పదోషం వంశపారంపర్యంగాను, సర్పములు పీడించినా, హింసించినా, బంధించినా, సంహరించినా ఆ దోషం సర్పరూపంలో మనలను వెంటాడుతుంది. వంశక్షయానికి కూడా కారణభూతము అవుతుంది. సర్పములకు అపకారం చేయటమే కాదు అందుకు సహకరించినా ఈ దోషం తగులుతుంది. కర్మలు సర్పరూపములో మానవునికి తగులును దానిని జప, అభిషేక, శాంతి హవనములతో మరియు దానములతో తొలగించవలెను. ఈ సర్పదోషము వలన సంతాన, దాంపత్య, దోషములు, వివాహ దోషములు కల్గును. సంతానహీనతకు, గర్భశోకానికి సంసార దుఃఖానికి, దీర్ఘరోగములకు జీవితాన్ని దుర్భరం చేసేది ఈ నాగదోషమే కారణం.

శ్లో॥ అపుత్రాః పుత్రశోకంచ కురూపఃపుత్రజాయతే।

అభర్తా పతిహీనంచ పతిసంగ వివర్జితాః॥

శ్లో॥ భర్తృత్యక్తా భవేద్రోగా జీవనం దుర్భనం భవేత్।

సర్పదోషో భవేద్యస్తు కష్టశోక భయావహమ్॥

ఈ సర్పదోష నివారణకై మహర్షులు ఓ విధి విధానాన్ని మనకు అనుగ్రహించారు. ఆ మహర్షుల వాక్యములను శిరసావహించి ఆ విధానాన్ని ఆచరించటం వల్ల సర్పదోషము నుండి విముక్తి చెంది పుత్రాభివృద్ధిగా ఆయుశ్శ్రీశాంతులతో ఉందాం.

## 52. సుబ్రహ్మణ్యస్వామి నిజముగా సర్ప స్వరూపుడా?

చాలామందికి సుబ్రహ్మణ్యస్వామి సర్పస్వరూపుడా అవునా? కాదా? అని సందేహాలు వ్యక్తము అవుతుంటాయి. సాధారణంగా నాగదోషాలకు సుబ్రహ్మణ్య స్వామిని ఆరాధిస్తుంటారు. ఈ స్వామిని నాగదేవతగా సుబ్రహ్మణ్యునిగా ఆరాదిస్తుంటారు. ఈశ్వరపుత్రుడైన సుబ్రహ్మణ్యేశ్వరుడు ఒకానొకసమయంలో లోక కళ్యాణార్థమై సర్పరూపము ధరించినారు అని కొన్ని పురాణ గాథలు ద్వారా తెలుస్తుంది. సర్పరూపము ధరించిన మాత్రమున నాగదేవతగా భావించరాదు ఇలాగే శ్రీవేంకటేశ్వరస్వామికి కూడ నడుముకు నాగాభరణం ఉంటుంది. అలాగని ఆయనను కూడ నాగదేవతగా భావిస్తున్నారా? భావించట్లేదు గదా! అందువల్ల సుబ్రహ్మణ్యేశ్వర స్వామి చేసే పూజ వారికే చేయాలి నాగదేవతకు చేసే పూజను నాగదేవతకే చేయాలి. మనము ఈక్రింది శ్లోకములను గమనిద్దాం.

శ్లో॥ గాంగేయం వహ్ని గర్భం శరవణ జనితంజ్ఞాన శక్తిం కుమారం।

బ్రహ్మణ్యం స్కంద దేవం గుహ మమలమిదం రుద్ర తేజ స్వరూపమ్।

సేనాన్యం తారకఘ్నం గురుమచలమిదం కార్తికేయం వడాస్వం।

సుబ్రహ్మణ్యం మయూరధ్వజ రథ సహితం దేవదేవం నమామి॥

శ్లో॥ షడ్వక్త్రం శిఖి వాహనం త్రినయనం చిత్రాంబ రాలంకృతం।

శక్తిం వజ్ర మసిం త్రిశూల మభయం ఖేటం ధను శ్చక్రకమ్।

పాశం కుక్కుట మంకుశం చ వరదం దోర్భిర్దధానం సదా।

ద్యాయే దీప్సిత సిద్ధిదం శివ సుతం వందే సురా రాధితమ్॥

(కుమారతంత్రము)

పై శ్లోకములు పరిశీలించిన సుబ్రహ్మణ్యస్వామిని కొలచిన నాగదేవతను కొలచిన సమానమైన ఫలితం వస్తుందని చెప్పలేదు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామికి ఉపాసన, ఆరాధించటం వలన నాగదోషములు సమస్తపాపములు పరిహారములు అగును నాగదోషములను, పాపాలను హరించగల మహిమ స్వామి ఉపాసనలో గలదని తెలుస్తుంది. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి నాగదేవత యని గాని నాగదేవతే సుబ్రహ్మణ్యస్వామి అని గాని తెలియజేయలేదు.

శ్లో॥ సర్వాభీష్ట ప్రదం తస్యాన్మహాపాతక నాశనం
సుబ్రహ్మణ్య ప్రసాదేన అప మృత్యు వినాశనమ్
ఆయురారోగ్య మైశ్వర్యం పుత్రపౌత్ర ప్రవర్ధనమ్
నాగదోషహరం చైవ సర్వం సంపత్సు భావహమ్॥

పై శ్లోకముల వలన నాగదోష నివారణాశక్తి సుబ్రహ్మణ్యస్వామి కున్ననూ సర్ప ప్రీతికరమైన శాంతివిధానములను నాగదేవతలకే చేయవలెను గాని సుబ్రహ్మణ్యస్వామి కాదు.

## 53. రాహుకేతువుల అన్యగ్రహముల కలయిక

1) రాహువు 6వస్థానములో
 ఉండి గురువు 1,4,7–అష్టలక్ష్మీయోగము కల్గును10స్థానములలో ఉన్నచో
2) రాహువు 11వ స్థానము
 లో ఉండి గురువు దృష్టి – బహుపుత్రయోగము కల్గినను
3) రాహువు శని కలిసి జన్మలగ్నములో ఉన్నచో – అనారోగ్యము
4) రాహువు చంద్రుడు కలిసి జన్మలగ్నములో ఉంటే – మతిచెడును పిశాచయోగము కలుగును
5) రాహువు 7వ స్థానంలో ఉండి అశుభగ్రహదృష్టి కలిగినచో – వైవాహిక జీవితము అసంతృప్తి కరము
6) రాహువు, శని కలిసి 4వ స్థానములో ఉంటే – విద్యా విఘ్నములు మాతృసౌఖ్యం ఉండదు
7) కేతువు, శని కలిసి కేంద్ర కోణములలో – రాజయోగము కల్గును
 ఉన్నచో
8) రాహువు, శని కలిసి 10వ స్థానములో ఉంటే –వృత్తిలో అపశ్రుతులు

| | | |
|---|---|---|
| 9) ద్వితీయంలో కేతువున్నచో | - | ధనము కల్గును |
| 10) రాహువు, శని కలిసి 7వ స్థానములో ఉంటే | - | వివాహసమస్యలు రెండవ వివాహము జరుగును. |
| 11) కేతువు 7లో ఉన్నచో | - | అన్యస్త్రీ సంపర్కము కలుగును |
| 12) రాహువు శని కలిసి 9వస్థానములలో ఉంటే | - | పితృ సౌఖ్యం ఉండదు |
| 13) రాహువు, శని కలిసి 5వ స్థానములో ఉంటే | - | సంతాన నష్టము |
| 14) కేతువు, శుక్రుడు కలిసి ఉంటే | - | అల్పసంతానము, భార్యకు గర్వము, సహోదరుల నష్టం కల్గును. |
| 15) రాహువు, శని కలిసి సప్తమంలో ఉంటే | - | భార్యకు ప్రమాదము వైవాహిక జీవితంలో అసంతృప్తి |
| 16) రాహువు, చంద్రునితో కలిసి సప్తమంలో ఉంటే | - | జీవితము సుఖప్రదము |
| 17) రాహువు, చంద్రుడు, రవి కలిసి సప్తమంలో ఉంటే | - | అన్యస్త్రీ సంపర్కము, భార్యకు ప్రమాదము |
| 18) మకరములో కేతువు ఉండి సప్తమము అయితే | - | భార్యకు దీర్ఘరోగము |
| 19) వృశ్చికములో కేతువు ఉండి సప్తమము అయినచో | - | స్త్రీ మూలకముగా ధనము కల్గును |
| 20) రాహువు, కుజుడుకలిసి అష్టమంలో ఉంటే | - | ఆత్మహత్య చేసికొనడం లేదా లేదా ప్రమాదములు |
| 21) మేష, వృషభ, మిథున, కర్కాటకంలో రాహువు ఉండి, గురు దృష్టికల్గినను | - | రాహువుదశ యోగించును |

22) సప్తమంలో రాహువు అయి

ధనుర్ లగ్నము అయితే - అన్యస్త్రీ సంపర్కము

## 54. కాలసర్పదోషమునకు ఛిన్న మస్తాదేవి గాయత్రి మంత్రములు

జాతకంలో కాలసర్పదోషము ఉండి రాహువు గ్రహము అశుభస్థానములలో ఉన్నచో దానికి రాహువుకు అంతరిక్షదేవత అయిన ఛిన్నమస్తాదేవిని ప్రసన్నం చేసుకొనవలెను. ఈ ఛిన్నమస్తాదేవి మంత్రములు ప్రతీరోజు చదువవలెను.

1) ఓం విరోచన్యై విద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి।। తన్నో దేవీ ప్రచోదయాత్

2) ఓం చండేశ్వర్యైచ విద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి। తన్నోదేవీ ప్రచోదయాత్।

3) ఓం యోగిన్యాయచ విద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నో దేవీ ప్రచోదయాత్।

4) ఓం మహావిద్యాయైచవిద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

5) ఓం మహాభీమాయైచవిద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

6) ఓంఘోరరూపాయైనవిద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

7) ఓం మహాభీమాయైచవిద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

8) ఓం శుభదాయైచవిద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

9) ఓంగంధర్వగణపూజితాయైచవిద్మహే।ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవిప్రచోదయాత్

10) ఓం భద్రకాళ్యైచవిద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవి ప్రచోదయాత్।

11) ఓం శివాయైచవిద్మహే। ఛిన్నమస్తాయైధీమహి। తన్నోదేవి। ప్రచోదయాత్।

12) ఓం చండమాయైచ విద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి తన్నోదేవి ప్రచోదయాత్।

13) ఓంఛిన్నముండధరాయైచవిద్మహే।ఛిన్నమస్తాయైధీమహితన్నోదేవీ ప్రచోదయాత్।

14) ఓం ఛిత్రణ్యై చ విద్మహే। ఛిన్నమస్తాయై ధీమహి తన్నోదేవిః ప్రచోదయాత్।

15) ఓం ఢాకిన్యై చ విద్మహే । ఛిన్నమస్తాయై ధీమహి తన్నోదేవి ప్రచోదయాత్।

## 55. కాలసర్పదోషమునకు ధూమవతి గాయత్రి మంత్రములు

జాతకంలో కాలసర్పదోషము ఉండి కేతువు గ్రహము అశుభస్థానములలో ఉన్నచో దానికి కేతువుకు అంతరిక్షదేవత అయిన ధూమవతిదేవిని ప్రసన్నం చేసుకొనవలెను. ఈధూమవతి గాయత్రిదేవి మంత్రములు ప్రతిరోజు చదువవలెను.

1) ఓం ధూమ్ర వర్ణాయ విద్మహే। ధూమవత్యైచ ధీమహి తన్నో దేవి ప్రచోదయాత్।

2) ఓం చిత్ర రూపిణ్యైచ విద్మహే । ధూమవత్యైచ ధీమహి తన్నోదేవి ప్రచోదయాత్।

3) ఓం బహురూపిణ్యైచ విద్మహే। ధూమవత్యైచ ధీమహి తన్నోదేవి ప్రచోదయాత్

4) కాలస్వరూపయైచవిద్మహే। ధూమవత్యై చ ధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
5) ఓంకైలాసస్థానవాసిన్యైచవిద్మహే।ధూమవైత్యచధీమహేతన్నోదేవి ప్రచోదయాత్।
6) ఓం కృష్ణరూపాయైచవిద్మహే। ధూమవత్యై చ ధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
7) ఓం దీర్ఘాంగ్యైచవిద్మహే । ధూమవతీ చ ధీమహే తన్నోదేవీ ప్రచోదయాత్।
8) ఓం త్రికాలజ్ఞాయైచ విద్మహే। ధూమవత్యై చ ధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
9) ఓంయక్షరాక్షసపూజితయైచవిద్మహే।ధూమవతీచధీమహేతన్నోదేవి ప్రచోదయాత్।
10) ఓం త్రినేత్రాయచవిద్మహే। ధూమ వతీచధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
11) ఓం త్రిలోకేశ్యైవిద్మహే। ధూమతీచధీమహే తన్నోదేవిప్రచోదయాత్।
12) ఓం శూర్ప ధారిణ్యైచ విద్మహే। ధూమవతీచధీమహే తన్నోదేవిప్రచోదయాత్।
13) కాకధ్వజధారూఢాయైచ విద్మహే। దూమవతీచధీమహే తన్నోదేవిప్రచోదయాత్।
14) ఓం కరాళ్యైచ విద్మహే। దూమవతీచధీమహే తన్నోదేవిప్రచోదయాత్।
15) ఓంస్మశానస్థానవాసిన్యైచవిద్మహే।ధూమవతీచధీమహేతన్నోదేవి ప్రచోదయాత్।
16) ఓంకాలచక్ర ప్రవర్తిన్యైచ విద్మహేధూమవతీచధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
17) ఓం భక్తప్రయాయచవిద్మహే । ధూమవతీచ ధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
18) ఓంచండస్వరూపాయచవిద్మహే।ధూమవతిచ ధీమహే తన్నోదేవిప్రచోదయాత్।
19) ఓందూమ్రాక్ష మదిన్యైచవిద్మహే।ధూమవతీచధీమహే తన్నో దేవి ప్రచోదయాత్
20) ఓం లలజ్జహ్వాయ విద్మహే। దూమవతిచ ధీమహే తన్నోదేవి ప్రచోదయాత్।
21) ఓందుష్టవిధ్వంసకారిణ్యైచవిద్మహే।ధూమవతిచధీమహే।తన్నోదేవి ప్రచోదయాత్॥

## 56. ఆరోగ్య మంత్రము

మానవుని యొక్క రోగములు విముక్తి చెందుటకు (తాత్కాలికంగా) ఆరోగ్య దాయిని మంత్రము ఋగ్వేదములో ఉన్నది ఇది ఒక స్వయం ప్రేరణ మంత్రము.

ఒక్కొక్క వ్యాధికి స్పెషలైజేషన్ డాక్టర్లు ఉంటారు. అనగా ఇ.ఎన్.టి. హార్ట్, గైనకాలజి, న్యూరాలజి, ఐ, డయాబెటీస్, ఎండ్రోకనాలజిస్ట్, యూరాలజీ, ప్లాస్టిక్ సర్జన్ మొదలగు అవయవములకు మొదలగు డాక్టర్లు ఉంటారు. అలాగే తల, మెదడు, కళ్ళు, ముక్కు, చెవులు, గుండె, ఊపిరితిత్తులు, నరాలు, కాళ్లు, చేతులు, గోళ్లు, వెంట్రుకలతో సహా మనిషిలో ప్రతి అవయము పేరు పలుకుతూ ఆయాచోట్ల రోగం గాని రోగలక్షణాలు గాని లేకుండా తొలగించే మంత్రాన్ని ప్రతివారు నిత్యము జపించవలెను.

ఓం అక్షీభ్యాంతే నాసికాభ్యాం కర్ణాభ్యాం చుబుకాదధి
యక్ష్మం శీర్షణ్యం మస్తిష్కా జ్జిహ్వాయా వివృహామి తే
గ్రీవాభర్త ఉష్ణిహాభ్యః కీకసాభ్యో అనుక్యాత్
యక్ష్మం దోషణ్య అమంసాభ్యాం బాహుభ్యాం వివృహామితే
అన్త్రేభ్యస్తే గుదాభ్యో వనిష్టా హృదయాదధి
యక్ష్మం మతస్నాభ్యాం యక్నః ప్లాశిభ్యో వివృహామితే
ఊరుభ్యాం తే అష్టీవద్భ్యాం పార్ష్ణిభ్యాం ప్రపదాభ్యామ్
యక్ష్మం శ్రోణిభ్యాం భాసదాద్భంససో వివృహామితే
మేహనాద్వనం కరణాల్లోమభ్యస్తే నఖేభ్యః
యక్ష్మం సర్వస్మాదాత్మనస్తమిదం వివృహామితే
అజ్గాదుజ్గాల్లో న్మోల్లోన్మో జాతం పర్వణి పర్వణి
యక్ష్మం సర్వస్మాదాత్మనస్తమిదం వివృహామితే
పై శ్లోకమునకు ఈ క్రింది అర్థములను గమనించగలరు.

| | | |
|---|---|---|
| అక్షీభ్యాం | = | కళ్ల నుండి |
| తే | = | నీదయినటువంటి |
| నాసికాభ్యాం | = | ముక్కునుండి |
| కర్ణాభ్యాం | = | చెవుల నుండి |
| చుబుక | = | గడ్డము |
| యక్ష్మం | = | వ్యాధి |
| శీర్షం | = | తల |
| మస్తిష్కం | = | మెదడు |
| జిహ్వా | = | నాలుక |
| వివృహామి | = | పారద్రోలుట |
| గ్రీవం | = | కంఠం |
| కీకసాభ్యః | = | ఎముకల నుండి |
| అనూక్యాత్ | = | కీళ్ల నుండి |
| అమంసాభ్యాం | = | చేతుల నుండి |
| బాహుభ్యాం | = | ముంజేతులు |
| దోషణ్యం | = | అరచేతులు |
| అన్త్రములు | = | ప్రేగులు |

| | | |
|---|---|---|
| వనిష్టః | = | పొత్తికడుపు |
| మతస్నాభ్యాం | = | మూత్రపిండాలు |
| యక్నః | = | వృషణాల నుండి |
| ప్లాశిభ్యః | = | కడుపులోపలి భాగాలు |
| ఊరుపులు | = | తొడలు |
| పార్ష్ణిభ్యాం | = | మెకాళ్ల నుండి |
| ప్రపదాభ్యామ్ | = | అరికాళ్ల నుండి |
| శ్రోణి | = | నడుమభాగము |
| భాసధాత్ | = | వెనుక వైపు |
| భాంసనః | = | లోపలి అవయవాల నుండి |
| మేహనాత్ | = | జననాంగం |
| వనం కరణాత్ | = | మూత్రకోశం |
| లోమభ్యాః | = | వెంట్రుకల నుండి |
| నకేభ్యః | = | గోళ్ళు |

ఆరోగ్యం మహాభాగ్యము అని అన్నారు మంత్రశక్తితో వ్యాధులు కూడా తగ్గించవచ్చు. మంచి మనసూ, మంచి పరిసరాలు, మంచిశరీరము ఈ మూడు ఉంటే రోగాలు మన దగ్గరకు చేరవు. పై మంత్రము వలన ఆరోగ్యము చేకూరును. ఈ అక్షీభ్యాంతే సూక్తము ఋగ్వేదములోనిది.

## 57. వంశానుగత కర్మలు

మనము జ్యోతిషము గురించి తెలుసుకొనేముందు ఖగోళశాస్త్రము గురించి తెలుసుకొందాము. ఖగోళశాస్త్రము గురించి తెలుసుకొందాము. ఖగోళ, గణిత శాస్త్రాలలో ఆర్యభట్టు, వరాహమిహిరుడు, అపురూపమైన కొత్త విషయములను రూపొందించారు. క్రీ.శ. 499లో ఖగోళశాస్త్రంలో ఎన్నో మౌలికమైన సమస్యలను ప్రపంచము ముందుంచిన మొట్ట మొదటి శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టు, భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరుగుతుందని. చంద్రుడు భూచ్ఛాయలో ఉన్నప్పుడు గ్రహణము ఏర్పడుతుంది అని ఆర్యభట్టు తెలిపినాడు. సూర్యుడి చుట్టూ భూమి ఒకసారి తిరిగి రావడానికి పట్టేకాలము సౌరమానము ప్రకారము సంవత్సరానికి 365.558605 రోజులని తెలిపిన వారు ఆర్యభట్టు. బృహత్సంహితము రచించిన వరాహమిహిరుడు ఖగోళశాస్త్రాన్ని జ్యోతిష్య శాస్త్రంగా రూపొందించినారు.

భారతీయులు దశాంశ పద్ధతిని గణితంగా ఉపయోగించారు. భారతీయ గణిత శాస్త్రజ్ఞులకు సున్నా గురించి తెలుసు దీన్నే శూన్యాంక పద్ధతి అంటారు. ఈ పద్ధతి ఆధారంగా దశాంశ పద్ధతిని కనుగొన్న ఘనత గుప్తులకాలం నాటి మేధావు లకే చెందుతుంది. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు ఈ కాలంలో ప్రపంచప్రసిద్ధి చెందారు. మనిషి యొక్క మరణము మీద రాహువుకేతువు ప్రభావము ఉంటుంది. మనిషి మరణానంతరం పునర్జన్మ పొందుతాడనేది సనాతన ధర్మంలోని ప్రగాఢ విశ్వాసము. కర్మకు, జ్యోతిషానికి అవినాభావ సంబంధము ఉంది. పూర్వజన్మలోని కర్మలఫలాన్ని ఈ జన్మలో అనుభవిస్తాము. జీవుడు తాను చేసినపాప పుణ్యముల ఫలితంగా సుఖదుఃఖాలను అనుభవించడానికి కాలం నిర్ణయింపబడి ఆయాసమయాల్లో ఆయాప్రాంతాల్లో ఆయా కుటుంబాల్లో జన్మిస్తారు అని కర్మసిద్ధాంతం చెపుతుంది. ఒక వ్యక్తి చేసిన కర్మల ఫలాన్ని ఆ తర్వాత ఐదుతరాలు అనుభవించాల్సి వస్తుంది. కర్మఫలాన్ని అనుభవించడానికి మానవుడు స్వర్గం లేదా నరకాన్ని చేరతాడు. శుభకర్మఫలం స్వర్గమైతే, అశుభ కర్మల ఫలమే నరకమని మన ధర్మం ప్రతి జీవధారికి (మానవుడు) ఏడు తరాలతో గరిష్ఠ సంబంధం, 21 తరాలతో గౌణ సంబంధము ఉంటుంది. ఆ విధంగా ప్రతి శిశు వు జన్మ 84 సహపిండాలతో జరుగుతుంది. వీటిలో 28 సహపిండాలు తనవి మిగిలిన 56 పిండాలు తనకు ముందున్న ఆరుతరాలవి వీటిలో 15 తండ్రివి, 10 తాతవి, 6ముత్తాతవి, 3 ముత్తాత తండ్రివి, 1 ముత్తాత తాతది. ఈ విధంగా ప్రతి వ్యక్తిలోనూ తనతోకలిసి ముందటి ఏడుతరాల అంశాలతో సంబంధం ఉంటుంది.

భౌతిక దేహమును విడిచిన జీవునకు చేయు కర్మలే అపరకర్మలు ఈ కర్మలకు అధికారము కల గ్రహములు రాహుకేతువులు. మరణించిన వానికి శ్రాద్ధకర్మలు నిర్వర్తించుట ధర్మము మరణానంతరము జీవుడు పునర్జన్మపొందే వరకు అనేక విధములుగా పాంచ బౌతిక దేహమునకై వెతుకును. ఆత్మ ఘోషిస్తాడు. జరుగుతున్న విషయాలు తెలుసుకొంటాడు అయితే ఆ జీవి ఆవేదన మాటలు మనకు వినిపించవు. ఆ ఆత్మకు ఉత్తమగతులు ప్రసాదించుటకై మనము మన పితృ, పితామహ, మాతృ, మాతామహ మొదలగు బంధువులందరికి చనిపోయిన వారికి శ్రాద్ధ కర్మలు నిర్వర్తించుట మన ధర్మము. శ్రద్ధవహించి చేయునది శ్రాద్ధము. చనిపోయిన వాళ్లందరు ఉత్తమగతులు పొందాలంటే శ్రాద్ధకర్మలు ఆచరించవలెను. పితృ దేవతల కర్మలను ఆచరింపకబోవుట మంచిది కాదు. పితృదేవతల కర్మలు నిర్వహించక పూర్తిగా విస్మరించేవారిని గరుడ పురాణమందు భ్రష్టాచారులుగా

వర్ణించినారు. ఇలా చేయకపోవటము కూడా అవయోగము. ఆత్మ బయటకు వెళ్లి పోయినప్పుడు నుండి కర్మల వరకు తద్దినాల వరకు అనగా నిత్యకర్మ నుండి షోడష మాసికములు, సంవత్సవిమోకము వరకు మరియు ప్రతి సంవత్సరము పెట్టే ఆబ్ధికములను మరియు అనాధప్రేత దహన సంస్కారములన్నియు రాహుకేతువుల వలనే జరుగును. పితృదేవతల కర్మలు చేయనిచో దుష్ప్రభావములు కల్గును. వచ్చే జన్మలో అయినా అనుభవిస్తారు. మానవులు పితృదేవత కర్మలు చేయనిచో రాహుకేతువుల మహర్దశ, అంతర్ధశ, విదశల యందు పితృదేవతల ఆగ్రహమునకు గురి అవుతారు. పితృదేవతల కర్మలె నిర్వర్తించనివారికి రాహుకేతువుల దశాంతర్దశలో శృంగభంగము తప్పదు.

ఏకాదిష్ఠ, హేమ, పార్వణ సిద్ధాంత శ్రాద్ధములలో ఏదైన ఒక పద్ధతిలో పితృకార్యాలు చేయవలెను. విశ్వదేవతలు పదమూడు మంది అవి:

1) క్రతు, 2) దక్ష 3) సత్య, 4) వసు 5) ధూలి 6) రోచన 7) పురూవర, 8) ఆర్ద్రన 9) కాల, 10) కామ 11) ధమరుచి, 12) రుద్ర, 13) విలోచన విశ్వేదేవతలను ఆహ్వానించి పూజించి ఆరాధించవలెను. ఇట్టి కర్మలను నిర్వర్తించుట మానవుని విధి.

## 58. ద్వాదశ భావములు

జ్యోతిష శాస్త్రములో మానవుని భూత, భవిష్యత్ వర్తమాన కాలములు ధనము, సోదరులు, గృహయోగం, మాతాపితరుల, శతృవుల, విద్య, విదేశీయగమనం, ఆయుష్షు, మనస్తత్వం, వివాహము, సంతానము, వృత్తి, ఖర్చులు, వ్యాధులు మొదలగు అన్ని విషయాలు తెలుసుకోవాలంటే ద్వాదశ భావములు ముఖ్యము. ఈ జ్యోతిష శాస్త్రములో ముఖ్యముగా రెండు భాగములు ఉన్నవి.

1) గణితభాగం (Mathematical Part)

2) ఫలిత భాగం (Prediction Part)

ఈ ఫలిత భాగంలో జన్మలగ్న కుండలి ముఖ్యం దీనిని బట్టి ద్వాదశ భావములను మరియు దృష్టి, శత్రు, నీచ, ఉచ్ఛ, గ్రహములు, రాశులను వివిధ రకాలయోగములను మొదలైనవి అన్నీ పరిశీలించి ఫలతములను. విశదీకరించవలెను. మానవ జీవిత విషయములు రాశికుండలి యందు ద్వాదశ భావాలలో నిక్షిప్తమై ఉన్నాయి.

**ప్రథమభావము:**

ఈ భావమును తను భావముగా వ్యవహరిస్తారు. దీని ద్వారా ఆరోగ్యము, శరీరము, జ్ఞానము, కీర్తి, సుఖము, కష్టము, సౌందర్యము, జన్మస్థలము, బలము,

దుర్బలము, ఆకార సౌష్టవము, అభిమానము, పౌరుషము, చర్మము, నిద్ర, ధనము దొంగిలించుట స్వభావము, అపకీర్తి, వర్ణము, వైరాగ్యము రాజనీతి, ఆయుర్దాయము, తల్లిఉద్యోగము తమ్మని లాభములు మొదలైన అంశాలు విశ్లేషించబడుతాయి.

**ద్వితీయభావము:**

ఈ భావమును ధనము లేక కుటుంబ భావముగా వ్యవహరిస్తారు. దీని ద్వారా ధనము, వాక్కు, స్నేహము, నేత్రము, కుటుంబము, ముఖము, కుడికన్ను, భోజనము, అమ్మట, దానము, చదువు, ధాన్యము, వినయము, ముత్యములు, లోహము, బంగారము, రత్నములు, వస్త్రము, కోపము, కపటము, రాకపోకల విధానము, ఏనుగులు గుర్రము, ముఖకవళికలు, రోజువారి ఆదాయము, మృదుభాషణ, ఔధార్యము, తేజస్సు, శాంతము, పరోపకారం, స్థిరత్వం భోగం మొదలగున విషయాలన్నీ విశ్లేషించవచ్చు.

**తృతీయ భావము:**

ఈ భావమును భ్రాతృభావముగా వ్యవహరిస్తారు. దీనిద్వారా సోదరులగురించి, మిత్రులు, అక్క చెల్లెళ్లు, ధైర్యము, పరాక్రమము, కంఠస్వరము, మైత్రి, సాహసము, కోపము, వీర్యము, బలము, ఆభరణము, విషభక్షణము, ఉపాయము, చెవులు, బాహువులు, దాసదాసీజనము, అహం భావం, యుద్ధము, మార్గము, మనస్సు, సామర్థ్యము, స్వప్నము, బంధువులు, వినోదము, వార్తలు, మనో అభిరుచి, ఆయుష్షు, మామగారు, తండ్రి, వివాహ విషయాలు. దళారులు, ఏజెంట్లు, కమ్యూనికేషన్లు, రేడియో, టెలిఫోన్లు, అగ్రిమెంట్లు, వేలి ముద్రల శాస్త్రం, హస్తసాముద్రికము, హ్యాండ్‌బ్యాగ్‌లు, క్రికెట్, టెన్నిస్, పెన్సిల్స్, పెన్నులు పోస్టల్ సర్వీస్, పోస్ట్‌మ్యాన్, వాచీలు, కాలము, వాయువు, రైల్వేలు, రైలుమార్గము, దస్తూరీ, పుస్తకములు, ఎడిటర్‌లు, అకౌంట్సు, చెక్స్, ఆక్సిజన్, విమానములు, ప్రైజ్‌లు, లాటరీలు, రిజిస్ట్రేషను, వ్యాసములు, కథలు, చెవిటి యంత్రములు, ఆడవారు ధరించే ఆభరణములు, రోడ్డు రవాణా సంస్థలు, ఊపిరితిత్తులు, ఎర్రకణాలు, గదులు, కుర్చీలు, వ్రాతబల్లలు, తీర్థయాత్రలు, ప్రయాణములు, భూములు, ప్రింటింగ్‌ప్రెస్‌లు, ఇంక్ మొదలగు విషయములు.

**చతుర్థభావము:**

ఈ భావమును మాతృభావముగా వ్యవహరిస్తారు. దీనిద్వారా తల్లి, గృహము, భూమి, వాహనము, వంశము, మిత్రులు, విద్య, కృషి, బంధువులు, స్కూలు

చదువు, నదులు, పాలు, నీరు, బావులు, చెరువులు గృహస్థలములు, సుఖము, తోటలు, గృహప్రవేశము, దున్నపోతు, గుర్రములు, గేదెలు, పాతాళము స్థానభ్రంశ, పౌరాణి, వివాదములు, కుటుంబాభివృద్ధి, ద్వార, శయ్య, గుట్టములు, పశువులు, ఏనుగులు, వాపీ, కూప, తటాక, పుస్తక, సాక్షి, గృహభోగములు, చెమట, వరి, సుగంధము, పాలకేంద్రములు, శత్రువుల లాభములు, నీటిపారుదల, కాలువలు, ప్రాజెక్టులు, వాస్తుశాస్త్రము, తండ్రిఆయుష్షు, వ్యవసాయము, గృహనిర్మాణము, విద్యా సంస్థల భవనాలు, పరీక్షలు, భార్యభర్తల ఉద్యోగములు, తమ్ముని లేక చెల్లెలు కుటుంబము మరియు ధనము, కుమారుడు లేక కుమార్తె ఖర్చులు, స్నేహితుని వ్యాధి ప్రతిపక్షాలు, కిరోసిన్, డీజలు, పెట్రోలు, కంపెనీలు, ఎరువులు, భర్తయొక్క స్థిరాస్థులు, పైపులు, జలాశయములు, ఓవర్‌హెడ్ టాంక్‌లు, ఓడలు, జలాంతర్గాములు, స్టీమరులు, వంతెనలు, స్విమ్మింగ్ పూల్స్, మేనమామ మొదలగునవి.

**పంచమభావము:**

ఈ భావమును సంతాన భావముగా వ్యవహరిస్తారు. దీని ద్వారా సంతానము, జ్ఞానము, మేధాశక్తి, గ్రంథరచన, కవిత్వము, దురాలోచన, వినయం, రహస్యం, క్షేమం, పాండిత్యము, అన్నదానం, మంత్రోపాసన, మంత్రజపం, గాంభీర్యము, వివేకము, శుభలేక, తండ్రి యొక్క పుణ్యము, మంత్రి, శిల్పములు, గర్భము, దేవతానుగ్రహము, ప్రజ్ఞ, ఉపాయము, వాయిద్యము, కోరికలు, దురాలోచన, అక్రమ సంబంధములు, భార్యవలన ధనము, ఉపాసన శక్తి, స్నేహము, వివేకజ్ఞానము, విద్య, ఘనత, గర్భాశయము, చదరంగం, క్రీడలు, యాజమాన్యం, సంస్థలలో మేనేజర్లు, ప్రభుత్వ అధికార్లు, వ్యాపార లాభములు, గుండెజబ్బులు హృదయ సంబంధ వ్యాధులు, కార్డియాలజి, సినిమాలు, రంగస్థలములు, నటన, స్పీకరులు, రేడియోలు, టేప్‌రికార్డులు, హోమములు, మంత్రోపదేశము, జపము, తపము, దైవభక్తి, కర్మలు, అగ్ని, వేదవిద్యల అధ్యయనం. వ్రతములు పూజలు, వంటిల్లు, లాటరీలు, జూదములు, పాటలు, డాన్సులు, ఎలక్ట్రానిక్స్, బుద్ధికుశలత, ప్రేమ వ్యవహారాలు, మంగళవాద్యం, శత్రువులకు నష్టము, గురువులు, స్నేహితుని భార్యలేక భర్త లెక్చరర్ లేక ప్రొఫెసర్, భార్య యొక్క స్నేహితులు, భార్య అక్కగారు లేక పెద్దన్న, తండ్రి, నాయనమ్మ వచ్చే జబ్బులు, మొదలగు విషయములు.

**షష్ఠమభావము:**

ఈ భావమును శతృభావముగా వ్యవహరిస్తారు. దీని ద్వారా శత్రువుల గురించి అకాలభోజనము, దీర్ఘరోగములు, లోభము, కారాగృహము, కపటము, అల్సర్, మూత్రవ్యాధి, అతిసార వ్యాధి, అజీర్ణము, అసిడిటీ, కడుపు నొప్పి, కఫము, కురుపులు, మశూచి, పిచ్చి, మేహము వలన వచ్చు వ్రణములు, క్షయ, మనోవ్యథ, కంటిజబ్బులు, ఉష్ణ, విఘ్నము, యుద్ధప్రాప్తి ఆయాసము, అప్పు, బహుజనద్వేషము, అపవాదము, బిచ్చము ఎత్తడం, కీర్తిఋణము, పీడ, దుఃఖము, కలహములు, దాసీత్వము, చోర, చెరసాల, సోదరులతో తగాదాలు, సేవకలు, నర్సులు, మత్తు పదార్థములు, నీచత్వము, ఆస్తి నష్టము, తండ్రి ఉద్యోగం, భార్యకు దీర్ఘరోగము, భార్య, అంత్యక్రియలు, తల్లి నుండి వచ్చు ఆస్తి నష్టము, నిద్రలేమి, శ్రమచేయుట, చాకిరీ, కూలీలు, లోభత్వము, వేరొకరి ధనముపై ఆకర్షణ, ఈర్ష్య, మాతామహుని ఆస్తి నష్టము, వైద్యవిద్య, ఏజంట్లు, మందులు మొదలుగునవి పరిశీలించవలెను.

**సప్తమభావము:** ఈ భావమును కళత్ర భావముగా వ్యవహరిస్తారు. దీని ద్వారా భార్యభర్తల గుణ, రూపములు, దాంపత్య విషయములు కళత్ర విషయములు, పరస్త్రీలేక పరపురుషులతో సంగమం, శృంగారము, శయ్యాది భోగములు, అలంకారము, వాణిజ్యము, కలహములు, అభిరుచి, దానము, జయము, సంగీత, సాహిత్య, నృత్య కళలయందు, ఉద్యోగము, వ్యభిచారము, పురుషునకు భార్య, స్త్రీకి భర్త గురించి, కామము, ద్వేషము, సుగంధము, విందుభోజనము, తాంబూలము, ప్రయాణం, వీర్యము, గుహ్యము, మూత్రము, వర్తకము, నీరు, ఆకాశప్రయాణము, దానం, వాదము, రతిక్రీడ, అన్యదేశము, దత్తపుత్రుడు, రహస్యం, దొంగతనం, అమ్మమ్మ, తల్లికి చెందిన స్థిరాస్తులు, ప్రేమ, వ్యాపారములో భాగస్తులు, మూత్రపిండములు, కోర్టు, న్యాయము, తమ్ముని లేక చెల్లెలు సంతానము, మూత్రపిండములు, శత్రువిజయము, విరాళము, జనేంద్రియములు పెదనాన్న, మేనత్త మొదలగు విషయములు.

**అష్ఠమ భావము:**

ఈ భావమును ఆయుర్ధాయభావము అందురు. దీని ద్వారా ఆయుష్షు వ్యాధులు, కళత్ర నష్ఠము, మరణం, నాశనము, పరాభవము, దుఃఖము, ఋణము, జీవనోపాయము, మోక్షము, గుహ్యము, శిరచ్ఛేదము, క్రూరము, జాడ్యము, దండన, కష్ఠము, విషము కలిపిన భోజనము, మేహము, తమ్ముని శత్రువులు, మరణించిన వారి ధనము, రాజదండన, బద్ధకము, కళత్రపీడనము, దుర్మార్గుల ఆగడాలకు,

శత్రువు ఇల్లు, మనస్సునకు స్థిమితము లేకపోవుట, అవయవలోపం, భయము, భార్యయొక్క ధనము, యజ్ఞభంగము, ప్రమాదములు, మలము, పంటివ్యాధులు, తండ్రివ్యయము, తండ్రి ప్రాణగండములు, గొడవలు, విషము, రక్తం చెడిపోవుట, ధర్మ కార్యములు భగ్నము, నిష్టజపతపాదులు, మాంగల్యము, మానసికవిచారము, అశుచి మొదలగు విషయములన్నియు.

**నవమ భావము:**

ఈ భావమును పితృభావము లేదా భాగ్యభావము అందురు. భాగ్యము, పితృ, గురువు, దేవతాభక్తి దానము, ధర్మము, తీర్థయాత్రలు, పట్టాభిషేకము, విద్య, వాహనము, పుత్రులు, ఏనుగులు, గుర్రములు, పుణ్యము, చిత్తశుద్ధి, తండ్రి ధనము, మనుమడు, ఐశ్వర్యములు, అభిషేకములు, యజ్ఞములు, వైదిక కర్మలు, విద్యావిషయము,న్యాయము,దానము,ధర్మము, బ్రాహ్మణునికి సేవ, న్యాయ సూత్రాలు, సన్యాసము, తమ్ముని భార్య, మరదలు లేక బావమరది, తల్లిరోగము, మధ్యవర్తి, న్యాయవాదులు, జడ్జీలు, హుండీలు, ట్రష్టులు, దేవాలయ ధర్మాదాయ శాఖలు, రాజకీయం, మతగురువులు, యూనివర్సిటీ, రిసెర్చ్, పి. హెచ్.డీ, లెక్చరర్స్ లేక ప్రొఫెసర్, పూజలు పునస్కారములు మొదలగు అన్ని విషయములు.

**దశమ భావము:**

రాజ్యము, కర్మస్థానము, గౌరవము, కృషి, వృత్తి, ఉద్యోగము, వ్యాపారము, జీవనము, నిధి, దత్తపుత్రుడు, రాజసన్మానము, యజ్ఞము, ప్రభుత్వము, యోగ్యత, తీవ్రవాంఛ, లౌకిక కార్యకలాపాలు, బాధ్యతలు, కీర్తి, ప్రతిష్ఠలు, ప్రమోషన్, తల్లిదండ్రులకు చేసే ఉత్తరక్రియలు, మతసంబంధమైన కలాపాలు, తీర్థయాత్రలు, గౌరవజీవనము, శరీర వ్యాయామక్రీడలు, గుర్రపుస్వారీ చేయుట, దత్తపుత్రుడు, మేధాశక్తి, ధైర్యసాహసాలు, తల్లిదండ్రుల మారకస్థానము, వ్యాపారభాగస్వామి లేదా వివాహం చేసుకున్న భార్యలేక భర్తవాహనము, దేశవాణిజ్యము, ఎన్నికలలో తమ్మునికి అపాయం, ప్రత్యర్థుల విషయం, తండ్రిధనము, తల్లిపేరున చేయు వ్యాపారము, రాజుచే సన్మానింపబడుట, ముద్రాధికారము, మంత్రతంత్రములలో సిద్ధిని సాధించుట,శీలము,ఆజ్ఞ, అత్తగారు, పుత్రరోగము, స్నేహభంగము కలుగును. ఈ భావము రాజ్యభావము లేక కర్మభావము లేక వృత్తి భావము అందురు.

**ఏకాదశభావము:**

ఈ భావమును లాభస్థానముగా వ్యవహరిస్తారు. లాభములు, జ్యేష్ఠసోదరుడు, పిన, పెదతండ్రులు, విద్య, ధనము, నష్టద్రవ్యము, శివదీక్ష, జయము, ఆయువు,

ఆశలు, కోరికలు, భాగస్వామ్యము, విదేశాల వారి సయోధ్యతో పని చేయటము పనుల్లో జయం, ఎన్నికలు, ఆరోగ్యం, చట్టవ్యాపారము శ్రేయోభిలాషులు, కులవర్గాలకు చెందిన వారు ధర్మ సంస్థలు, స్నేహబంధము ప్రయత్నములు, సంప్రదాయ భిన్నమైన కార్యకలాపములు, తండ్రిసోదరులు, దైవభక్తి, బావగారు, తల్లి, ఆయుష్షు, మంత్రిపదవి, వార్త, సంతోషకరమైన, ఆస్తి, పలుకబడి, భాగ్యోదయము, భార్య ప్రేమికుడు లేక భర్తప్రియురాలు, అనురాగము, వడ్డీవ్యాపారము, చిత్రలేఖనము, మామగారి వల్ల లాభము, కోడలు, అల్లుడు, తాతముత్తాతల ధనము, దేవతలను పూజించుట, అంతర్జాతీయ స్నేహాలు, శత్రుజయము, దీర్ఘప్రయాణాలు, ఫర్నీచర్, నగలు, ఏనుగులు, గుర్రాలు, అలంకారం, ప్రభుత్వఋణాలు, విద్యుత్తు కంపెనీలు, గ్యాస్, వ్యవసాయము, భార్యభర్తయొక్క వినోదాలు, తండ్రిగారి దగ్గర ప్రయాణాలు, మ్యూజియము, నీటిపారుదల, ప్రభుత్వపాలసీలు, కార్పోరేషన్లు, మున్సిపాలిటీలు, పంచాయితీలు, పార్లమెంట్, లోకసభలు కలవు.

**ద్వాదశభావము:**

ఈ భావమును వ్యయస్థానము అందురు. వ్యయము, పాపము, మోక్షము, నరకము, వివాహహాని, శృంఖలము, చిత్తవికలము, అన్యదేశగమనము, జారత్వము, శయనము, శత్రువులు, వామనేత్రము, భయము, ఉద్యోగము పోవుట, శత్రువులకు సంకెళ్లు, పితృసంబంధమగు ఆస్తి, వాధించుట, కోపము, భార్యకు అనారోగ్యము, అంగవైకల్యము. పీడ, త్యాగము, దీనము, పడకగది, మంచము, ఎడమకన్ను, తల్లిదండ్రులను, సోదరులను కష్టపెట్టుట, భార్యయొక్క శత్రువులు, అపకీర్తి, నిద్రశవము, స్మశానము, రహస్యగూఢాచారులు, అంత్యక్రియలు, తల్లితండ్రి, కొడుకులేక కూతురి ఆయుష్షు, వైద్యాలయములు, ఓడలో ప్రయాణము, జైళ్లు, ఉరి,వ్యాపారములలో నష్టము, పెట్టుబడి సముద్రపు దొంగలు, రాయబారులు, జీవితంలో కష్టాలు,అతీంద్రియ విషయాల పరిశోధన దేశ బహిష్కారము, శానిటోరియం, దేశద్రోహము, రాజకీయ హత్యలు, మానభంగము, విషపు ఆహారము తినుట, దొంగవ్యాపారములు, ధానధర్మములు ఈ భావము తెల్పును.

## 59. రాహుకేతువుల వామా దక్షిణాచారములు

రాహుకేతువులకు రెండు ఆచారములు కలవు అవి 1) వామాచారము 2) దక్షిణాచారము. ఇవి రాహు కేతువులకు సంబంధించినవి తంత్రశాస్త్రంలో వామాచారము రాహువుకు సంబంధించినది. అలాగే మంత్రశాస్త్రంలో దక్షిణా చారము కేతువుకు సంబంధించినది. మడి,ఆచారము, నిష్టలతో కూడినది

దక్షిణాచారము. శుచిగా, శుభ్రంగా, అనగా స్నానము, మడికట్టుకోవటం. సాత్విక ఆహారము, వేదమంత్రములతో గృహములో దేవతార్చనలు మరియు యజ్ఞ యాగాదిక్రతువులు, అభిషేకములు, వ్రతములు నిర్వహించటము ఎంతో నియమ నిష్ఠలతో మనము పూజలు చేస్తే అంతఫలితము ఉంటుంది. దీనిని చేయటానికి ఎంతో శక్తి అవసరము సాధకుడు నియమనిష్ఠలు పాటించేతీరు. మనము అనుసరించే విధానమును బట్టి ఫలితము ఉంటుంది. ఈ ఆచారము మంత్రజ్యోతిష శాస్త్రమునకు సంబంధించినది. ఇది కేతువు గ్రహమునకు సంబంధించినది.

రెండవది వామాచారము. తంత్రశాస్త్రములో వామాచారము రాహువుకి సంబంధించినది. దీనికి శుచి, శుభ్రత అవసరము లేదు. స్నానము మడిబట్టలు, సాత్వికాహారము అవసరము లేదు మాంసము, మద్యం, నిర్జనమైన ప్రదేశాలు గుహలు, శిధిలమైన ఇండ్లు, స్మశానము ఈ తంత్ర శాస్త్ర ప్రక్రియలకు రాహువు అధిపతి. ఎన్ని నియమనిష్టలతో మడిబట్టలతో ఎంతో ఆచారవంతముగా మనము పూజలు చేసిన భగవంతుడు కరుణిస్తారా? తొందరగా అనుకున్న శక్తులు వశమవుతాయ? అని దక్షిణాచారము గురించి ఆలోచిస్తారు కొందరు. ఈ వామాచారము దక్షిణాచారము కంటే తేలిక. అని భావిస్తే పొరపాటు. ఇది మంచి మార్గము అనే భావించే వారు ఉన్నారు. ఇది పూర్తిగా పొరపాటు అభిప్రాయము. అ వామాచారమునకు ఎంతో ధైర్యము, ఏకాగ్రత, చిత్తశుద్ధి కావాలి. ఎంతో ధైర్యము అగ్నిపరీక్షలకు ఎదురీదాలి. అన్ని విషయాలకు తట్టుకొని నిలబడాలి. వీటి అన్నింటిని వామాచార పద్ధతిలో సిద్ధిసాధించడం అంత సులభమైనది కాదు. ఎక్కడైన పొరపాటు జరిగితే అన్ని రకముల కష్టములు కల్గును. శక్తులు రాకపోగా దరిద్రములు సంభవించును. అశుభ్రంగా ఉండి అశుచియైన జాతక కర్మలను నిర్వర్తించుచూ ఉండే కన్నా వేదశాస్త్రములు, ఉపనిషత్తుల నియమములకు లోబడి సదాచారము, మంచి ఆహారము మంచిమార్గములో అనుసరించి ఉత్తమ ఫలితములను పొందుట మంచిది. మంచి శాఖాహారపు అలవాట్ల వలన మరియు ఉపాసన, అనుష్టానము వలన సాత్వికత్వము ఏర్పడి మంత్రజపముల వలన మంచి శక్తులు ఏర్పడుతాయి.

## ౬౦. అనులోమ కాలసర్పయోగము

**నిర్వచనము:** జాతక చక్రములో జన్మలగ్నము నుండి అస్థానాలలోపల రాహువు ముందువైపు ఉండి సప్తగ్రహముల వెనుక కేతువు ఉంటే అనులోమ కాలసర్ప యోగము అందురు.

## అనులోమ కాలసర్పయోగము స్వరూపము

| రాహువు | | | |
|---|---|---|---|
| చంద్ర | అనులోమ కాలసర్పయోగం | | |
| శని | | | |
| గురువు కుజుడు | బుధుడు రవి | లగ్నం శుక్రుడు | కేతువు |

పై జాతకచక్రములో గ్రహములు అనగా సప్తగ్రహములు ఉదాహరణకు మాత్రమే వ్రాసాము రాహుకేతువుల స్వరూపాన్ని చూడాలి. అనులోమ కాలసర్ప యోగము వల్ల జీవితంలో అత్యున్నతస్థాయికి వెళ్లుతారు. ఒకదశలో వెళ్లిమరొక దశలో కొద్దిగాతగ్గుతారు. వృత్తిలో విజయం సాధిస్తారు.

## 61. కాలసర్పయోగముపై శ్లోకముల వివరణ

కాలసర్పయోగముపై వివిధ రకముల శ్లోకములు గలవు అవి ఈ క్రింది శ్లోకములు అర్ధములు ఇస్తున్నాము.

1) శ్లో॥ అగ్రే రాహు రథౌ కేతుః మధ్యే సప్త గ్రహౌ తథా।
యది కాలసర్పాఖ్యయోగాయా నృపరాష్ట్ర వినాశనమ్॥

పై శ్లోకమును ననుసరించి అగ్రభాగాన రాహువు (పైభాగమున) అధోభాగ మున కేతువు (క్రింద భాగమున) అనగా ముందు భాగమున రాహువు వెనుక భాగమున కేతువు ఉండి రాహు కేతువుల మధ్య సప్తగ్రహములు ఉన్నచో కాలసర్ప యోగము ఏర్పడును ఈ యోగము వలన దేశములకు రాజులకు అరిష్ఠము జరుగును.

2) శ్లో॥ అగ్రే రాహు రథో కేతుః మధ్యే షడ్గహౌ యది।
కాలసర్పాఖ్య యోగోయం। నృపరాష్ట్ర వినాశనం॥

పై శ్లోకమును ననుసరించి రాహు కేతువుల మధ్యలో ఆరు గ్రహాలు ఉన్నను కాలసర్పయోగం ఏర్పడును. (చంద్రుడు మినహా) దీని వలన దేశాలమధ్య యుద్ధములు రాజులు రాజ్యాలు నాశనమగును.

3) శ్లో॥ అగ్రేరాహు రథః కేతుః గర్భస్తే గ్రహసప్తకే

కాలసర్పాఖ్యా యోగోయం నృపాణ సమరం భవేత్॥

పై శ్లోకమును ననుసరించి ముందు భాగమున రాహువు వెనుక భాగమున కేతువు ఉండి మధ్యభాగమున సప్తగ్రహములు ఉన్నచో కాలసర్పయోగం ఏర్పడును. దీనివలన రాజులకు యుద్ధములు జరుగును. ప్రజానష్టం అశాంతి ఏర్పడును.

4) శ్లో॥ అగ్రేరాహుః రథోకేతుః సర్వేమధ్యే గతగ్రహాః

కాలసర్పాఖ్య యోగోయం నృపరాష్ట్ర వినాశకృత్

పై శ్లోకమును అనుసరించి రాహుకేతువుల మధ్య అన్ని గ్రహములు ఉంటే కాలసర్పయోగం ఏర్పడును. దీనివలన రాష్ట్రాలు వినాశనమగును.

5) శ్లో॥ అగ్రే రాహుః అథః కేతు ర్మధ్యేచ గ్రహసప్తకం।

కాలసర్పాఖ్యా యోగోయం నృపాణాం సమరం భవేత్॥

పై శ్లోకమును ననుసరించి కూడ రాజుల మధ్య పరస్పర యుద్ధములు జరుగును. రాజ్య సంక్షోభము కలుగును.

6) శ్లో॥ అగ్రే రాహుః అథః కేతు గర్భస్తే గ్రహసప్తకే

యోగాయం కాలసర్పాఖ్యాం నృపసస్య వినశ్యతి

పై శ్లోకమును ననుసరించి కూడ రాజులు నశింతురు, పంటలు నష్టమగును.

7) శ్లో॥ అగ్రే కేతు రథా రాహుః। గర్భస్తే సప్తకే తథా

యది అపసవ్య కాలసర్పాఖ్యా దోషోయం నృపాణాం సమరంభవేత్॥

పై శ్లోకమును ననుసరించి అగ్రభాగమున కేతువు అధోభాగాన రాహువు ఉంటే అపసవ్య కాలసర్పయోగము ఏర్పడుతుంది. దీనివలన దేశమునకు అరిష్టము వాటిల్లును.

8) శ్లో॥ అగ్రే వా చేతు పృష్ఠతో ప్రత్యేక పార్శ్వే ।

భాతాష్ఠకే రాహుకేత్వోన ఖేటః ।

యోగ ప్రోక్త సర్పశ్చ తస్మిన్న్ జీతో జీతః।

వ్యర్థ పుత్రర్తి పీయాతు ॥

రాహుకేతు మధ్యే సప్తో విఘ్నాహ కాలసర్ప సారికః।

సుతయాసాది సకలదోష రోగేణ ప్రవాసి చరణం ధృవమ్॥

కాలసర్పయోగస్థ విషవిషాక్త జీవనె భయావహ పునఃపునరపి శోకంచ యోషణె రోగాంతాధికం పూర్వజన్మకృతం పాపం బ్రహ్మశాపాత్ సుతక్షయః కించిత్ ధృవమ్॥

పై శ్లోకానుసారంగ కాలసర్పయోగ జాతకులకు, విఘ్నములు రోగములు ప్రవాసత్వం భయములు దుఃఖ శోకములు అభివృద్ధి ఆటంకములు సుత ఆయాసములు సంతాన నష్టం జీవన్మృత్యుభయాధికములు కలుగుచుండును. ధననష్ఠ గౌరవ హీనములు కలుగుచుండును.

## 62. విలోమకాలసర్పయోగము

**నిర్వచనము:** జాతక చక్రములో జన్మలగ్నము నుండి 6(ఆరు)స్థానాల లోపల కేతువు ముందువైపు ఉండి సప్తగ్రహముల వెనుక రాహువు ఉంటే విలోమ కాలసర్పయోగము అందురు.

| కేతువు | | | |
|---|---|---|---|
| | విలోమ కాలసర్ప యోగం | | |
| గురువు | | | |
| చంద్ర | కుజుడు శుక్రుడు | లగ్నం, రవి, శని, బుధ | రాహువు |

పై జాతకచక్రంలో గ్రహములు అనగా సప్తగ్రహములు ఉదాహరణకు మాత్రమే వ్రాసాము రాహుకేతువుల స్వరూపాన్ని చూడాలి. విలోమకాలసర్పయోగము వల్ల జీవితంలో అనేక కష్టములు ధననష్టం, అపశృతులు కలుగును. చెడు ఫలితాలు కలుగును.

## 63. వంశానుగత, నవాంశ కాలసర్పయోగములు

కాలసర్పయోగం, సర్పయోగములు ఎందుకు ఏర్పడుతున్నాయి అంటే మన శాస్త్రములో అనేక విధములుగా చెప్పడం జరిగినది. వంశానుగతమైన కర్మములను బట్టి ఈదోషము ఏర్పడును. వంశానుగతకర్మలు అనగా పిత్ృ, పితామహ,

ప్రపితామాహ, మాతా, మాతామహుల నుండి ఈ సర్పదోషము వస్తుంది. తాత, ముత్తాతల వల్ల జరిగిన అపచారము వల్ల జాతకుడు సర్పదోషానికి గురి అవుతారు. స్వయంకృత అపచారముకావచ్చు, పూర్వజన్మ కృత అపచారము కావచ్చు జాతకంలో సర్పదోషము ఉంటే రాహుకేతువులు విషయోగమును ఇస్తారు.

అగ్రభాగమున రాహువు అధోభాగమున కేతువు ఉండి మధ్యలో షష్ఠగ్రహ ములు ఉంటే అది సవ్యకాలసర్పదోషము. అగ్రభాగమున కేతువు అధోభాగమున రాహువు ఉండి మధ్యలో సప్త(7) గ్రహములు ఉంటే అది అపసవ్యకాలసర్ప దోషము అవుతుంది, అగ్రభాగమున రాహువు అధోభాగమున కేతువు ఉండి సప్త (7) గ్రహములుంటే అది కాలసర్పయోగము ఏర్పడును, లగ్నము లేక లగ్నాధిపతి బైటపడిన ఎడల ఈ యోగము ప్రభావము తగ్గును. సవ్య, అపసవ్య కాలసర్పదోషములు వంశానుగతముగా ప్రాప్తించును. జాతకచక్రంలో కాలసర్పయోగం ఏఏ భావముల మీద పడుతుందో ఆ భావములు చెడిపోతాయి. మరణానంతరం కూడా జీవునిపై ఈ సర్పదోష ప్రభావములు ఉంటాయి. జాతకచక్రమందు అనేక యోగము లుండి నవాంశమునందు కాలసర్పదోషము ఉంటే ఫలితములు తారుమారు అవుతాయి. నవాంశంలో కాలసర్పదోషము చూడకుండా జాతకచక్రమంలో ఫలితములు చెప్పడం వల్ల ఫలితములు మారుతాయి. సర్పదోషమును నవాంశములో కూడా పరిశీలించవలెను. శుభగ్రహదృష్టి లేని కారకాంశయందు జన్మలగ్నాధిపతి (లేక) దశమాధిపతితో కేతువు చేరితే కూడా సర్పయోగం ఏర్పడును. లగ్నకాలసర్పదోషము, లగ్న అపసవ్యకాల సర్పదోషం, లగ్న లగ్నసవ్యకాలసర్పదోషం, మిశ్రమ కాలసర్పదోషములు ఉన్నాయి. సవ్యకాలసర్పదోషములు రాహువు అనుసరించి, అపసవ్య కాలసర్పదోషములు కేతువు అనుసరించి ఉంటాయి.

## 64. జాతకచక్రంలో రాహుకేతువుల బలాబలములు

మనము జాతకచక్రమును పరిశీలించేటప్పుడు సప్తగ్రహములతోపాటు రాహుకేతువుల బలములను కూడా పరిశీలించవలెను. అప్పుడే జాతకచక్రంపై సంపూర్ణ నియంత్రణ ఏర్పడును. రాహుకేతువులు అమృతయోగాన్ని ఇవ్వగలవు, విషయోగమును కూడా ఇవ్వగలరు. అసలు రాహుకేతువులు ఏ రాశిలో ఉన్నారో, ఏయేనక్షత్రాలలో ఉన్నారో? ఏరాశిలో ఉంటే ఏ యే ఫలితములు ఇస్తారు? ఏయేనక్షత్రాలలో ఉంటే ఏయేఫలితాలు ఇస్తారో కృష్ణమూర్తి పద్ధతిలో ఏయేసబ్‌లో (లేక) ఏయేసబ్‌సబ్‌లలో ఉంటే ఏయే ఫలితాలు ఉంటాయో ఇవ్వన్నీ ప్రాథమిక

అంశాలు పరిశీలించాలి. రాహుదశ, అంతర్ధశ, కేతుదశ, అందర్ధశలు, సహజ, నైసర్గిక,మిత్రులు, శత్రువులు ద్వాదశాధిపతులు, రాహుకేతు నక్షత్రములలో ఇతర గ్రహములు ఎన్ని ఉన్నాయి? రాహుకేతువులకు మిత్రగ్రహములా? శత్రుగ్రహ ములా? వాటి సంఖ్యఎంత? మిగతా సప్తగ్రహములు రాహుకేతువులను నియంత్రణ చేయుచున్నారా ఏమైనా రాహుకేతువులను నియంత్రించే రాజయోగములు ఉన్నాయా? గజకేసరి, చంద్రమంగళ, బుధాదిత్య, అమలవాసి, వేసి, ఖడ్గ, చామర, రథ, గజ, తురంగ, వసుమతి ఉభయచరి, పరివర్తన, శ్రీనాథ, మాలికా మొదలగు అఖండయోగములు ఉన్నాయ? రాహుకేతువుల నైసర్గికక్షేత్ర, నక్షత్రదృక్, యతి, షడ్బల విచారణలో వారు బలవంతులా? బలహీనులా? వారి ఆదిపత్యం ఏమిటి? రాహుకేతువులు నవాంశ భావచక్రములలో ఎలా ఉన్నారు? కాలసర్పయోగం, అపసవ్యకాలసర్పయోగం, సవ్యకాలసర్పయోగం దృశార్థ, అదృశార్థ, సర్పదోషం, మొదలగు దోషములు ఏమైనా ఉన్నాయా? ఈ రాహుకేతువుల మీద శుభగృహ దృష్ఠి ఉన్నాయా? అన్నీ పరిశీలించవలెను అప్పుడే రాహుకేతువుల బలము తెలుస్తుంది. మరియు రాశిచక్రమంలో అనేకయోగములుండి నవాంశమునందు కాలసర్పదోషము ఉన్న ఎడల ఆచరణలో ఫలితములు తారుమారు అవుతాయి.

రాహుకేతువులు విషయోగంలో ఉన్నారా? అమృత యోగంలో ఉన్నారా అని పరిశీలించవలెను? గ్రహణయోగంలో జన్మించారా? అనేవి అన్ని పరిశీలించి నిర్ణయించవలెను. అప్పుడు మనకు మంచి ఫలితములు వస్తాయి. ముఖ్యంగా రాశి, భావచక్రము, నవాంశ చక్రములలో ఏయో భావములలో రాహుకేతువులు ఉన్నారో ఆభావపరిస్థితి ఏమిటి? ఏయే భావములు రాహుకేతువులకు అమృతయోగాన్ని ఇస్తే ఆభావములో ఉండే కారకత్వములు అనుకూలమైన ఫలితముల ఇస్తాయి. అదే విషయోగాన్ని ఇస్తే ఆ భావములో ఉండే కారకత్వములు ప్రతికూల ఫలితములు ఇస్తాయి.

జాతకుడు మహరాజుతో సమానుడైన మరణానంతరం అంత్యక్రియలు ఎలా జరుగుతాయి. ఎన్ని రోజులకు జరుగుతాయి. అన్ని విషయాలు కూడా పూర్తిగా కేతుగ్రహ ఆధీనమో మరణానంతరం వారికి పరలోక క్రియలు కర్మలు జరగని పరిస్థితి కేతువు కల్పిస్తాడు. రోడ్డు మీద పడిన మరణించిన అనాధలను అంత్యక్రియ లను పరమనికృష్టంగా జరుపుతారు. కోటేశ్వరులైన విశేష అంత్యక్రియలు సరిగ్గా (శాస్త్రపద్ధతి)లో జరగాలంటే కేతుగ్రహ అధికార నియంత్రణా పరిధిని తెలియ చేస్తుంది. సామాన్యపరిభాషలో చెప్పాలంటే జాకచక్రంలో రాహుకేతులు తీర్పుఇచ్చే జడ్జితో సమానం.

## 65. కాలసర్పయోగమునకు నారాయణ బలి నాగ బలి వివరాలు

పూర్వజన్మలో చేసిన కర్మఫలితములకు కాలసర్పయోగమేర్పడును. గత జన్మలో పాపములు వెంటాడుతుంటాయి. వివిధ రకాల శాపముల వలన కలిగే సమస్యలకు పరిహారంగా నారాయణ బలి మరియు నాగబలి చేస్తారు.

నారాయణ నాగబలి విధిని ధనిష్ఠా పంచకము మరియు త్రిపాద నక్షత్రము లలో చేయకూడదు.

ధనిష్ఠా పంచకము అనగా ధనిష్ఠా నక్షత్ర 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.

త్రిపాద నక్షత్రములు అనగా కృత్తిక, పునర్వసు, ఉత్తరా, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర ఇవి త్రిపాద నక్షత్రములు పంచమి, ఏకాదశి తిదులలో కాని మృగశిర, ఆరుద్ర, పుష్యమి, ఆశ్లేష, స్వాతి, మూల, హస్తా నక్షత్రములలో గాని ఆదివారం సోమవారం, గురువారములలో ఈ నారాయణ, నాగబలులు చేయుట శ్రేష్ఠము. ఈ నారాయణ నాగబలులు తాంత్రిక ప్రక్రియలు.

మొదటి రోజున నదీ పరివాహక ప్రదేశములలో కలశస్థాపన చేసి బ్రహ్మవిష్ణు మహేశ్వరులను స్థాపన చేయవలెను. ఏర్నశార్ అనే ప్రక్రియ జరిగిన తరువాత చనిపోయిన అశాంతితో బాధపడుతున్న పూర్వీకుల ఆత్మలకు అక్కడకు రప్పించి వారి ఆత్మ శాంతికి తగిన పరిహారాలు చేయటం జరుగుతుంది. రెండవరోజు మరణించిన వ్యక్తి పట్ల గౌరవాన్ని సూచిస్తూ కుశావత్తన్‌లో స్నానంచేస్తారు.

మూడవరోజు నాగబలి నారాయణబలిలో కృత్రిమంగ బియ్యపు పండితో ఒక మనిషిబొమ్మను కాని ఒక సర్పపు బొమ్మని గాని చేసి దహన కార్యక్రమములు జరిపి శ్రాద్ధ కర్మలు చేయటం జరుగుతుంది.

ఒక మంచి నక్షత్రంలో గాని తిధియందున గాని వారమునందునను కాని ఈ నారాయణ బలి ప్రక్రియను ప్రారంభించి రెండవరోజు అపరాహ్నామువరికు పూర్తిచేయ బడుతుంది.

## 66. సర్పనక్షత్రములకు ప్రత్యేక నామములు

**భరణి:** యమ, యామ్య, అంతకః, యమసంజ్ఞిక

**ఆశ్లేష:** ఉరగ, సార్ప, అహి, భుజంగ, వ్యాళ

ప్రయాణరాహువు

రాహువు ఆది, గురు వారములలో తూర్పుదిక్కు వైపు, సోమ, శుక్రవారము లలో దక్షిణ దిక్కువైపు మంగళవారం పశ్చిమ దిక్కువైపు, బుధ, శనివారములు ఉత్తర దిక్కువైపు ఉంటాడు.

ప్రయాణము చేయువారికి ఎదురు ఎదురు దిశగాని కుడి చేతివైపున గల దిక్కు గాని ఉంటే కార్యభంగము కలుగును. వెనుక భాగమున ఎడమ చేతివైపునము ఉన్నప్పుడు ప్రయాణకార్య విజయమును కలిగిస్తాడు రాహువుకు మాత్రమే ఉ ందికాని కేతువుకి లేదు

## 67. కుబేరయోగము

కన్యారాశిలో రాహువు ఉండి. ఆ రాహువుతో కుజుడు శనితోకలిస్తే కుబేర యోగము కలుగును.

**ఫలితము:** ధనలాభము, కుబేరుడుతో సమానమైన ధనవంతుడు. అష్టఐశ్వర్య ములు, సంఘంలో గౌరవ మర్యాదలు, కనకాభిషేకములు జరుగును.

## 68. బృహద్బీజయోగము

జన్మలగ్నంలో రాహువుతో కుజశనులు కలసినను లేదా జన్మలగ్నాధిపతి అష్టమములో రాహువు మరియు ఇతర పాపగ్రహములతో కూడినచో అది బృహద్బీజ యోగము అంటారు.

**ఫలితములు:** వృషణములలో వాపులు, వరిబీజము, వెరికోసిల్, వృషణము లకు సంబంధించిన వ్యాధులు, సుఖరోగములు కలిగి ఉంటారు.

## 69. కాలసర్ప పాశుపత అభిషేకము, హోమము

జాతకంలో కాలసర్పయోగము ఉండి కాలసర్పదోష నివారణకు సర్పపాశు పత అభిషేకము, హోమము చేయవలెను. ఇది బ్రహ్మాస్త్రము లాంటిది.

**కాలసర్పపాశుపత అభిషేక మంత్రము:**

ఓం హౌం। ఓం జూం। ఓం సః। ఓం భూః। ఓం భువః। ఓంస్వ

ఓం నమో అస్తు సర్పేభ్యో యేకేచ పృథివీమను।

యే అన్తరిక్షేయేదివితేభ్య స్సర్పేభ్యో నమః। ఓం స్వః।ఓం

భువః। ఓం భూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా।

ఓం నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।

నమస్తే అస్తు ధన్వవే బాహుభ్యా ముతతే నమః॥

ఓం హౌం। ఓం జూం। ఓం సః। ఓం భూః। ఓం భువః। ఓం స్వః।

ఓం నమో అస్తు సర్పేభ్యో యేకేచ పృథివీమను।

యే అన్తరిక్షేయేదివితేభ్య స్సర్పేభ్యోనమః। ఓం స్వః।

ఓం భువః। ఓంభూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా।

పై సంపుటీకరణలాంటి 169 వస్తాయి. పై అభిషేక మంత్రమును హోమమునకు కూడా ఇదే మంత్రము.

**విశేష సంకల్పము (కాలసర్పపాశుపత):**

పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్ఠాయాం శుభతిథౌ మమ సహకుటుంబానాం క్షేమ, స్థైర్య, ధైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్యర్థం, ధర్మార్థ, కామ, మోక్ష చతుర్విద ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం, మమగృహే అలక్ష్మీ పరిహారద్వారా శ్రీమహాలక్ష్మీ పరిపూర్ణతా సిద్ధ్యర్థం, ధన, కనక, వస్తు వాహన, ధేను,కళత్ర, భ్రాతృకృత ఋణవిమోచన సిద్ధిద్వారా మనోనిశ్చల తాసిద్ధ్యర్థం సమస్త ఋణవిమోచన సిద్ధి ద్వారా సుఖసౌఖ్య పూర్వక ఆయుష్యాభివృద్యర్థం, మమ చింతిత సమస్త మనోరథ ఫల ప్రాప్త్యర్థం సకల శత్రు బాధానివారణార్థం, సర్వశత్రు పలాయన సిద్ధి ద్వారా రాజ ద్వారే, రాజముఖే, సర్వదా దిగ్విజయార్ధం, సర్వశత్రూన్.

పై విదంగా అభిషేకం మరియు హవనం కరిష్యే అని హవనము చేయవలెను తరువాత స్వాహా కారమునకు “కాలసర్ప పాశుపతాయేదం నమమ” అని చెప్ప వలెను. పై విధంగా చేయవలెను దాని వల్ల సత్ ఫలితములు పొందుతారు.

## 70. కాలసర్పయోగమునకు అఘోరపాశుపత అభిషేకము, హోమము

ఎంతపూజ చేసిన ఫలించకపోతే పరిహారములు అనగా సక్రమమైన పద్ధతిలో జప, అభిషేక హోమాదులు చేసిన తరువాత ఈ పాశుపత అభిషేక, హోమములు చేయవలెను. ఇది బ్రహ్మాస్త్రము లాంటిది. శివ ఆరాధనలలో అత్యంత క్లిష్టమైనది. ప్రత్యక్ష ఫలదాయకమైనది. అర్జునునికి శ్రీకృష్ణభగవానుడు పాశుపతమంత్ర విధానము బోధించబడినది. అర్జునుడు దీని ద్వారా శత్రువులను జయించి పాశు పతాస్త్రాన్ని పొందాడు. ఈ పాశుపతాస్త్రం పరమేశ్వరుడుకు సంబంధించిన బ్రహ్మాస్త్రము ఈ పాశుపతము రుద్ర సంపుటీకరణ ద్వారా చేయాలి. రుద్రమునందలి 169 మంత్రములతో మనకు కావలసిన మంత్రమును సంపుటీకరించి శివునికి అభిషేకము చేయాలి. ఈ పాశుపతాలను రుద్రంతో సంపుటీకరించి ప్రయోగిస్తే అది ఆగమవిదానమౌతుంది. వేరు విధానాలలో ప్రయోగిస్తే అది తంత్రపు యోగ

మవుతుంది. పశుపతి యొక్క ఈ అస్త్రశక్తి కొరకై ఆయనను గురించి తపస్సు చేసిన అనేక మంది దేవతలు, ఆయన (శివుడి) అనుగ్రహంతో వారు సాధించుకున్న శక్తులను బీజాక్షరాలలోబంధించి, దానికి ఒక మంత్రరూపాన్ని ఇచ్చారు. రుద్రంలో, మహాన్యాసంలో ప్రతి అణువునా పాశుపతాలు కనిపిస్తాయి. ఈ పాశుపతాస్త్ర అభిషేకము, ఆ మంత్రములతో హోమము చేయవలెను. కాలసర్పదోషము ఉన్న వారు సశాస్త్రీయంగా కాలసర్పదోషము నివారణ చేసిన తరువాత అపమృత్యు దోషమునకు అఘోర పాశుపత అభిషేకము, హోమము చేయవలెను. మరియు అఘోర పాశుపత పారాయణము చేయవలెను.

**అఘోర పాశుపత అభిషేకము మంత్రము:**

ఓం హౌం। ఓం జూం। ఓం సః। ఓం భూః। ఓం భువః। ఓం స్వః। ఓం
అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। సర్వే
భ్యస్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥
ఓం స్వః। ఓంభువః। ఓంభూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా।
ఓం నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముత తే నమః॥
ఓం హౌం। ఓంజూం। ఓంసః। ఓంభూః। ఓంభువః। ఓంస్వః। ఓం
అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। సర్వే
భ్యస్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః॥
ఓం స్వః। ఓంభువః। ఓంభూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా।

పై సంపుటీకరణ లాంటి 169 వస్తాయి. పై అభిషేక మంత్రమును హోమమునకు కూడా ఇదే మంత్రము.

**విశేష సంకల్పము (అఘోర పాశుపత):**

పూర్వోక్త ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమ సహకుటుంబానాం క్షేమ, స్థైర్య, ధైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం, ధర్మార్థ, కామ, మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం, ఇష్టకామార్థ సిద్ధ్యర్థం, కాలసర్పయోగ దోషనివారాణార్థం మమ శరీరే కుష్టాపసార హృద్రోగవ్యదోధర గుల్మభూర్గుతార్ష, శ్రోణితార్క్ష, జలోధర, భగంధర, పాండురోగ, కాస మిత్రత్వ సిద్ధి ద్వారా సర్వకార్య అనుకూల్యతా సిద్ధ్యర్థం, సర్వరోగనివారణార్థం, శరీర సంపూర్ణ ఆరోగ్యతా సిద్ధి ద్వారా శతాయుష్యాభి వృద్ధ్యర్థం, మమ అన్యోన్యదాంపత్య

సిద్ధిద్వారాగృహే శాంతిపూర్వక, సౌఖ్య పూర్వక ఆయుష్యాభి వృద్యర్థం, దపంత్యోః పూర్వక, సౌఖ్య పూర్వక ఆయుష్యాభి వృద్యర్థం, దంపత్యోః పరస్పర మనోవైకల్య నివృత్తి ద్వారా పరస్పరాన్యోన్య తాతిశయ సిద్ధిద్వారా సుఖజీవన, సంతానసాఫల్యతా సిద్ధి ద్వారా సుఖేన జీవనసిద్ధ్యర్థం, మమ శ్రీఘ్రమేవ ఉన్నతస్థాన అత్యంత వైభవ ప్రకారేణ పాణిగ్రహణ అధికారయోగ్యతా సిద్ధ్యర్థం, ఇష్టకన్యాప్రాప్తిద్వారా సుఖసౌఖ్య భోగానుభవసిద్ధి ద్వారా జన్మసాఫల్యతా సిద్ధ్యర్థం, రాహుకేతు మధ్యస్థితి జనితగ్రహణ దోషనివారణార్థం, నాగదేవతాశాప దోష నివారణార్థం, జన్మ జాతక రీత్యా సంపూర్ణకాల సర్పదోషనివారణార్థం, కాలసర్పపాశుపత సంపుటీకరణ రుద్రాభిషేకం తదనంతరం కాలసర్పపాశుపత హవనం కరిష్యే॥

స్వాస సహితాది విస్పోటక, అజీర్ణ, శిరోరోగ, ప్రయేహాంశ్చ, మహావ్యాధి నాశన సిద్ధి ద్వారా శరీర సంపూర్ణ ఆరోగ్యతా సిద్ధి ద్వారా శతాయుష్యాభి వృద్యర్థం, అఘోర పాశుపత సంపుటీకరణ రుద్రాభిషేకం తదనంతరం అఘోర పాశుపత హవనం కరిష్యే॥

పై విధంగా అభిషేకం మరియు హవనం కరిష్యే అని హవనము చేయవలెను. తరువాత స్వాహాకారమునకు "అఘోరపాశుపతాయేదం నమమ" అని చెప్పవలెను. పైవిధంగా చేయవలెను. దానివల్ల సత్ఫలితములు పొందుతారు. ఇక్కడ హోమము అనగా అగ్ని ముఖముగా దేవతలకు హవిస్సులు అర్పించే విధానమే హోమం వివిధమైన కామ్యాలను అనుసరించి వివిధ హోమములు చెప్పబడినవి. పాశు పతహోమములలో అఘోరపాశుపతా హోమమునకు ఒక విశిష్టత ఉంది.

## 71. కాలసర్పదోషము-మహాపాశుపతరుద్రాభిషేకము-పాశుపతహోమము

రాహుకేతువుల మధ్య సప్తగ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. ఇందులో సవ్య, అపసవ్య, లగ్నసవ్య, లగ్య అపసవ్య, మిశ్రమ, దృశ్యార్ధ, అదృశ్యార్ధ కాలసర్పదోషములు ఉన్నాయి. అవి 1) అనంత కాలసర్పదోషం 2) కులికకాలసర్పదోషం, 3) వాసుకి కాలసర్పదోషం 4) శంఖకాలసర్పదోషం 5) పద్మకాలర్పదోషం 6) మహాపద్మకాలసర్పదోషం 7) తక్షక కాలసర్పదోషం 8) కర్కోటక కాలసర్పదోషం9)శంఖచూడకాలసర్పదోషము10) పాతక కాలసర్పదోషం 11)విషక్తకాలసర్పదోషం 12) శేషనాగకాలసర్పదోషములు ఉన్నాయి. ఈ కాలసర్ప దోషము నివారణ చేసేటప్పుడు మహాపాశుపత రుద్రాభిషేకం, మహాపాశుపతా హోమముచేయవలెను. ముందుగా సర్పసూక్త పాశుపతరుద్రాభిషేకం (లేక) సర్ప సూక్త సహిత మహాన్యాసక పూర్వ ఏకాదశ రుద్రాభిషేకం చేయాలి ఆ తరువాత మహాపాశుపతరుద్రాభిషేకం, మహాపాశుపత హోమము చేయాలి. అన్నింటికి

కంటే ముందు లింగంతో భద్రమండలి ఏర్పరచాలి. వివిధ పాశుపతాది హోమము లకు లింగంతో భద్రమండలి ఏర్పాటు చేయాలి.

**సంకల్పము:**

పూర్వోక్త ఏవంగుణ విశేషన విశిష్టాయాం శుభతిథౌ, ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ, కామ, మోక్ష చతుర్విధ ఫలపురుషార్ధ సిద్ధ్యర్థం, ఇష్టకామ్యార్ధ సిద్ధ్యర్థం, మమ మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం, మమ పౌత్ర, మిత్ర, కళత్ర, భ్రాతృ, బంధు, దాస, దాసీజన, విమల, విజ్ఞాన, సంపన్న నానావిధ సౌఖ్యానుభవసిద్ధ్యర్థం, కాలసర్పదోష నివారణార్ధం మహాపాశుపత రుద్రాభిషేక మహాపాశుపత వాహనం కరిష్యే॥

ఓం హౌం। ఓం జూం। ఓం సః। ఓం భూః। ఓం భువః। ఓం స్వః।
ఓం క్రాం క్రీం క్రోం ఘుం కపఈలహ్రీం నమశ్శమ్భవేచ
మయోభవే చ నమఃశ్శఙ్కరాయ చ మయస్కరాయ చ
నమఃశ్శివాయ చ శివతరాయ చ। ఓం స్వః।
ఓం భువః। ఓం భూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా
ఓం నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।
నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యా ముతతే నమః॥
ఓం హౌం। ఓం జూం। ఓం సః। ఓం భూః। ఓం భువః। ఓం స్వః।
ఓం క్రాం క్రీం క్రౌం ఘుం క ప ఈలహ్రీం నమశ్శమ్భవే
చ మమోభవేచ నమఃశ్శఙ్కరాయచ మయస్కరాయ
చ నమఃశ్శివాయ చ శివతరాయచ। ఓం స్వః।
ఓం భువః। ఓంభూః। ఓం సః। ఓం జూం। ఓం హౌం। ఓం స్వాహా

పై మంత్రముల ద్వారా అభిషేకము, స్వాహాకారాములతో హవనము చేయవలెను.

## 72. గర్భచ్యుతి యోగము

శ్లో॥ "సుతే పాపయుతదృష్టే గర్భచ్యుతి।

(జాతకతత్వము)

పై శ్లోకము ప్రకారము స్త్రీలకి గర్భస్రావము జరుగును. పైవిధంగా పంచమ భావమందు పాపగ్రహములు ఉన్న లేక పాపగ్రహముల వీక్షణం కలిగిన గర్భస్రావ మగును.

శ్లో॥ "పుత్రస్థానవాంశే యావత్పాపదృష్టః।
శుభాదృష్టిస్తావద్గర్భపాతః॥" (జాతకతత్వము)

పై శ్లోకము ననుసరించి పంచమభావ నవాంశరాశి శుభదృష్టి లేకుండా పాపగ్రహములచే చూడబడిన ఎన్ని అశుభగ్రహములు చూడబడిన అన్నిసార్లు గర్భస్రావమగును. వివరణాత్మకంగా వివరించాలి అంటే కుజ,శుక్రులు జన్మలగ్న మందుండిన గర్భస్రావమగును. చంద్రుడు లగ్నమందున్న వీక్షించినను గర్భస్రావ మగును.

## 73. గర్భస్రావయోగము

1) సప్తమాధిపతి రవితో కలిసి ఉండి పుత్రకారకుడు నీచయందున్నచో గర్భస్రావము కలుగును.
2) చంద్రుడు దశమమున బృహస్పతి సప్తమంలో ఉండి పుత్రస్థానాధిపతి బలహీనుడై ఉన్నచో గర్భస్రావము అవుతుంది.
3) మేషలగ్నమయి, పంచమాధిపతి వ్యయస్థానములో ఉండి పంచమములో చంద్ర, గుళిక గ్రహములుంటే గర్భస్రావము అవుతుంది.
4) శుక్రుడు పాపగ్రహముతో కలిసినను, అస్తంగతుడైన గాని మిధునమునకు పంచమమున ఉన్నచో పుత్రకారకుడు శుక్రునితో కలిసియున్నను వుక్రదృష్టి కలిగినచో గర్భస్రావము కలుగును.
5) సింహాలగ్నమునకు శని పంచమమున గురువు శనికి షష్టమంలో అష్టమాధి పతి ద్వాదశంలో ఉన్నచో గర్భస్రావమగును.
6) చంద్రుడు వృశ్చికమున గాని, ధనస్సున గాని పంచమమున నుండి రాహువుతో కలిసియున్న లేక రాహువు దృష్టి కలిగినను గర్భస్రావమగును.
7) ద్వాదశాధిపతి పంచమమున, పంచమాధిపతి ద్వాదశమున ఉన్నచో పుత్రకారకుడు శత్రగ్రహముతో కలిసి ఉన్నచో గర్భస్రావము అవుతుంది.
8) సప్తమాధిపతి అష్టమమున మరియు పంచమాధిపతి సప్తమమున ఉన్నచో గర్భస్రావమగును.
9) మీనమునకు పంచమమున రవి, రవికి పంచమమున చంద్రుడు ఉంటే మరియు సప్తమాధిపతి బలహీనుడైన ఉన్నచో గర్భస్రావమగును.
10) రవి నీచస్థానము పొంది. పంచమాధిపతితో కలిసి గాని దృష్టికల్గినను మరియు బృహస్పతితో కలిసినను దృష్టి కలిగినను గర్భస్రావము కల్గును.

## 74. రక్తస్రావయోగము

1) కన్యకు పంచమమందు గురువు, ఆ గురువుకి పంచమమున చంద్రుడు ఆచంద్రునికు పంచమమున కుజుడు లేక కేతువు ఉన్నచో రక్తస్రావయోగము కలుగును అనగా రక్తస్రావమగును.
2) తులాలగ్నమునకు సప్తమమున కుజుడు, శనితోగాని లేక శుక్రునితో గాని కలిసియున్నచో రక్తస్రావయోగము కలుగును. అనగా రక్తస్రావమగును.
3) పంచమాధిపతి సప్తమమున, సప్తమాధిపతి అష్టమమునన్నచో రక్తస్రావ మగును.

## 75. కాలసర్పయోగమునకు వినాయక స్నానమ్

కాలసర్పయోగ జాతకులు వినాయకుని పూజించటము ముఖ్యము, రాహుకేతు వులతో బాధపడువారు శ్రీమదగ్ని మహాపురాణము ప్రకారము శ్లోకముననుసరించి వినాయకదోషము తొలగాలంటే సర్వమనోరథముల స్నానము చేయవలెను. కర్మలకు విఘ్నము కల్గించుటకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వినాయకుని నిర్మించి అతనిని గణాలకు అధిపతిని చేసారు.

గణపతి పీడితుడు స్వప్నములో లోతైన నీటిలో మునిగిపోవును. ముండిత శిరస్కులను చూడటం, మాంసమును తిను మృగములను ఎక్కును. ఎక్కడికైన నడచి వెళ్లితే తనవెనుక ఎవరోవచ్చునట్లు అనిపిస్తుంది. కారణములేకుండా మనస్సు చెడిపోయి, వ్యర్థప్రయత్నములు కలవాడగును.

కన్యకు వరుడు లభించదు (అమ్మాయిలకు గాని, అబ్బాయిలకుగాని వివాహము కాకపోవటం) స్త్రీకి సంతానము కాకపోవటం. శ్రోత్రియునకు ఆచార్యత్వము, శిష్యునకు అధ్యయనము, ధనికునకు లాభము, కృషివలునకు కృషి, రాజునకు రాజ్యము లభించదు. అలాంటి వారికి అనగా సర్వవిధదోషములకు వినాయకుని స్నానము చేయవలెను. స్నానము ఎలా చేయాలంటే, అశ్విని, మృగశిర, పుష్యమి, హస్త, శ్రవణ నక్షత్రములందు, భద్రపీఠముపై కూర్చుండ బెట్టి పచ్చటి ఆవాలు నూరి నేతితో తడిపి శరీరమంత పూసి వాని శిరస్సుపై సర్వౌషధ సహితములగు అన్ని విధముల సుగంధ ద్రవ్యములను లేపనము చేసి సర్వౌషదులు ఉంచిన నాలుగు కలశ జలముతో స్నానము చేయవలెను, అశ్వశాల, గజశాల, పుట్ట, నదీసంగమము, జలాశయము వీటి నుండి తీసుకొని వచ్చిన ఐదు విధములగు మట్టి, గోరోచనము, గంధము, గుగ్గులము, ఆ కలశజలములందు ఉంచవలెను. పురోహితుడు తూర్పున ఉన్న కలశమును తీసుకొని సహస్రనేత్రములు కలదియు,

మహర్షులచే పవిత్రీకృతమును అగు జలముతో నీకు స్నానము చేయించుచున్నాను. ఈ పిత్ర జలము నిన్ను పవిత్రున్ని చేయాలి అని చెపుతూ స్నానము చేయమని చెప్పవలెను.

రాజీవ వర్ణుడు సూర్యుడు, బృహస్పతి, ఇంద్రుడు, వాయువు, సప్తరుషులు, నీకు కళ్యాణ చేసిరి, అనియు నీకేశములందును, సీమంతమునందును, శిరస్సు యందును, లలాలట, కర్ణ, నేత్రములందున్న దౌర్భాగ్యమును ఈ జలము పూర్తిగా తొలగించుగాక అని చెప్పుచు స్నానము చేయించవలెను. గురువు తన ఎడమ చేతిలో తీసుకొని శిరస్సుపై ఉంచి ఉదుంబస్రువతో ఆవనూనెతో హోమము చేయవలెను. హోమమును చేసేటప్పుడు చతుర్థ్యంత ములగామిత, సమ్మిత, శాలకకంటక, కూష్మాండ, రాజపుత్ర, అను పదములు చెప్పవలెను. (స్వాహాయ పదము చేర్చిన) హోమము అయిపోయిన తరువాత చరువుతోనమః అను పదము చేరిన జలమంత్రమునలను ఉచ్ఛరించుచు వారికి బలి ఇవ్వవలెను.

తరువాత చేటలో అంతట కుశములు పరచి తడిపొడిగా ఉన్న బియ్యము, నూరిన తిలలు కలిపిన అన్నము, వివిధరకాల పుష్పములు, పూరి, పాయసము, లడ్లు, బెల్లము త్రివిధసుర (మూడురకాల) పానీయాలు, మూలి, అపూపములు (గారెలు) లేక పిండివంటలు పండవిక మాలలు, దధ్యన్నము (పెరుగు అన్నము) మొదలగునవి. ఒకచోట చతుష్పథమునందు చేర్చి వాటిని దేవతా, సుపర్ణ, సర్ప, గృహ, అసుర, యాతుధాన పిశాచ, నాగ, మాతృ, శాకినీ, యక్ష, వేతాళ, యోగినీ, పూతనాదులకు అర్పించవలెను. తరువాత గణపతి తల్లియైన అంబికకు దూర్వాదళ ములు, తెల్లఆవాలు, పుష్పములు వీటితో నిండిన అంజలిని సమర్పించి సౌభాగ్యవతి యైన ఓదేవి నాకు రూపమును, యశస్సును, సౌభాగ్యమును, పుత్రుని, ధనమును, సర్వకామములను ఇమ్ము అని ప్రార్థించవలెను. బ్రాహ్మణులకు బోజనముపెట్టి, వస్త్రములు ఇవ్వవలెను. ఈ విధముగ వినాయకునిని ప్రార్థన చేయవలెను. ఇలా చేయటం వల్ల ఐశ్వర్యమును కర్మఫలమును పొందును.

పైనచెప్పినవిధంగాచేయవలెను.కాలసర్పదోషనివారణకు ఇది ఒక చిన్నరెమెడి.

## 76. అరిష్టయోగములు

1) రాహుకేతువుల షష్ఠమ, అష్ఠమ ద్వాదశ స్థానములలో ఉండి 6-8-12 స్థానాధిపతులతో కలిసి అనగా దృష్టి కలిగినను గాని మరణము సంభవించును. 6-8-12 స్థానాధిపతులుగాని మారకులతో రాహుకేతువులతో కలిస్తే కూడా మరణము కలుగును. 6,8,12 స్థానములలో రాహుకేతువులుఉండి.

కేంద్రాధిపతులతో గాని కోణాధిపతులతో గాని కలిసి ఉంటే రోగము వలన గాని, ఉరితోగాని, కత్తితోగాని, జలముతోగాని, కరెంటుతో గాని మరణము కలుగును.

2) రాహుకేతువులు సప్తమాధిపతితో గాని ద్వితీయాధిపతితో గాని కలిసినను దృష్టి కల్గినను ధననాశనము మారకము చేయును.

3) రాహుకేతువులు చర, స్థిర రాశులలో ఉండి కేంద్రాధిపతులతోగాని కోణాధి పతులతోగాని కలిసి పాపక్షేత్రమునందు ఉండి పాపగ్రహములతో కలిసినచో మారకము చేయును.

4) రాహుకేతువుల 6-8-12 స్థానాధిపతులతో కలిగి ఉన్నచో తల్లికి మరియు తల్లివర్గం వారికి మారకము చేయును.

5) రాహుకేతువులు 5,9 స్థానములలో ఉండి 2,7 స్థానముల అధిపతులతో కలిసిగాని దృష్టి కల్గినను గాని వారి మహర్దశ, అంతర్దశలలో గాని మరణం కలుగును.

6) లగ్నమందు, రాహుగ్రస్తుడయిన రవి యుండగా లగ్నమునకు 5,9 స్థానము లలో పాపులగు కుజనులు అంటే అంధులు అవుతారు.

## 77. రాహుకేతువుల నిర్మితమైన యోగములు

**1. గురుచండాల యోగము :**

రాహువు గురువు కలయిక వలన గురుచండాల యోగము ఏర్పడును. ఈ యోగము వలన ఏఏ భావములు ఏర్పడ్డారో ఆయా భావములు యొక్క ఫలితములు అశుభకర ఫలితములు ఇస్తాయి. గొడవలు, చికాకులు, ఎంతపని చేసిన అభివృద్ధి ఉండదు. ఋణాలు, ప్రమాదములు మనస్తాపములు కలుగును.

**2. పుణ్యనదీ స్నానయోగము:**

రాహువు కర్కాటకమున ఉన్నను (లేక) రవి, రాహుకేతువులతో కలిసి దశమ ముందున్నచో (లేక) దశమమందు గాని లగ్నమందుగాని పూర్ణచంద్రుడు అయిననూ లేక రాహు అయిననూ ఉన్నచో జాతకునుకు పుణ్యనదీ స్నాన యోగము ఏర్పడును. ఈయోగము వలన దేవాలయములు దర్శించుట నదీ, సముద్ర స్నాననములు చేస్తారు.

**3. సన్యాసయోగము:**

రాహువుతో దశమాధిపతి కలిసిననూ గుళికునితో కలిసిననూ క్రూరాంశమం దుండి వారితో శనికలిసినచో సన్యాసయోగము కల్గును. ఈ యోగము వలన జీవితముపై విరక్తి చెంది సన్యాసయోగములోకి వస్తారు.

**4. ఉపాసనయోగములు:**

రాహుకేతువులు స్వక్షేత్ర, ఉచ్ఛ, మిత్ర క్షేత్రములయందు ఉండి ఆ క్షేత్రము పంచమస్థానము అయి, ఆస్థానమునకు రాహుకేతువుల సంబంధం కలిగితే. ఉపాసన యోగము ఏర్పడును. ఈ యోగము వలన జనులయొక్క బాధలు తీర్చడానికి దేవతోపాసన చేస్తాడు.

**మృత్యుయోగము:**

1. దశమస్థానాన నవాంశాధిపతి రాహువు లేదా కేతువు కలిసి యున్నచో ఉరి వలన మరణము సంభవించును.
2. దవమస్థానాన నవాంశాధిపతి రాహు, కుజుడు గాని కుజ, శనితో కలిసిన అగ్ని వలన మరణము సంభవించును.
3. అష్టమంలో పాపగ్రహయుక్తరాహువు అయిన సర్పదంశతో మృత్యువు కలుగును.

## 78. వివిధ నక్షత్రములను అనుసరించి వ్యాపారములు

నక్షత్రముల ద్వారా ఏఏ వ్యాపారములు అనుసరించి అభివృద్ధి సాధిస్తారో క్రిందతెలుపబడినవి.

1. **అశ్వని నక్షత్రము:** ఈ నక్షత్రము ద్వారా రసాయినక వస్తువు అమ్మటం, ప్లాట్లవ్యాపారములు, పొలములు అమ కొనటం, రేడియో, టెలివిజన్ వ్యాపార ములు (ఎలక్ట్రానిక్స్ వ్యాపారములు) ఇనుము, ఉక్కు వ్యాపారము
2. **భరణి నక్షత్రము:** ఫైనాన్స్ వ్యాపారములు, హోటళ్లు, చీరలు, కళ్లజోళ్లు వ్యాపారములు
3. **కృత్తికనక్షత్రము:** రాజకీయ పార్టీలకు సంబంధించిన బ్యానర్లు, పెన్నులు, శిల్పాలు, ఫోటోలు, బొమ్మలు.
4. **రోహిణినక్షత్రము:** వాటర్‌బాటిల్స్, పాలు, డెయిరీలు, బేకరీలు
5. **మృగశిరనక్షత్రము:** పండ్ల వ్యాపారములు, ఫ్యాన్సీసమానులు, దర్జీదుకాణాలు, భూములు వ్యాపారము, పెట్రోలు, పెయింట్లు, సెంట్లు రసాయన వస్తువులు, మందులు, గ్యాస్ ఎజన్సీలు

6. **ఆరుద్రనక్షత్రము:** మందులు వ్యాపారములు (మెడికల్ షాపులు) రేడియోలు, బుక్‌షాపులు, వైద్యులకు సంబంధించి ఎక్యూట్‌మెంట్స్ వ్యాపారము, ల్యాబ్ పరికరాలు.

7. **పునర్వసు నక్షత్రము:** ఆధ్యాత్మిక పుస్తకములు, ఆధ్యాత్మికమునకు సంబంధించిన (నర్మదాబాణలింగం, స్ఫటికదేవతావిగ్రహములు, రుద్రాక్షలు, రత్నములు, శంఖములు, మరకత, పగడ, జిల్లేడు) మొదలగు వస్తువులు వ్యాపారములు, ఎడిటర్‌లు, ఊలు వర్తకులు, ప్రచారకులు, స్కూల్సు, విద్యాసంస్థలు.

8. **పుష్యమి నక్షత్రము:** నల్లని వస్తువుల వ్యాపారము, నువ్వులు, మినుముల వ్యాపారములు, కిరోసిన్,బొగ్గు,పెట్రోల్‌వ్యాపారము, చిన్నచిన్న వ్యాపారములు.

9. **ఆశ్లేషనక్షత్రము:** పెసల వ్యాపారము, స్టేషనరీ వ్యాపారములు, పెయింట్లు.

10. **మఖనక్షత్రము:**భూములవ్యాపారము,ప్లాట్లు,ఎల్రానిక్స్‌గూడ్సు,నగల వ్యాపారము.

11. **పుబ్బనక్షత్రము:** సిగరెట్లవ్యాపారములు, పాన్‌షాపులు, పురుగుల మందులు, బంగారు వ్యాపారములు.

12. **ఉత్తర నక్షత్రము:** భూత అద్దములు, షేర్లు.

13. **హస్త నక్షత్రము:**ఐస్‌క్రీమ్స్ కంపెనీలు,ఫ్రిజ్ కంపెనీలు, వస్త్రాలు, ఎగుమతుల దిగుమతులు

14. **చిత్త నక్షత్రము:** రసాయన పరికరాలు, పెట్రోలు, పౌడర్లు, ఎలక్ట్రానిక్స్ గూడ్సు, వాహనాల స్పేరుపార్ట్స్,సిగరెట్లు,పౌడర్లు, సెంట్లు, ఆటవస్తువులు, ముద్రణ పనులు.

15. **స్వాతి నక్షత్రము:** వైద్యపరికరాలు, ట్యూబ్‌లైట్లు, ఫాన్స్, వైద్య, పుస్తకాలు, రెడిమేడ్ వస్త్రాలు.

16. **విశాఖ నక్షత్రము:** అధ్యాత్మిక పుస్తకములు, పూజాసామానుల షాపులు, దేవత విగ్రహముల తయారు చేయుట అమ్ముట, పుణ్యక్షేత్రములకు బస్సుల వ్యాపారము నగలు, పెంట్లు.

17. **అనురాధ నక్షత్రము:** నల్లని వస్తువులు, హోమియో మందులు, తోళ్ళు, బొగ్గు, నూనెలు, అతితక్కువ పెట్టుబడి వ్యాపారములు.

18. **జ్యేష్ఠ నక్షత్రము:** పెసల వ్యాపారము క్యాలెక్యులేటర్లు, పంపులు, పచ్చళ్ల వ్యాపారములు.

19. **మూలనక్షత్రము:** చిత్రవర్ణపటములు, పండ్ల, పూలవ్యాపారములు, విత్తనాలు విక్రయము, కిరాణాషాపులు.

**20. పూర్వాషాడ నక్షత్రము:** బంగారు, వెండి నగల తయారు, గోల్డ్‌షాపులు, హోటళ్ల, ఆయుర్వేద మెడిసన్లు, పంచదార, బట్టల వ్యాపారం, రబ్బర్లు.

**21. ఉత్తరాషాఢ నక్షత్రము:** హోమియోమందులు, వంటలు తయారి (కేటరింగ్) కిరాణషాపులు, పత్రికలు, బొగ్గు, వస్త్రములు.

**22. శ్రవణ నక్షత్రము:** ఐస్‌క్రీముల వ్యాపారం, వాటర్ బాటిల్స్, పెట్రోలు, ఫ్రిజ్‌లు, ఎయిర్ కూలర్స్, ముత్యాలు, గనులు.

**23. ధనిష్ట నక్షత్రము:** వాహనాల స్పేర్‌పార్ట్స్, ల్యాబ్ పరికాలు, బ్రాందీషాపులు, సిమెంటు పరిశ్రమలు, వస్త్రాలు, కూరగాయల వ్యాపారములు, కొరియర్ సర్వీసులు,తోళ్లు

**24. శతభిష నక్షత్రము:** షేర్లు, స్టాక్ ఎక్స్‌ఛేంజ్‌లు, వైద్యపరికరాలు.

**25. పూర్వాభాద్రనక్షత్రము:** విద్యాసంస్థలను నడుపుట, ఇన్సూరెన్స్ ఏజెంట్లు, బుక్స్ విక్రయం, ఫర్నీచర్స్ విక్రయము.

**26. ఉత్తరాభాద్రనక్షత్రము:** ఇనుము సామాన్లు అమ్మటం, తాళాలు, గొళ్ళాలు, ఇనుపకడ్డీల వ్యాపారము, టెలిఫోన్ వ్యాపారములు, కుర్చీలు, బల్లలు తయారి, రోడ్డుమీద ఫుట్‌పాత్‌వ్యాపారములు, చెప్పులవ్యాపారములు, బ్రోకరైజ్ వ్యాపారములు, మేస్త్రీపనులు, గొడుగులు, రెయిన్‌కోట్లు

**27. రేవతి నక్షత్రము:** ప్రచారకులు, ఎలక్ట్రానిక్ వస్తువులు, పేపర్లు, పుస్తకాల వ్యాపారములు.

## 79. అనుమాన యోగము

కేతుగురువుల వల్ల కలిసినను ఈ యోగము ఏర్పడును. దీనివల్ల ఉపాసనాబలము. ఎవరిని నమ్మరు. అనుమానాలతో జీవించును.

## 80. నరకప్రాప్తి యోగము

వ్యయస్థానమున రాహుమొందీగ్రహములున్ననూ, వ్యయాధిపతి షష్ఠాధిపతిచే దృష్టికల్గిననూ, అష్టమాధిపతితో కలిసిననూ లేక షష్ట్యాంశములయందున్ననూ (కూరగ్రహము) దృష్టి కల్గినను నరకలోకప్రాప్తి యోగము కలుగును.

## 81. ఉన్మాద యోగము

చంద్రుడు పాపయుక్తుడైన రాహువుతో కలిసి వ్యయస్థానమున ఉన్న అష్టమమునందు శుభగ్రహములున్నచో ఉన్మాదయోగము కలుగును. ఈ యోగము వలన అధికకోపము, కలహములు శాడిస్టుగా ఉంటాడు.

## 82. రాజతుల్యయోగము

శని లాభము నుండి గాని, రాహువు దశమమునుండి గాని నవమాధిపతితో దృష్టి కల్గినను. జన్మలగ్నాధిపతి నీచగ్రహములతో కలుస్తే (లేక) చంద్రుడు నుండి గాని కుజుడునుండి గాని ద్వితీయమందు (లేక) తృతీయమందు (లేక) పంచమములయందు రాహువు ఉన్నచో రాజతుల్యయోగము కలుగును. ఈయోగము కల్గినజాతకుడు మంచిపదవిలో ఉంటాడు. రాజసమానుడగును.

## 83. మోక్ష యోగము

వ్యయస్థానమున గురువు ఉండి శుభగ్రహదృష్టి కల్గి వ్యయాధిపతి ఉచ్ఛస్థానము నందు కేతువుతో కలిసి ఉంటే మోక్షయోగము కలుగును.

## 84. కపట యోగము

చతుర్థస్థానములలో శనిఉండి ద్వాదశ భావములో రాహువు ఉన్న కపట యోగముకల్గును. ఈయోగమువలన మోసము, కపట బుద్ధి కలిగి ఉండును.

## 85. పాయాలు యోగము

జన్మలగ్నాధిపతి, రాహువు ఈ రెండు కలిసి దశమస్థానములో ఉన్నచో తల్లి గర్భము నుండి మొదట కాళ్లు బయట పడి తరువాత శరీరము బయటపడును ఈ యోగమును పాయాలు యోగము అందురు.

## 86. గురు చండాలయోగ విశ్లేషణ

రాహువు గురువు కలియక వలన గురు చండాలయోగము ఏర్పడును.

(లేక)

గురువు బలహీనమైన శనితో లేదా గుళికునితో కలిసినను దానిని గురు చండాలయోగము అందురు.

(లేక)

గుళికుడున్న భావాధిపతి లేదా రాహువు ఉన్న రాశ్యాధిపతి గురువు అయిన దానిని గురుచండాలయోగము అందరు.

గురురాహువులుండే స్థితిని అనగా రాశి భావస్థితుల బట్టి సాముదాయక ఫలితాలలో మార్పులు ఉంటాయి. ఈ యోగము బలముగా ఉన్నప్పుడు, మరియు ఖచ్చితమైన కలియక ఉన్నప్పుడు నైతికత ఆధ్యాత్మికత ఉండవు విచక్షణా జ్ఞానము కోల్పోతారు. ఈ యోగము తను భావములో ఉంటే మనస్సుపరంగా ఆరోగ్య పరంగా దెబ్బతింటారు. దనభావములో ఉంటే మాటజారటం, తిట్టటం, గొడవులు,

కోపం, ధనంకోల్పోవటం, విక్రమస్థానంలో ఉంటే సోదరులతో గొడవులు, సోదరులకు దూరంగా ఉండటం. మాతృభావంలో ఉంటే తల్లికి అనారోగ్యం, తల్లితో గొడవలు. సంతానభావంలో ఉంటే సంతాన పరంగా కష్టాలు సప్తమాభావంలో ఉంటే వైవాహిక జీవితంలో అపశ్రుతులు, అష్టమభావంలో ఉంటే ప్రాణభయం స్త్రీలకు మాంగళిక దోషములు, భాగ్యభావంలో ఉంటే ధననష్టాలు కలుగును. దశమభావంలో ఉంటే వృత్తిలో ప్రతికూల ఫలితములు, నైతిక పరమైన ధైర్యాదులు ఉండవు లాభభావంలో ఉంటే లాభాలు కలుగక పోవడం. ద్వాదశ భావంలో ఉంటే ఖర్చులు పెరగడం, ఆధ్యాత్మిక భావాలు వక్రమార్గం పడతాయి. ఈ యోగముతో పాటు సర్పయోగము కూడా ఉంటే తీవ్ర ఫలితములు ఉంటాయి.

**ఫలితములు:**

ఈయోగమువలన నాస్తికుడుగా అవటం, మనస్తాపములు, వ్యాధులు, ఆపదలు, ఇది ఒక దరిద్ర సూచక యోగము దారిద్రము మానసిక అశాంతి కలుగును.

## 87. రుణ శాపగ్రస్తములు

**మనకు తొమ్మిది రుణములను పేర్కొన్నారు.**

1) పితృరుణం 2) స్వరుణం 3) మాతృరుణం 4) స్త్రీరుణం 5) సంబంధిరుణం 6) సోదరి రుణం 7) నిర్ధయా రుణం 8) అపరిచితుల రుణం 9) దేవిరుణం వీటిని నివారించే ఉపాయాలు పాటించకపోతే వ్యక్తి జీవితము శాపము అయి అశాంతిమయము అవుతుంది. సంతానసుఖహాని, శారీరకశ్రమ, ధననష్టం జీవితంలో నష్టము గృహకలహాలు, రాజభయం మొదలైన వివిధ సంకటాలు ప్రాప్తిస్తాయి. ముఖ్యంగా పరమేశ్వరుని దృష్టి ఈ శాపాలపై పడుతుంది.

1. **పితృఋణము:** పితృదేవతల (పూర్వీకులు) మరణానంతరము వారి పిండప్రధానము, శ్రాద్ధకర్మములు నిర్వహించకపోవటం వల్ల పితృదేవతలు శపిస్తారు. వీరి శాపం వల్ల జాతకునికి ధననష్టం, అనారోగ్యము, వ్యాపార సమస్యలు, ఉద్యోగసమస్యలు, అవమానాలు, అపవాదులు, మొదలగు అన్ని రకముల సమస్యలు కలుగుతాయి. ఈ క్రింది విధంగా గ్రహములుంటే పితృరుణము కలుగుతుంది.

   1) జాతకచక్రంలో ద్వితీయ పంచమ భావాలలో దేనిలోనైనా బుధుడు, శుక్రుడు, రాహువులలో ఎవరైనా గురువుకి కేంద్రాలలో ఉన్నచో.

   2) ద్వితీయంలో శని, పంచమంలో శుక్రుడు ఉండాలి.

3) రవి, కుజుడు, శుక్రుడు ద్వాదశభావంలో ఉండటం శని తృతీయంలోగాని, చతుర్థంలో గాని లేకపోవటంము వల్ల కలుగును

4) బుధుడు, శుక్రుడు, తృతీయం లేదా షష్ఠమంలో ఉండి మరియు రాహువు ద్వాదశంలో ఉండాలి.

5) రవి లగ్నంలోగాని, ఏకాదశంలో గాని, లేకుండా ఉండి, రాహుకేతువులు పంచమభావంలో ఉండును.

6) బుధుడు, శుక్రుడు లేదా శనితో ఉండి, చతుర్థంలో చంద్రుడు ఉండును.

7) బుధుడు లేక కేతువు లగ్నంలో గాని అష్టమంలో గాని ఉండును.

**2. మాతృఋణము:** పూర్వజన్మలో తల్లికి కష్టపెట్టినవారు సరిగా చూడని వారికి మరుసటి జన్మలో ఈ రుణం కల్గును. దీనివల్ల విద్య, కుటుంబం, దన సంబంధిత వ్యవహారాల్లో బాధలు కల్గును, వ్యవసాయంలో బాధలు కల్గును.

ఈ క్రింది గ్రహముల వల్ల మాతృఋణముచే బాధించబడును.

1) జన్మ కుండలిలో చతుర్థ భావంలో కేతువు ఉండాలి.

**3. స్త్రీఋణము:** స్త్రీని ఎవరైతే హింసిస్తారో వారికి మరుజన్మలో ఈ ఋణము కల్గును. దీనివల్ల ఇంట్లో జరిగే శుభకార్యక్రమములకు ఆటంకములు కలుగును. భార్యభర్తల మధ్య గొడవలు జరుగును. హార్మోనుల ప్రభావము కల్గును. ఈ క్రింది గ్రహముల వల్ల స్త్రీ ఋణముచే బాధించబడును.

1) జాతకచక్రంలో షష్ఠాష్టమ వ్యయ (6,8,12) స్థానములలో శుక్రుడు ఉండటం.

2) జన్మకుండలిలో ద్వితీయ, సప్తమ స్థానాలలో రవి, చంద్ర, రాహువులు ఉండాలి.

**4. సోదరి, కుమార్తెల రుణము:**

జాతకునికి హఠాత్తుగా అశుభపరిణామాలు జరుగుతాయి. అపారనష్టము. శరీరంలో హార్మోనుల ప్రభావము కల్గును.

ఈ క్రింది గ్రహముల వల్ల సోదరి, కుమార్తెల ఋణముల చే బాధించబడును.

1) జన్మకుండలిలో తృతీయ, షష్ఠమ భావాలలో చంద్రుడు ఉండటం వల్ల జరుగును.

**5. అపరిచితుల ఋణము:** పూర్వజన్మలో బంధువులను నాశనం చేసి కుల నాశనానికి పాల్పడినవారికి మరు జన్మలో అపరిచితుల రుణము పీడిస్తుంది.

జాతకునికి కుటుంబ సభ్యులలో ప్రమాదాలు జరుగుతాయి. దురదృష్టం ఎప్పుడు వెంటాడుతుంది. జాతకునిపై మోసాలు కలుగుతాయి.

ఈ క్రింది గ్రహములవల్ల అపరిచితుల రుణములచే బాధించబడును.

1) జాతక చక్రంలో రవి, కుజుడు ద్వాదశ భావములో ఉంటాయి.

**6. సంబంధి రుణము:** జాతకుని పూర్వజన్మ సంబంధమైన రుణాన్ని సూచిస్తుంది. దీనివల్ల అంగవికలాంగత, శరీరంలో బలహీనత, అవిటితనము, సంతాన దోషాలు కల్గును.

1) జన్మలగ్నంలోగాని, సప్తమంలోగాని బుధకేతువులు కలిసి ఉండటం వల్ల

**7. స్వ రుణము:** ఈ స్వ రుణము వలన జాతకుడు వ్యసనములు, వంశప్రతిష్ఠలను నాశనము చేయుట, అధర్మమార్గము, గౌరవమునకు భంగము కలుగుట.

ఈ క్రింద గ్రహముల వల్ల స్వరుణములచే బాధించబడును.

1) జన్మకుండలిలో పంచమ భావములో శుక్రుడు ఉండి మరియు రాహుకేతువులల్లో ఎవరైన కలిసి ఉంటే ఈ స్వ రుణము కల్గును.

**8. నిర్ణయారుణము:** పూర్వజన్మలో జనులందరిని మోసము చేసినవారిని ఆస్తిని అపహరించిన వారిని మరియు హత్యలు చేసినవారు ఈ రుణంతో మరుజన్మలో బాధలు అనుభవిస్తారు.

అగ్నిప్రమాదాలు కూడా కలుగుతాయి. కుటుంబసభ్యులకు ప్రమాదాలు కూడా కల్గుతాయి.

ఈ క్రింది గ్రహముల వల్ల నిర్ధయారుణములచే బాధించబడును.

1) జాతకచక్రంలో ఆరవ(లేక) వ్యయస్థానములలో పాపగ్రహములు ఉంటే

**9. దేవీరుణము:** పూర్వజన్మలో ఇతరుల సంతానమును వెక్కిరించినవారిని, సంతానమును నాశనము చేసినవారిని. వీరికి సంతానము కలగదు. సంతానము కలిగిన వికలాంగులు అవుతారు.

ఈ క్రింది గ్రహముల వల్ల దేవీరుణములచే బాధించబడును.

1) జాతకచక్రంలో నవమస్థానములో పాపగ్రహములు ఉంటే జరుగును.

## 88. మేషాదిలగ్నము లందు రాహుప్రభావము

రాహువుకు అధిష్టానదేవత దుర్గాదేవి ఈ గ్రహము శనిఫలితాలను ఇస్తాడు. రాశిచక్రములో రాహువుకు కన్యారాశి స్వక్షేత్రము ఉచ్ఛస్థానము వృషభరాశి, వృశ్చికరాశియందు నీచస్థితిని పొందుతారు. ఈ గ్రహమునకు బుధ, శుక్ర,

శని, కేతువులు మిత్రులుగాను, రవి, కుజ, చంద్రులు శత్రువులుగాను, గురువుతో మధ్యవైఖరి కలిగి ఉంటారు. ఇతడు గంభీరుడు, చెడునడత, దురాలోచన, నపుంస కుడు, భూమి, వాయుతత్త్వము, దక్షిణం, పశ్చిమము, రాహువు నైరుతిస్థానములో ఉండి దక్షిణముఖము, నీలములేక దూమ్రవర్ణం, పైఠీనసగోత్రం, చండాలకులం, మినుములు ధాన్యము, గరికెసమిథలు చేట ఆసనములు ఈ రాహువు 35,000 వైబ్రేషనులు కల్గిఉండును.

**జన్మలగ్నములో రాహువు:**

లగ్నము నందు రాహువు ఉన్నచో జాతకుడు పనులలో ఆలస్యము, శత్రువుల వలన బాధలు, ప్రయాణములు, కుటుంబంలో కలహములు, ధననాశనము, దీర్ఘకాలిక వ్యాధులు కల్గును, వృత్తుల యందు మార్పులు కల్గును.

**దోష నివారణములు:**

1) రాహువు జపము చేయవలెను.
2) మినుములు కేజింపావు దానము చేయుట
3) నదిలో నారికేళమును వదులుట
4) గోధుమ, బెల్లము, రాగి దానము చేయవలెను
5. దుర్గాదేవి పూజ

**ద్వితీయంలో రాహువు:**

ద్వితీయస్థానమందు రాహువు ఉన్నచో ధనము ఖర్చు అవుట, కుటుంబములో సుఖసంతోషములు ఉండును ప్రమాదములు ఆయుధముల దెబ్బ వలన విగత జీవులగును.

**దోషనివారణములు:**

1) రాహుకాల పూజ
2) దుర్గా, గణపతి అర్చన
3) గోమేధికము ధారణ
4) ప్రతి శనివారం ఆంజనేయస్వామికి నూకలు (బియ్యం) చక్కెర లేక పంచదార కలిపి ఒకకాగిత పొట్లంలో ఉంచుకొని ప్రదక్షిణము అయినతర్వాత నల్లచీమలకు అవి పెట్టవలెను.

**తృతీయ స్థానమున రాహువు:**

తృతీయస్థానమున రాహువు ఉన్న జాతకుడు సంఘంలో పేరు ప్రఖ్యాతలను కలిగి ఉండును. దీర్ఘాయువును కలిగి, దనికుడై ఉండును ఇతని సోదరులకు అపాయములు కలుగును.

నిరాశావాది, భవిష్యత్ దృష్టిని కూడ కలిగి ఉండును. ఉద్రేకస్వభావము కల్గి ఉండును.

**దోషనివారణముల:**

1) రెండు (జంట) సర్పములకు పూజ

2) సర్పములను పూజచేసి పుట్టలో వదలవలెను

3) గోమేధికము దానము చేయుట

**చతుర్థస్థానమున రాహువు:**

చతుర్థంలో రాహువు ఉన్నచో తల్లిదండ్రులకు సమస్యలు విద్యయందు ఆటంక ములు, పరస్త్రీల వ్యామోహము అనారోగ్యము, మిత్ర సౌఖ్యము స్వల్పము గృహంలో కీటకముల వలన బాధలు కల్గును.

**దోషనివారణములు:**

1) మినుములు, నువ్వులు, నూనెలు బ్రాహ్మణునికి దానము చేయవలెను.

2) పాలు లేదా బియ్యములను బావియందు విడువవలెను.

3) సర్పములకు క్షీరమును (పాలు) నివేదించవలెను.

**పంచమస్థానమున రాహువు:**

పంచమ భావమునందు రాహువు ఉన్న జాతకుడు సంతాన నష్టము లేక ఆడసంతానము కలుగును. విద్యకు అనేక ప్రతిబంధకములు ఏర్పడును. భార్యకు సంతానమునకు హాని చంచలమైన స్వభావము కల్గిఉండును. దుష్టప్రవర్తన కలిగి ఉండటం.

**దోషనివారణములు:**

1) గృహంలో రాహుయంత్రమును ఉంచుట.

2) రుద్రాక్షధారణ

3) స్పటిక అమ్మవారు, గణపతికి పూజ చేయవలెను.

4) ఇంటిలో రజతముతో చేయబడిన ఏనుగు బొమ్మను ఉంచవలెను.

**షష్ఠమస్థానమున రాహువు:**

షష్ఠమ భావమునందు రాహువు ఉన్నచో ధైర్యశాలి, మేధాశక్తి కల్గినవాడు, విచారములోనున్న వారికి ధైర్యము చేకూర్చుట గృహములో ఉన్న వారితో అసభ్యముగా ప్రవర్తించును.

**దోషనివారణములు:**

1) రాహుయంత్రమునకు పూజ చేసి నైవేధ్యమును నివేదన చేయవలెను.

2) గోమేధికము శనిహోరలో ధరించుట

3) ఆంజనేయప్రదక్షిణలు

4) మినుములు ధానము చేయవలెను.

**సప్తమస్థానమున రాహువు:**

సప్తమస్థానముయందు రాహువు ఉన్నచో వృత్తిలో రాణింపు కుటుంబ సౌఖ్యము ఉండకపోవడం, క్రూరప్రవర్తన కలవాడై తన అదృష్ఠమును తాను నాశనము చేసుకొనును. వివాహము వలన కష్టములు ధనవ్యయము అగును. ఇంకాదుష్ఫలితములను కలుగును.

**దోషనివారణములు:**

1) స్ఫటికలింగమునకు పండ్లరసాలతో పూజలు

2) వెండిసర్పములను పుట్టలో వదులుట

3) రాహుజపం, ధానములు.

**అష్టమస్థానమున రాహువు:**

అష్టమ భావము నందు రాహువు వలన జాతకుడు ధైర్యము, సాహసపనులు చేయుట ధనము ఖర్చుఅవటం మోసముచేయుట అనారోగ్యము ఉదరసంబంధమైన వ్యాధులు కల్గును.

**దోషనివారణములు:**

1) మినుములు, నువ్వులు దానము చేయుట

2) బంగారము, పసుపుపచ్చని పువ్వులు, వస్త్రములు, కనకపుష్యరాగము బ్రాహ్మణులకు దానము చేయుట.

3) శ్రీచక్ర యంత్రమును పూజించుట

**నవమస్థానమున రాహువు:**

నవమ భావమందు రాహువు వలన కుటుంబ ఆర్థిక సంబంధ విషయముల యందు మరింత శ్రమపడి పనులను విజయవంతము చేయగలడు. వైద్యవృత్తిలో నిష్ణాతుడు కాగలడు వ్యక్తిత్వములలో మార్పులు కల్గును.

**దోషనివారణములు:**

1) మెడలో నవరత్నమాలధారణ
2) నాగసింధూరమును పెట్టుకొనుట
3) బంగారు ఆభరణములను ధరించుచుండవలెను.
4) రాహువుకు పూజచేసి దక్షిణావృతశంఖములో తీర్థము తీసుకొనుట.

**దశమ స్థానమునందు రాహువు:**

దశమ భావమునందు రాహువు ఉన్నచో ఆజాతకునికి తల్లిదండ్రులకు అనారోగ్యము ఇష్టము వచ్చిన రీతిలో ప్రవర్తన కలిగి ఉందురు. వైద్యవృత్తిలో జయముకల్గును.

**దోషనివారణముల:**

1) దుర్గాయంత్రమునకు కుంకుమార్చన
2) పాదరసలింగమును దానముచేయుట
3) మెడలో గోమేధిక మాల ధరించుట

**ఏకాదశ స్థానమున రాహువు:**

ఏకాదశస్థానమున రాహువు ఉన్నచో తండ్రికి అనారోగ్యము, తండ్రికి ధనము ఖర్చుఅగును. చెడుస్నేహము వలన ధననష్టము కల్గును. ఆ చెడుస్నేహమువలనే ధనాదాయము కూడా కల్గును. అపకారముచేయుచున్న స్నేహితులు ఉందురు.

**దోషనివారణములు:**

1) రాహుగ్రహ హోమముచేయుట
2) దేవాలయాలను దర్శించుట
3) మరకత లింగముపూజ
4) అమ్మవారికి అభిషేకము

**ద్వాదశస్థానమునరాహువు:**

ద్వాదశ భావమందు రాహువు ఉన్నచో అనారోగ్యము, ఆత్మహత్యలు, నిద్రలేమి కలుగును. మానసిక సమస్యలు, ధనమును దుర్మార్గములకై వ్యయపరచు చుండును. సోదరులకు, కుమార్తెల కొరకు ధనము ఖర్చుచేయును. చెడుస్నేహ ములు అవిశ్రాంతముగా కృషిచేసి, అనవసర వ్యయము చేసికొనుచుండును. మూలశంఖ వంటి వ్యాధులు కల్గును.

1) రాహువుపూజ చేయుట.
2) మినుములు, గోమేధికము, బ్రాహ్మణులకు దానము చేయుట
3) రాహుయంత్ర అభిషేకం చేయటం
4) గోమేధికము ధరించుట.

## 89. మేషాది లగ్నములందు కేతు ప్రభావము

కేతువుకు అధిష్టానదేవత గణపతి ఈ గ్రహము కుజఫలితాలను ఇస్తాడు. రాశిచక్రములో కేతువుకు మీనరాశి స్వక్షేత్రము వృశ్చికరాశిలో ఉచ్ఛస్థితిని, వృషభరాశిలో నీచస్థితని కల్గి ఉంది. ఈ కేతువునకు బుధ, శుక్ర, శని రాహువుల మిత్రులుగాను, రవి, చంద్ర, కుజులు శత్రువులు గురువు మద్యస్థ వైఖరి కల్గి ఉంటాడు. కేతువు వాయుస్థానములో ఉండి దక్షిణ ముఖము కల్గిఉంటారు. ఈ కేతువు మోక్షకారకుడు, తన భావాలన్నియు చిత్రవిచిత్రమైన రీతులలనిచ్చును. విద్యాకారకుడు, నిర్ణయాలను తారుమారు చేయుట దైవోపాసన మంత్రసిద్ధిని కలుగజేయును. అధ్యాత్మికములయందు ఆసక్తి కేతువు మానవుని శరీరములోని శిరోభాగము, చెవులు, పాదములు తప్ప మిగిలిన భాగములు అంతటికి తన ప్రభావాన్ని చూపును. వరిబీజము, వెన్నుముక, మూత్రనాళ వ్యాధులు వచ్చును. పురుషగ్రహం క్షత్రయ, అగ్నితత్త్వము కల్గి ఉంటుంది. ఈ గ్రహము వివిదరకములైన వర్ణములలోను లేక నలుపు-తెలుపు మిశ్రమ వర్ణమును కల్గి ఉండును.

**జన్మలగ్నమునందు కేతువు:**

జన్మలగ్నమునందు కేతువు వలన అజాతకునికి మంచినడవడిక లేకపోవుట, స్థిరత్వము ఉండదు. మానసిక ఆలోచనలు, శరీరనిర్మాణము నందు ఆకర్షణ లేకుండుట అధ్యాత్మిక కార్యక్రములయందు ఆసక్తిలేకపోవుట.

**దోషనివారణములు:**

1) కేతువు జపము చేయవలెను
2) ఉలవలు కేజింపావు ధానము చేయవలెను
3) శ్రీమహాగణాధిపతి పూజ చేయవలెను
4) ఆధ్యాత్మిక కార్యక్రమములలో పాల్గొనుట
5) కేతువుగ్రహ హోమము చేయవలెను.

**ద్వితీయస్థానమున కేతువు:**

ద్వితీయభావమునందు కేతువు ఉన్నచో ఆ జాతకుడుకి ఎక్కువగా ధనము రావడం. విశ్రాంతి లేకపోవడం, ప్రయాణములు, నిద్రలేమి కల్గును. నిరంతరము అటుఇటూ తిరుగుచుండును.

**దోషనివారణములు:**

1) వైఢూర్యమును శాస్త్రీయపద్ధతిలో ధరించడం

2) స్ఫటిక గణపతి అభిషేకము

3) జిల్లేడు గణపతి పూజ

**తృతీయస్థానమున కేతువు:**

తృతీయభావములో కేతువు ఉన్నచో సోదరులతోను, బంధువులతోను కలహాలు వారికి దూరముగా ఉండటం. తల్లిదండ్రులకు దూరంగా ఏదోప్రదేశంలో ఉండటము సంతాన సమస్యలు, భార్య భర్తల మధ్య సఖ్యత లేకపోవుట.

**దోషనివారణములు:**

1) వైఢూర్యమును ధానము చేయుట

2) సర్పములను పూజ చేసి పుట్టలో వదల వలెను.

**చతుర్థస్థానమున కేతువు:**

చతుర్థభావములో కేతువు ఉన్నచో చరస్థిర ఆస్తిపాస్తులు నష్టపోవుట. మాతృవర్గము వారితో విభేధములు మాతృసౌఖ్యము ఉండదు. తల్లికి అనారోగ్యము విశ్రాంతి లేని విధముగా ప్రయాణించడం దీర్ఘరోగములు కలుగును.

**దోషనివారణములు:**

1) ఉలవలవలు, కందులు, భోజన భత్యము బ్రాహ్మణునికి ఇవ్వవలెను.

2) నిమ్మకాయలను పారుతున్న నదీజలములందు విడువవలెను.

3. వైఢూర్యధారణ చేయుట:

**పంచమస్థానమున కేతువు :**

పంచమభావమందు కేతువు ఉన్నచో స్త్రీలకు, ఆడసంతానము, సంతాన సౌఖ్యము స్వల్పముగా నుండుట, చంచలత్వము స్థిరమైన ఆలోచనలు లేకపోవుట.

**దోషనివారణములు:**

1) రావిచెట్టు ప్రదక్షిణాలు

2) నాగప్రతిష్ఠ చేయవలెను

3) రుద్రాక్షధారణ

4) గృహంలో కేతు యంత్రము పూజచేయుట

5) బంగారము, పసుపు వస్త్రములు బ్రాహ్మణునకు దానము చేయవలెను.

**షష్ఠమస్థానమున కేతువు:**

షష్ఠమ భావమందు కేతువు ఉన్నచో శతృబాధలు కుటుంబంలో కలతలు, వైవాహిక జీవితంలో అప్రశుతులు, కళత్రం లేకపోవుట, తల్లిదండ్రులకు కష్ఠములు కల్గును. మానసిక ఆందోళనలు కలుగును.

**దోషనివారణములు:**

1) గణపతి ప్రదక్షిణలు
2) వైఢూర్యమును కుజహోరలో ధరించడం
3) కేతు యంత్రమునకు పూజచేసి నైవేధ్యమును నివేదన చేయవలెను.

**సప్తమస్థానమున కేతువు:**

సప్త భావమందు కేతువు ఉన్నచో కళత్రవియోగము, అనారోగ్యములు కలుగును వైవాహిక జీవితంలో అసంతృప్తి మానసిక ఆందోళనలు, శరీర సౌఖ్యము తక్కువ, స్థిర ఆలోచనలు లేకపోవుట.

**దోషనివారణములు:**

1) కేతువు జపం, అభిషేకం, దానములు
2) దర్భగడ్డిని, రాగిచెట్టును శుభముహూర్తములో పూజించుట
3) మరకతలింగమునకు అభిషేకము
4) సాలగ్రామము దానము

**అష్టమస్థానమున కేతువు:**

అష్టమ భావమందు కేతువు ఉన్నచో భార్యకు దీర్ఘరోగములు, మగవారికి గొంతు, మూత్రనాళవ్యాధులు, సంతానము జన్మించిననూ మరణించుట సంభవించగలదు. మూలశంఖవ్యాధులు కల్గును.

**దోషనివారణములు:**

1) ఉలవలు, కందులు దానము చేయుట
2) దేవాలయాలకు కేతువు ప్రతిమ ఇవ్వటం
3) కేతు యంత్రపూజ, నవరత్నములు ధరించడం
4) బంగారము,పసుపుపచ్చని పువ్వులు,వస్త్రములుబ్రాహ్మణులకుదానము చేయుట.
5) శ్రీలక్ష్మీ గణపతి యంత్రమును పూజ చేసి మహానైవేధ్యమును సమర్పించవలెను.

**నవమస్థానమున కేతువు:**

నవమ భావమందు కేతువు ఉన్నచో శరీర సమస్యలు తండ్రికి అనారోగ్యము మానసిక ఆలోచనలు, చెవి, వెన్నుముక వ్యాధులు కలుగును.

**దోషనివారణములు:**

1) శ్వేతార్కగణపతి అభిషేకము
2) మెడలో గణపతి మణిలాకెట్ ధరించడం
3) గణపతిమాల ధరించడం
4) లక్ష్మీగణపతి హోమం చేయడం.
5) రుద్రాక్షధారణ, గణపతిజపం.

**దశమస్థానమున కేతువు:**

దశమ భావమందు కేతువు ఉన్నచో మంచి ఆలోచనలు, మంచిభావములు, విచక్షణాజ్ఞానము చేయుట, సంఘంలో పేరు ప్రఖ్యాతలు కల్గి ఉండటం.

**దోషనివారణములు:**

1) మెడలో వైఢూర్య మాలను ధరించుట
2) తెల్లజిల్లేడు గణపతి పూజ
3) సూర్యకాంతగణపతి గృహంలో పూజ చేయుట.
4) ప్రతి రోజు గణపతికి పూజ చేసి దక్షిణావృత శంఖములో తీర్థము తీసికొనుట.

**ఏకాదశ స్థానమున కేతువు:**

ఏకాదశ భావమందు కేతువు ఉన్నచో మాతృ వర్గము వారికి గాని పితృవర్గమ ఉ వారికి వారి వైపు స్త్రీలకు కలహములు కల్గును. ధన ధాన్య సమృద్ధి కల్గిఉ ండును.

1) శ్రీగణపతి, కేతుయంత్రములో గృహములో పూజించుట
2) పాదరస గణపతికి అభిషేకం
3) గణపతిమాల ధరించడం
4) బంగారము, పసుపుపచ్చని పువ్వులు, వస్త్రములు బ్రాహ్మణులకు దానము చేయుట
5) శ్రీలక్ష్మీ గణపతి యంత్రమును పూజ చేసి మహానైవేద్యమును సమర్పించవలెను.

**ద్వాదశస్థానమున కేతువు:**

ద్వాదశ భావమందు కేతువు ఉన్నచో ధనధాన్య సంపన్నము కలవాడు అగును. దేవాలయాలు దర్శించుట, సంతానమువలన సుఖసంతోషములకు దూరంగా ఉండటం. క్షణంక్షణం పరిస్థితులు మారిపోవడం.

**దోషనివారణములు:**

1) వైఢూర్యధారణ
2) రుద్రాక్షలు ధరించడం
3) కేతుగ్రహ జపం, దానములు చేయుట
4) నవగ్రహ హోమము

## 90. రాహువు దోషం - పరిహారము- సూచనలు

1) రాహువుకు 18 వేల వేదమంత్రము
(ఓం కయానశ్చిత్ర అభువదూతీ సదా వృధస్సఖా।
కయా శ చిష్ఠయా వృతా ॥ వేదోక్తమంత్రమును బ్రాహ్మణులతో చేయించ వలెను.
2) శనివారము రోజున సూర్యోదయానికి 15 నిమిషాలలోపున శనిహోరలో గోమేధికము ధరించడం
3) శ్రీలక్ష్మీగణపతి హోమము (శాస్త్రీయ పద్ధతిలో)
4) రాహువుకు పూజ చేసి మినుములు దానము చేయుట.
5) కొన్ని వారములు రాహుకాల పూజ చేయడం.
6) రాహువు గాయత్రి మంత్రం పఠించంటం
7) రాహుగ్రహ హోమము చేయడం.
8) రాహుయంత్రమును గృహములో పూజించడం
9) పాదరస లక్ష్మీదేవికి అభిషేక చేయటం వలన శుభం కల్గును.
10) శ్రీచక్ర మహామేరువును పూజించటం.
11) జంటసర్పములను పూజచేసి దానము ఇవ్వవలెను.
12) రాహు జపం చేసి గ్రహహోమం చేసి, స్ఫటికలింగమునకు రుద్రాభిషేకం చేసి దానములు చేయవలెను.
13) గృహంలో రాహుయంత్రమునకు పూజచేసి రుద్రాభిషేకం చేయవలెను.
14) స్ఫటికదుర్గాదేవిని పూజించడం.

15) దేవి నవరాత్రులలో దుర్గాస్తోత్రములు పారాయణ చేయగలరు.

16) రాహువు మంత్రమును 21 రోజులలో 18,000 సార్లు జపము చేయగలరు.

17) రాహువు గాయత్రి మంత్రములను 108 రోజులు రోజుకి 21 మార్లు జపం చేయగలరు.

18) గోమేధికము ధరించడం మరియు ధానములు చేయడం.

19) రాహువు ధ్యాన శ్లోకములు, దుర్గాస్తోత్రములు పఠించడం.

20) శుభముహూర్తమున లేక నాగుల చవితి, నాగపంచమి పర్వదినములలో నాగప్రతిష్ఠ చేయడం.

21) వెండితో చేసిన సర్పాకార ఉంగరము చేయించి శివునికి లఘురుద్రాభిషేకం చేసి ధరించడము.

22) దుర్గాదేవికి కుంకుమపూజ మరియు రాహువుకు అష్టోత్తర పూజ చేయవలెను.

23) పార్వతీపరమేశ్వరుల కళ్యాణము చేయించడము

24) ప్రతిరోజు లక్ష్మీగణపతి పూజచేసి వారమునకు ఒకసారి ఉపవాసము చేయవలెను.

25) సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారిషష్ఠి రోజున అభిషేకము చేసి పుట్టలో పాలు పోయవలెను.

26) భైరవస్తోత్రముతో పాటు రాహుజపం చేయవలెను.

27) సర్పసూక్తసహిత మహన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకము ఆరుద్ర నక్షత్రము రోజున చేయండి.

28) రాహువుకు అదిష్ఠాన దేవత దుర్గాదేవి దుర్గా సప్తశతి పారాయణము గాని మంత్రంగా దుర్గా కవచం గాని పునశ్చరణ చేయవలెను. పదునెనిమిది శనివారములు పారుతున్ననదిలో కొబ్బరికాయను వదలవలెను.

29) పదునెనిమిది శనివారములు శిరఃస్నానము చేసిన నల్లవస్త్రములు ధరించి రాహుగ్రహముల మంత్రము, అధిదేవత, ప్రత్యాధిదేవతల మంత్రములు 108 సార్లు బ్రాహ్మణులతో ఆ తరువాత నీటిలో గరికెలు, ధర్భలు వేసి రావిచెట్టు మొదట్లో దారపోయాలి. ప్రతి శనివారము పగలు ఉపవాసము ఉండి రాత్రిపూట అల్పాహారము భుజించవలెను. ప్రతి శనివారము నువ్వుల నూనెతో దీపం వెలిగించవలెను.

30) శనివారం రోజున రాహు జపము చేసి బ్రాహ్మణునికి పాదప్రక్షాళన చేసి $1\frac{1}{4}$ మినుములు దక్షిణతాంబూలములు, ఎండుద్రాక్ష, ఖర్జూరపండ్లు, బూడిదగుమ్మడి కాయ, గొడుగు, విసనకర్ర, నల్లనివస్త్రము.

## 91. కేతువు దోషం - పరిహారము - సూచనలు

1) కేతువుకు 7వేల వేదమంత్రము

(ఓం కేతుం కృణ్వన్న కేతవే పేశో మర్యా అపేశసే ।

సముషద్భిరజాయథాః॥) వేదోక్తమంత్రమును బ్రాహ్మణులతో చేయించవలెను.

2) మంగళవారము రోజున సూర్యోదయానికి 15 నిమిషాలలోపున కుజహోరలో వైఢూర్యమును ధరించడం

3) శ్రీలక్ష్మీ గణపతిహోమము (శాస్త్రీయపద్ధతిలో)

4) కేతువుకు పూజచేసి ఉలవలు దానము చేయుట.

5) కొన్ని వారములు కేతువు శ్లోకములు ధ్యానించడం

6) కేతు గాయత్రి మంత్రము పఠించటం

7) కేతుగ్రహ హోమము చేయడం

8) కేతుయంత్రమును గృహములో పూజించడం.

9) పాదరసపు లక్ష్మీదేవికి అభిషేకం చేయటం వలన శుభం కల్గును.

10) శ్రీచక్రమహా మేరువును పూజించడం.

11) కేతుగ్రహజపము చేసి జంట సర్పములను పూజచేసి ధానము ఇవ్వవలెను.

12) కేతుగ్రహ జపం చేసి గ్రహ హోమంచేసి స్ఫటికలింగమునకు రుద్రాభిషేకం చేసి దానములు చేయవలెను.

13) గృహంలో కేతుగ్రహ మంత్రమునకు పూజచేసి రుద్రాభిషేకం చేయవలెను.

14) స్పటిక లేక శ్వేతార్క గణపతిని పూజించడం.

15) గణపతి స్తోత్రములతో పారాయణ చేయడం.

16) కేతువు మంత్రమును 21 రోజులలో 7,000 సార్లు జపము చేయగలరు.

17) కేతువు గాయత్రి మంత్రములను 108 రోజులు రోజుకి 21 మార్లు జపం చేయగలరు.

18) వైఢూర్యము ధరించడం మరియు ధానములు చేయడం.

19) కేతువు ధ్యానశ్లోకములు శ్రీమహాగణపతి స్తోత్రములు పఠించడం.

20) ఒక శుభముహూర్తమున లేక నాగుల చవితి లేక నాగపంచమి పర్వదినము లలో నాగ ప్రతిష్ఠ చేయడం.

21) బంగారము లేక వెండితో చేసిన సర్పాకార ఉంగరము చేయించి శివునికి లఘు రుద్రాభిషేకం చేసి ధరించడము

22) గరికెతో విఘ్నేశ్వరపూజచేసి కేతువుకు అష్టోత్తర పూజ చేయవలెను.

23) కాలసర్పదోష నివృత్తి చేసికొనుట

24) కేతుజపం చేసి సూర్యనారాయణస్వామికి పారాయణ చేయవలెను. చిత్రగుప్తునికి పూజలు చేసి కేతుస్తోత్ర పారాయణ చేయవలెను.

25. శాస్త్రీయ పద్ధతిలో నాగ ప్రతిష్ఠ చేయడం.

26) ప్రతిరోజు లక్ష్మీగణపతి పూజ చేసి వారమునకు ఒకసారి ఉపవాసము చేయ వలెను.

27) సర్పసూక్త సహిత మహన్యాస పూర్వ ఏకాదశ రుద్రాభిషేకం ఆరుద్ర నక్షత్రము రోజున చేయండి.

28) కేతువుకు మూలమంత్రము, అదిదేవత, ప్రత్యాధిదేవతలకు సంబంధించిన మంత్రము బ్రాహ్మణులతో జపించి, ధానములు చేయవలెను.

29) కేతువుకు అధిష్టాన దేవత గణపతి ఈ గణపతిని తెల్లజిల్లేడు లేదా పగడంతో తయారుచేసి కేతువుకు బ్రాహ్మణులతో 7వేల జపం చేసి దానముకూడా చేసి ఆ గణపతిని కూడా వివిధ రకములుగా (పంచామృతములతో, పండ్లరసా లతో, ఏకవింశతి పత్రాలతో పూజచేపించి బ్రాహ్మణులను భోజన తాంబూ లాధులతో సత్కరించవలెను.

30) పదునెనిమిది మంగళవారములు శిరఃస్నానముచేసి ఎట్టని వస్త్రము ధరించి కేతుగ్రహముల మంత్రము, అధిదేవత, ప్రత్యాధి దేవతల మంత్రములు 108 బ్రాహ్మణులతో చేపించవలెను. ప్రతిమంగళవారము చేయవలెను.

## 92. రాహువుకు తాత్కాలిక పరిహార మార్గములు

1) శని లేక ఆదివారము రోజున మినపగారెలు లేదా మినప ఉండలు పేదవారికి సాధువులకు పంచగలరు.

2) బ్రాహ్మణునకు వెండిసర్పములు లేక బంగారు సర్పములను గ్రహణ సమయంలో గాని, అమావాస్యలో గాని శనిలేక ఆదివారం రాహుకాలంలో దానం చేయగలరు.

3) అమ్మవారి, సుబ్రహ్మణ్య దేవాలయము ముందు పేదవారికి, అన్నదానం శనివారము రోజున చేయవలెను.
4) సుబ్రహ్మణ్య చరిత్ర, స్కాందపురాణం, మన్యుసూక్తం, కుమారసంభవంను మండల రోజులలో పారాయణము చేయవలెను.
5) జంట సర్పములను పూజించి, అశ్వర్థ వృక్షం చుట్టూ ప్రదక్షిణములు చేయవలెను.
6) రాహువుకు మబ్బు జువ్వి లేక గరిక చెట్టును పూజించవలెను.

## 93. కేతువుకు తాత్కాలిక పరిహారమార్గములు

1) 7 మంగళవారములు ఉపవాసము ఉండి చివరి మంగళవారము పూజచేసి మరియు కేతు అష్టోత్తర పూజ చేయవలెను.
2) విష్ణువు, గణపతి దేవాలయముల యందు బీదవారికి, సాధువులకు ప్రసాదములు అన్నదానములు చేయగలరు (మంగళవారము)
3) వినాయక చవితి రోజున గణేష అర్చన, స్తోత్రములు పారాయణ చేయడం.
4) శ్వేతార్క గణపతి లేక తెల్లజిల్లేడు గణపతి పూజా మందిరములో ఉంచి పూజ చేయండి.
5) బ్రాహ్మణులకు 11 మంగళవారములు ఎండుఖర్జూర, ఎండుద్రాక్ష, ఉలవలు వీటితోపాటు భత్యము, ధనము ఇవ్వవలెను.
6) ప్రతిరోజు గణపతి దేవాలయమునకు వెళ్ళి ప్రతిమంగళవారము గణపతిని ధ్యానించుకుంటూ 108 ప్రదక్షిణలు చేయటం మంచిది.
7) ఎండుఖర్జూరపండ్లు 108 బ్రాహ్మణులకు దానం చేయడం మంచిది
8) కేతువుకు దర్భగడ్డి, రాగిచెట్టును పూజించవలెను.

## 94. కాలసర్ప జాతకులు రాహువు దోషమునకు పూజించు దేవతలు

కాలసర్ప దోషమున్న జాతకులు రాహువు వివిధ రాశుల్లో ఉన్నప్పుడు ఆరాధించవలసిన దేవతలు.

1) మేషరాశిలో రాహువునున్నప్పుడు భ్రమరాంభిక అష్టకము, సుబ్రహ్మణ్యస్వామి అష్టకము, గకార శ్రీగణపతి అష్టోత్తర శతనామావాళి సర్పసూక్తములు, రుద్రాభిషేకములు, పఠించవలెను.
2) వృషభ రాశిలో రాహువు నున్నప్పుడు కనకధార స్తోత్రము, దుర్గా అష్టోత్తర శతనామావళి, స్త్రీసూక్తం, గణపతి సూక్తం, శ్రీసుబ్రహ్మణ్య సహస్రనామావళి, పఠించవలెను.

3) మిథునరాశిలో రాహువున్నప్పుడు భీజాక్షర శ్రీవినాయక అష్టోత్తర శతనామావళి దుర్గాసూక్తమ్, విష్ణుసహస్ర నామపారాయణము, శ్రీమానసా దేవి నాగస్తోత్రము శ్రీ సుబ్రహ్మణ్య షోడశ నామస్తోత్రము, పఠించవలెను.
4) కర్కాటక రాశిలో రాహువు నున్నప్పుడు ధనంజయకృత శ్రీదుర్గాస్తుతి, నాగదోషనివారణ జపమంత్రములు, శ్రీసుబ్రహ్మణ్య భుజంగస్తోత్రము, గణపతి గాయత్రి మంత్రములు పఠించవలెను.
5) సింహరాశిలో రాహువు నున్నప్పుడు వివిధ రకాల గణపతి బీజాక్షర మంత్రములు యుధిష్ఠిర కృతదుర్గాస్తవనమ్, ఆదిత్యహృదయం పఠించవలెను.
6) కన్యారశిలో రాహువు నున్నప్పుడు వివిధ గణపతుల అష్టోత్తర శతనామావళి, పురుషసూక్తం, సర్పసూక్తం, సర్పగాయత్రి శ్రీసుబ్రహ్మణ్య కవచస్తోత్రము, దుర్గా అష్టోత్తర శతనామావళి పఠించవలెను.
7) తులారాశిలో రాహువునున్నప్పుడు గణపతి సూక్తమ్, కనకధారస్తోత్రమ్, శ్రీమానసాదేవి స్తోత్రము, నాగేశ్వరస్తుతి పఠించవలెను.
8) వృశ్చిక రాశిలో రాహువు నున్నప్పుడు మన్యుసూక్తమ్, గకార శ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము, నాగదోష నివారణ జపమంత్రములు, శ్రీమహిషాసుర మర్ధినీ స్తోత్రమ్ పఠించవలెను.
9) ధనస్సురాశిలో రాహువు నున్నప్పుడు శ్రీసుబ్రహ్మణ్య భుజంగస్తోత్రము, రాజరాజేశ్వరి కవచము, నాగ అష్టోత్తర శతనామావళి శ్రీమహాగణపతి గాయత్రి, స్త్రీ సూక్తమ్, దత్తాత్రేయ మంత్రములు, సాయిబాబా అష్టోత్తర శతనామావళి, శ్రీరాఘవేంద్రస్వామి అష్టోత్తర శతనామావళి పఠించవలెను.
10) మకరరాశిలో రాహువు నున్నప్పుడు గణపతి సూక్తమ్, హనమద్బడ బానల స్తోత్రము భ్రమరాంభికాష్టకమ్, రుద్రాభిషేకం, శ్రీసుబ్రహ్మణ్య సహస్రనామావళి పఠించవలెను.
11) కుంభరాశిలో రాహువు నున్నప్పుడు శ్రీమహాగణపతిగాయత్రి, సర్పగాయత్రి వివిధ రకాల గణపతి బీజాక్షర మంత్రములు, శ్రీసుబ్రహ్మణ్య స్తోత్రము, శ్రీరాఘవేంద్రస్వామి ఆరాధన, సాయిబాబాస్తోత్రము యుధిష్ఠిర కృత దుర్గాస్తవనమ్, విష్ణుసహస్ర నామము, శివపంచాక్షరి పఠించవలెను.
12) మీనరాశిలో రాహువు నున్నప్పుడు శ్రీ వివిధ గణపతుల, అష్టోత్తర, శతనామా వళి, శ్రీరాఘవేంద్రస్వామి ఆరాధన, శివసంచాక్షరి, దుర్గాఅష్టోత్తర శతనామా వళి, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము, సర్పసూక్తములు పఠించవలెను.

## 95. కాలసర్పజాతకులు కేతువు దోషమునకు పూజించు దేవతలు

కాలసర్ప దోషమున్న జాతకులు కేతువు వివిధ రాశుల్లో నున్నప్పుడు ఆరాధించ వలసిన దేవతలు

1) మేషరాశిలో కేతువు నున్నప్పుడు గణపతిసూక్తమ్, భ్రమరాంభిక అష్టకము, సుబ్రహ్మణ్య స్వామి కవచస్తోత్రము, నాగదోష నివారణ జపమంత్రములు, నాగ అష్టోత్తర శతనామావళి, సుబ్రహ్మణ్య సహస్ర నామావళి పఠించవలెను.
2) వృషభరాశిలో కేతువునున్నప్పుడు గకారశ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, శ్రీమహాగణపతి గాయత్రి, శ్రీసుబ్రహ్మణ్య కరావలంబాష్టకము, సర్పసూక్తమ్ (పూర్వార్ధము), కనకధారాస్తోత్రము, దుర్గాసూక్తమ్, శ్రీరాఘవేంద్రస్వామి ఆరాధన పఠించవలెను.
3) మిధున రాశిలో కేతువు ఉన్మనప్పుడు బీజాక్షర శ్రీవినాయక అష్టోత్తర శత నామావళి, శ్రీమానసాదేవి నాగస్తోత్రము, సర్పగాయత్రి, స్త్రీ సూక్తం, పురుష సూక్తం, పాదరస శివలింగ సర్పసూక్త రుద్రాభిషేకం, విష్ణుసహస్ర నామపారా యణము పఠించవలెను.
4) కర్కాటక రాశిలో కేతువు ఉన్నప్పుడు వివిధ గణపతుల అష్టోత్తర శతనామా వళి, గణపతి బీజాక్షర గణపతి మంత్రములు, శ్రీసుబ్రహ్మణ్య కవచస్తోత్రము, నాగఅష్టోత్తర శతనామావళి, సర్పగాయత్రి, భ్రమరాంభికాష్టకము, రాజరాజే శ్వరి కవచం, పఠించవలెను.
5) సింహరాశిలో కేతువు ఉన్నప్పుడు ఆదిత్యహృదయం, గణపతిసూక్తమ్, యుధిష్ఠిర కృత దుర్గా స్తవనమ్, శ్రీసుబ్రహ్మణ్య సహస్ర నామావళి, నాగదోష నివారణ జపమంత్రాలు. పాదరస శివలింగముతో సర్పసూక్త రుద్రాభిషేకం, శివపంచాక్షరి పఠించవలెను.
6) కన్యారాశిలో కేతువు ఉన్నప్పుడు బీజాక్షర శ్రీవినాయక అష్టోత్తర శతనామావళి భ్రమరాంభికాష్టకము, శ్రీమానసాదేవి స్తోత్రము, విష్ణుసహస్ర నామపారాయణస్తోత్రమ్ పఠించవలెను.
7) తులరాశిలో కేతువు ఉన్నప్పుడు గకార శ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, మన్యుసూక్తమ్, స్త్రీ సూక్తం, దుర్గా సూక్తం, శ్రీరుద్రకవచమ్, కనకధార స్తోత్రమ్ పఠించవలెను.
8) వృశ్చికరాశిలో కేతువు ఉన్నప్పుడు గణపతి గాయత్రి, వివిధరకాల గణపతి బీజాక్షర మంత్రములు, నాగేశ్వరస్తుతి, ధనంజయకృత శ్రీదుర్గాస్తుతి, శ్రీసుబ్రహ్మణ్య కవచస్తోత్రము, పఠించవలెను.

9) ధనస్సు రాశిలో కేతువు ఉన్నప్పుడు సంకటనాశన గణేషస్తోత్రము, యుధిష్ఠిర కృతదుర్గా స్తవనమ్ శ్రీసుబ్రహ్మణ్య సహస్ర నామావళి దత్తాత్రేయ స్తోత్రము పఠించవలెను.

10) మకర రాశిలో కేతువు ఉన్నప్పుడు వివిధ గణపతుల అష్టోత్తర శతనామావళి, శ్రీసుబ్రహ్మణ్య షోడశనామస్తోత్రము, భ్రమరాంభికాష్టకము, హనుమద్బ డబానల స్తోత్రము, శివపంచాక్షరి పఠించవలెను.

11) కుంభరాశిలో కేతువు ఉన్నప్పుడు గకార శ్రీగణపతి అష్టోత్తర శతనామావళి, శ్రీసుబ్రహ్మణ్య సహస్ర నామావళి, శ్రీమహిషాసుర మర్ధినీ స్తోత్రము, హను మద్బడబానలస్తోత్రము, పాదరస శివలింగముతో సర్పసూక్త రుద్రాభిషేకం, నాగదోష నివారణ జపమంత్రములు పఠించవలెను.

12) మీనరాశిలో కేతువు ఉన్నప్పుడు గణపతి సూక్తమ్, దుర్గా అష్టోత్తర శతనామావళి, దుర్గాసూక్తమ్, గణపతి గాయత్రి, శ్రీసుబ్రహ్మణ్య సహస్రనామా వళి, దత్తాత్రేయ స్తోత్రము శివపంచాక్షరి పఠించవలెను.

## 96. రాహుకేతువుల ప్రభావం

జ్యోతిష శాస్త్రానుసారంగా ఛాయాగ్రహములుగా రాహుకేతువులు గుర్తించ దగినవిగా నున్నను ఈ రెండు గ్రహములకు నిర్ణయించిన స్థానములు గుణ గణ యోగ కారణములు స్వభావములు మొదలుగునవి లేనప్పటికిని మన పూర్వపు ఋషులగు పరాశర జైమిని ఈ గ్రహములగు కొన్ని గుణ స్వభావకారణములను నిర్ణయించినారు. పాశ్చాత్య దేశాలలో గుణస్వభావ తార్కాణముగా చాలాజాతకా లను చూచిన తర్వాత యోగములుగా నిర్ణయించబడినది. మన దేశములో ఈరాహుకేతువులు విరుద్ద స్వభావము గుణకారకులైన రీతి చంద్ర సమాగమనము లేక కేంద్ర కోణస్థితుల చూడ విపరీత స్థితిని కలిగి ఫలితములను గూడా పొందుట సుప్రమాణము.

జాతక చక్రములో లగ్నంలో రాహువు సప్తమంలో కేతువున్నచో ఆ జాతకునికి ధనము లేకపోవుట మందబుద్ధి పిశాచ బాధలు బహిష్కరణ రోగములు కలుగును కానీ పంచమ నవమ స్థానములలో గురుదృష్టి ఉన్న కొంత వరకు దోషము తగ్గును. వీటిలోకి శని దృష్టి కలిగితే రోగాధిక్యత మారకము దశాంతర దశలలో జరుగును. ద్వితీయంలో రాహువు అష్టమంలో కేతువున్న ఆ జాతకునికి ప్రమాదములు ఎముకల వ్యాధులు, ఆకస్మిక మరణములు, సంసార చిక్కులు కలుగును.

ఈ గ్రహములకు చంద్రుడు కలసి శుక్ర దృష్టి ఉన్న ద్వికళత్రయోగము కంటి వ్యాధులు వచ్చును. ఈ గ్రహములకు గురుదృష్టి కలిగిన కొంతచెడు ఫలితము తగ్గును తృతీయ నవములలో రాహుకేతువులున్నచో వాహన ప్రమాదములు స్వేచ్ఛా జీవి కొంతకాలము ధనవంతుడు కొంతకాలము దరిద్రుడుగాను జీవించును. చతుర్థంలో దశమంలో రాహు కేతువులున్నచో మానసిక బాధలు ప్రయాణములు మోసము చేయుట మొదలగునవి కలుగును.

లగ్నాధిపతి శుభుడైన ఊపిరితిత్తుల సంభందిత వ్యాధులు, చర్మవ్యాధులు, దీర్ఘవ్యాధులు కలుగును. పంచమంలో ఏకాదశంలో రాహువున్నచో తొందర స్వభావము రక్తపోటు మానసిక వ్యాధి వివాహము ఆలశ్యము సంతానము స్వల్పము మంత్రశాస్త్రమునందు ప్రావీణ్యత బీదవారికి సేవ చేయును.

షష్ఠమంలో ద్వాదశంలో రాహువున్న సంపూర్ణ ఆరోగ్యము వంతులు, భోజనప్రియులు, తలనొప్పి, పెంకితనం, జయము కలుగును. ఈ రాహు కేతువుల దోషములకు ఆదిత్యహృదయము హనుమత్ కవచము, సుందరకాండ రాహుకేతువుల జపములు చేసిన కొంత ఉపశమనము కలుగును.

**రాహువు:** క్రిమిరోగము, గౌరవలోపము, కోమా, ఆటంకములు, ఆత్మహత్యలు పక్షవాతము, క్షుద్రవిద్యలు, ఆత్మహత్యలు, ఉరిశిక్షలు, విషప్రయోగము ముఖమునకు నోటికి సంబంధించి వ్యాధులు, మశూచి, క్యాన్సరు, వాహనప్రమాదములు వీటిలన్నిటికి రాహుగ్రహ జపము దుర్గాగణపతుల పూజ గోమేధికం దరించుట గాజువస్తువులు నీలంవస్త్రము కంబళి, మినుములు, నువ్వులు, కత్తి, గుఙ్టము, నల్లరంగు పుష్పాలు వీటిలను దానము చేయవలెను. గేదె కొమ్ముతో జేసిన పాత్రయందలి ఉదకము గుగ్గిలము ఇంగువ హరిదళము మణిశ్శిలలతో కలిపి ఆనీటితో స్నానము జేసినచో కొంతరాహు దోషం తగ్గును. శుభతిధి గల శనివారము రోజున రాహు మంత్రం ఓం క్రోం క్రీం హూం టుం టం టంకధారీ రాహవే రం హ్రీం శ్రీం భౌం స్వాహా లేక ఓం భ్రాం భ్రీం భ్రౌం స్వాహా రాహవే నమః అనుమంత్రమున 40 రోజులు 18 వేల జపం జేసి కస్తూరి ఏనుగు దంతం సాంబ్రాణి కలిపి మరగించిన నీటితో స్నానము జేసిన రాహుదోషం కొంతవరకు పోతుంది.

**కేతువు:** మనోవ్యధ, ఆకస్మిక మరణము వెన్నెముక వ్యాధి దృష్టి లోపము శత్రుబాధ అరాచకము వంధ్యత్వము దీర్ఘరోగం అధిక కోపము పై దోషములకు కేతుగ్రహ జపము వైఢూర్యము, ఉలవలు, నూనె, శాలువ, కస్తూరి దానము చేయవలెను. కొమ్ముతో త్రవ్వబడిన మట్టి మేకపాలు కలిపి ఆనీటితో స్నానము

జేసిన కొంత తగ్గును. శుభతిధి గల మంగళవారం రోజున ఓం హ్రీం క్రూం క్రూర రూపిణే కేతవే ఐం సౌం స్వాహా ఈ మంత్రమును 40 రోజులలో 7వేల జపము చేయవలెను. సాంబ్రాణి, నువ్వుచెట్టు ఆకులు, ఏనుగు దంతం, మేక మూత్రం, మారేడుపట్ట ఈవస్తువులు నీళ్ళలో వేసి మరిగించి స్నానము చేయవలెను.

## 97. ముసల యోగము

శ్లో॥ కర్మస్థాన గతేరాహౌ కర్మపే స్వోచ్ఛరాశిగే।
రవి పుత్రేణ సంధృష్టే యోగోముసల సంజ్ఞితః।
పద్మపత్ర విశాలాక్షః ప్రసన్న వదనోబలీ।
మంత్రీవాణిజ్య ధనవాన్ ముసలే కామజీవనః॥

పై శ్లోకముననుసరించి జన్మలగ్నము నుండి కర్మస్థానమున రాహువు ఉండి. దశమాధిపతి ఉచ్ఛస్థానము యందుడి శనిదృష్టి తగిలనచో జన్మకుండలిలో ముసల యోగము కల్గును. ఇలాంటి యోగము కలవారు దనమును అధికంగా సంపాధించడం, మంచి ఆలోచనశక్తి, మంత్రులు, కార్యదక్షులు, ప్రశాంతత, శాంతమైన ముఖము, విశాలమైన నేత్రములు కలిగి ఉందురు.

## 98. భూపయోగము

శ్లో॥ రాహు స్థితాంశనాథస్య త్రికోణే సాధిపేయది।
భూమిపుత్రేణ సంయుక్తే భూపయోగః ప్రకీర్తితః।
శత్రుహంతా సుసల్లా పస్సేనానీ రాజశేఖరః ।
నృప యోగేతు సంజాతో రాజాబ్దాద్వేదవత్సరే ।

పై శ్లోకము ననుసరించి రాహువు యొక్క నవాంశాధిపతియున్న రాశినుండి, త్రికోణమునందు ఆ రాశ్యాధిపతి కుజునితో చేరి ఉన్నచో ఆ జాతకునికి భూపయోగము కల్గును. ఈ యోగము వలన మంచివాక్స్ఫుటము శతృరహితుడు సేనాధిపతులుగా, రాజులుగా ఉందురు.

## 99. క్రోధ యోగము

శ్లో॥ లాభేశ్వరే దృగాణేతు సరాహౌ బుద్ధినాయకే।
భూమ్యాత్మజేన సంధృష్టే క్రోధయోగోపి సౌఖ్యం।
పాపవిత్తార్జన పరోదా నధర్మపరాయణః ।
సాహసీ క్రోధయోగే తుక్రోధహర్షభయన్వితః॥

పై శ్లోకముననుసరించి పంచమాధిపతి, లాభాధిపతి యొక్క ద్రేక్కోణము నందున్న రాహువుతో కలిసి కుజుడు దృష్టి కల్గిన ఈయోగము కల్గును. ఈ యోగము వలన కోపము, సంతోషము, సాహసం చెడుకర్మల ద్వారా ధనము సంపాదించుట. దానధర్మములు చేయుట వీరు సుఖవంతులు.

## 100. దుర్గేశయోగము

శ్లో॥ రాహుస్థితాంశాధిపతౌ త్రికోణే।
స్వోచ్ఛంగతే భూమిసుతే బలాఢ్యే।
ధర్మాధిపే సప్తమ భావసంస్థే ।
దుర్గేశ యోగోవన భూమినాథః॥

పై శ్లోకమును ననుసరించి రాహువు యొక్క నవాంశాధిపతి జన్మలగ్నమునుండి త్రికోణము నందు ఉచ్ఛరాశియందు ఉండి కుజుడు బలము కలవాడు అయి సప్తమస్థానమున ధర్మస్థానాధిపతి ఉన్నచో ఈయోగము ఫలించును. ఈ యోగజాతకులు, అడవికి సంబంధించిన అధికారులు అవుతారు.

## 101. మారుత యోగము

శ్లో॥ రాహుత్రిషష్టలాభ స్థోలగ్నం సౌమ్యయుతేక్షితం।
యోగోయం మారుతోనామ దురితావినాశయాత్॥

పై శ్లోకమును ననుసరించి రాహువు తృతీయ షష్ఠమ, ఏకాదశ స్థానముల యందు ఉండి జన్మలగ్నమునకు శుభగ్రహములతో కలసినను మరియు దృష్టి కల్గినను ఈ యోగము కల్గును. ఇలాంటి యోగ జాతకులకు పాపకర్మలు తగలవు. సామాన్యంగా ఈ యోగజాతకులు పాపపు పనులు చేయరు.

## 102. సర్పశాపము

**1. సర్పశాపము :**

1) జన్మకుండలిలో పంచమంలో రాహువు (లేక) కుజుడు ఉండి రాహువు లేక కుజుడు దృష్టి కలిగి ఉంటాడు.
2) పంచమస్థానములో రాహువు ఉండి అవి మేష, వృశ్చిక రాహువులు అయి ఉండడం
3) పంచమాధిపతి రాహువుతో కలిసి ఉండటం లేక రాహువు దిష్టి కల్గినను
4) జన్మలగ్నాధిపతి కుజునితో కలిసి ఉండడం వల్ల
5) జన్మలగ్నాధిపతి రాహువుతో కలిసి ఉండడం వల్ల

6) జన్మలగ్నంలో రాహువు, శని ఉండడము వల్ల
7) జన్మలగ్నంలో రాహువు పుత్రకారకునికి మూడవ స్థానంలో ఉండటం వల్ల
8) సంతానకారకునితో రాహువు కలిసి ఉండటం వల్ల
9) సంతాన స్థానములో రవి, కుజుడు, బుధుడు, శుక్రుడు, శని ఉండటం వల్ల
10) పంచమాధిపతి రాహువుతో కూడియున్న, శని పంచమముందున్నా, చంద్రునితో కలిసిననూ
11) పంచమాధిపతి దుష్టస్థానమున నీచ, శత్రురాశిలో ఉన్ననూ
12) పంచమాధిపతి రాహువుతో కలిసి యున్నా బుధునితో కలిసినను, చూడబడిననూ
13) కుజాంశలో కుజుడున్నా, పంచమాధిపతి బుధుడైన జన్మలగ్నమున రాహు మాందులున్నారో సర్పశాపము కలుగును.

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆ కుండలిలో సర్పశాపము కల్గును.

## 103. పితృ శాపము

**2. పితృశాపము:**

1) పంచమ స్థానములో రవి నీచ రాశిలో శని నవాంశలో ఉండి రెండు ప్రక్కల చతుర్థ షష్ఠములందు క్రూరగ్రహ సంబంధమున్నచో (లేక) పన్నెండవ లేదా రెండవభావంలో పాపగ్రహములు ఉండటం వల్ల.
2) రవి పంచమాధిపతిగా ఉండి త్రికోణంలో ఉండటం పాపగ్రహాలతో కలసి ఉన్న (లేక) పాపగ్రహముల దృష్ఠి కల్గిననూ.
3) రవికి రెండు వైపులా పాపగ్రహాలు ఉండటం రవికి పాపగ్రహ దృష్ఠి కలిగి ఉండటం రవి రాశిలో గురువు ఉండటం వల్ల.
4) సింహరాశిలో గురువు ధనస్సు లేక మీనములో రవియుండి పంచమము, లగ్నమును పాపయుక్తమైనా.
5) గురువు రవితో కలిసి ఉండి పుత్రస్థానంలో లేదా జన్మలగ్నంలో పాపగ్రహ ములు ఉండటం వల్ల
6) జన్మలగ్నాధిపతి దుర్భలుడై పంచమమందుండి, పంచమాధిపతి రవితో కలిసి లగ్నపంచమములు పాపయుక్తులుకాగా.

7) పంచమ నవమాధిపతులు పరివర్తనులై, లగ్న పంచమములు పాపయుక్తమైనా
8) జన్మ లగ్నంలోను, పంచమస్థానంలోను రవి, కుజుడు, శని ఉండటం వల్ల.
9) పంచమాధిపతి రాహువుతోకలిసి ఉండటం వ్యయాధిపతి లగ్నంలో ఉండటం వల్ల
10) దశమాధిపతి కుజుడై పంచమాధిపతితో కలిసి లగ్నపంచమ దశమములు పాపయుక్తమైనా
11) అష్ఠమాధిపతి పంచమభావంలో ఉండటం దశమాధిపతి అష్టమంలో ఉండటం వల్ల
12) షష్ఠాధిపతి, దశమాధిపతి పుత్ర స్థానములో ఉండటం పుత్రకారకుడు రాహువుతో కలిసి ఉంటాడు.
13) దశమాధిపతి పాపస్థానగతుడై, కారకుడైన గురువు పాపరాశిగతుడై లగ్నపంచమాధిపతులు పాపులతో కూడి ఉంటాడు.
14) రవికుజశనులు లగ్నపంచమములందుండగా అష్ఠమ వ్యయములందు గురువు రాహువులుంటే
15) రవి అష్ఠమమున శనిపంచమమున ఉండి పంచమాధిపతి రాహువుతో కూడిన
16) వ్యయాధిపతి లగ్నమున అష్ఠమాధిపతి పంచమమున దశమాధిపతి అష్ఠమమున ఉండాలి.
17) షష్ఠాధిపతి పంచమమున, దశమాధిపతి షష్ఠమున గురువుతో కలిసనను, పితృశాపము కలుగును.

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆ జన్మకుండలిలో పితృశాపము కల్గును.

## 104. మాతృశాపము

**3. మాతృశాపము:**

1) పంచమాధిపతియైన చంద్రుడు నీచయందుగాని పాపగ్రహాల మధ్యగాని చతుర్ధ పంచమములందు పాపులతో కూడియున్న ఉన్నచో
2) పంచమమందు నీచస్థితిలో చంద్రుడు లాభము యందు శని చతుర్థమున పాపులు ఉన్నచో.
3) జన్మలగ్నాధిపతి నీచయందుండి. చంద్రుడు పాపయుక్తుడై పంచమాధిపతి షష్ఠష్ఠామవ్యయస్థానముల యందు ఉన్నచో

4) జన్మలగ్న పంచమములు పాపయుక్తులై చంద్రుడు పాపాంశయందుండిన పంచమాధిపతి దుష్ఠస్థానమున ఉన్నచో.

5) నవమ స్థానములో గాని, పంచమములలో గాని పంచమాధిపతి చంద్రుడు, కుజుడు, శని, రాహువు కలిసి ఉన్నచో

6) లగ్న పంచమాధిపతుల షష్ఠమున, చతుర్థాధిపతి అష్ఠమమున, దశమ అష్ఠమాధిపతులు లగ్నమున ఉన్నచో.

7) క్షీణచంద్రుడు సప్తమమున చతుర్థపంచమములందు రాహుశనులున్నా లగ్నము పాపగ్రహముల మధ్య ఉన్నచో.

8) జన్మలగ్నమున షష్ఠాష్టమాధిపతులు, వ్యయమందు చతుర్థాధిపతి పంచమ మున చంద్రుడు గురుడు పాపయుతుడైనా

9) జన్మలగ్నంలో కాని పంచమములలో గాని చతుర్థాధిపతి కుజుడు, శని, రాహు, రవి, చంద్రులు కలిసి ఉంటే.

10) అష్ఠమాధిపతి పంచమమున పంచమాధిపతి అష్ఠమమున ఉండి చతుర్థాధిపతియందు చంద్రుడు దుష్ఠస్థానములందున్నా

11) కర్కాటక లగ్నములో కుజరాహువులు ఉండి శనిచంద్రులు పంచమములో ఉన్నచో.

12) లగ్న, పంచమ అష్ఠమ వ్యయములందు కుజ, రాహు రవి శనులుంటే, చతుర్థలగ్నాధిపతులు దుష్టస్థానములలో ఉంటే.

13) పంచమమున శనిచంద్రులు ఉండి అష్ఠమమున గురుడు కుజ రాహువులతో కలిసి ఉంటే

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆ కుండలిలో మాతృశాపము కల్గును.

## 105. భాతృశాపము

**భ్రాతృశాపము:**

1) పంచమమున తృతీయాధిపతి కుజరాహువులతో కలిసి మరియు జన్మ లగ్న పంచమాధిపతులు అష్టమము ఉంటే.

2) జన్మలగ్నములో కుజుడు, పంచమమున శని, తృతీయాధిపతి భాగ్యమున, కారకుడు అష్ఠమము ఉన్నచో.

3) గురువు తృతీయమున నీచయందుండి. శనిపంచమమున, చంద్రకుజులు అష్టమమున ఉన్న
4) జన్మలగ్నాధిపతి వ్యయమున, కుజుడు పంచమమున, పంచమాధిపతి అష్ఠమమున పాపుడై ఉన్న
5) జన్మలగ్న పంచమములు పాపుల మధ్య నుండి పంచమలగ్నాధిపతులు షష్ఠాష్టమవ్యయములందున్నచో
6) తృతీయ భావంలో దశమాధిపతి పంచమభావంలో పాపగ్రహంతో శుభగ్రహం కలిసి ఉండి పంచమమున కుజుడున్నా
7) మిధున (లేక) కన్యారాశులు పంచమభావం కావడం ఆ పంచమములో శని రాహువులుండి వ్యయమున కుజ బుధులు ఉన్నచో.
8) జన్మలగ్నాధిపతి తృతీయ భావంలో ఉండి, తృతీయాధిపతి పంచమంలో ఉండి, లగ్న, తృతీయ, పంచమ భావాలలో ఉండటం.
9) తృతీయాధిపతి అష్టమ భావంలో ఉండటం పుత్రకారకుడు పుత్రస్థానంలో రాహుశని గ్రహములతో కలిసి కాని దృష్ఠి కలిగినను.
10) అష్టమాధిపతి పంచమంలో తృతీయాధిపతితో కలిసి అష్టమంలో కుజుడు, శని ఉండటం వల్ల.

## 106. మాతుల (మేనమామ) శాపము

1) జన్మలగ్నంలో శని పంచమంలో బుధ, గురువు, కుజుడు, రాహువు ఉండటం వల్ల
2) జన్మలగ్నాధిపతి పంచమాధిపతి పుత్రస్థానంలో ఉండటం వల్ల
3) పంచమాధిపతి అస్తంగతుడై లగ్నములో ఉండి సప్తమమున శని, బుధుడు లగ్నాధిపతి ఉన్నచో.
4) చతుర్ధాధిపతి లగ్నమున వ్యయాధిపతితో కలిసియుండి పంచమములో చంద్ర, కుజ బుధులు కలిసి ఉన్నచో.

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రంలో ఉంటే ఆ కుండలిలో మాతుల శాపము కల్గును.

## 107. బ్రహ్మాశాపము

బల, సంపత్తి గర్వముతో బ్రాహ్మణుల నవమానించునో వానికి ఆదోషము వలన బ్రహ్మశాపము కలుగును.

1) జాతక చక్రంలో రాహువు ధనురాశి లేక మీనరాశిలో ఉండటం పంచమమున కుజ, గురువు, శనులు ఉండి నవమాధిపతి అష్ఠమమందున్న బ్రహ్మశాపము కల్గును.
2) నవమాధిపతి పంచమమున, పంచమాధిపతి అష్ఠమమున గురు కుజ రాహువులతో ఉన్నచో.
3) నవమాధిపతి నీచుడై వ్యయాధిపతి లగ్నమునగాని, పంచమమున గాని యున్నా రాహువుతో కలిసిగాని దృష్ఠి కల్గిననూ గాని
4) జన్మలగ్న పంచమములందు రాహువు ఉండి గురువునీచుడై, పంచమాధిపతి షష్ఠ్యాష్ఠమ వ్యయము లందున్నచో.
5) రవి, చంద్రుడు, పంచమాధిపతి, గురువుతో కలిసి అష్ఠమమున ఉన్నచో
6) శని నవాంశంలో శనియుండి గురుకుజులతో కలిసి, పంచమాధిపతి వ్యయమందున్నా
7) శని గురువుతో కలిసి జన్మలగ్నమున కాని వ్యయమున గురువు కాని, నవమమమున రాహువు ఉన్నచో ఈ బ్రహ్మశాపము కల్గును.

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆకుండలిలో బ్రహ్మశాపము కల్గును.

## 108. పత్నీశాపము మరియు భర్త శాపము

1) పంచమమున సప్తమాధిపతి సప్తమమభావం నవాంశానికి శని అధిపతి కావటం. పంచమమున అష్ఠమాధిపతి ఉన్నచో
2) సప్తమాధిపతి అష్టమమున, అష్టమాధిపతి పంచమమున ఉండి పుత్రకారకుడు పాపయుక్తుడైనా
3) పంచమమున శుక్రుడు, అష్టమమున సప్తమాదిపతి కారకుడు పాపయుక్తుడైనా
4) కుటుంబస్థానము పాపయుక్తమై, సప్తమాధిపతి అష్టమమునుండి పంచమము పాపయుక్తమైనా
5) జన్మలగ్నపంచమములు పాపగ్రహముల వీక్షణము కలిగి సప్తమాధిపతి అష్టమమున ఉండి భాగ్యమున శుక్రుడు ఉన్నచో.
6) శుక్రుడు భాగ్యాధిపతియై పంచమాధిపతి శతృస్థానమున ఉండి గురువు లగ్న సప్తమాధిపతులు 6, 8, 12 స్థానములందున్నచో

7) వృషభమము, తులారాశులు పంచమము అయి ఆ పంచమములో రాహుచంద్రులు కలిసి ఉండి ప్రథమ, ద్వితీయ, ద్వాదశ భావము లయందు పాపులున్నచో

8) రవి రాహులు జన్మలగ్నములో ఉండి సప్తమంలో శుక్ర,శని గ్రహములు ఉండి అష్టమాధిపతి పంచమములలో ఉన్నచో.

9) ద్వితీయంలో కుజుడు పంచమములో శుక్రుడు ఉండి వ్యయంలో గురువు ఉండి శని రాహువుల దృష్టి కలిగి ఉన్నచో.

10) జన్మలగ్నంలో రాహువు, పంచమములో శని, భాగ్యములో కుజుడు ఉండి, పంచమసప్తమాధిపతుల అష్టమంలో ఉన్నచో.

11) ధన, సప్తమాధిపతులు అష్టమమున ఉండి, పంచమ లగ్నముల శనికుజులుండి కారకుడు పాపయుక్తుడైనా

పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆ కుండలిలో పత్నీశాపము కలుగును. ఈశాపమువలే తీవ్రమైన శాపము భర్తశాపము జాతకంలో చెడుగ్రహదృష్టిఉంటే అష్టమంలో గ్రహదోషం, ద్వితీయంలో గ్రహదోషం వ్యయంలో గ్రహదోషము వలన భర్తశాపము ఏర్పడును దీనివల్ల తీవ్రపరిణామాలు ఉంటాయి. కాలసర్పయోగము ఉండి పై స్థానాలు బాగాలేకపోతే భర్తశాపము కల్గును.

1) ద్వితీయంలో చెడుగ్రహములు అనగా (రాహువు,కేతువు,కుజుడు,శని,రవి)

2) సప్తమంలో అశుభదృష్టి మరియు చెడు గ్రహములు

3) అష్టమంలో చెడు గ్రహములు

4) కాలసర్పయోగము ఉన్నచో

5) వ్యయభావంలో పాపగ్రహముల వలన భర్త శాపము కల్గును.

## 109. ప్రేతశాపము

1) జన్మలగ్న ద్వాదశములందు రాహు గురువులు ఉండి. పంచమమున రవిశనులు, సప్తమమున క్షీణచంద్రుడు ఉంటే

2) పంచమాధిపతి శని అష్టమమున, కుజుడు లగ్నమున కారకుడు అష్టమమున్నచో

3) జన్మలగ్నము పాపయుక్తమై, పంచమమున కుజుడు శనిబుధులు పంచమాధిపతి అష్టమమున కుజుడు శనిబుధులు పంచమాధిపతి అష్టమమున ఉండి వ్యయమున రవి ఉన్నచో.

4) జన్మలగ్నములో రాహువు పంచమము శని ఉండి గురువు అష్టమమున ఉన్నచో

5) జన్మలగ్నములో చంద్రుడు, గురువు, శుక్రుడు, శని రాహువు గ్రహములు ఉండి, లగ్నాధిపతి అష్టమమున ఉన్నచో

6) అష్టమాధిపతి పంచమమున శని, శుక్రులతో కలిసి ఉండి కారకుడు అష్టమములో ఉంటాడు.

7) జన్మలగ్నములో శని గుళికులు ఉండి, సప్తమాధిపతి 6, 8, 12 స్థానములలో ఉండి పంచమమున చంద్రుడు ఉంటాడు.

8) జన్మలగ్నములో శని, పంచమమున రాహువు అష్టమమున రవి వ్యయమమున కుజుడు ఉండాలి.

9) కారకుడు, పంచమాధిపతి నీచస్థులై నీచస్థగ్రహములచే దృష్టికల్గి ఉండాలి. పైన వ్రాయబడిన విషయములు ఏ జాతక చక్రములో ఉంటే ఆకుండలిలో ప్రేత శాపము కల్గును.

## 110. మాతృ శాప పరిహారము

పరమేశ్వరుడు పార్వతీ దేవితో మాతృశాపము గురించి వివరించినాడు ఆ విషయము ఏమనగా శుక్ల పక్షము నందు ద్వాదశి రోజున లేక శుభవారమున పుత్రుల కొర్కై సంకల్పము చేసి విష్ణుమూర్తిని నుద్దేశించి పురుష సూక్తముతో హోమము చేసిన యడల పుత్రసంతానము కలిగి వంశ వృద్ధి కలుగును. దీనికితోడుగా విష్ణుసహస్రపారాయణముచేత విశేష ఫలితములు పొందవచ్చును.

ద్వాదశినాడు స్వగృహ్యాగ్నియందు ఆవుపాలతో విష్ణు ప్రీతికరమైన చరువును శుచిగా వంట తయారు చేయవలెను.

ఈ విధముగా చెరువును తయారు చేసుకొని విధి ప్రకారము ప్రోక్షించి దానితోనే పదహారు పర్యాయములు పురుష సూక్తముతో చరుహోమమును చేయవలెను ఈ పురుష సూక్త హోమమునకు అశ్వర్థ సమిధులు, ఆవునెయ్యితో చేయవలెను. ఈ అగ్ని ముందర రావిపత్రము నుంచి చర్వాహుతి శేషమును ఒక్కొక్క భాగమును ఆ పత్రమునందుంచి తరువాత ఆజ్యహోమమును పురుష సూక్తముతోనే చేసి ఆచరు శిష్ఠములం దాజ్యమును గలిపి స్విష్ఠ కృద్ధోమమును చేయవలెను. తరువాత గృహ్యాసూత్ర ప్రకారముగా, హోమ శేషమును పూర్తిచేయ వలెను.

అశ్వర్థ పత్రమునందు సంపాతమును (ఆకునందు ఉంచిన నెయ్యిని) పురుష సూక్తముచేత ఆచ్ఛాదించి దర్భలచేతగాని హస్తముచేత గాని భార్యను తాకి యుండి పురుష సూక్తమును జపించవలయును తరువాత పురుషసూక్తమునందుండు ప్రతి ఋక్కు చేతను (అనగా ఆకునందుగల నెయ్యిని) ఆ సంపాతములను భార్యచేత భుజింప చేయవలెను. మరియు ఆ అశ్వర్థ పత్రముతోనే పురుష సూక్తముతో భార్యకు జలాపానము చేయించవలెను భార్య యొక్క నాభిదేశమును దర్భతో గాని హస్తముతో గాని తాకుచూ పదహారుసార్లు పురుషసూక్తమును జపించవలెను. ఇలా చేసిన తరువాత బ్రాహ్మణులకు బోజనము పెట్టి వస్త్రదక్షిణ తాంబూలాదులు ఇచ్చి సంతృప్తి పరుచవలెను. సద్బ్రాహ్మణుడు గృహస్థుడైన బ్రాహ్మణునికి పరమాన్నము వాయనము ఇవ్వవలెను. ఇలా చేయుటచేత మాతృశాపము తొలగి సత్‌సంతానము కలుగును ఈ విధముగా పురుష సూక్తముతో చరుహోమమును శ్రీవిష్ణుప్రీతిగా చేయించిన యడల సమస్త దోషములు తొలగి శీఘ్రముగా సంతానము కలుగును వంశము వృద్ధియగును.

## 111.పితృశాప దోషనివారణము

పితృశాప నివృత్తికై నైజమేష యంత్ర శాంతిచేయవలెను. నైజమేష యంత్రమనగా ఎనిమిది నిష్కములు బంగారు లేదా వెండిచేత యంత్రము చేయించవలెను. చేయించిన యంత్రమధ్యమున ఓంకారము (ఓం) వృత్తమందు, త్రికోణమందును, పంచమ కోణమునందును ఈ కోణములందు - మన్మద బీజమును కోణమునందును ఈ కోణములందు - మన్మద బీజమును విష్ణుబీజములు వ్రాసి ఈ యంత్రము 40 రోజులు ప్రతిరోజు ఈ యంత్రమును పూజిస్తూ ప్రతిరోజు మూలమంత్రమును రాజు వెయ్యిసార్లు చొప్పున మండలము వరకు చేసి తరువాత దశాంశ క్షీరతర్పణము దశాంశహోమము హోమదశాంశము బ్రాహ్మణులకు భోజనమువస్త్రదాన దక్షిణలతో సహా పూర్తిచేయవలెను.

దానసందర్భమున ఓ కామరాజా ఈ కామరాజయంత్రమును దానము ఇచ్చుచున్నాను నాకు దీర్ఘాయుష్మంతుండు అగు పుత్రసంతానము ప్రసాదించమని భగవంతుని ప్రార్థించవలెను. సంతానము ప్రసాధించును ఈ విధముగ పితృశాపవిమోచనము కలిగి కుమారులు, మనుమలు, మునిమనుమలు కలిగి భూలోకములో చిరకాలము ఉందురు.

## 112. దైవశాప దోషనివారణ

గంగా జలమందలి సైకతమును (ఇసుకను) తెచ్చి విఘ్నేశ్వరుడిని శివలింగ మును చేయవలెను. చేసిన తరువాత గణపతిపూజ గణపతిసహస్రనామావళి

అధర్వ గణపతి సూక్తముచేత పూజించవలెను మరియు పరమేశ్వరుడికి మహాన్యాస పూర్వకాభిషేకమును తుమ్మిపూలు మారేడుదళములచేత అష్టోత్తర శతనామావళి చేతను సద్యోజాత మంత్రములచేత పూజించవలెను ఇలా మూడు సంవత్సరములు అనగా ప్రతినెలయందు మాసశివరాత్రి యందు మరియు మహాశివరాత్రి యందును పూజించవలెను. ఇలా చేసిన తరువాత శివలింగ దానము బ్రాహ్మణునికి ఇవ్వవలెను. శివలింగ దానము చేయుకాలమందు శివపంచాక్షరిమంత్రమును జపిస్తూ సత్‌సంతానము ప్రసాదించుమని శివుడిని ప్రార్థిస్తు దానము ఇవ్వవలెను. బ్రాహ్మణుడికి భోజనము పెడ్తూ వస్త్రముతోబాటు దక్షిణతాంబూలాదులు ఇచ్చి ఆశీస్సులు పొందవలెను దీని ప్రభావము చేత దైవశాప విముక్తి కలుగును.

## 113. రాహుగ్రహనవాంశ ఫలితములు

1) రాహువు మొదటి నవాంశంయందు ఉన్నచో ఆజాతకుడు మంచి ఆలోచనలు తెలివితేటలు కలిగి ఉండటము లావుగా ఉండటం తల్లిదండ్రులను బాగా చూసుకొంటాడు. సామర్థ్యము, సంఘంలో కీర్తిప్రతిష్ఠలు కలిగి ఉంటారు.

2) రాహువు రెండవ నవాంశం యందు ఉన్నచో ధనవంతుడు దైవభక్తి కలిగి ఉండడం. తీర్థయాత్రలు చేయడం దేశసంచారము, వేదాధ్యయము, ధానధర్మ ములు చేయడం.

3) రాహువు మూడవ నవాంశం యందు ఉన్నచో చంచల స్వభావము దరిద్రము అనుభవించును. పనులల్లో ఆలస్యము కల్గును ఎవరికి ఏమి సహాయం చేయడు అన్ని విషయములలో దీర్ఘకాలము పడుతుంది.

4) రాహువు నాల్గవ నవాంశ యందు ఉన్నచో సున్నితమైన శరీరము ధృడమైన వ్యక్తితత్వము, కలిగి ఉంటారు. సుఖమైన జీవితాన్ని గడపడం వాయుసంబంధ మైన వ్యాధులు కలిగి ఉంటారు.

5) రాహువు ఐదవ నవాంశం యందు ఉన్నచో మొదటి దశలో అనగా 45 సంవత్సరములవరకు విపరీతమైన ఐశ్వర్యము కలిగి ఉండటం బంగారు, వెండిసామాన్లు కలిగిఉండటం. గొప్పధనికుడుగాఉండును. 45 సంవత్సర ముల తరువాత దరిద్రమును అనుభవించును. ఎన్నోకష్టాలు కల్గును.

6) రాహువు ఆరవనవాంశం యందు ఉన్నచో సంఘంలో కీర్తిప్రతిష్ఠలు, ప్రజలచే మన్ననలు పొందడం సుఖజీవితమును గడపడం. స్త్రీలను గౌరవించును. భార్యను ప్రేమించును. అనారోగ్యము కల్గును.

7) రాహువు ఏడవనవాంశం యందు ఉన్నచో, కష్టాలు పడటం, దరిద్రము

అనుభవించును గౌరవ సన్మానములు, అవార్డులు, సంఘంలో కీర్తి, సాహిత్య అవార్డులు, కవులను గౌరవించడం సాహిత్యములో గొప్పఖ్యాతి కలిగి ఉండటము.

8) రాహువు ఎనిమిదవ నవాంశం యందు ఉన్నచో అందరికి సహాయం చేయడం ఇష్టమైన ఆహారము తినడం నెయ్యి, వెన్న, పెరుగు, పాలు, ఐస్‌క్రీం, కూల్‌డ్రింక్స్‌లు ఇష్టపడటం.

9) రాహువుతో తొమ్మిదవ నవాంశం యందు ఉన్నచో రచనలు చేయడం, గ్రంథరచన ప్రింటింగు, DTP (డి.టి.పి), అంగవైకల్యము ఉండును దీర్ఘకాలిక రోగములు కలుగును.

## 114. కేతుగ్రహ నవాంశ ఫలితములు

1) కేతువు మొదటి నవాంశం యందు ఉన్నచో దేశ సంచారము చేయును ఇంజనీరింగు విద్యను అభ్యసించును. అనేక నదులపై ఆనకట్టలను నిర్మించును. మధ్యవయస్సు ఆయుర్ధాయము కలిగి ఉండును.

2) కేతువు రెండవ నవాంశం యందు ఉన్నచో మానవత్వముకలిగి ఉండటం. మంచి భార్యను (లేక) భర్తను కలిగి ఉండటం, పాదయాత్రలు చేయడం భాగ్యవంతుడు అవుతాడు.

3) కేతువు మూడవ నవాంశము యందు ఉన్నచో పరస్త్రీలతో సంబంధము ప్రకారము చేయుట

4) కేతువు నాల్గవ నవాంశము యందు ఉన్నచో విదేశాలకు వెళ్లడం. అక్కడ విపరీతమైన ధనము సంపాదించడం. దానిని అక్కడే ఖర్చుచేయడం. తక్కువ ఆయుర్ధాయము కలిగి ఉండును.

5) కేతువు ఐదవ నవాంశము యందు ఉన్నచో అందముగా ఉండి చాలతక్కువ ఆయుర్ధాయము కలిగి ఉండును.

6) కేతువు ఆరవ నవాంశము యందు ఉన్నచో రాజకీయాలలో ప్రవేశించి మంత్రిపదవి చేపట్టును. వీరికి నీటి సంబంధిత వ్యాధులు వలన ఇబ్బందులు కలుగును.

7) కేతువు ఏడవ నవాంశము యందు ఉన్నచో వైద్యవృత్తిని చేపట్టటం, వేదములను నేర్చుకొనుట. పురాణపఠనములు ఆధ్యాత్మిక భావములు కలిగి ఉండటం.

8) కేతువు ఎనిమిదవ నవాంశము యందు ఉన్నచో గొప్పతత్వములు కలిగి యుండును. గొప్ప యోగిగా మారును.

9) కేతువు తొమ్మిదవ నవాంశము యందు ఉన్నచో డ్రామా (లేక) సినిమాల యందు ఆసక్తి. ఆటలయందు ఇష్టము కలిగి ఉండటం. గ్రామాలలో జరిగే క్రీడల యందు ఆసక్తి కలిగి ఉండును.

## 115. రాహుగ్రహ నక్షత్ర విశ్లేషణ

రాహువు కూడా శుభఫలితములు ఇస్తాడు. సూర్యునితో రామావతారము, చంద్రునితో కృష్ణావతారము కుజునితో నరసింహావతారము, బుధునితో బుద్ధావతారము, గురువుతో వామనావతారము, శుక్రునితో పరుశురామావ తారము, శనితో కూర్మావతారము రాహువుతో వరాహావతారము, కేతువుతో మత్స్యావతారములు అని మహర్షి పరాశరుడు చెప్పాడు.

రవిరాహువుతో కలిస్తే విశేష అస్తిత్వం, చంద్రుడు రాహువుతో కలిస్తే మానసిక బాధలు, కుజుడు రాహువుతో కలిస్తే అనారోగ్యము, మరణ గండములు కల్గును. **జ్యోతిష్యంలో ఆరుద్ర, స్వాతి, శతభిషము రాహు నక్షత్రములు.**

**ఆరుద్ర:** ఈ నక్షత్రములో సూర్యుడు ప్రవేశిస్తే విపరీతంగా వర్షము వస్తుంది. అసలు ఆరుద్ర అంటే ఉక్క (Humidity) అనే అర్ధము వస్తుంది. ఇది పరమేశ్వరుడి నక్షత్రము విపరీతమైన ఉద్రుతమైన నక్షత్రము మరియు విపరీతమైన శాంతివంతమైన నక్షత్రము కూడా ఇది.

ఒకసారి బ్రహ్మ తన పుత్రిక సంధ్య రూపురేఖలావణ్యాలు చూసి మోహిస్తాడు. సంధ్యలేడి రూపము ధరించి వెళ్లుతూ ఉండగా బ్రహ్మకూడా జంతురూపము ధరించి వెంబడించాడు. ఈ అనర్థాన్ని నివారించడానికి శివుడు బ్రహ్మమీదకు బాణం వేసినాడు. ఆ బాణము నుంచి తప్పించుకోవటానికి బ్రహ్మ మృగశిర నక్షత్రముగా మారతాడు. అప్పుడు శివుడు ఆరుద్ర నక్షత్రమై బ్రహ్మని వెంబడిస్తాడు. ఇప్పటికి వాని వెంటపడుతున్నట్లే ఆనక్షత్రము కనపడుతుంది.

ఈ ఆరుద్ర నక్షత్రమునకు అధిష్ఠానదేవత పరమేశ్వరుడు అందువల్ల సోమవారము ఆరుద్ర నక్షత్రము కలిసేరోజున రుద్రాభిషేకము లేక కోరిక గురించి పాశుపతాస్త్ర అభిషేకము చేయుట మంచిది (లేక) కనీసం ఆరుద్ర నక్షత్రము కూడా చేయవచ్చు. ఈ నక్షత్రమునకు అధిష్టానదేవత రుద్రుడు అయితే ఉపదేవత భూదేవత అందువల్ల ఆరుద్రని ఆరాధించడం ముందుగా భూదేవిని ఆరాధించాలి. ఆరుద్ర నక్షత్రజపం చేసేవారు ముందురోజు భూసూక్తం చదవాలి మరియొక ఉ పదేవత వాయువును కూడా పూజించవలెను.

ఆరుద్రానక్షత్రము సర్వశక్తివంతమైనది. మిథునరాశిలో ఉంటుంది. అశ్వని నుండి 6వ నక్షత్రము చాలా గొప్పశక్తులున్న కాస్మిక్ నక్షత్రము దీని అధిష్టాన

దేవత రుద్రుడు ఈ నక్షత్రమునకు క్రింద మంత్రము పఠించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం ఐం హ్రీం సః ఆరుద్రాయై నమః

పై మంత్రాన్ని

జపము చేయాలి శ్రీమహాగణపతి పూజ చేసి అధిష్టానదేవతయైన రుద్రగాయత్రి యంత్రాన్ని కనీసం 1116 సార్లు జపించి ప్రధాన జపము ప్రారంభించాలి.

**స్వాతి:** ఈ నక్షత్రము శక్తివంతమైనది. ఈ నక్షత్రములో వానచినుకును అమృతంలా, శుద్ధిగా చేసే శక్తి ఉంది. రాహువుచే శుద్ధిచేయబడింది. ఈనక్షత్ర ములో వర్షపు చినుకు చిప్పలో పడితే శ్రేష్ఠమైన ముత్యము తయారవు తుంది. చాతకపక్షి (వానకోయిల) స్వాతి నక్షత్రంలో కురిసిన వానచినుకులు త్రాగి సంవత్సరము వరకు నీళ్లు తాగకుండా జీవిస్తుంది. ఈ స్వాతి నక్షత్రమునకు అధిష్టానదేవత వాయువు మరియు పృద్వి, ఈ నక్షత్ర జపము కంటే ముందుగా వాయువు గురించిపూజ, భూదేవత పూజ చేసిన తరువాత నక్షత్ర జపము చేయాలి.

ఈ నక్షత్రము వారు మొండివారు, వాదనా పఠిమ ఎక్కువ. ఈ నక్షత్రము ఫవర్‌ఫుల్ నక్షత్రం, ఈ నక్షత్రమునకు చాలా గొప్ప శక్తులున్నాయి.

ఈ నక్షత్రమునకు క్రింద మంత్రము పఠించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం డం హ్రీం సః స్వాతైన నమః

పైమంత్రాన్ని జపము చేయాలి. వాయు మరియు పృధ్వి మంత్రములను కనీసం 1116సార్లు జపించవలెను.

**శతభిషము:** ఈ నక్షత్రము మహిమ 'దుర్గాసప్తశతిలో ఉన్నది. అమ్మవారి అష్టోత్తర శతనామాల వర్ణన ఉంది ఈ క్రింది శ్లోకము గురించి తెలుసుకుందాము.

భౌమావాస్యాని శామగ్నే చంద్రే శతభిషాం గతె।

విలిఖ్య ప్రపరేత్ స్తోత్రం సభవేత్ సంపదామ్ పదమ్॥

పై శ్లోకముననుసరించి భౌమవతి అమావాస్య అర్ధరాత్రి చంద్రుడు శతభిష నక్షత్రంలో ఉండే ఆ సమయంలో స్తోత్రాన్ని రాసి ఎవరైతే పఠిస్తారో అనగా (దుర్గాదేవి అష్టోత్తర శతనామావళి పఠిస్తారో) వారికి ధనధాన్యములు వృద్ధి చెందుతాయి. వారు ఐశ్వర్యవంతులు అవుతారు. ధనసంబంధమైన ఇబ్బందులు ఎదుర్కొనేవారు శతభిష నక్షత్రములో అమ్మవారిని పూజచేయాలి. నక్షత్రమునకు అధిష్ఠానదేవత వరుణుడు మరియు జలదేవత. ఇక్కడ నక్షత్ర జపము చేసేవారు ముందురోజు వరుణ సూక్తం చదవాలి. అలాగే మరియొక ఉపదేవత జలదేవత జలదేవిని ఉపాసించి మంటపం మధ్యలో కలశస్థాపన చేసి జలంపోసి జలసూక్తం

చదవవలెను. మరియు దీనితోపాటు ఉపదేవత వాయువుకు కూడా పూజ చేయవలెను. వీరు ఆకాశ (ఊర్ధ్వ)మును కూడా పూజించవలెను.

శతభిషనక్షత్రం వారు ఈ క్రింది మంత్రమును పఠించవలెను.

ఓం ఐం హ్రీం శ్రీం లం హ్రీం శతభిషాయై నమః

పై మంత్రాన్ని జపము చేయాలి మరియు సర్పగాయత్రి, మంత్రమును పఠించవలెను. వరుణ మంత్రాన్ని కనీసము 1116 సార్లు జపము చేయవలెను. ఈ నక్షత్రము కూడా అద్భుతమైనది. ఈ నక్షత్రము వారు అందరిని నమ్ముతారు. నమ్మి మోసపోతారు.

## 116. రాహువుతో వ్యాపార సంబంధము

ఏదైన వ్యాపారములు ప్రారంభించుటకు ఆ వ్యాపారములో లాభము ఎలా ఉంటుంది. నష్టము ఎలా ఉంటుంది. ఆరోజు మూహూర్తము ప్రాధాన్యత సంత రించుకుంటుంది. అయితే లగ్నకుండలిలో రాహువు ఏనక్షత్రములో ఉన్నాడో తెలుసుకొని ఆ నక్షత్రము నుండి వ్యాపారము ప్రారంభించబోయే ఆరోజు నక్షత్రమునకు లెక్కించవలెను. ఆ లెక్కలో వచ్చిన గణసంఖ్యను బట్టి ఫలితములు ఉంటాయి.

**ఉదాహరణ:** రాహువు అశ్వని నక్షత్రములో ఉన్నాడు ఆరోజు నక్షత్రము రోహిణి ఉంటే అశ్వని నుండి రోహిణి వరకు లెక్కవేయవలెను. అప్పుడు 'నాలుగు' అవుతుంది. సంఖ్యాపరంగా ఫలితములు ఈ క్రింది విధంగా ఉంటాయి.

| రాహువు ఉన్న నక్షత్రము నుండి | ఆరోజు నక్షత్రం వరకు | ఫలితములు |
|---|---|---|
| రాహువు ఉన్న నక్షత్రము | 1, 2, 3 | వ్యాపారం సామాన్యముగా ఉండును |
| రాహువు ఉన్న నక్షత్రము | 4, 5, 6 | వ్యాపారంలో అధిక లాభాలుండును |
| రాహువు ఉన్న నక్షత్రము | 7, 8, 9 | వ్యాపారంలో నష్టము కల్గును |
| రాహువు ఉన్న నక్షత్రము | 10, 11, 12 | దరిద్రము, నష్టము కల్గును |
| రాహువు ఉన్న నక్షత్రము | 13, 14, 15 | జాయింటు వ్యాపారంలో నష్టము |
| రాహువు ఉన్న నక్షత్రము | 16, 17, 18 | వ్యాపారములో అధిక నష్ట ము |
| రాహువు ఉన్న నక్షత్రము | 19, 20, 21 | లాభనష్టములు సమానము |
| రాహువు ఉన్న నక్షత్రము | 22, 23, 24 | నిధానంగా లాభములు |
| రాహువు ఉన్న నక్షత్రము | 25, 26, 27 | విజయముఅధిక లాభములుకల్గును |

పైపట్టిక ద్వారా కూడా వ్యాపార లావాదేవీలు తెలుసుకొనవచ్చును. పై విధానము ద్వార కుదిరి మళ్లి లగ్నముహూర్తము కుదిరినచో వ్యాపారము భాగా అభివృద్ధి కల్గును పైవిధానము ఏమిటి అంటే ప్రతిరోజు వచ్చే నక్షత్రము చంద్రుడి ద్వారా తెలుస్తుంది. అంటే రాహువు, చంద్రులు సంబంధము అంటే రాహువు, కేతువుల మరియు కాలసర్పదోషము ఉన్నవారు పైవిధంగా వ్యాపారము ప్రారంభించినచో అభివృద్ధి సాధిస్తారు.

## 117. కాలసర్పయోగ శాంతి

జన్మకుండలిలో రాహుకేతువుల మధ్య అన్ని గ్రహములు ఉంటే దానిని కాలసర్పయోగం అందురు. ఈ యోగం వల్ల వివాహ దోషము, సంతానము దోషం, విడిపోవుట, దాంపత్యంలో సుఖము లేకపోవుట. మానసిక అశాంతి, విద్యాభ్యాసంలో ప్రతికూలము, అనారోగ్యము ధనహాని, అభివృద్ధిలో ఆటంకములు కల్గును. ఈ కాలసర్పయోగమును నివారించాలంటే శ్రద్ధాభక్తులతో విధిగా శాంతి చేయటం అవసరం. ఈ శాంతి ద్వారా సంపూర్ణఫలము లభించును. పన్నెండు నాగమూర్తులు ఒకే ధాతువుతో చేసినవి ఉంచి శాంతి, విధాన కర్మలు చేయాలి ఆ పన్నెండు నాగమూర్తులు ఇవి అనంత, కులిక, వాసుకి, శంఖపాల, పద్మ, మహాపద్మ, తక్షక, కర్కోటక, శంఖనాధ, పాతక, విషక్త, శేష సర్పములు. ఈ సర్పములను బంగారు లేక వెండి లేక రాగి లేదా పంచలోహములతో తయారుచేసి శాంతికర్మలు చేయాలి. ఈ సర్పములను నాగమండలం (అష్టదళం) మధ్యలో మానసాదేవి కలశమును ఉంచి ఆ కలశమునకు నాలుగు దిక్కుల నాగమూర్తులను ఉంచి మిగతా ఎనిమిది నాగమూర్తులను ఉంచాలి తర్వాత పంచభూః సంస్కార పూర్వక వహిస్థాపన, గ్రహముల స్థాపన, గ్రహహోమం మరియు క్రమానుసార ముగా దేవతల ప్రధాన హోమం పూర్ణఆహుతి మొదలగు పూజాకార్యక్రమాలు ఉన్నాయి. మరి కొంతమంది నాగప్రతిష్ఠ కూడా చేయుదురు. నాగప్రతిష్ఠలో ఈశాన్యంలో నవగ్రహమండలము ఆగ్నేయంలో చతుష్షి యోగినీ మండలము నైరుతీలో వాస్తుమండలము వాయువ్యంలో క్షేత్ర పాలక మండలము మధ్యలో సర్వతో భద్రమండలము, లింగతో భద్రమండలము వేసి ఈ ప్రతిష్ఠలో నాగదేవతను ప్రధానంగా ఆరాధిస్తారు.

కార్తిక మాసంలో వచ్చేది నాగులచవితి అలాగే శ్రావణమాసంలో కూడ పంచమి తిథితో కూడిన దానిని నాగపంచమి అందురు. నాగారాధన వేదకాలం నుంచి ప్రసిద్ధి చెందినది భుజగము శివునికి ఆభరణము, మహావిష్ణువు నాగశయనుడు, నాగరాజును సేవిస్తే శివకేశవులను సేవించిన ఫలితం కల్గును.

దీర్ఘవ్యాధులతో బాధపడేవారు, చెవిటి, మూగవారు నాగమయ్య పుట్టకు గనుక ప్రదక్షిణం చేస్తే తప్పక ఫలితం ఉంటుందని పురాణాలలో చెప్పబడింది. నాగప్రతిష్ఠ చేస్తే సంతానం లేని వారికి తప్పక సంతానం కలుగుతుంది. నాగుల పుట్టకు ఆవుపాలను పోసి కొబ్బరికాయ కొట్టి ధూపములను వెలిగించి బియ్యంపిండితో చేసిన చలిమిడి, పానకం, వడపప్పు, నైవేద్యం కూడా నివేదన చేయవలెను. నాగుల చవితిరోజున ఉపవాసము ఉండి శాస్త్రీయ పద్ధతిలో నాగరాజును ఆరాధించవలెను. చవితి మరుసటి రోజు మళ్లీ నైవేద్యం పాయసం పాలు నైవేద్యం పెట్టిన తర్వాత ఉపవాసం విరమించి భోజనం చేస్తారు. మరికొంత మంది పాము పుట్టపై నూతనవస్త్రాలు–చీర, రవిక, ధోవతులు ఉంచిన తర్వాత తాము ధరిస్తారు. పురణాలలో నాగరాజుకి స్థానం విశిష్ఠమైనది. అస్సాం దక్షిణ భాగంలో నాగాయ్ పర్వతాలలో నాగజాతివారు ఇప్పటికీ నివసిస్తున్నారు. కాశ్మీరంలో కూడ నాగులు నివసించినట్లుగా కొన్ని ఆధారములు ఉన్నవి కొన్నిచోట్ల నాగమాత విగ్రహం ఏడాదిలో ఆరునెలలు తెల్లని ఇసుక మరో ఆరునెలలు మరొక విధంగా వెలుస్తుంది.

అలాగే కృష్ణానదీ ప్రాంతంలో కూడా నాగజాతి వారు నివశిస్తూ వున్నారని ఇతిహాసాలు, పురాణాలు తెలుపుతున్నాయి. నవంబరు మాసం వచ్చిందంటే కేరళలోని అనేకమంది భక్తులు మన్నార్ శాలలోని శ్రీనాగరాజ్ దేవాలయానికి తరలి వెళ్తారు. సంతానం కోసం ఎన్నో ఏళ్ళు ప్రార్థనలు జరిపిన వృద్ధ మహిళకు ఐదుతలల నాగరాజు జన్మించాడని ప్రతీతి నాగరాజు జన్మదినం సందర్భంగా తులం (నవంబరు) నెలలో 'ఐల్యం' ఉత్సవాలను ఘనంగా నిర్వహిస్తారు.

బ్రాహ్మణదంపతులకు చాలాకాలము నుండి సంతానము లేకపోవుటచే ఆబ్రాహ్మణస్త్రీ పుత్రిడిని ప్రసాదించాల్సిందిగా పరశురాముడిగా ప్రార్థించింది. పరశురాముడు ఆమె కోరికను సర్పదేవత అయిన వాసుకికి తెలియజేశారు. సంతానం కోసం బ్రాహ్మణస్త్రీ చేస్తున్న ప్రార్థనలను వాసుకి ఆలకించిన ఫలితంగా ఆమెకు ముందుగా ఐదుతలల నాగరాజు జన్మించాడని పురాణాలు పేర్కొంటున్నాయి. దేవాలయం లోపల నాగరాజు నివసిస్తుంటాడని భక్తుల విశ్వాసం ఇక్కడ ఉర్లిక మర్తాళ్ అనే ప్రత్యేకమయిన పూజ నిర్వహిస్తారు.

పూర్వం గోదావరి–కావేరి నదుల మధ్య భాగంలో నాగజాతి వారు పరిపాలించారని కొందరి విశ్వాసం. నాగపూర్ అనే నగరం నాగశబ్దం నుంచే వచ్చిందని భావిస్తున్నారు. గుంటూరు జిల్లాలోని నాగార్జున కొండ, అమరావతి, విజయవాడ, ఘంటసాల మొదలైన ప్రాంతాలలో బౌద్ధశిల్పాలు, నాగరాజు, నాగిని ప్రతిమలు విశేషంగా మనం చూడవచ్చు. ముస్లింలకు కూడా నాగరాజు ఆరాధ్య దైవమన్న

విషయం కొంతమందికి తెలియదు. మనం సుబ్రహ్మణ్య స్వామిగా పూజిస్తే ముస్లింలు 'నాగూర్' అనే పేరుతో సేవిస్తారు. 'నాగూర్' అనే పదం నుంచే 'నాగపట్నం' వచ్చిందంటా. సర్పము ప్రాచీన దైవంగా కొలుస్తున్నారు. సంకర్షణుడు అనగా సాక్షాత్తు శ్రీమహావిష్ణువు దీనిని మన్మధునికి మరొక పేరని కొందరు అందరు ఇతను గొప్ప ఆకర్షణశక్తి గలవాడు ఈ శక్తినే సర్పశక్తి అని ఎంతో మంది మహాపురుషులు వేడుకున్నారు. అందుకే శ్రీమన్నారాయణుడు సృష్ట్యాదిలో వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న మొదలగు రూపాలలో విడదీసి సృష్టి, స్థితులకు శ్రీకారం చుట్టాడు. సృష్టికి కారణమైన బీజభావనే సంకర్షణరూపం. ఈ సంకర్షణ రూపంలోని బీజతేజస్సును ప్రద్యుమ్న తత్త్వం ప్రచోదనం చేస్తుంది. మనవేదాల్లో కూడా సర్పసూక్తాలని సర్పమంత్రాలు ఉన్నాయి. పురాతనకాలం నుంచి కూడ సర్పదేవతలకు పూజలు చేస్తున్నారు. సర్పప్రసన్న కర విద్యలు ఉన్నాయి. నాగశిలలు, నాగవిగ్రహాలను కూడా ప్రతిష్టింపచేసారు. కొండగుహలలో అడవులలో కూడా గిరిజనులు, చెంచులు కూడా ఆరాధించారు.

మానసాదేవిపూజ ద్వారా కూడా సర్పదోషం తొలగుతుంది. ప్రాచీనకాలంలో కూడా త్రవ్వకాలలో నాగవిగ్రహాలు దొరికినాయి. మంత్రరీత్యా నాగబేతాళవిద్యలు, నాగభైరవ, నాగాస్త్ర తంత్రమార్గంలో నీలకంఠ, గరుడ, మయూర పరిహారక్రియలు ఉన్నాయి. సృష్టిలో ఏ ప్రాణికి లేని శక్తి సర్పాలకు ఉన్నాయి. అందువల్లే సర్పములు మరణిస్తే వాటి ఆత్మ గ్రహరూపంలో పీడిస్తుంది. సర్పదష్టులైన వారు మరణించినచో వంశంలో ఎవరైన సర్పవ్రతం చేస్తే ఆ పితృదేవతలకి పుణ్యలోకాలు ప్రాప్తిస్థాయి నాగారాధనకు లడ్డూలు, పాలు, తామరకపూలు ప్రతీవైనవి. సర్పారాధన చేసినవారి వంశ అభివృద్ధి చెందుతుంది అని భవిష్యపురాణం చెబుతున్నది. ఈ ఆరాధన చేసిన వారికి వంశంలో ఎవరికి సర్పగండం ఉండదు. ఈ నాగదేవతను 'నాగలింగ' పుష్పాలతో పూజచేస్తారు. పుష్పాలను భగవంతుడు సృష్టించినవి అని దానిలో దైవత్వం దాగి ఉన్నదని కొంతమంది దేవతలకి కొన్ని పుష్పాలు ప్రతి అని ఆపుష్పా లతో ఆరాధన వలన అనుగ్రహం లభిస్తుంది అని శాస్త్రసమ్మతం.

ముఖ్యంగా ఈ నాగలింగ పుష్పం, శివుని ఆరాధనలో ఎక్కువగా కనిపిస్తాయి. శివాలయాలలో కుసుమ వృక్షాలు ఉంటాయి. ఈ నాగలింగ పుష్పాలతో ఏకాగ్రత శివుని పూజించిన మంచి అభివృద్ధి సాధిస్తారు. ఈ నాగలింగపుష్పమును నాగమల్లె పుష్పం అని అందురు. ఈ పుష్పం నాలుగయిదు దళాలతోనడుమ చిన్న కేసరాలతో ప్రకాశించే ఈ పుష్పం మధ్యభాగంలో శివలింగాకృతి ఉండి దానిపై పడగ వంటి దళం ఉంటుంది. ఈ పుష్పంలో ఎరుపు, తెల్లనివి, కుసుమంలోని రంగులలో

ఉంటాయి. ఒక్కొక్కరంగు వివిధ రకాల ఫలితాలను కలుగ చేస్తాయి. ఈ పుష్పాలతో సర్పములను పూజించిన. మంచిఫలితాలు అభివృద్ధికలుగుతుంది. సర్పవిషంతోనే మందులు కూడా తయారుఅవుతున్నాయి. చర్మవ్యాధులకు, చెవి సంబంధ వ్యాధులకు నేత్రరోగాలకు మరియు పాముకుబుసం (చర్మ) వల్ల సంతానం, పురిటి నొప్పులు పడేస్త్రీకి త్వరగా ప్రసవం అవుతుంది. ఏ జన్మలోనో మనము సర్పము పట్ల అపచారం చేయటం వల్ల పగతీరక గ్రహరూపంలోని సర్పాలు మానవులను పీడిస్తాయి. దీనినే కాలసర్పదోషం అందురు. ఈసర్పములు పెనవేసుకుంటే నాగబంధం అందురు. ఈ "నాగబంధం దర్శనం ...... సర్వపాపహరణం" అనే శ్లోకం ఆర్యుల సంప్రదాయం. నాగులు తమ రతి కార్యక్రమాన్ని నాగబంధం అందురు.

నాగబంధం చూస్తేచాల పుణ్యమనీ వాటి దగ్గర తెల్లటి వస్త్రం పెడితే దానిపై నాగబంధం జరిగితే అన్ని విజయాలు కలుగుతాయి అని ప్రజల నమ్మకం. ఇలా కలుసుకోవటం మామిడి, పూలతోటలలోను పెనవేసుకొంటాయి. ఇవి మండువేసవి చల్లబడిన సమయంలో ఈ కార్యక్రమం జరుగుతుంది. రావిచెట్టు, వేపచెట్టుల దగ్గర రాతిపై చెక్కిన సర్పములు ఆ వృక్షముల వద్ద పెట్టి నాగప్రతిష్ఠలు చేస్తారు. ఈ సర్పములను ద్రవిడ జాతి వారు కూడా పూజించే వారు. అనాది కాలం నుండి నాగుల అస్తిత్వం దేవతలతో పాటుగా వర్ణింపబడినది. నాగులను ఈ క్రింది విధంగా స్తుతించారు. వేదములలో

"ఓం నమోఅస్తు సర్పేభ్యో।యేకేచ।పృథివీమను

యే అంతరిక్షే యే। దివి తేభ్య। స్సర్పేభ్యోనమః॥"

"అగ్నిభ్యో యోధ సర్పేభ్యోఽ యేయే చాన్యే తత్సమాశ్రితాః।
బలిం తేభ్యః ప్రయచ్ఛామి పుణ్యమోదన ముత్తమమ్॥
"యాఽఇషవో యాతు ధానా నాన్యేవా వనస్పతి రను
యే వావటిషు శోరతె తేభ్యః సర్పేభ్యో నమః।
"ఓం వ్వసుంభ్యస్త్వా రుద్రేభ్యస్త్వా ఆదిత్త్యేభ్యస్త్వా సజానాయాం ద్యావా।
పృథివీమిత్రా వరుణోత్వ వృష్టయా వతామ్ వ్యయంతు వ్యయంతు వయోక్తతం॥
రిహాణ మరుతా ప్రుసతీగర్గచ్ఛ వృశాప్రుశిర్భం।
త్వా దివం గచ్ఛతతో నో వృష్టిమావహా॥
చక్షుష్టా అగ్నె అసిఽచక్షర్మెపాహి॥"

ఈ విధంగా ఋషుల ద్వారా స్తుతించారు. కాలసర్పయోగం వలన వైహిక సుఖాల యొక్క లోటు పరిపూర్ణంగా ఉంటుంది. నారాయణబలి–నాగబలి చేస్తే దోషనివారణ మార్గము ప్రశస్థంగా ఉంటుంది కాని ఏరకమైన కాలసర్ప యోగం ఉందో తెలుసుకొనవలెను. దానిని బట్టి ఏరకమైన పూజ చేయవలెనో ఆ పూజను చేయాలి.

ఈ సర్పముల గురించి వివిధరకాల పురాణములు ప్రశంసించారు. అగ్ని పురాణంలో దాదాపు 80 రకాల నాగకులాలను వర్ణించినారు. ఈ కాలసర్ప యోగము రాహుకేతువుల ద్వారా ఏర్పడును. అసలు ఈ రాహుకేతువుల రూపము ఏమిటి. భారతీయ మహాశిల్పము గ్రంథములో ఈ క్రింది విధంగా వివరించారు.

రాజావర్తని భోరాహుర్ధూమ్రః కేతుః సదాభవేత్

అర్ధకాయస్థితోరాహుః కేతుః కరపుటా కృతిః

రాహుండవై కుండమద్యగమ్ సర్పశీర్షాకృతిం కేతుః

(భారతీయ మహాశిల్పం)

పై శ్లోకము ప్రకారము రాహువు నైరుతి ముఖము నలుపువన్నె. కేతువు దక్షిణముఖము ధూమ్రవర్ణము రాహువు సగము శరీరము కలిగి యుండుట కేతువు పడగవలె ఉండుట రాహువు కుండము యొక్క నడుమునుండును కేతువు పాము పడగ ఆకారము నుండును.

సింహాసనగతంరాహుం కరాలవదనంవిఖేత్

వరదం ఖడ్గసంయుక్తం ఖేటశూలధరంక్రమాత్॥

ధూమ్రాద్విబాహవః సర్వే వరదాశ్చగదాధాధరా॥

గృధ్రపృష్ఠసమారుంధా లేఖనీయాస్తుకేతవః॥

(భారతీయమహాశిల్పం)

పై శ్లోకమును అనుసరించి రాహువు భయంకరమైన ముఖమును వరదము ఖడ్గము ఖేటము, శూలము గల నాలుగు చేతులను సింహాసనముపైనను లేక రాహుకేతువులు ఇద్దరు దూమ్రవర్ణమును రెండు చేతులును వరదము గద రెండు చేతులయందును గద్దపైనెక్కియున్నట్లును రచించవలయును.

## 118. సంతాన రెమెడీస్

1. సంతాన గోపాలయంత్రాన్ని గాయత్రీ సంపుటీకరణతో బ్రాహ్మణులతో లక్ష పర్యాయాలు జపంచేసి హోమములుదానములుచేసిన సంతానము కలుగును.
2. గాయత్రి మంత్రమును యాభైవేల పర్యాయాలు పంచమాధిపతి వేదమంత్రాన్ని కూడా యాభైవేల సార్లు జపించి జపహోమ తర్పనాదులు చేసిన సంతానము కలుగును.
3. రాహువుకు 18వేల జపం చేసి మరియు కేతువుకు 7వేల జపంచేసి నాల్గు రోజులు ఒకబంగారు సర్పం మరొకటి వెండి సర్పములకు ప్రతిరోజు జపంతో పాటు సర్పములకు అభిషేకములు చివరిరోజు స్పటిక లేకపాదరస లేక మరకతశివలింగమునకు సర్పసూక్త మహన్యాసపూర్వక రుద్రాభిషేకం ఆ అభిషేకం ఐదుపండ్లరసాలతోను, చెరకురసంతోను, అన్నంతోను, రుద్రాక్షల, నవరత్న, స్వర్ణముతో వివిధరకాల అభిషేకములు శివలింగమునకు రాహు కేతువులకు సంబంధించిన దానములు దీనితోపాటు నారాయణబలి, నాగబలి హోమములు సర్పదానములు చేసి బ్రాహ్మణులకు భోజనతాంబూలాదులతో సత్కరించి వారి ఆశ్శీస్సులు పొందవలెను.
4. ఏద్దైనా దేవాలయంలో శాస్త్రీయపద్ధతిలోనే నాగప్రతిష్ఠ చేయాలి.
5. జ్యోతిషరిత్యా పంచమభావమును పంచమాధిపతిని సంతాన కారకుడైన గురువును మరియు దృష్టినిరాశులను వివిధ అంశాలను పరిశీలించి వాటిలోని దోషములకు ఆయాగ్రహాలకు నివారణ చేయవలెను మరియు కృష్ణమూర్తి పద్ధతిలో 2,5,11 భావాల కారకత్వములు దీనికి వ్యతిరేఖ భావములు, 1,4,10 పరిశీలించి అలాగే దీనిని సైంటిఫిక్ పద్ధతిలో రాశిచక్రములో 5 వభావము, మూలగ్రహము, రూలింగ్ మూల గ్రహముల ద్వారా, సంతాన బిందువుద్వారా, బీజము 1,2 బిందువులను సప్తాంశ చక్రములను పరిశీలించి దోషముల నివారించిన సంతానం కలుగును.

## 119. సంతాన దోష పరిహారములు

శ్లో॥ పత్రమేకం పలాశస్య గర్భిణీ పయసాన్వితమ్
ఋత్వంతే తచ్చపీతం చేద్వంధ్యా పుత్రవతీ భవేత్
ఏవం సప్తదినం కుర్యా చ్ఛోకోద్వేగ వివర్జితం
పతిసంగే పుత్రవతీ నాత్ర కార్యా విచారణా॥

పై శ్లోకమునుసరించి మోదగు చెట్టు ఆకులని తెచ్చి (ఒకటి మాత్రమే) ఎవరైన గర్భవతి స్త్రీ యొక్క పాలతో నూరి 7 రోజులు దుఃఖము, ఉద్రేకము విసర్జించి త్రాగి ఎనిమిదవరోజు భర్తతో సంయోగము చేస్తే ఆస్త్రీకి తప్పకుండా

గర్భం వస్తుంది. (ఈరెమెడీ ఋతుస్నానం చేసిన తరువాత చేయాలి).
పైన ప్రక్రియ చేయుముందు ఒకశివాలయంలోకివెళ్ళి బిల్వధళములతో పంచామృతముతో అభిషేకం చేయాలి(శివునకు) ఆ తర్వాత పై విధంగా చేయాలి.

శ్లో॥ దేవదారీయ మూలంతు గ్రాహ్యేత్ పుష్యభాస్కరే
ఏకవర్ణాం గవాందుగ్ధే ఋతుకాలతే భక్షయేత్
ఏవం సప్తదినం కుర్యాద్ వంధ్యా పుత్రవతీ భవేత్
ఉద్వేగం భయశోకౌచ వ్యాయామం పరివర్జయేత్
అత్యంత మృష్టాం శీతంచ దివానిద్రాం తథైవ చ
పతిసంగాద్ గర్భలాభౌ నాత్ర కార్యావిచారణా॥

పై శ్లోకమునసరించి దేవదారు వృక్షం యొక్క వ్రేళ్లను శుభ్రపరచి, శరీరం అంతా ఒకే రంగున్న ఆవు యొక్క పాలను తీసుకొని, ఆపాలలో దేవదారు వేరులను అరగదీసి త్రాగాలి అలాగే 7 రోజులు త్రాగాలి. ఇక్కడొక ముఖ్యవిషయము కలదు ఈ దేవదారు వృక్షము వ్రేళ్లు ఆదివారం పుష్యమి నక్షత్రం రోజు వ్రేళ్లను తీయవలెను ఎనిమిదివరోజు భర్తతో కలవలెను (ఈ రెమెడీ ఋతుస్నానం చేసిన తరువాత చేయాలి) శ్రీఘ్రమే సంతానము కల్గును.

## 120. సంతాన సుబ్రహ్మణ్య యంత్రము

| శం | | లం | | | రం |
|---|---|---|---|---|---|
| | హం<br>42 | శం<br>40 | భూం<br>2 | షం<br>7 | |
| సం | క్లీ<br>6 | క్ష్మాం<br>3 | అం<br>64 | లం<br>45 | వాం |
| | క్షాం<br>48 | ఇం<br>48 | శ్రీం<br>8 | యం<br>1 | |
| | క్రాం<br>4 | రం<br>5 | సం<br>44 | సాం<br>4 | |
| యం | | వం | | | షం |

పై యంత్రమును ఒకరాగి రేకుమీద వ్రాసి ఆ యంత్రముకు అభిషేకము చేసి ఆరాగిరేకును చుట్టి దానిలో మయూరి శిఖ మరియు నీలివేరును తెచ్చి తాయత్తునందు యంత్రమును వేరును పెట్టి ఆ యంత్రమును మూసి దారముతో కట్టుకొనలవలెను. కట్టుకొనినచో సంతానము కల్గును.

## 121. సంతాన గోపాలకృష్ణ మంత్రములు

అస్యశ్రీ సంతాన గోపాలకృష్ణ మహామంత్రస్య నారద ఋషిః। శ్రీసంతాన గోపాలకృష్ణోదేవతా। అనుష్టుప్ఛ్చందః। శ్రీసంతాన గోపాలకృష్ణ అనుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే సంతాన గోపాల మంత్ర జపం కరిష్యే॥

శ్రీఘ్రమేవ సంతానఫల సిద్ధ్యర్థే జపే వినియోగః

**కరన్యాసము**

ఓం దేవకీసుత - అంగుష్టాభ్యాం నమః

ఓం గోవింద - తర్జనీభ్యాం నమః

ఓం వాసుదేవ - మధ్యమాభ్యాం నమః

ఓం జగత్పతే - అనామికాభ్యాం నమః

ఓం దేహిమే తనయం కృష్ణ - కనిష్ఠికాభ్యాం నమః

ఓం త్వామహం శరణగతః - కరతల కరపృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసము**

ఓం దేవకీసుత - హృదయాయ నమః

ఓం గోవింద - శిరసే స్వాహా

ఓం వాసుదేవ - శిఖాయై వషట్

ఓం జగత్పతే - కవచాయహుం

ఓం దేహిమే తనయంకృష్ణ - నేత్రత్రయాయ వౌషట్

ఓం త్వామహాం శరణంగతః - అస్త్రాయఫట్

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానము**

శ్లో॥ వైకుంఠా దాగతం కృష్ణం రథస్థం కరుణానిధిమ్।
కిరీటి సారథిం పుత్రమానయంతం జగత్పతిమ్॥

రథస్థం పుత్రమాడాయ గురవే వైదికాయచ
అర్చయంతం సుతార్థం భావయామ్యహ మచ్యుతమ్॥
శంఖం చక్రం గదాం పద్మం ధారయంతం జగత్పతిమ్
అంకేశయానం దేవక్యాస్సుముఖం మంధిరేశుభే
ఏవం రూపం బాలకృష్ణం భావయామచ్యుతం సదా।

**మూలమంత్రము**

ఓం దేవకీసుత గోవిందం వాసుదేవ జగత్పతే
దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః

పై మంత్రమును సంతానగోపాల యంత్రము మీద పాదరస శివలింగమును పెట్టి అభిషేకము చేసి మళ్లి తిరిగి వెండిశ్రీకృష్ణుని విగ్రహము పెట్టి అభిషేకము చేయాలి ఈ అభిషేకములకంటే ముందు 41 రోజులు యంత్రమునకు మూలమంత్రమును జపంచేసి (3 లక్షలు) ధారపోయాలి. జపం చేసిన తర్వాత శివలింగ అభిషేకం ఆ తరువాత శ్రీకృష్ణుని అభిషేకం అయినతర్వాత యంత్రమును పూజించవలెను. తామర, మల్లెపూలు, చందనం కస్తూరి పసుపు, కుంకుమలతో పూజించవలెను. దానితోపాటు నవగ్రహతైలంతో దీపారాధన నవగ్రహ అగరుబత్తీలతో పూజించవలెను.

**సంతానమంత్రములు (మరికొన్ని) :**

1) ఓం ఐం వాగ్భవేశ్వరీ విద్మహే। క్లీం కామేశ్వరీ దీమహి, తన్నో శక్తిః ప్రచోదయాత్॥

పై మంత్రమును ప్రతిరోజు 108 సార్లు 41 రోజు జపించగలరు.

2) ఓం హ్రీం సాం శరవణభవ సాం హ్రీం ఓం

పై మంత్రమును 41 రోజులలో లక్షజపము పూర్తి చేసి ఏకాదశ మహాన్యాస పూర్వక రుద్రాభిషేకం పూర్తి చేయాలి. ఇంకొక ముఖ్యవిషయం ఏదైన జపం పూర్తి చేసిన తర్వాత దానికి దశాంశక్షీరత్పణము చేయాలి. అభిషేకము అనంతరం తామరపూలు, సుగంధద్రవ్యాలతో తామరగింజలు, నవగ్రహ సమిథులు, గంధపు చెక్క పాయసంతో, గులాభిపూలతో, ఎర్రని కందిగింజలతో హోమము చేయాలి సంతానం కల్గును.

## 122. సంతాన గోపాలకృష్ణ బీజాక్షర మంత్రములు

అస్యశ్రీ సంతాన గోపాలకృష్ణ మహామంత్రస్య నారద ఋషిః అనుష్టుప్ఛందః శ్రీసంతాన గోపాల కృష్ణోదేవతా క్లాం బీజం క్లీం శక్తిక్లూం కీలకం శ్రీ సంతాన గోపాలకృష్ణ ప్రసాద సిద్ధ్యర్థే శ్రీఘ్రమేవ సంతాన ఫలసిద్ధ్యర్థే జపే వినియోగః

**కరన్యాసము:**

క్లాం – దేవకీసుత అంగుష్టాభ్యాం నమః
క్లీం – గోవింద తర్జనీభ్యాం నమః
క్లూం – వాసుదేవ మధ్యమాభ్యాం నమః
క్లైం – జగత్పతే అనామికాభ్యాం నమః
క్లౌం – దేహిమే తనయం కృష్ణ కనిష్ఠికాభ్యాం నమః
క్లం – త్వామహంశరణగతః కరతలకర పృష్ఠాభ్యాం నమః

**అంగన్యాసము:**

క్లాం – దేవకీసుత హృదయాయ నమః
క్లీం – గోవింద శిరసే స్వాహా
క్లూం – వాసుదేవ శిఖాయైవషట్
క్లైం – జగత్పతే కవచాయహుం
క్లౌం – దేహిమే తనయం కృష్ణ నేత్రత్రయాయ వౌషట్
క్లం – త్వామహంశరణం గతః అస్త్రాయఫట్

ఓం భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్:**

శంఖచక్రధరం దేవం శ్యామవర్ణం చతుర్భుజం
సర్వాభరణ సందీప్తం పీతవాసన మచ్యుతమ్
మయూర వింద సంయుక్తం విష్ణు తేజోన బృంహితం
సమర్పయంత్రం విప్రాయ నష్టానానీయ బాలకాన్

**మూలమంత్రము:**

ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః శ్రీం హ్రీం క్లీం స్వాహాః

పైన భీజాక్షర మంత్రము చేయలేనివారు

ఈ క్రింది మంత్రముతో కూడా జపము చేయవచ్చు.

<u>మూలమంత్రం:</u>

ఓం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణం గతః॥

పై మంత్రమును కనీసం లక్షా 25వేలు (లేక) 2 లక్షల 7 వేలు చేసిన మధ్యమము 3 లక్షలు చేసిన ఉత్తమము.

విశేషంగా చేయాలని అనుకొనేవాళ్లు సంతాన గోపాల యంత్రము తీసుకొని ఇంటికి ఈశాన్యమూలలో ఉంచి జపమును ధారపోయాలి అలాగే ఆ యంత్రమునకు సంతాన పాశుపతాస్త్రరుద్రాభిషేకము పాదరసలింగముతో చేయాలి. అభిషేకం చేసేటప్పుడు జపము అయిన తర్వాత సంతాన గోపాలయంత్రము మీద రసలింగము ఉంచి పంచామృతముతో, గంగాజలంతో, పండ్లరసాలు, చెరుకు రసంతో, నవరత్నాలు, రుద్రాక్షలతో మొదలగు వస్తువులతో అభిషేకం చేయాలి.

అలాగే రెండు జంటసర్పాలు ఉంచికూడ సర్పసూక్త సంతాన పాశుపతాస్త్ర అభిషేకం చేయవచ్చు. జపము గురువారము చేయాలి. ఏ రోజు జపఫలితం ఆరోజే ధారపోయాలి. జపం అయిన తర్వాత ఆ యంత్రానికి పూజ కార్యక్రమములు నిర్వహించవలెను. జపము పూర్తి అయిన తర్వాత దశాంశక్షీర తర్పము తప్పకుండా చేయాలి.

## <u>సంతాన గోపాల మంత్రము</u>

అస్యశ్రీ గోపాల మహామంత్రస్య। నారదఋషిః అనుష్టప్ ఛ్ఛందః।

సంతానదాయకః। కృష్ణోదేవతా। క్లీం, బీజం। స్వాహాః శక్తిః।

ఓం కీలకం। జపే వినియోగః।

ధ్యానం-పాదైశ్చతుర్భిః పూర్వార్ధే నోత్తరార్ధేస కర హృదయాదిన్యాసః।

క్లామిత్యాది అంగన్యాస, కరన్యాసః

క్లాం - అంగుష్టా - హృదయా -

క్లీం - తర్జనీ - శిరసే -

క్లూం - మధ్యమా - శిఖాయై

క్లైం–అనామికా – కవచాయ–

కః, – కనిష్టికా – నేత్రత్రయాయ –

అస్త్రాయ ఫట్

**ధ్యానం:**

శ్లో॥ శంఖచక్రధరం దేవం శ్యామవర్ణం చతుర్భుజం

సర్వాభరణ సందీప్తం పీతవాసన మచ్యుతమ్।

మయూర వింద సంయుక్తం విష్ణుతేజోన బృంహితం।

సమర్పయంతం విప్రాయ నష్టా నానీయ బాలకాన్॥

మనుః॥ క్లీం దేవకీసుత గోవింద వాసుదేవ జగత్పతే।

యజమానస్య దేహిమే తనయం కృష్ణత్వామహం శరణం గతః

హ్రీం దేవకీ సుతగోవింద వాసుదేవ జగత్పతేః।

యజమానస్య దేహిమే తయం కృష్ణ త్వామహం శరణం గతః॥

భూర్భువస్సువరోమితి దిగ్బంధః।

## 123. కాలసర్ప ఆవరణ పూజ

కాలసర్ప ఆవరణ పూజాం కరిష్యే

ఓం నాగదేవతాభ్యోనమః।

ఓం కాలసర్పదేవతాభ్యో నమః

ఓం అనంతనామ కాలసర్పదేవతాభ్యోనమః।

ఓం కుళికనామ కాలసర్పదేవతాభ్యో నమః।

ఓం వాసుకీనామ కాలసర్పదేవతాభ్యో నమః।

ఓం శంఖపాలనామ కాలసర్పదేవతాభ్యోనమః।

ఓం పద్మనామకాలసర్ప దేవతాభ్యోనమః।

ఓం మహాపద్మకాలసర్ప దేవతాభ్యోనమః।

ఓం తక్షకకాలసర్ప దేవతాభ్యోనమః।

ఓం కర్కోటక నామకాలసర్పదేవతాభ్యోనమః।

ఓం శంఖచూడ నామకాలసర్పదేవతాభ్యో నమః।

ఓం ఘటకనామ కాలసర్పదేవతాభ్యో నమః।

ఓం విషక్తనామ కాలసర్పదేవతాభ్యో నమః।

ఓం శేషనాగనామ కాలసర్పదేవతాభ్యో నమః।

ఓం అష్టనాగ దేవతాభ్యోనమః।

ఓం నవనాగదేవతాభ్యోనమః।

ఓం ద్వాదశనాగదేవతాభ్యోనమః।

ఓంచాయగ్రహదేవతాభ్యోనమః।

ఓం రాహుగ్రహ దేవతాభ్యోనమః।

కేతుగ్రహ దేవతాభ్యోనమః।

ఓం సర్పగ్రహదేవతాభ్యోనమః।

ఓం అశ్వనీ నక్షత్రదేవతాభ్యోనమః।

ఓం మఖానక్షత్రదేవతాభ్యోనమః।

ఓం మూలనక్షత్ర దేవతాభ్యోనమః।

ఓం ఆరుద్ర నక్షత్రదేవతాభ్యోనమః।

ఓం స్వాతి నక్షత్ర దేవతాభ్యోనమః।

ఓం ఛిన్నమస్తాదేవతాభ్యోనమః।

ఓం ధూమవతి దేవతాభ్యోనమః।

ఓం ఆశ్లేష నక్షత్ర దేఉవతాభ్యో నమః।

ఓం కార్తికేయ దేవతాభ్యోనమః।

ఓం త్రిమూర్తి దేవతాభ్యోనమః।

ఓం నీలాంరాయనమః।

ఓం అంతరిక్షదేవతాభ్యోనమః।

ఓం పృధ్విదేవతాభ్యోనమః।

## 124. వృత్తి లేక ఉద్యోగస్థానము

మానవుని జీవితంలో "ధనం మూలం మిధం జగత్" ముఖ్యమైనది ధనము ప్రతిఒక్కరి అవసరం అవసరమే కాదు జీవనానికి మూలం ధనము రావడానికి కారణం వృత్తి ఆవృత్తి ద్వారా ధనము లభిస్తుంది. ఆవృత్తిని జ్యోతిషశాస్త్రము ద్వారా ఈ క్రిందివిధంగా ఎంచుకొనవచ్చు. జాతకుని జన్మలగ్నము నుండి

గాని చంద్రుని నుండి గాని దశమభావాధిపతిని, దశమభావంలో ఉన్న గ్రహములను దశమమునకు సంబంధించి (వృత్తి) గ్రహం బుధుడును విచారించవలెను. అలాగే జన్మకుండలిలో ముఖ్యంగా దశమంలో ఉండే గ్రహమును పరిశీలించవలెను. దశమంలో గ్రహము లేకపోతే ఆరాశ్యాధిపతి నవాంశంలో ఏరాశిలో అయితే ఉన్నదో ఆరాశ్యాధిపతిని బట్టిని వృత్తిని నిర్ణయించవలెను. అలాగే పదవ ఇల్లు అగ్ని, పృధ్వివి, వాయు, జలతత్వ రాశులను పరిశీలించవలెను.

అవి: 1) మేషము, సింహము, ధనస్సు - అగ్నితత్వరాశులు

2) వృషభం, కన్య, మకరము - భూతత్వరాశులు

3) మిధునము, తుల, కుంభము - వాయుతత్వరాశులు

4) కర్కాటక, వృశ్చిక, మీనం - జలతత్వరాశులు

పదవభావము అగ్నితత్వరాశులు అయితే ఫైర్‌మెన్ ఉద్యోగాలు, రసాయన శాస్త్రవేత్తలు, కర్మాగారములు, ఇనుము, లోహపరిశోధనలు, ల్యాబ్ అసిస్టెంట్ మొదలగు అగ్నికి సంబంధించిన వృత్తులు భూతత్వ రాశులు అయితే భూమికి సంబంధించిన కొలతలు ప్లాట్స్, బిజినెస్, గృహనిర్మాణములు, వ్యవసాయము, పొలములు అమ్మటం, కొనటం, తోటపని, వస్త్రముల వ్యాపారము వాయుతత్వరాశులు అయితే టెక్నికల్ విధ్యలు, వృత్తులు, ఉపన్యాసకులు, వార్తాపత్రికలు మరియు వివిధపుస్తకములు వ్రాయుట, ఆస్ట్రాలాజర్‌గాను వివిధ కంపెనీలలో వృత్తులు, జలతత్వరాశులు అయితే నావికులు, పడవలు నడిపేవారు ఫిష్ బిజినెస్, స్విమ్మింగ్ నేర్పేవారు, యుద్ధనౌకాధ్యక్షుడు, సారాబ్రాందీ షాపులు వాటర్ వర్క్సుడిపార్టుమెంటులో ఉద్యోగము, సముద్రలో పనిచేయువారు, బోర్‌వెల్స్ మొదలగు వృత్తులు చేయువారు అవుతారు.

జాతకచక్రములో పదవస్థానములో ఈ క్రిందిగ్రహములు ఉన్నచో దశమభావాధిపతిని దశమమును పరిశీలించి మరియు దృష్టిని కూడా చూడవలెను. ఈ క్రింది గ్రహముల ప్రభావము ఉన్నచో ఆయా వృత్తులను చేపట్టును.

**రవి:** ఫైర్‌మెన్ ఉద్యోగములు, న్యాయవాదులు, జడ్జీలు, ప్రభుత్వఉద్యోగములు, రాజకీయనాయకులు, మేనేజ్‌మెంటు నిర్వహించుట, రాజులు, మంత్రులు, రాయబారులు, బంగారుపని, రత్ననిపుణులు, సర్కస్‌ట్రైనర్లు, నాటకశాలలు, మేనేజర్స్, ఫైనాన్సియర్లు, పిల్లలకు సంబంధించిన వృత్తులు, సంగీతం.

**చంద్రుడు:** నావికులు, చేపలవ్యాపారము, నర్సులు, ముత్యాల వ్యాపారం, విలువైనలోహాలు, మంత్రసానులు, నగలవ్యాపారం ప్రభుత్వకార్యక్రమములు, ధార్మికకార్యక్రమములు, గృహనిర్వాహణ చేయువారు, పాలఉత్పత్తులు, రొట్టెలు అమ్మడం లాండ్రియజమానులు, తోటపని, మిఠాయల వ్యాపారం, రొట్టెలు ప్లాస్టిక్, క్యాటరింగ్, హోటళ్లు మరియు రెస్టారెంట్లలో పనిచేసే వెయిటర్లు, మద్య విక్రేతలు,

**కుజుడు:** సైనికులు, మెకానిక్‌లు, న్యాయవాదులు, మిలటరి అధికారులు, యోధులు, కర్రపనివారు, భూమికొలతలు చేయవారు (సర్వేర్) రసాయనశాస్త్ర లెక్చరర్లు, మందుల కంపెనీలో తయారు చేయువారు, వడ్డీవ్యాపారులు, భీమాఏజెంట్లు, అగ్నిమాపకకేంద్రాలలో పనిచేసేవారు, లోహములలో పనిచేసేవారు, ఆయుధకర్మాగారం, పోలిసు డిపార్టుమెంట్, సర్జన్లు, దంతవైద్యులు, మంగలివాళ్లు, వంటవాళ్లు, హార్డ్‌వేర్, తాళాలు, రియల్ఎస్టేట్ వ్యాపార్లు, బిల్డర్స్, స్లేట్స్ వ్యాపారం (మార్కాపురం పలకల వ్యాపారం) టైల్స్, బండలు వ్యాపారములు, వ్యవసాయము.

**బుధుడు:** ఉపాధ్యాయవృత్తి, ప్రధానోపాధ్యాయులు, లెక్చరర్స్ ఉపన్యాసకులు, ప్రొఫెసర్లు, సైంటిస్టులు, గణితశాస్త్రజ్ఞులు, గ్రంథకర్తలు, ప్రచురణకర్తలు, కార్యదర్శులు, పుస్తకవిక్రేతలు, అకౌంటెంట్లు, చార్టెడ్ అకౌంటెంట్లు, భీమాఏజెంట్లు, బోధనాపరులు, పోస్టల్ ఉద్యోగులు, గుమస్తాలు, డ్రైవర్లు, రైల్లునడిపేవారు, ఇంజనీర్లు, డైరెక్టర్లు, కరస్పాండెంట్లు, స్టెనోగ్రాఫర్లు, రిపోర్టర్లు, స్టేషనరీ, ప్రింటింగ్‌ప్రెస్‌లు, టెలిఫోన్ ఆపరేటర్లు, జోతిష శాస్త్రము మొదలుగునవి.

**గురువు:** మతగురువులు, న్యాయవాదులు, కౌన్సిలర్లు, పండితులు, ప్రజాసేవకులు, పబ్లిషర్లు, రచయితలు, ఉపాధ్యాయలు, ఉపన్యాసకులు, జ్యోతిష్యులు అర్చకులు, ఆలయధర్మకర్తలు, శాస్త్రజ్ఞులు, లెక్చరర్స్ ప్రొఫెసర్స్, క్యాషియర్లు, వేదాంతులు, ట్రావెల్ఏజెంట్లు, సాహిత్యము, ప్రభుత్వఉద్యోగులు, కాలేజి డైరెక్టర్లు, విద్యాసంస్థల అధినేతలు, అవధాన పండితులు, బహుభాషాకోవిదపండితులు, కవులు, సంగీతకళాకారులు, ఇంజనీర్లు, కంప్యూటర్ ఇంజనీర్లు

**శుక్రుడు:** సినిమానటులు(కళాకారులు), కవులు, నృత్యసంగీత కళాకారులు, దుస్తులు తయారిదారులు, సుగంధద్రవ్యాలు, అలంకరణవస్తువులు, సిల్క్

మరియు ఖరీదైన వస్తువులు, బ్యూటీషియన్లు, వినోదాలు, ఫ్యాన్సీ వస్తువులు, ఫర్నీచర్ తయారి, కాఫీ టీ ఎస్టేట్‌లు, స్త్రీలకు సంబంధించిన అన్ని వస్తువులు, కళాత్మకవస్తువులు, ఎంబ్రాయిడరీ, ఫోటోగ్రఫీ, పూలు అమ్మడం, కుట్టుమిషన్లు, నగలవ్యాపారాలు, సారావ్యాపారం, న్యాయవాదులు, వీలునామాలు

**శని:** కార్మికులు, అచ్చుపని, వీదుల వెంటతిరిగి అమ్మటం, కర్మాగారపు కూలీలు, గనులు, బొగ్గు, ఖనిజతైలం, రియల్ ఎస్టేట్, ఇంటినిర్మాణ పనివారు, తోలుపరిశ్రమలు, ఐసుతయారి, గడియారాలు, బొగ్గుచేయడం, సమాధులు నిర్మించేవారు, శవపేటికలు తయారు చేయడం, ఫ్యాక్టరీలలో పనిచేసేవారు, వాచ్‌మెన్‌లు.

**రాహువు**: వైద్యవృత్తి, మందులు, మెడికల్ రిప్రజెంట్స్, సీసము, కార్మికులు, పర్వతప్రాంతవాసులు, మాతామహులు,

**కేతువు:** టి.వి. ఛానెల్స్‌లలో ఉద్యోగములు, భటులు, పురాణపఠనము, గైడ్స్ గా (టూరిజం)

పదవ ఇంటిలో గ్రహము లేకపోతే పదవ ఇంట్లో అధిపతి యొక్క నవాంశమును కనుగొనవలెను. అలాంటినవాంశాధిపతి ఈ క్రింది గ్రహములు అయితే

**రవి అయితే:** మందులు, రసాయనాలు, బంగారు వ్యాపారం

**చంద్రుడు:** వ్యవసాయం, ముత్యములు, ఐస్‌క్రీం

**కుజుడు:** మెకానిక్స్, ఉద్యోగులు, ప్రమాదకరమైనవి

**బుధుడు:** గ్రంధకర్త, రచయిత, గణితశాస్త్రజ్ఞుడు, శిల్పి

**గురువు:** మతబోధకులు, న్యాయవాది, వీలునామాలు

**శుక్రుడు:** దుస్తుల తయారి, పశువుల వ్యాపారం, సంగీతం, నాట్యము, కళాకారులు

**శని:** సేవకులు క్రింది తరగతి ఉద్యోగులు

ఇలా కాకుండా రెండు మూడు గ్రహాలు కలిస్తే వాటియొక్క లక్షణాలు సరిగ్గా మిశ్రమం చేసి నిర్ణయించవలెను. ఉద్యోగప్రారంభ సమయం నుంచి ఉద్యోగంలో అభివృద్ధి చెందుసమయాలను, మొదలైన వాటిని పదవ ఇంటికి ఏదోఒక రకంగా సంబంధం కలిగి ఉన్నగ్రహాల దశలలోనూ, అంతర్దశలలోనూ మాత్రమే నిర్ణయించాలి, పదవ ఇంటి అధిపతి లేదా పదవ ఇంటిలో

ఉన్నగ్రహాలుగాని వాటితో సంబంధం ఉన్న గ్రహాలు దశలు కూడా పరిగణించాలి.

## 125. ముహూర్త శాస్త్రము-రాహుకేతువులు

ఏదైన శుభకార్యక్రమములకు ముహూర్తము నిర్ణయించాలంటే అన్ని విషయములను పరిగణలోనికి తీసుకొంటారు. తారబలం, చంద్రబలం, సప్తమ, అష్ఠమ, శుద్ధి, ఏకవింశతి మహాదోషములు, పంచకరహితము నవగ్రహస్థానములు, దృష్టి పాపగ్రహములు, శుభగ్రహములు, పుష్కరాంశము, వార, నక్షత్ర, తిధులు, యోగ కరణములు, దుర్మూహూర్త, వర్జ్యాధి అమృతఘడియల మీద దృష్టి పెట్టి (మొదలగు వాటి) లెక్కలు వేస్తాము. మంచి శుభముహూర్తమును ఎన్నుకొంటాము. గృహములకు సంబంధించినవి అయితే వృషభ కలశ చక్రముల ద్వారా మంచి ముహూర్తమును ఎన్నుకొంటాము.

అన్ని ముహూర్తములకు అన్ని విషయములు అవసరము ముహూర్త శాస్త్రములో ప్రధానముగా శుభగ్రహములు పాపగ్రహములను మాత్రమే పరిశీలించడము ఛాయాగ్రహములను మాత్రమే పరిశీలించడము ఛాయాగ్రహములు అయిన రాహుకేతువులను విస్మరించడం జరుగుతుంది. ముహూర్త సమయంలో మనము రాహుకేతువులను పట్టించుకొనకపోయిన రాహుకేతువు మాత్రము మనల్ని పట్టించుకొని పీడిస్తాయి రాహుకేతువులని ద్వాదశ రాశులలో మనము వ్రాయకపోయిన ఆయా స్థానాలలో ఆయాఫలితాలు ఇస్తాయి. ముహూర్తమునందు రాహుకేతువుల స్థితి సరిగా లేనప్పుడు వీరికి విషఫలితములు ప్రాప్తించును. ముహూర్తములలో రాహుకేతువులను ఛాయాగ్రహములని పరిగణలోనికి తీసుకోకుండ ముహూర్తములు నిర్ణయించరాదు.

జాతకుని జన్మ, చక్రము నందు రాహు కేతువులు శుభస్థానములో నున్నను ముహూర్తమునందు రాహుకేతువులు సరిగా లేకపోతే అమృతయోగాన్ని ఇవ్వలేరు. తారాబలమును పరిశీలించి నిర్ణయించునపుడు తారక గ్రహమస్తకుడైన కేతువును కూడా పరిశీలించాలి. చంద్రబలానికి అత్యంత ప్రాముఖ్యతను ఇస్తాము చంద్రబలాన్ని బలహీనపరచగల రాహుకేతువులను విస్మరించడం ముహూర్తశాస్త్రములో జరుగుతున్న పొరపాటు. కొంతమంది జ్యోతిష్కులు రాహుకేతువులను ఏదో ఖగోళములో ఉండే చిన్న బిందువులు (నోడ్స్)గా పరిగణిస్తున్నారు. ఏదో ఒక త్రిభుజాన్ని తీసుకొని దానిమీద రెండు బిందువులను గుర్తించి చాపముగా ఉంచి సరళరేఖ గీయడము కాదు పురాతనరోజులనుంచి సప్తగ్రహములు అనలేదు

నవగ్రహములు అని అంటారు. రాహుకేతువులకు పురాణాల ప్రకారం పరమేశ్వ రుడు నవగ్రహాలలో స్థానము కల్పించాడు.,, కొంతమంది జ్యోతిష్కులు రాహుకేతు వుల ప్రభావములేదు అని అంటారు. మళ్ళీ రాహుగురువు కలిస్తే మంచిది కాదు అంటారు. కేతుశుక్రులు కలిస్తే మంచిదికాదు అంటారు. రాహుకేతువులు శు భగ్రహాలతో కలవగూడదంటారు. మరి ఇదేమిటి?

మళ్ళీ దశాంతరదశాలలో రాహుకేతువులకు కూడా స్థానము ఉన్నది కదా మరి ఆరాహుకేతువులను తీసివేయాలా ఇవన్నీ వ్యాపారరీత్యా జ్యోతిష్యముచెప్పేవాళ్ళకు అలవాటే అయింది.

రాహుకేతువులను జాతకరీత్యాగాని, ముహూర్తరీత్యాగాని విస్మరించరాదు.

ముహూర్త శాస్త్రములో రాహుకేతువులు ప్రధానంగ గుర్తించవలసివస్తుంది. శుభముహూర్తకాలము నిర్ణయించునపుడు అమృతగడియలు, పుష్కరాంశమును రాహుకేతువులను పరిశీలించని కారణంగా వివాహాలు విడాకులుగాను, యాక్సిడెంట్లు మొదలగు అనేక ప్రమాదాల పరం పరలు కొనసాగుతూనే ఉ న్నాయి. జాతకాల యందు బాగున్నను శుభముహూర్తముల కాలమునందు రాహుకేతువులను గుర్తించని కారణంగ నిర్లక్ష్యంగా వివాహమునకు జననముల విషయంలో గృహారంభ, గృహప్రవేశములందు జరిగిన నష్టకష్టములు కోకొల్లలుగా గుర్తించడం జరిగింది.

ఇది రాహుకేతువులను సరిగగ్రహించకపోవడమే అమృతఘడియలు శు భపుష్కరాంశములు సరిగ్గా నిర్ణయించినను ఇలాగున జరుగుతున్నాయి కదా కారణము మరిఏదైన ఉందా? అంటే అదికాదు రాహుకేతువులను సరిగ్గా గుర్తించకపోవడమే మూలము.

వివాహలగ్నమునకు రాహు (లేక) కేతువులు వివాహలగ్నంలో ఉంటే మృత్యువు కలుగును (లేక) మృత్యుపుత్రులు కల్గును అనారోగ్యము కల్గును.

వివాహలగ్నము నుండి రెండవ స్థానములో రాహు (లేక) కేతువులు ఉ న్నచో దరిద్రం దుఃఖము కల్గును వివాహలగ్నము నుండి మూడవ స్థానములో రాహువు (లేక) కేతువులు ఉన్నచో అనారోగ్యము, వచ్చిపోవును వివాహలగ్నము నుండి నాల్గవ స్థానములో రాహువు (లేక) కేతువులు ఉన్నచో రోగము మరియు పుత్రత్వం కల్గును.

వివాహలగ్నము నుండి ఐదవస్థానములో రాహువు (లేక) కేతువులు ఉ న్నచో కలహాలు, అనారోగ్యము దుశ్శీలత కల్గును.

జన్మలగ్నం మేషం, వృషభం, కర్కాటకం అందురాహువు ఉన్నా రాహుదశ యోగించును.

1) సప్తమమున్నరాహువు ఉంటే అసంతృప్తి దాంపత్యము
2) సప్తమమున్న రాహువు ఇతరనైసర్గికపాపులతో ఉన్న ఆలస్య వివాహములు
3) సప్తమమున్న రాహువు పాపులతోకలిసి ఉన్నా విధవా స్త్రీ, సంభోగము
4) సప్తమమున్న రాహువు ఇతరనైసర్గికపాపులతో ఉన్న స్త్రీల వలన విశేషధననష్టము
5) సప్తమంలో శనిరాహువులు ఉండి దశమాధిపతి బలహీనుడుగా ఉన్నచో బ్రహ్మాచర్యయోగము కలుగును
7) సప్తమం మిథునమైన కోణంలో రాహువు ఉన్నా భార్య విధేయుడు అవుతాడు.
8) సప్తమములో రాహువుబలము ఉంటే కార్యసాధన, తెలివితేటలు, వివాదస్పధకీర్తి, అభివృద్ధి నిస్సంశయము.
9) సప్తమములో రాహువు ఉండి శుభగ్రహదృష్టి కలిగితే గృహజీవితం సుఖప్రదం
10) సప్తమములో రాహువు ఉండి పాపగ్రహదృష్టి ఉంటే నీచస్త్రీ సాంగత్యము
11) సప్తమము కర్కాటకం, సింహం, మేషం, వృశ్చికములు అయి రాహువు ఉంటే దాంపత్యము సుఖము.
12) సప్తమం ధనస్సు అయి రాహువు ఉంటే స్త్రీలోలుడు
13) సప్తమమందు శనిరాహువులున్నచో భార్యమృతి
14) అష్టమంలో రాహువు వలన అకస్మికమరణం
15) అష్టమంలో రాహువు రవితో కలిసి ధీర్ఘకాల అనారోగ్యము
16) అష్టమంలో రాహువు శనితో కలిసిన అనారోగ్యము
17) అష్టమంలో రాహువు కుజునితో కలిసిన ఆత్మహత్య, ప్రమాదములు, హత్యలు జరుగును.
18) అష్టమంలో రాహువు ఉంటే అక్రమసంపాదన, లంచగొండితనం, పరస్త్రీలయందు ఆసక్తి.
19) సప్తమంలో కేతువు ఉంటే గౌరవభంగము, నీచస్త్రీలతో స్నేహము
20) సప్తమము వృశ్చికమై కేతువు ఉన్నచో స్త్రీమూలక ధనము, స్త్రీ వశీకరణ ఉండును.

21) అష్టమంలో కేతువు ఉన్నచో ఒంటరిజీవితము
22) అష్టమంలో కేతువు బందువులతో కలహములు
23) అష్టమంలో కేతువు ఆయుధాఘాతము
24) అష్టమంలో కేతువు ఉన్నచో ప్రయాణములో ప్రమాదములు
25) అష్టమంలో కేతువు ఉన్నచో అనారోగ్యము
26) అష్టమంలో కేతువు ఉన్నచో స్త్రీలకు వైధవ్యయోగం
27) అష్టమము మేష, వృశ్చికాలలో ఒకటైన అందుకేతువు ఉన్నచో స్త్రీలేక భార్య చేతిలో మరిణిస్తారు.
28) అష్టమం మిథునం, కన్య, వృషభమైన నైసర్గిక పాపులతో కేతువు ఉన్న మరణశిక్ష లేక ఉరి
29) సప్తమము మకరమై కేతువు ఉంటే భార్యకు ధీర్ఘరోగము
30) రాహువు కోణంలో ఉండి మారకస్థానాధిపతులైన 2, 7 అధిపతులతో కలిసి ఉన్నా, దృష్టికల్గిననూ రాహుదశలో మరణము కల్గును.
31) రాహువు చతుర్థమునందుగాని, నవమమునందుగాని ఉన్నచో హూణవిద్యలో అభివృద్ధిచెందును.
32) రాహువు విద్యాస్థానమందు ఉన్నచో గురుకుల విద్యాభ్యాసములో అపశృతి ఏర్పడి అకస్మికంగా విద్యలో ఉన్నత ప్రమాణములు సాధించగలరు.

వివాహలగ్నము నుండి ఏడవస్థానములో రాహు (లేక) కేతువులు ఉంటే మరణం, ధనహాని కల్గును. వివాహలగ్నము నుండి, ఎనిమిదవస్థానములో రాహు (లేక) కేతువులు ఉంటే సౌఖ్యం, అనారోగ్యం కలుగును వివాహలగ్నము నుండి తొమ్మిదివస్థానములో రాహువు (లేక) కేతువులు ఉంటే వంధ్యాదోషము (లేక) గర్భస్రావము ఏర్పడును.

వివాహలగ్నము నుండి పన్నెండవస్థానములో రాహువు (లేక) కేతువులు ఉ ంటే ముఖరోగము వ్యభిచారి అవుతుంది.

వివాహలగ్నము నుండి 3, 6, 8, 11 స్థానములందు రాహుకేతువులు ఉ ండటం మంచిది. మిగితావాటిలలో మంచిదికాదు.

వివాహలగ్నములో చంద్రుడు రాహువు (లేక) కేతువులు కలిసినా దోషము కల్గును.

ఈ విధంగా ప్రతిముహూర్తంలోను రాహుకేతువులు ప్రాధాన్యత సంతరించు కొన్నారు.

## 126. నవగ్రహదోష నివారక పూజాక్రమము

శ్లో॥ మాఘమాసేసి తేపక్షే రౌద్రభేసోమవాసరే।
పూజయే చ్ఛతురుద్రైశ్చ స్ఫాటికంలింగముత్తమమ్।
లింగదానంచ యః కుర్యాత్సపుత్ర శత వార్షికం।
లబ్ధ్వాసుఖమవాప్నోతి మోదతే పుత్రసంపదా।
రవిదోష నివృత్తిశ్చ భవిష్యతి నసంశయ॥

పై శ్లోకము ననుసరించి మాఘమాస శుక్లపక్షము నందు ఆర్ద్రా నక్షత్రయుక్త సోమవారము నందు స్పటిక శివలింగమునకు అభిషేకము (రుద్రనమక చమకము) జేసి శివలింగముదానము చేసిన యెడల నూఱు సంవత్సరములు జీవించి ఉండే కుమారుడు కలుగుతాడు. ఆ కుమారుని వలన సుఖము పొందుతారు. ఇది రవిదోషమును నివారించును. ఈ విషయములు పరమేశ్వరుడు వివరించినాడు.

**ప్రత్యేకవిషయము:** ఈ రవి దోషమునకు సన్‌స్టోన్ శివలింగమునకు అభిషేకము చేయడం కూడా మంచిది.

శ్లో॥ శశిదోష నివృత్యర్థం దుర్గా దేవింప్రపూజయేత్।

పై శ్లోకముననుసరించి దుర్గాదేవిని పూజించవలెను. దానివలన చంద్రదోషము తొలగును.

**ప్రత్యేక విషయము:** దుర్గాదేవి పూజలో రాహుకాలపూజ చేయుట మంచిది దీనివల్ల మంచి సంతానము కల్గును.

శ్లో॥ యది భౌమకృతం దోషం సుబ్రహ్మణ్యస్యపూజనాత్।
తన్మంత్రదశ సాహస్ర జపాన్యతి తక్షణాత్॥

పై శ్లోకము ననుసరించి సుబ్రహ్మణ్య మంత్రమును పదివేల జపము చేసి సుబ్రహ్మణ్య స్వామికి అభిషేకము చేసిన కుజదోషము తొలగును.

**ప్రత్యేకవిషయము:** సుబ్రహ్మణ్య స్వామిని అభిషేకమును పంచామృతాలతోనే కాకుండా పండ్ల రసాలతో (నవరసాలు) చెరుకురసంతో అభిషేకము చేయవలెను. గులాభీ పూలతో పూజించవలెను. ఆరోగ్యమైన సంతానము కలుగును.

శ్లో॥ విష్ణునాసంభవ స్యాస్య దోషస్యశమనం మఖాత్।

సాలగ్రామశిలాధానా త్పుత్రంలబ్ధ్వాస మోదతే ॥

పై శ్లోకము ననుసరించి విష్ణుయజ్ఞము చేసి సాలగ్రామ శిలాదానము చేయవలెను. దీనివల్ల బుధదోషము తొలగును.

<u>**ప్రత్యేకవిషయము:**</u> శ్రీరమాసహిత వీరవేంకటసత్యనారాయణస్వామి వ్రతము చేసి నారయణుని హోమము చేసి సాలగ్రామ శిలాదానము చేయవలెను. ప్రహ్లాదుడులాంటి బాలుడు జన్మించును.

శ్లో॥ గురు శాపస్య దోషస్య ప్రాయశ్చిత్తంహితం శ్రుణు।

ద్విజపుత్రం దరిద్రంహి ప్రతిష్ఠాంతుకరోతి చేత్।

సుపుత్రం పౌత్రసంయుక్తం లబ్ధ్వాతు భువిమోదతే॥

పై శ్లోకము ననుసరించి పేదవాడైన బ్రాహ్మణ కుమారుడికి ఉపనయము చేసి వివాహము చేసి గృహమును భూమిని (పొలమును) ఇవ్వవలెను. ఇలా చేయటము వలన పుత్ర పౌత్రాది యుతుండై సుఖముగా ఉండును. మరియు గురుదోషము తొలగును.

<u>**ప్రత్యేకవిషయము:**</u> చదువు మీద ఆసక్తిగల బ్రాహ్మణకుమారుడికి విద్య నేర్పిస్తే గాని (లేక) విద్యకు ఖర్చు పెడితే (లేక) బ్రాహ్మణుల కుమార్తెకు వివాహము జరిపిస్తే చాలామంచిది.

శ్లో॥ శుక్రసంగతదోషస్య ప్రాయశ్చిత్తముదాహృతం।

సేతు స్నానంచకర్తవ్య మధువాత్రింశతింజపేత్।

మంత్రం జపేత్షోడశీంవాదశసాహస్ర సంఖ్యయా।

దుర్గాపూజాంకృతే సద్యః సుపుత్రం లభతేద్రువమ్॥

పై శ్లోకముననుసరించి సేతు స్నానము చేసి దేవి త్రింశతి మంత్రమును గాని, షోడశీమంత్రమును గాని పదివేలు జపము చేసి దుర్గా పూజ చేయవలెను ఇలా చేయటం వల్ల దీర్ఘాయుష్యముగల పుత్రులు కలుగుతారు.

<u>**ప్రత్యేకవిషయము:**</u> ప్రముఖ శైవక్షేత్రమైన శ్రీశైలంలో పాతాళగంగలో స్నానము చేసి భ్రమరాంబా దేవిని షోడశోపచారములతో పూజ చేయవలెను.

శ్లో॥ శని శాపస్య దోషస్య ప్రాయశ్చిత్తం హితంశ్రుణు।

శివలింగ ప్రతిష్ఠాంచ వంశవృద్ధిం కరం శుభమ్॥

పై శ్లోకము ననుసరించి శివలింగము ప్రతిష్ఠ చేయవలెను మరియు ప్రతిరోజు శివపూజనాచరించి ప్రదోషకాలంబున దంపతులు దీపారాధన చేసి ప్రదక్షణములు ఆచరించి శనిప్రీతికరమైన తిలలు బ్రాహ్మణుడికి దానము చేయవలెను. దీనివలన వంశవృద్ధి కలుగును. శనిదోషము తొలగును.

**ప్రత్యేకవిషయము:** శివలింగము ప్రతిష్ఠచేసి అక్కడే నవగ్రహముల ప్రతిష్ఠ చేయవలెను.

## 127. సైంటిఫిక్ వైబ్రేషన్ నక్షత్ర మంత్రములు

| నక్షత్రములు | | మంత్రము |
|---|---|---|
| 1) అశ్వని | - | ఓం ఐం హ్రీం శ్రీం అం హ్రీం అశ్విన్యై నమః |
| 2) భరణి | - | ఓం ఐం హ్రీం శ్రీం ఇం హ్రీం సః భరణ్యైనమః |
| 3) కృత్తిక | - | ఓం ఐం హ్రీం శ్రీం ఈం సః కృత్తికాయై నమః |
| 4) రోహిణి | - | ఓం ఐం హ్రీం శ్రీం లూం రోహిణ్యై నమః |
| 5) మృగశిర | - | ఓంఐం హ్రీం శ్రీం ఐం హ్రీం సః మృగశిరాయై నమః |
| 6) ఆరుద్ర | - | ఓం ఐం హ్రీం శ్రీం ఐం హ్రీం సః ఆర్ద్రాయై నమః |
| 7) పునర్వసు | - | ఓం ఐం హ్రీం శ్రీం ఐం ఔం పునర్వసయే నమః |
| 8) పుష్యమి | - | ఓం ఐం హ్రీం శ్రీం కం హ్రీం ఐం పుష్యయ్యై నమః |
| 9) ఆశ్లేష | - | ఓం ఐం హ్రీం శ్రీం గం ఖం ఆశ్లేషాయై నమః |
| 10) మఖ | - | ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం ఘం మఖాయ నమః |
| 11) పుబ్బ | - | ఓం ఐం హ్రీం శ్రీం చం పూర్వఫల్గుణ్యైనమః |
| 12) ఉత్తర | - | ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం ఛం జం ఉత్తరఫల్గుణ్యై నమః |
| 13) హస్త | - | ఓం ఐం హ్రీం శ్రీం ఘం సః హస్తాయై నమః |
| 14) చిత్త | - | ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం టం రం చిత్రయై నమః |
| 15) స్వాతి | - | ఓం ఐం హ్రీం శ్రీం డం హ్రీం సః స్వాత్యై నమః |
| 16) విశాఖ | - | ఓం ఐం హ్రీం శ్రీం ఢం ణం వైశాఖ్యై నమః |
| 17) అనురాధ | - | ఓం ఐంహ్రీంశ్రీంతంధంరం హ్రీంఅనురాధయై నమః |
| 18) జ్యేష్ఠ | - | ఓం ఐం హ్రీం శ్రీం ధం జ్యేష్టజ్ఞాయై నమః |
| 19) మూల | - | ఓం ఐం హ్రీం శ్రీం నం పం ఫం సః మూలయై నమః |

20) పూర్వాషాఢ - ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం బం పూర్వాషాఢయై నమః

21) ఉత్తరాషాఢ - ఓంఐంహ్రీంశ్రీంభం హ్రీంసః ఉత్తరాషాఢయై నమః

22) శ్రవణం - ఓం ఐం హ్రీం శ్రీం మం హ్రీం సః శ్రావణ్యై నమః

23) ధనిష్ఠ - ఓం ఐం హ్రీం శ్రీం యం రం సః ధనిష్టాయై నమః

24) శతభిషం - ఓం ఐం హ్రీం శ్రీం లం హ్రీం శతభిషాయై నమః

25) పూర్వాభాద్ర - ఓం ఐం హ్రీం శ్రీం వంశం సః పూర్వాభాద్రయై నమః

26) ఉత్తరాభాద్ర - ఓం ఐం హ్రీం శ్రీం హ్రీం క్లీం షం సం హం క్షం ఉత్తరాభాద్రయై నమః

27) రేవతి - ఓం ఐం హ్రీం శ్రీం అం ఆః ళం రేవత్యై నమః

పై బీజాక్షర మంత్రములను కాలసర్పయోగము కలవారు. రోజు కనీసం 108 సార్లు పఠించవలెను. వాళ్ల నక్షత్రములు చూసుకొని ఆయా నక్షత్రముల వాళ్లు ఆ నక్షత్రము (ఆనెలలో) వచ్చినరోజు నుండి ప్రారంభము చేయవలెను. ఈ పై మంత్రములను లక్షసార్లు జపించాలి. 41 రోజులలో పూర్తి చేయాలి నియమ నిష్టలతో చేయవలెను.

## 128. కాలసర్పయోగముపై రాహువు స్థితి

కాలసర్పయోగ జాతకులపై రాహుకేతువుల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. అన్యగ్రహ సంబంధములే కూడా రాహుకేతువులు ఆయా భావమునందు ఉన్నప్పుడు సామాన్యముగా నుండు ఫలితములు వ్రాయబడుచున్నవి.

1) జన్మలగ్నభావమున రాహువు ఉన్నచో సామాన్యముగా ఉన్నది. స్త్రీజాతకమున, పురుష జాతకమున బిడియంగా ఉండటం భార్య చెప్పినట్లు వినువాడు కాగలడు. లగ్నముబేసి రాశియైన ఆదోషము తగ్గును.

2) ద్వితీయభావ రాహువు ఉన్న జాతకుడు వ్రాతమూలకముగా తన ఊహలను బాగుగా వెల్లడించువాడు అగును. చిత్రలేఖనం, చక్కనివ్రాత, లలిత కళలయందు ప్రవేశం కొంతధనయోగమును విద్యాయోగము కలుగును కుటుంబ బలము తక్కువగా ఉండును.

3) తృతీయభావ రాహువు వలన అది పాపగ్రహక్షేత్రమైన ధైర్యసాహసములు, వ్యాపారము, ఉద్యోగము మున్నగు వాని యందు చొరవతీసుకొని పురోగ మింపగలడు. ఆ స్థానమునకును ఆస్థానాధిపతికిని బలమును బట్టి సోదరులు గాని సోదరీమణులు గాని కలుగుదురు. దానితోపాటు మరియొక గ్రహము

చేరినచో ఆ గ్రహము యొక్క గుణశీలబల ఆదిపత్యములను బట్టి ముద్రాధికార యోగము కూడగలుగును.

4) చతుర్ధ రాహువు స్వస్థానము యొక్క మార్పునకు విదేశీయానం, యాత్రలకు హుణవిద్యకు, మాతృ దీర్ఘాయువునకు కారణము.

5) పంచమ రాహువు వలన సంతానదోషము, స్త్రీ సంతానమును దేశాటనమును కలుగజేయును. యోగ విద్య, వేదాంత జిజ్ఞాస విషయములను తీయు డాక్టరుగాను, సర్పములను ఆడించడం పురుష క్షేత్రమైనచో పురుషసంతానము అది కర్కాటక, తులా వృషభ రాశులైన ఒక్క సంతానము మాత్రమే కలుగును.

6) షష్ఠమ రాహువు వల్ల రోగములు, శత్రువులు జారయోగము, కలిసియున్న గ్రహములను బట్టి రోగములను అంచనావేయాలి.

7) సప్తమ రాహువు వల్ల కళత్ర సుఖహీనత దేశసంచారం రోగపీడిత కళత్రము ఆలస్యపు వివాహం అక్కడ సహజ పాపులైన రవి, కుజ, శనులతో కలిసిన పూర్తి కళత్రదోషము, ఆ రాహువునకు సప్తమాధిపతితోగాని శుక్రునితో గాని సంయోగం కలిగితే కామసౌఖ్యము తక్కువగా ఉండును. కుజునితో చేరిన కులభ్రష్టుడగును. రవితో జేరిన విధవాసంపర్కము కలుగును. శనితో చేరిన నీచస్త్రీతో సంగమం సప్తమమున రవిరాహుసంబంధము సంతాన హీనుని చేయును.

రాహువు గురువు శుక్రుడుతో కలిసి ఉంటే అగ్రకుల వితంతుతో సంపర్కము సప్తమమునరాహువు ఉన్నప్పుడు చతుర్దమున గురువు గాక తక్కిన గ్రహములు ఏవైన ఒకటి జారయోగము కలుగును. చతుర్ధమున రెండు లేక అంతకంటే ఎక్కువ గ్రహములుంటే ఈ యోగము లేదు.

8) అష్టమ రాహువువల్ల జాతకునకు అవమానం అక్కడ రవితో కలిసిన ఆయోగ మునకు బలము ఆయువునకు బలము తగ్గును పనులలో ఆలస్యం అనేక దుస్సంఘటనలు, ఆ రాశి పాపక్షేత్రమైనను కర్కాటకము అయితే కొంత ఆయువును నిచ్చును. లగ్న అష్టమ ఆధిపతులలో ఒకడైన బలవంతుడగా నుండవలెను.

9) నవమ రాహువు పితృకర్మకు కారకుడు అది మకర కుంభము రాశులయందు ఒకటియైన తీర్ధయాత్రలు, గంగాస్నానము చేయించును దశమాధిపతితో కూడిన రాజయోగము మకర కుంభరాశులందున్న కుల మతాచారములను పాటింపని వాడగును అసత్యము, రాహువు చంద్రునితో కలిసినప్పుడు

చంద్రుని ప్రాబల్యము తగ్గును అతడి ఇచ్చు యోగమును కూడా రాహువే ఇచ్చును. తులాలగ్నమై, మిథున రాశులందు గాని కర్కాటకము యందుగాని చంద్రరాహులు కలిసియున్న రాజయోగము కలుగును.

10) దశమస్థితి రాహువు ఏ గ్రహ సంబంధము లేకుండినను యోగ కారకుడే ఇక్కడ చతుర్థ, పంచమ, నవమ రాజ్యాధిపతులలో ఎవరితోనైను చేరియుంటే మంచియోగము దశమస్థానము మేషమై అక్కడ కుజునితో కలిసి ఉంటే కర్కాటకరాశి అయిన ఇక్కడ చంద్రునితో కలిసియున్నను సింహమై అచట రవితోకలిసి యున్నను కుంభమై శనితో కలిసయున్నను అధికారముతో కూడిన గొప్పపదవిని పొందగలరు. మిగితాగ్రహములతో ఆ విధంగా కూడియున్నను ఉన్నత పదవి లభించును. కాని అధికారము తక్కువ.

11) లాభరాహువు ధన వస్తు లాభమునకు విద్యాలాభమునకు కూడా కలిగించును ఆ రాశిగురు బుధ క్షేత్రమైనప్పుడు విద్యాయోగము బాగుండును. మిథున రాహువు కళత్ర యోగము కలిగించును. జ్యేష్ఠ సోదర, సోదరి మణులుందురు, రాహువు ఒక్కడు ఉంటే విదేశస్థుల యొక్క గాని అన్యమతస్థుల యొక్కగాని ఆధిపత్యముల సంస్థలలో ఉద్యోగి అవుతాడు లేదా వారి ఏజెంటు అవుతాడు. అన్యగ్రహసంబంధమున్నప్పుడు ఆయా గ్రహశీలములను బట్టి ధనదాయ ములను గుర్తింపవలెను.

12) ద్వాదశ రాహువు దుర్మరణమును సూచించును లేక దీర్ఘరోగపీడ కలుగు జేయును. ఎక్కువగా వ్యయప్రయాసలకు గురిచేయుము. దుఃఖమును నిరుత్సాహమును, నిరాశ కలిగించును మరియొక గ్రహముతో చేరినప్పుడు అది కేంద్రకోణాధిపత్యములలో ఒకటియైన కొంత ధన యోగమును కలిగించును. ఆగ్రహము పాపగ్రహమైన దుస్సంఘటనలను కలిగించును.

## 129. కాలసర్పయోగముపై కేతువు స్థితి

1) కేతువు తనుభావమందున్న జాతకుడు సామాన్యముగా అందగా లేకపోవడం, పండ్లు ఎత్తుగాను, పొట్టిగా ఉండటం, వంగిన శరీరము, దైవభక్తి, మంచిగుణ ములు, దేశసంచారిగాను, తీర్థయాత్రలు చేయడం, గణిత విద్యయందు ప్రవేశము, రవి గురుక్షేత్రములైన భక్తి జ్ఞానములందు ఆసక్తి ఎక్కువగా రవి గురుక్షేత్రములైన తీర్థయాత్రలు చేయును.

2) కేతువు ద్వితీయమందున్న జన్మించిన కొన్ని నెలలోనే మాటలు వచ్చును. వాగ్ధాటి బాగుండటం పెద్దవయస్సులో మాటలలో హెచ్చుతగ్గులు ఉండటం,

ప్రగల్భములు, అసత్యము, మోసము సంసార సుఖము తక్కువగా ఉండటం లేదా జారుడు గుణము అక్కడ గురువుతో చేరిన మంచు వాగ్ధాటి గంభీర స్వరము కల్గును. ద్వితీయ కేతువుతో శని కలిసియున్న నత్తిమాటలు. తడబాటు కలుగును. బుధనితో కలిసిన నిజము పలుకునని చెప్పుదురు. కాని బుధుడు నవమాధిపతి అయినప్పుడే ఈ యోగము చెప్పవలెను. లేకున్న స్వప్రయోజనము కొరకు అబద్ధములు చెప్పడం ఇది వ్యాపారస్థులకు ప్రయో జనము గురుబుధక్షేత్రమైన చిత్రకళాసక్తియు కలుగను. శుక్రునితో కలిస్తే జారత్వము కలుగును. కుజసంబంధమున గడియారములు మున్నగు యంత్రములు రవిచంద్రుల కలయిక వలన పురోహితం చేయించడం శని కుజునితో కలిసినను ఆలస్యపు వివాహం జరుగును.

3) తృతీయ కేతువు వలన సోదర సోదరీలను కలిగించును ఉద్యోగం, ధైర్యము, స్వార్జిత ధనాదాయము, దానగుణము, ధైవభక్తి, జ్ఞానము కలిగించును. గురువుతో చేరిన గొప్పదాత అవుతాడు. మంచి యోగము కలుగును.

శనితో చేరిన ఆయురారోగ్యము అన్యగ్రహములతో చేరిన ఆయాగ్రహముల కారకత్వభావములకు కొంతహాని కలిగించును తృతీయమందలి బుధకేతు సంబంధము ఉంటే చెవి వ్యాధులు అవయవలోపములు జరుగును.

4) చతుర్ధకేతువు వలన జాతకునికి దేశదిమ్మరిగా తిరగడం, బంధువిరోదం, విద్యాభంగం, సుఖహీనత్వము, మాతృనష్టము, అజ్ఞాతవాసము, పెద్దలను ఎదరింపు, బంధకయోగములు కలుగును.

5) పంచమకేతువు వలన, స్త్రీసంతానము, మంత్రానుష్ఠనము, పూర్వాచార పరాయణత్వము, ఆరాశి కర్కాటక తులలో ఒకటియైన ఉభయ సంతానము అందు స్త్రీ సంతానము ఎక్కువగా ఉండటం, వృషభమైన స్వల్పముగా ఉ భయసంతానము కలుగును. గురువు కేతువులు కలిస్తే భక్తి, జ్ఞానము, వేదాంతము, తీర్ధయాత్రలు, జపము, తపము, దాతృత్వము, వాగ్ధాటి, మోక్షము, వైరాగ్యం, కలుగును. గురువు కేతువులు ఏ భావమందు కలిగినను అక్కడ గురువు చేయుపని ప్రోత్సాహం ఎక్కువగా ఉండును. గురుదశ కంటే కేతుదశ ముందు వచ్చినచో ఆ గురువు చేయు యోగమును కేతువే చేయును. పరిచయమునందలి ఉచ్ఛగురువు స్త్రీ సంతానము నిచ్చును.

6) షష్ఠమ కేతువు వలన చరరాశియైన శతృవృద్ధి, ఋణవృద్ధి, రోగములు, అదిచరేతర రాశియైన వాటికి భిన్నంగా జరుగును. శత్రువులను మోసగించి

వారి భారి నుండి తప్పించుకోవడం విషజంతువుల వలన భయము కలుగును.

7) సప్తమ కేతువు వల్ల జారత్వము, శుక్రకుజసంబంధము వలన యోగమునకు బలమునిచ్చును. గురువుతో చేరిన సత్ప్రవర్తన, వైరాగ్యము కలవాడు అగును. జన్మలగ్నమందు గురుకేతువులున్న కలుగు ఫలితములే ఇక్కడ కలుగును. రవి శని సంబంధము (వారికి స్వక్షేత్రములు కానియెడల) ఆలస్యవివాహ ములు నీచస్త్రీ సంగమమునకు దారితీయును. చంద్రసంబంధము హృదయ వైకల్యమునకు గాని మాతృవియోగమునకు గాని దోహదము చేయును. ఉ దర జలరోగములు, బుధ సంబంధమున్న వివాహ విషయమైన మోసముగాని లేక చాలా సంబంధములు తప్పిపోవుట జరుగును.

8) అష్ఠమ కేతువు వల్ల యోగకారకుడు కాకపోయినను అపకారికాడు. అష్టమ గురువు చేయుపనులనే చేయును. జీవనాధారమును కలిగించును. సంబం ధము గల గ్రహముల గుణశీలాదులను బట్టి ఫలితములు నిర్ణయించవలెను.

9) భాగ్యకేతువు వల్ల నష్టము, ఇక్కడ గురు సంబంధమున్న తీర్ధయాత్రలు, శనిసంబంధమున్న పితృవియోగము కలిగించును. శుక్రసంబంధమున్న కళత్రవియోగము లేక పూర్వార్జితమునకు నష్ఠమునకు దారితీయును. పాపగ్రహసంయోగము అన్యమతప్రచారములు ఆసక్తి దురాభ్యాసములకు లోను కావడం.

10) దశమకేతువు వల్ల జీవనాధారమగు వృత్తిలో ఉద్యోగము, కర్మప్రాధాన్యత, కీర్తిప్రతిష్టలు, పితృపితామహాదులకు జ్ఞాతులకు శ్రాద్ధకర్మలు గయాపిండాలు చేయును.

11) లాభకేతువు వల్ల ఇక్కడ మంచి యోగము కలుగును. ఈ రాశి కేతువునకు స్వక్షేత్ర మూల త్రికోణ ఉచ్ఛస్థానములలో ఒకటియైన లేదా చరరాశిగాని గురుక్షేత్రముగాని అయినచో యోగమునకు బలం ఎక్కువ. అనేక విధముల ధనార్జన కలుగును, వ్యాపారలాభములు కలుగును, సంతానవాహన యోగములు కలుగును, అధికారభివృద్ధి కలుగును.

12) కేతువుకు ద్వాదశము చరరాశియైన గురుద్వాదశస్థితివలెనే కేతుద్వాదశస్థితియు ఫలితమునిచ్చును. పుణ్యలోకప్రాప్తి మోక్షముగాని కలుగును. ఇతర రాశు లలో ఉంటే కష్ఠనష్ఠములు దేశాటన దుఃఖము దుస్సంఘటనలు కలుగును.

## 130. రాహు కేతువులు-శుభయోగములు

1) రాహువు 4, 5, 9, 10 స్థానములందు ఉన్నప్పుడు అది కేంద్రమైన కోణాధి పుని తోడను, కోణము ఐన, కేంద్రాలధిపుని తోడును కలసి యున్న ఆ రాహువు మహార్ధశయందు మంచి రాజయోగము పట్టును.

2) తృతీయమునందు కేతువు శుభగ్రహము కూడి ఉన్నను లగ్నాధిపతితో కలసి ఉంటే, రాజయోగము ఏర్పడును.

3) రాహువు కోణాధిపతితో కలసి కేంద్రమందును, కేంద్రాదిపతితో కలసి కోణమునందు ఉండుట రాజయోగం కలుగను.

4) రాహువు కేంద్రకోణాధిపతులతో గాని, రెండింటికి ఆధిపత్యము పట్టిన గ్రహముతో కలసినపుడు 2,3,11, స్థానములందున్న యోగించును, ఇక్కడ రాహువుతో సంబంధం గల గ్రహ దశలకంటే ఈ రాహుకేతువుల దశలు ముందు వచ్చినపుడును లేదా! ఆ గ్రహదశలు వచ్చు అవకాశము లేనప్పుడు ఈ రాహుకేతుదశలు బాగుగా లేనపుడు ఈ రాహుకేతుదశలు బాగుగా యోగించును.

5) ద్వాదశము చరరాశి అయిన గురు ద్వాదశ స్థితి వలెనే కేతు ద్వాదశస్థితియు ఫలితమిచ్చు పుణ్యలోకాల ప్రాప్తిగాని, మోక్షముగాని కలుగును.

## 131. రాహువుకు సహజపాపులు

రాహువు సహజపాపులందరిలో మిక్కిలిపాపి అందువలన కేంద్ర కోణాధిపతులతో కలిసి కేంద్రము లందున్నపుడు సాధారణంగా మేలు కలిగించదు. లాభమునందున్నపుడు మాత్రము కొంతయోగించును. పాపులతో చేరినను శుభులతో చేరినను అగ్రహములకు కారకత్వము గల భావములకు హాని కలిగించును.

రాహువు శనివలె సహజపాపి అగుటచేత చాలా విషయములందు శనివలెనే పనిచేయును. లగ్న, చతుర్థ, షష్ఠ, సప్తమ, అష్టమ, నవమ, రాజ్య, లాభవ్యయ ములందు ఉన్నప్పుడు శనిచేయుపనినే చేయును. ఉపపదమందుగాని, రాజ్యరూఢమందుగాని ఉన్న శనివలెనే అక్కడనున్న రాహువును యోగించును శుక్రునితో కలిసినను రాహువు కళత్ర దోషమును కలిగించును.

## 132. సర్పసంస్కారము

సర్పమును వధించుట ఈ జన్మలోగాని, పూర్వజన్మలో గాని చేసినట్లు అయితే ఈదోషము పోవటానికి బంగారముతోగాని, వెండితోగాని కర్రను చేయించి

బ్రాహ్మణునికి దానము చేయవలెను. కోట్టులతోగాని, నల్లఆవాలుతోగాని, గోధుమపిండితోగాని, బియ్యపుపిండితోగాని, నువ్వుల ముద్దతోగాని సర్పాకృతిని చేసి "ఏహిపూర్వమృత స్సర్పఅస్మిన్ షిష్ఠేసమావిశ, సంస్కారార్ధమహం భక్త్యాప్రార్ధయామి సమాహితః" అనుచూ షోఢశోపచారపూజలతో పూజించి ఊరిబయటికి తీసికొనిపోయి లౌకికాగ్నిని ప్రతిష్ఠించి యజ్ఞోపవీతిగానే యీ సంస్కారము చేయవలెను. ఇధ్మాధానము అఘారములు చేసి, సర్పమునోట వ్యాహుతులతో ఆజ్యహోమము చేసి

" అగ్నేరక్షణ ......" మంత్రముతో అగ్నిని ముట్టించవలెను.

శ్లో॥ "నమో అస్తు సర్పేభ్యోయేకేచ పృథివీమను।

యే అన్తరిక్షేయేదివితేభ్య స్సర్పేభ్యో నమస్స్వాహా॥

అనుచు కాలుతున్న సర్పమును ప్రార్థించవలెను.

"జ్ఞానతోజ్ఞానతో వాపి కృత స్సర్పవదోమయా

పూర్వజన్మని వాసర్ప। తత్సర్వం క్షంతు మర్హసి"

అని ప్రార్థించవలెను అస్థిసంచయనములేదు మూడురోజుల అశౌచము, నాల్గవ రోజున ఎనమండుగురు బ్రాహ్మణులను పూజించి భోజనములు పెట్టవలెను. దీనివల్ల సర్పమును చంపిన దోషము తొలుగును.

## 133. సర్పశాపనివారకప్రాయశ్చిత్తము

మంచి శుభముహూర్తము చూసికొని తొమ్మిదిమంది బ్రాహ్మణులచే ఈ కార్యమును నిర్వహించవలెను. ఇందులో ఒక బ్రాహ్మణుడు బ్రహ్మగాను మిగితా ఎనిమిది మంది ఋత్విక్కులనుగా నియమించవలెను. భార్యభర్తలు ఇద్దరు బ్రాహ్మణులందరికి 3 లేక 5 సార్లు ప్రదక్షిణలు చేసి నమస్కారము చేయవలెను. తరువాత మహాగణాధిపతి పూజ, స్వస్తిపుణ్యాహవవాచనము. (సంకల్పముతో సహా) ఋత్విగరణము, తరువాత పంచగవ్యములను తీసుకొనవలెను. తరువాత మూడు కుంచముల యవబియ్యమును అన్ని నువ్వులను. కలిపి పిండి చేసి అందులో యాలకులు, లవంగాలు, కర్పూరము, గంధమును వేసి చూర్ణము చేసి అవునెయ్యి వేసి కలిపి ముద్దగా చేసి రెండు సర్పములు చేయవలయును. ఎనిమిది సర్పములను 288 అండములను మరియు కాలకూటమను విషపిండమును శిఖరముతో కూడిన పుట్టను చేసి వాటికి ప్రాణప్రతిష్ఠచేసి సర్పసూక్తములతో షోడశోపచారపూజలను నిర్వహించవలెను.

గోమయముతో భూమిని అలికి పంచరంగులతోను ముగ్గులు వేసి ఒక శుభదినమందు మూడు మంటపములు వేయాలి. ఆమంటపములయందు ఎనిమిది తూముల ధాన్యమును, నాల్గుతూముల బియ్యమును. రెండుతూముల నువ్వులు, ఒక తూము మినుములు ఉంచవలెను. ఆధాన్యము మీద కమలమును లిఖించవలెను. నూలుధారములు చుట్టిన కలశములను ధాన్యముల మీద ఉంచి ఆకలశములలో శుద్ధోదకమును, రత్నములను, కూర్చలను (ధర్భలు), రూపాయ నాణెములు(3), పసుపు, కుంకుమ, గంధం, అక్షతలు, వాటిలో వేసి మామిడి ఆకులు ఉంచి కొబ్బరికాయ పైన ఉంచి వస్త్రముల చేత అలంకరించవలయును. మూడు కర్షముల బంగారము చేత శివున్ని, విష్ణువును, సర్పమును చేయించి కలశములమీద ఉంచవలయును. ఆకలశములందే శంఖ, పద్మ, మహాపద్మ, కుళిక, తక్షక, కర్కోటక, మహానాగకాలకూటములను ఎనిమిది సర్పములను సర్పగాయంత్రి మంత్రము చేత ఆవాహనము చేసి పూజచేయవలెను. తరువాత శివ విష్ణువులను గూడా ఆవాహన చేయవలెను. దక్షిణ కుంభమందు రుద్రుని రుద్రమంత్రములతోను ఉత్తరకుంభమునందు విష్ణువును విష్ణుసూక్తములతోనూ పూజించవలెను. తరువాత సర్పకలశమును తాకి సర్పగాయత్రిని వెయ్యిసార్లు జపించి "నమో అస్తుసర్వేభ్యో యేకేచ పృథివీమను। యే అంతరిక్షే యే దివితేభ్యో స్సర్వేభ్యోనమః॥" అను మంత్రమును 108సార్లు జపించవలెను. తరువాత రుద్ర కళశమును తాకి రుద్ర గాయత్రిని 1000సార్లు జపించి నమకమును, చమకమును, రుద్రసూక్తమును, వరుణసూక్తమును బ్రహ్మసూక్తమును, పురుషసూక్తమును, పవమాన సూక్తమును, భూసూక్తమును, ఆశుశ్శిశాన మంత్రమును, మహాసౌరమును, బృహత్సామ మంత్రమును, రధంతరసామ మంత్రమును, జపించవలయను. తరువాత విష్ణుకలశమును ముట్టుకొని నారాయణ గాయత్రిని 1008 సార్లు జపించి వేదములను, విష్ణుసూక్తమును, మహానారాయణమును, పురుషసూక్తమును, "అతోదేవా ఆవంతున" అను ఆరుమంత్రములను "అభిత్వాశ్రీః" అను మంత్రమును, శ్రీసూక్తమును లక్ష్మీసూక్తమును, వసుసూక్తమును, వాలఖిల్య సూక్తమును, అబ్లింగమంత్రమును, వరుణ సూక్తమును పఠించవలెను.

తరువాత కుంభములకు పశ్చిమమున కుండమును త్రవ్వి గృహ్యోక్త విధిగా అగ్నిముఖాంతమును చేసి తరువాత సర్పసూక్తములచేతను రుద్రసూక్తములచేత విష్ణుసూక్తముల చేత 1008సార్లు పచ్చిపాలాలశసమిధులను తీసుకొని ఆజ్యముతో హోమమును చేయవలెను. తరువాత స్విష్టకృద్ధోమమును పూర్వము తాను చేసిన పిష్ట సర్పములను పిండాదులను అగ్నిముందుంచి దర్భలతో తాకించి "అసుర్వంతు"

మరియు "నమో అస్తు సర్పేభ్యః" అను మంత్రము జపము చేయవలెను తరువాత. వాటికి ప్రాణప్రతిష్ఠ చేసి అగ్నిలో పిండసర్పములన్నింటిని ఉంచవలెను నమో అస్తుసర్పేభ్యః" అను మంత్రములతోను రుద్రసూక్తములతోనూ, సర్పగాయత్రితోనూ 108సార్లు హోమము చేయవలెను.

"మయాపూర్వభవేనాగా హింసితాయూయయేవహి।

తత మధ్యం కృపాదృష్ట్వా కురుధ్వంజీవ పుత్రక।

గూఢ పాద్ధననాద్దోధషాన్మోక్షయిష్యామ్యహంపునః।

దహనాత్సర్వసర్పాణాం మయాజన్మశతార్జితాత్॥"

పై రెండు శ్లోకముల చేత అజ్యముతో 16 సార్లు హోమములో వేయవలెను.

తరువాత పిష్ట సర్పములను దహించిన భస్మమును రుద్రకలశమందున్న జలముతో రుద్రసూక్తములచేత మార్జనచేసి ఆ భష్యమును తీసుకోని, మహానదియందు ఉంచవలెను. అక్కడస్నానము చేసి ముహూర్తకాలము ధ్యాన ముతో ఉన్నతరువాత విష్ణుకలశోదకము చేత వరుణాది మంత్రములతో మార్జన చేసికొని తరువాత ఆ కలశోదకము చేతనే అభిషేకమును చేసికొని తిరిగి సతీసమేతముగా స్నానముచేసి మంచి వస్త్రములు ధరించి సర్పశాపవిముక్తికై బ్రాహ్మణునికి వస్త్రములు ఇచ్చి పూజించి, బంగారుప్రతిమలను, ఆవును, దూడను మరియు దక్షిణలను ఇచ్చి సంతృప్తి పరచవలెను. మిగితా ఎనిమిది మంది ఋత్వికులను (బ్రాహ్మణులను) వస్త్రములు ఇచ్చి పూజించిన తరువాత దక్షిణతాంబూలాదులను సమర్పించవలయును. ఇలా చేయడం వల్ల సర్పశాపము ఉండి మంచి సంతానము (దీర్ఘాయుష్మంతడుగు) కలిగి అనేకసుఖములు పొందును. మనుమలు, మునిమనుమలు గలిగి పితృఋణము విముక్తుడై చివరిలో శాశ్వత స్వర్గలోక సుఖమునొందును. అనగా సర్పశాపము కలిగి సంతానము కొరకై బాధపడువారు పైవి ఆచరించవలెను. అయితే జాతకచక్రమును చూసి పరిశీలించిన పిదప చేయవలెను.

## 134. కాలసర్పయోగరకములపై వివరణ

1. **కాలసర్పయోగము:** రాహుకేతువుల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని కాలసర్పయోగము అంటారు.
2. **అసంపూర్ణ కాలసర్పయోగము:** రాహుకేతువుల మధ్య ఆరుగ్రహములు ఉ ండి ఏడవగ్రహము రాహుకేతువులకు బయట ఉంటే దానిని అసంపూర్ణ కాలసర్పయోగము అంటారు.

3. **సంపూర్ణకాలసర్పయోగము:** రాహుకేతువుల మధ్య సప్తగ్రహములు ఉండి ఆ సప్తగ్రహములు రాహుకేతువుల ఉండే (సమానంగా) రాశిలో ఉండ కూడదు. అలాంటి యోగమును సంపూర్ణ కాలసర్పయోగము అంటారు.
4. **పరిపూర్ణ కాలసర్పయోగము:** రాహుకేతువుల మధ్య సప్తగ్రహములు ఉండి. ఆరాహుకేతువులతో మిగతాగ్రహములు ఒకేరాశిలో ఉన్నచో ఆరాశిలో మిగతాగ్రహములకంటే నక్షత్రంలో ముందు ఉండాలి. అలా ఉంటే అది పరిపూర్ణకాలసర్పయోగము అవుతుంది.
5. **సవ్యకాలసర్పయోగము:** అగ్రభాగములో రాహువు ఉండి అథోభాగములో కేతువు ఉంటే అనగా పైనవైపు రాహువు క్రిందవైపు కేతువు ఉంటే దానిని సవ్యకాలసర్పయోగము అంటారు.
6. **అపసవ్యకాలసర్పయోగము:** అగ్రభాగములో కేతువు ఉంటే అనగా పైనవైపు కేతువు క్రిందవైపు రాహువు ఉంటే దానిని అపసవ్యకాలసర్పయోగము అంటారు.
7. **అనులోమకాలసర్పయోగము:** జన్మలగ్నం నుండి (6) స్థానాలలోపల ముందువైపుకి రాహువు ఉండి అన్ని గ్రహాల వెనకవైపు కేతువు ఉంటే దానిని అనులోమకాలసర్పయోగము అంటారు.
8. **విలోమకాలసర్పయోగము:** జన్మలగ్నం నుండి (6) స్థానాలలోపల ముందువైపుకి కేతువు ఉండి అన్ని గ్రహాలు వెనకవైపు రాహువు ఉంటే దానిని విలోమకాలసర్పయోగము అంటారు.
9. **గోచారకాలసర్పయోగము:** ప్రస్తుత సమయంలో నడుస్తున్న కాలంలో సప్తగ్రహములు రాహుకేతువుల మధ్య ఉంటే దానిని గోచారకాలసర్పయోగము అంటారు.
10. **పూర్ణకాలసర్పయోగము:** రాహువు మరియు కేతువు మధ్య ఆరు (6) గ్రహములు ఉండి ఒకగ్రహం రాహువుతో కాని, కేతువుతోగాని కలిసి ఒకేస్థానం రాహువుతోకాని, కేతువుతోగాని కలిసి ఒకేస్థానంలో ఉంటే దానిని పూర్ణకాలసర్పయోగము అందురు.
11. **అర్ధకాలసర్పయోగము:** రాహువు, కేతువుల మధ్య 6(ఆరు) గ్రహములు ఉ ండి ఏడవగ్రహము వేరుగా ఉన్నట్లయితే దానిని అర్ధకాలసర్పయోగము అంటారు.

**12. ప్రకాశిత కాలసర్పయోగము:** జన్మలగ్నంలో రాహువు ఉండి సప్తమంలో కేతువుతో కలిసి అన్నిగ్రహములు ఉంటే దానిని ప్రకాశిత కాలసర్పయోగము అంటారు.

**13. దృశ్యగోళార్ధకాలసర్పయోగము:** రాహువు ద్వాదశభావములో, కేతువు షష్ఠమభావములో మరియు మిగితా గ్రహములు అష్ఠమ, నవమ, దశమ మరియు ఏకాదశ భావములలో ఉంటే దానిని దృశ్యగోళార్ధ కాలసర్పయోగము అంటారు.

**14. అన్యదృశ్య గోళార్ధకాలసర్పయోగము :** జన్మలగ్నంలో రాహువు, సప్తమంలో కేతువు మరియు అన్యగ్రహములు 8,9,10,11,12 (లేక) 12, 11, 10, 9,8 భావములలోఉంటే అనగా ఒక్క భావము కూడా ఖాళీ ఉండదు ఇలాంటి యోగమును అన్యదృశ్యగోళార్ధకాల సర్పయోగము అంటారు.

**15. అదృశ్య గోళార్ధకాలసర్పయోగము:** షష్ఠమ భావములో రాహువు మరియు ద్వాదశభావములో కేతువు ఉండి గ్రహములు క్రమంగా లగ్నము, ద్వితీ, తృతీయ, చతుర్ధ, పంచమ భావములో ఉండును. (1,2,3,4,5) ఇలాంటి యోగాన్ని అదృశ్య గోళార్ధకాలసర్పయోగము అంటారు.

**16. అన్యఅదృశ్యగోళార్ధకాలసర్పయోగము:** పంచమభావములో రాహువు మరియు లాభభావములో కేతువు ఉండి అన్యగ్రహములు చతుర్ధ, తృతీయ, ద్వితీయ, లగ్న, ద్వాదశ భావములలో ఉండును (4,3,2,1,12) ఇలాంటి యోగాన్ని అన్యదృశ్యగోళార్ధకాలసర్పయోగము అంటారు.

**17. సవ్యకాలసర్పయోగము:** రాహువు నుండి మొదలై కేతువు గ్రహాలవరకు మధ్యన సప్త(7) గ్రహములు ఉంటే దానిని సవ్యకాలసర్పయోగము అంటారు.

**18. అపసవ్యకాలసర్పయోగము:** కేతువు నుండి ప్రారంభం అయి రాహువు గ్రహాలవరకు మధ్యన సప్త (7) గ్రహములు ఉంటే దానిని అపసవ్యకాలసర్పయోగము అంటారు.

**19. లగ్నకాలసర్పయోగము:** రాహుకేతువుల మధ్య సప్తగ్రహములు ఉండి లగ్నము బయట ఉంటే దానిని లగ్నకాలసర్పయోగము అంటారు.

**20. లగ్నసవ్యకాలసర్పయోగము:** రాహువు నుండి మొదలై కేతువు గ్రహాలవరకు మధ్యన సప్త(7) గ్రహములు ఉండి మరియు లగ్నము బయట ఉంటే దానిని లగ్న సవ్యకాలసర్పయోగము అంటారు.

**21. లగ్నఅపసవ్యకాలసర్పయోగము:** కేతువు నుండి ప్రారంభం అయి రాహువు గ్రహాలవరకు మధ్యన సప్త(7) గ్రహములు ఉండి జన్మలగ్నము బయట ఉంటే (రాహుకేతువులకు) దానిని లగ్న అపసవ్య కాలసర్పయోగము అంటారు.

**22. మిశ్రమ కాలసర్పయోగము:** రాహువు కేతువులతో సప్తగ్రహములు కలిసి ఉంటే దానిని మిశ్రమ కాలసర్పయోగము అని అంటారు.

**23. లగ్నకాలసర్పయోగము:** రాహువు కేతువుల మధ్య మిగతా సప్తగ్రహములతో లగ్నము కూడా రాహుకేతువుల మధ్య ఉంటే లగ్నకాలసర్పయోగము అందుర్ను.

## 135. ద్వాదశ సర్పముల రూపము స్వభావము

భూమి మీద ఎన్నో సర్పాలు సంచరిస్తున్నాయి. మహర్షులు సర్పాలగురించి పురాణాలలో ఎంతో వివరించారు. అవి నాలుగు రకాలు

1) దర్వీకర సర్పాలు 2) మండలీసర్పాలు 3) రాజీమంత సర్పాలు 4) ఉపజాతి సర్పాలు కలవు సర్పజాతుల్లో ముఖ్యంగా రెండు విధాలు కలవు అవి:

1) దివ్యసర్పాలు 2) భౌమసర్పాలు

1. ఇక్కడ దివ్యసర్పాలు అంటే స్వభావరీత్యా దివ్యమైన శక్తి గల దేవతా సర్పములు అని అర్ధము.
2. భౌమసర్పాలు అంటే భూమి మీద నివసించేవి దేవతసర్పములు చాలా ఉన్నాయి. అవి అనంత, కుళిక, వాసుకి, తక్షక, కర్కోటక, శంఖపాల, శంఖ నంద, పద్మ, మహాపద్మ, విషక్త, శేషనాగ, ఘటక, నీల, ధనుంజయ, ఐరావత, కాళీయుడు ఇవన్నీ దేవతాసర్పములు.

ఈ సర్పములు దివ్య సర్పజాతులు ప్రచండాగ్నితో సమానమైన విషశక్తిని కలిగి ఉంటాయి. వీటిని జననమరణాలుండవు, వీటికి స్వయంప్రకాశ శక్తి ఉంటుంది. ఇవి విషవాయువులను చిమ్ముతాయి. ఈసర్పములకు దివ్యశక్తులు కూడా ఉన్నాయి. ఈ సర్పముల గురించి భవిష్యోత్తర పురాణంలో తెలుపబడినది.

శ్లో॥ "వదనం వెంకట గిరిః నృసింహచల మధ్యమం"।

శ్రీశైలం పుచ్ఛభాగస్త స్సర్వక్షేత్ర మయోగిరిః ॥

పై శ్లోకము ననుసరించి శేషుని ముఖము (పడగ) వెంకట పర్వతమని అనగా వేంకటేశ్వరస్వామి కొలువు తీరిన తిరుమల అని దానిమధ్యభాగం నరసింహుని క్షేత్రమైన అహోబిలము అని, పుచ్ఛభాగము (తోక) భ్రమరాంబ మల్లికార్జున స్వామి వార్ల పరమ పవిత్రమైన ప్రపంచంలో కీర్తింపబడిన శ్రీశైల మహాక్షేత్రము అని చెప్పబడినది. ఇవ్వని తెలిసిన కడప(జిల్లా) తాళ్లపాకలో జన్మించిన మహాభక్తుడు వాగ్గేయకారుడు అన్నమయ్య ఈ పర్వతాన్ని చూచి "పదివేల శేషుల పడగల మయమూ" అని కీర్తించారు. దీనిని బట్టి సర్పముయొక్క ప్రాధాన్యత ఎంత ఉందో తెలుస్తుంది. మూడు మహాక్షేత్రములు తిరుమల,అహోబిలము, శ్రీశైలంలో సర్పములు ఇమిడి యున్నవి. పరమపవిత్రమైన అలివేలుమంగ, పద్మావతి సమేత వేంకటేశ్వర స్వామి కొలువు అయి ఉన్న మహాగొప్పక్షేత్రము ప్రపంచంలో ప్రసిద్ధిక్షేత్రములో శేషుని పడగలు ఉండి మరియు వరాహలక్ష్మీ నరసింహక్షేత్రము అహోబిలం ఈక్షేత్రము మహాపవిత్రమైనది. అసలు నరసింహస్వామి ఎక్కడో లేడు ఆ అహోబిలంలోనే ఉన్నారు. అలాంటి మహాక్షేత్రము ఈ అహోబిలం. ఈ అహోబిలంలో మధ్యభాగం మరియు శ్రీశైలం గురించి వివరించాలంటే వేదాలలో సంకల్పము (ఆయుపట్టులాంటి) చెప్పేటప్పుడు మనము ఉన్న ప్రదేశము నుండి శ్రీశైలమహాక్షేత్రము ఏ దిక్కున ఉన్నదో ఆ దిక్కును సూచిస్తూ ఆ మహాక్షేత్రమును మనము చెప్పుకుంటాము. వాస్తవంగా పరమేశ్వరుడు శ్రీశైలం కొండలలోనే ఉన్నాడు. ఈ మూడు పరమ పవిత్రమైన క్షేత్రములు ఈక్షేత్రములలో శేషుడు పదివేల పడగలతో ఉన్నాడు.

**అనంతుడు:** సర్పము యొక్క నామధేయము అనంతుడు ఈ అనంతసర్పము నకు పడగలపైన తెల్లని పద్మం వంటి ఆకారంతో తెల్లచుక్కలుంటాయి. భవిష్యోత్తరపురాణం ప్రకారం లేతపచ్చని కొత్తమామిడి చిగురులాంటి శరీరచ్ఛాయాలలో ఉన్నటువంటి రంగులోనే ఉన్న గడ్డము మీసము, కను బొమ్మలు, కళ్ళు కలిగి తామరపూలలాంటి విప్పారిన విశాలమైన నేత్రాలతో ఉంటాడు. ఈ అనంతుడుకి కుడివైపు క్రిందినుండి పైకి శంఖము, పద్మము ఎడమవైపు గదా మరియు చక్రము ధరించిన నాలుగు చేతులు కలిగి ఉ ంటాడు. ఏడుపడగలతో ఉంటాడు. అని పురాణములో చెప్పబడినది. ఈ అనంతమహాసర్పం చాలాపొడుగు ఉంటుంది. ఈసర్పం మొత్తం భూగోళాన్ని చుట్టగలదు. సత్వగుణాన్ని కలిగి ఉంటుంది. ఆదివారము ప్రీతికరమైన వారము. ఆరోజు విషశక్తిని కలిగి ఉంటాయి. బంగారు వన్నె మరియు

ముదరునీలం రంగులో ఉంటుంది. ఈ సర్పము దేవసర్పము దేవజాతికి చెందినది. అనంత జాతికి చెందిన నాగులు బంగారు రంగులో మెరిసిపోతూ ఉంటాయి. ఈ సర్పములు అప్పుడప్పుడు మాత్రమే భూమిపై సంచరిస్తాయి. సర్పమంత్ర సిద్ధిని పొందిన వారికి మాత్రమే ఇవి కనిపిస్తాయి. ఇవి సంచరిస్తూ ఉంటే తియ్యటి వనమూలికల వాసనలు వస్తాయి.

**కుళికుడు:** ఈ సర్పము పడగలపైన శంఖం వంటి గుర్తులుంటాయి. ఎర్రటి గోధుమ రంగులో ఉంటుంది. తలమీద అర్ధచంద్రాకారం గుర్తు ఉంటుంది. దీనిని బంగారపు నెలవంకలాగా ఉంటుంది. ఈ సర్పమునకు ఒక్కతలను మాత్రమే కలిగి ఉంటుంది. ఏడుసర్పాలు రెండు నాలుకలు చొప్పున ఏడుతలలు కలిగిన ఒక పడగను కలిగి ఉంటాయి.

**వాసుకి:** వాసుకి సర్పమునకు వీపుపైన నల్లకలువపూల వంటి గుర్తులుంటాయి. సత్వగుణము కలిగి ఉంటాయి. ఇతనికి ఏడుపడగలు ఉంటాయి. ఈ సర్పమునకు సోమవారం, ప్రీతికరమైన వారము. మంధని పర్వతాన్ని మహాసముద్రంలో చిలకటానికి వాసుకి సర్పం కవ్వపుతాడుగా ఉపయోగపడింది. ఈ సర్పములు నాలుగు రకాల రంగులను కలిగి ఉంటాయి. ముత్యంవంటి తెల్లరంగు, గోధుమ వన్నెలో, ఆకుపచ్చ, కపిలవర్ణములలో అన్నిరకముల చాయకనబడుతుంది. ఈ సర్పములు బుధవారం భూమి మీదకు వస్తాయి. ఇవన్నీ సోమవారం విషాన్ని కక్కుతాయి.

**శంఖపాలుడు:** ఈ సర్పము రజోగుణమును కలిగి ఉంటాయి. ఈ సర్పమునకు వీపుపైన అర్ధచంద్రునిలా ఉండే త్రిశూలాకారం గుర్తుగా ఉంటుంది. ఈ సర్పం క్రౌర్యస్వభావాన్ని కలిగి ఉంటాయి. పాలవంటి తెల్లనిరంగులో పసుపు కలిస్తే ఎలా ఉంటుందో ఆ రంగులో ఉంటుంది. దాని తలమీద తెల్లగి గీత ఉంటుంది. శనివారము ప్రీతికరమైన వారము సోమవారము భూమిమీద సంచరిస్తాయి.

**పద్మ:** ఈ సర్పము పేరు పద్ముడు. ఈ మహాసర్పానికి ఐదు పడగలు ఉంటాయి. ఈ పద్మ సర్పం లేతకలువ రంగులో లేదా లేతగులాబీరంగులో ఉంటుంది. ఆకుపచ్చరంగు చాయకలిగి ఉంటుంది. ఈ సర్పం మెడచుట్టూ తెల్లటి గీత ఉంటుంది. ఈ పద్మ సర్పమునకు వీపుపైన ఎరుపురంగుతో ఐదు బిందువులు ఉంటాయి. ఈ సర్పమునకు గురువాము ప్రీతికరమైన వారము.

**మహాపద్ముడు:** ఈ సర్పము దాని పడగమీద త్రిశూలం గుర్తు ఉంటుంది. ఈసర్పము తెల్లరంగులో ఉంటుంది. ఈ మహాపద్మనామసర్పమునకు శు క్రవారము ప్రీతికరమైనది. ఈ సర్పమునకు తొమ్మిది పడగలు ఉంటాయి.

**తక్షకుడు**: ఈ సర్పము తమోగుణము కలిగి ఉంటాయి. ఈ సర్పము పడగలపైన స్వస్తిక్ వంటి గుర్తులుంటాయి. ఇవి ఎరుపురంగులో అనగా కాషాయరంగులోఉండి కారునలుపు చాయ కలిగి ఉంటాయి. ఈ సర్పమునకు మంగళవారము ప్రీతికరమైన వారము. ఈమహాసర్పానికి తొమ్మిది పడగలు ఉంటాయి. ఇవి ఆదివారము రోజున భూమి మీద సంచరిస్తాయి. ఇవి త్రాచులుగా పేరుగన్న సర్పాలు.

**కర్కోటకుడు:** ఈ సర్పము తమోగుణమును కలిగి ఉంటుంది. కర్కోటక సర్పపడగల మీద తెల్లటి నిలువుచారలు అనగా త్రినేత్రాలను పోలిన గుర్తులుంటాయి. ఇవి నల్లత్రాచులుగా పేరుగన్న సర్పాలు ఈ సర్పానికి ఆరుపడగలు ఉంటాయి. నల్లటి నలుపురంగులో ఉంటాయి. ఈ సర్పమునకు బుధవారము ప్రీతికరమైన వారము. పురాణములప్రకారం అడవిలో మంటలు చెలరేగుతుంటే ఆ అడవిలో కర్కోటక సర్పము చిక్కుకున్నది ఆ అడవి వైపు వెళ్ళుతున్న నలమహారాజు ఆ సర్పమును అనగా కర్కోటక సర్పమును రక్షించెను. ఆ కృతజ్ఞతతో కలిపురుషుడి చేత పీడించబడుతున్న నల మహారాజును కర్కోటకుడు కాటువేస్తాడు ఆ కాటు నలమహారాజుకు కాకుండా ఆ రాజు శరీరంలో ఉన్న ఆ రాజును పీడిస్తున్న కలిపురుషుడికి తగులుతుంది. దాంతో కలిపురుషుడు ఆయన శరీరం నుంచి వెళ్ళిపోతాడు అలా రాజుకి మేలు చేస్తుంది.

**ధనుంజయ:** ఈ సర్పము శుక్రవారము రోజున భూమిమీద సంచరిస్తుంది. నాగులు ఎర్రటి ఎరుపురంగులో ఉంటాయి. ఈ సర్పము రజోగుణము కలిగి ఉంటుంది.

**ఐరావత:** ఈ సర్పములు గురువారం రోజు భూమిమీద తిరుగుతాయి. ఐరావత జాతికి చెందిన సర్పాలు. అనేక రంగుల మిశ్రమంలో కనిపిస్తాయి. రజోగుణము కలిగి ఉంటుంది. ఈ సర్పములు బూడిద రంగులో ఉంటాయి.

**కాళీయుడు:** ఈ సర్పము యమునానది అడుగులో జీవిస్తూ ఉంటుంది. ద్వాపరయుగంలో శ్రీమహావిష్ణువు బాలకృష్ణుడు అవతరించినప్పుడు ఈకాళయుడనే మహాసర్పం పడగలపై తాండవం చేసి ఆసర్పాన్ని యమునా

నదినుండి బయటకు పంపివేసారు. ఈ సర్పమునకు ఐదుపడగలు కలిగి ఉంటాయి. ఇది రాక్షస సర్పం క్రూరస్వభావం కలిగి ఉంటుంది.

**శేషనాగుడు:** ఈ సర్పము సత్వగుణము కలిగి ఉంటుంది. ఈసర్పము పాలవంటి తెల్లనిరంగులో ఉంటుంది. ఈ సర్పమునకు మరోపేరు ఆదిశేషుడు అని పిలువబడే మహాసర్పానికి వెయ్యి పడగలు ఉంటాయి. అందుకే "సహస్రశీర్షం" అని వేదమంత్రంలో వస్తుంది. ఇవి శనివారం, భూమిమీద తిరుగుతాయి. ఈ ఆదిశేషుడు శ్రీమహావిష్ణువు శేషతల్పము శ్రీమహావిష్ణువుకు పరుపుగా మరియు నీడనిచ్చే గొడుగుగా ఉంటుంది. అదిదేవుడు అయిన బ్రహ్మదేవుడు అనంతవిశ్వాన్ని సృష్ఠించిన తరువాత జీవజలాన్ని ఏర్పరిచి ఆ తరువాత ఆదిశేషున్ని సృష్ఠించాడు.

## 136. రజ్జుదోషములు-నివారణ

వివాహ వధూవర పొంతనలలో రజ్జుదోషము ముఖ్యమైనది. ముఖ్యంగా రజ్జుదోషము ఉండకూడదు. దానికి నివారణలు కూడా కలవు అవి:

మండపారాధనలో శ్రీమహాగణపతిపూజ, స్వస్తి పుణ్యాహవాచనము, కలశ స్థాపన, పంచలోకపాలకపూజ, నవగ్రహ ఇంద్ర అష్ఠదిక్పాలక పూజ, వధూవరుల నక్షత్రముల జపము, నక్షత్రహోమము వెండినక్షత్రముల పూజ, నక్షత్రముల ప్రతిమలు దానములు మరియు నక్షత్రాధిపతుల జపము హోమము, దానము చేయవలెను.

1) **పాదంరజ్జు :** గణపతి అధర్వణశీర్షముతో అభిషేకము, వరుణసూక్తము, విష్ణువుకు అభిషేకము, రుద్రాభిషేకము, విష్ణుసహస్రపారాయణము.
   దానాలు: పెసలు, పచ్చనివస్త్రం, ఉలవలు, చిత్రవర్ణ వస్త్రము.
2) **కటిరజ్జు:** వరుణ పాశుపతాస్త్ర అభిషేకము రుద్రాభిషేకము, ఇంద్రాణిపూజ, లక్ష్మీసూక్తంతో పూజ.
   దానాలు: బొబ్బర్లు, తెల్లని వస్త్రం, నువ్వులు, నల్లని వస్త్రం.
3) **ఉదకం రజ్జు:** రుద్రకవచం పఠనం, ఇంద్రపాశుపతాస్త్ర అభిషేకము, నారాయణసూక్తం, సౌరసూక్తం, సూర్యనమస్కారములు, అరుణహోమము.
   దానాలు: గోధుమలు, ఎర్రని వస్త్రం, శనగలు, శ్వేతవర్ణ వస్త్రం.
4) **కంఠరజ్జు:** గౌరిపూజ, భ్రమరాంబికాష్టకము వరుణపాశుపతాస్త్ర అభిషేకము, ధనుంజయకృత శ్రీదుర్గాస్తుతి, రాజరాజేశ్వరి కవచము, సర్పసూక్త పారాయణము, విష్ణుసహస్రపారాయణము, రుద్రాభిషేకము.

<u>దానాలు:</u> గోవు, వడ్లు, తెల్లనివస్త్రం, మినుములు, నీలవస్త్రం.

రజ్జోదోషమునకు పై విషయములను పాఠించవలెను.

## 137. రాహుకేతువుల శుభములు

1) రాహుకేతువులు ద్విస్వభావరాశులయందు ఉండి కేంద్రస్థానాధిపతులతోగాని, కోణాల అధిపతులతో గాని, కోణాల అధిపతులతో గాని కలిసి ఉంటే (లేక) కేంద్ర త్రికోణస్థానాధిపత్యము కలవారై ఆ రాహుకేతువుల యొక్క దశలలో గాని, అంతర్ధశలలో గాని విశేషధనమును రాజ్యమును ఇచ్చును.

2) రాహుకేతువులు 3,9,1,4,7,10 స్థానముల యందుండి బలము కలిగి శు భయోగకారక గ్రహములతో కలిసినచో సంపత్తు సౌఖ్యము, సంతానం, ఐశ్వర్యము, రాజ్యము వాహనములు కలుగును.

3) రాహుకేతువులు స్థిరచరరాశులలో ఉండి కేంద్రాధిపతులతో గాని కోణాధిపతు లతో గాని కలిసి ఉండి వారిలో ఏ ఒక్క గ్రహము శుభక్షేత్రము ఉన్నచో ఆ జాతకునికి విశేషభాగ్యమును వచ్చును.

## 138. మానవ సంబంధానికి గ్రహముల పాత్రలు

"జాతస్య మరణం ధృవం" అన్న సూక్తి ననుసరించి జన్మ ఎత్తిన శరీరము గిట్టక తప్పదు. ఈ దేహము కాలగమనంలో శిథిలమవక తప్పదు. అని తెలిసినను శరీరముపై వ్యామోహము కలిగి ఉంటాడు మానవడు. భార్య పుత్రులు, బంధుమిత్రులు వారి అభిమానము శాశ్వతమని భ్రమిస్తాడు. ఆ అభిమానమే తనకు కొండంత అండయనే జీవిస్తాడు. అసలు ఆ అభిమానము ఎక్కడిది. తన కుటుంబ సభ్యులు తన వారు అనుకున్న ఆత్మీయుల కోసం ధనకనకవస్తు వాహన ములు భోగభాగ్యాలను సంపాదిస్తారు. ఆశ్రమ ఫలితంగా అభిమానముగా మారి ఆ అభిమానమే శాశ్వతమనే భ్రమలో ఉంటారు. అసలు నిజానికి ధనము భోగభాగ్యములు ఉన్నంతవరకే ప్రేమాభిమానాలను ప్రదర్శిస్తారు. వృద్ధాప్యం సమీపించి రోగగ్రస్తమైనప్పుడు ఎవరు పట్టించుకోరు. బొందిలో ఊపిరిఉన్నంత వరకే తనవారు. ఆకాస్తాపోయాక ఎవరికి వారే యమునాతీరే. జీవన్మరణాల మధ్య అతిచిన్నకాలములో మనం పెంచుకునే బంధాలను అనుబంధాలు శాశ్వ తముకావు. సినిమాలో హీరోపాత్ర అయిపోగానే వెళ్లినట్టుగా జీవితములో మనవంతు పాత్ర అయిపోగానే ఈ జీవననాటకం నుండి నిష్క్రమించవలసినదే. ఈ సత్యము తెలుసుకుని ప్రవర్తించటం మానవుని యొక్క ధర్మము. అయినా మానవుడు తెలుసుకోలేడు కారణం గ్రహాలు, బుధుడు, చంద్రుడు, బుధుడు

బుద్ధికి కారణం, చంద్రుడు మనస్సుకు కారణం. మనస్సు వికసించదు బుద్ధిజ్ఞానము పెరగదు.

వాస్తవంగా జ్యోతిషశాస్త్రంలో ముఖ్యమైన ఖచ్చితమైన గ్రహములు చంద్రుడు, బుధుడు దానికి గలకారణము ఏమయిటంటే పుట్టిన మానవుడికి మనస్సు మంచిది అయి ఉండాలి. మనస్సు మంచిగా ఉంటే బుద్ధి వికసిస్తుంది. ఎంతధనమున్న, ఎంతాఆరోగ్యమున్న, ఎంతమంచిపదవిలోనున్న, బుద్ధి మంచిగా ఉండాలి. మనము సభ్యసమాజములో చూస్తుంటాము. ఒక్కొక్కమనిషి ఒక్కొక విధంగా ఉంటాడు. దానికి కారణం చంద్రబుధులే కారణం సమాజంలో చాలారక ములైన మనుషులు ఉన్నారు. మరియొక గ్రహము కూడా వుంది ఆగ్రహము కేతువు అక్కడ జ్ఞానమును ప్రసాదిస్తాడు. చాలా మంది కూడా జ్యోతిషంలో ఏముంది అని అనుకుంటారు. కాని వాస్తవంగా గ్రహములతో ఏర్పడినదే జ్యోతిషశాస్త్రము. ఒక వ్యక్తి ఉంటాడు. ఆ వ్యక్తికి పనిచేసి బాగుపడాలని ఆలోచన ఉండదు. ప్రక్కన స్నేహితులు, బంధువులు చెప్పుతారు. ఎన్నిసార్లు చెప్పిన వినదు కారణం ఏమిటో తెలుసా? మనము చెప్పిన విషయాలు మైండ్‌లోకి ఎక్కవు కారణం గ్రహములు. ఆ గ్రహముల అనుకూలత లేకపోవటం వల్లే బుర్రలోకి ఎక్కదు. మరికొంతమంది అంటారు పనిచేస్తే జరగదా? అనే వ్యక్తులు కూడా ఉన్నారు. పనిచేసినా ఫలితం రాని వాళ్ళుకూడా కోకొల్లలు. వీటినన్నింటి కారణం గ్రహముల ఫలితాలు. మానువునిపై ప్రభావం చూపుతాయి. అందువల్ల బుద్ధి వికసించాలి. అంటే గ్రహములను ప్రసన్నము చేసుకొనవలెను.

మానవుని జీవితములో ముఖ్యంగా మూడుగ్రహములు అనుకూలత ఉండవలెను. ఆగ్రహములు చంద్రుడు, బుధుడు, కేతువు ఈ గ్రహములు సరిగా లేకపోతే సగము జీవితము వ్యర్థము అయిపోతుంది. దానికి కారణము ముందుగా చంద్రగ్రహమును పరిశీలించుదాము. చంద్రుడు మనోకారకుడు మనస్సుకు సంబంధించిన వాడు అంటే మానవునిగా అనగా జాతకుడు మంచిమనస్సుకలవాడై ఉండవలెను. దానికి కారణం చంద్రుడు మంచి ఆలోచన ఇవ్వటము. మైండు సరిగా పనిచేయటం. ఏదైన పనిచేయటానికి పనిచేయాలి అనే భావన కలగాలి. మనము చేసే తప్పు ఏమిటి మనము ఇప్పటి వరకు ఏమి సాధించాము. అనేది విశ్లేషించే జ్ఞానము ఉండదు. మానవుడిలో రకరకాల గుణాలు ఉంటాయి.

## 139. రాహునక్షత్ర మూల మంత్రములు

రాహువు ఆరుద్ర, స్వాతి, శతభిషము నక్షత్రములకు అధిపతి అందువల్ల నక్షత్రముల మంత్రములు ఈ క్రింద ఇస్తున్నాము.

**ఆర్ద్రానక్షత్ర మూల మంత్రము:**

ఆర్ద్రయా రుద్రఃప్రథమాన ఏతి। శ్రేష్ఠోదేవానాంపతి

రఘ్నియానామ్।నక్షత్రమస్య హ విషావిధేమ।

మానఃప్రజాగ్ం రీరిషన్మోతవీరాన్।

హేతీరుద్రస్య పరివోవృణక్తు।

ఆర్ద్రానక్షత్ర జుషతాగ్ం హవిర్నః।

ప్రముంచమానౌ దురితాని విశ్వా।

అపాఘశగ్ం సన్ను దతామరాతిమ్।

ఆర్ద్రా నక్షత్రాధిష్ఠానదేవతాం రుద్రం సాంగం సాయముధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం రుద్రమావాహయామి సాపయామి పూజయామి॥

**ఆర్ద్రా నక్షత్ర అధిదేవత మృగశిర:**

సోమోరాజా మృగశీర్షేణాగన్న్।శివంనక్షత్రం ప్రియ

మస్యధామ। ఆప్యాయమానో బహుధాజనేషు।

రేతఃప్రజాం యజమానేదధాతు। యత్తే నక్షత్రం మృగశీర్

షమస్తి। ప్రియగ్ం రాజన్ ప్రియతమం ప్రియాణామ్।

తస్మైతే సోమ హవిషా విధేమ।

శన్నఏధి ద్విపదే శం చతుష్పదే॥

ఆర్ద్రా నక్షత్ర అధిదేవతాం సోమం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం సోమ మావాహయామి స్థాపయామి పూజయామి

**ఆర్ద్రా నక్షత్ర ప్రత్యధిదేవత పునర్వసు:**

పునర్నోదేవ్యదితి స్పృణోతు। పునర్వసూనఃపునరే

తాంయజ్ఞమ్। పునర్నోదేవా అభియస్తు సర్వే ।

పునఃపునర్వోహవిషాయజామః। ఏవానదేవ్య

దితిరనర్వా। విశ్వస్యభర్త్రీ జగతఃప్రతిష్ఠా।

పునర్వసూ హవిషా వర్ధయన్తీ।

ప్రియందేవానా మప్యేతు పాథః॥

ఆర్ద్రా నక్షత్ర ప్రత్యధిదేవతాం అదితింసాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర

పరివారసమేతం అధితి మావాహయామి స్థాపయామి పూజయామి॥

**స్వాతినక్షత్ర మూల మంత్రము:**

వాయుర్నక్షత్రమభ్యేతి నిష్ట్యాం। త్రిగ్మశృంగో వృషభోరోరు వాణః।

సమీర యన్భువనామాతరిశ్వా। ఆపద్వేషాగ్ం సినుదతామరాతీః।

తన్నోవాయు స్తదు నిష్ట్యాశృణోతు। తన్నక్షత్రం భూరిదాఅస్తుమహ్యాం

తన్నో దేవాసో అనుజానంతు కామం। యధాతరేమ దురితాని విశ్వా

స్వాతి నక్షత్రాధిష్ఠాన దేవతాం వాయుం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం వాయుమావాహయామి స్థాపయామి పూజయామి॥

**స్వాతీ నక్షత్ర అధిదేవత చిత్త:**

త్వష్టానక్షత్ర మభ్యేతి చిత్రామ్। సుభగ్ం ససం యవతిగ్ం రోచమానామ్।

నివేశయ న్నమృతా న్మర్త్యాగ్శ్చ।

రూపాణిపిగ్ంశన్భువనానివిశ్వావతన్నస్త్వష్టా తదు చిత్రా విచష్టామ్।

తన్నక్షత్రం భూరిదా అస్తుమహ్యామ్।

తన్నః ప్రజాం వీరవతీగ్ం సనోత్। గోభిర్నోఅశ్వైస్సమనక్తుయజ్ఞమ్।

స్వాతినక్షత్ర అధిదేవతాం త్వష్టారం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ

పుత్ర పరివారసమేతం త్వష్టారమావాయామిస్థాపయామి పూజయామి॥

**స్వాతీ నక్షత్ర ప్రత్యధిదేవత విశాఖ:**

దూరమస్మచ్ఛత్రవో యన్తుభీతాః। తదిన్ద్రా గ్నీ

కృణుతా న్తద్విశాఖే। తన్నోదేవా అనుమదన్తు

యజ్ఞమ్। పశ్చాత్పురస్తా దభయన్నో అస్తు। నక్షత్రా

ణా మధిపత్నీ విశాఖే। శ్రేష్ఠా విన్ద్రాగ్నీ భువన

స్యగోపౌ। విషూచ శ్శత్రూనప బాధమానౌ।

అపక్షుధన్నుదతా మరాతిమ్హా॥

స్వాతీ నక్షత్ర ప్రత్యధిదేవతే ఇన్ద్రాగ్నీ సాంగం సాయుధం సవాహనం సశక్తి

పత్నీపుత్ర పరివార సమేతం ఇన్ద్రాగ్నీ మావాహయామి స్థాపయామి పూజయామి॥

**శతభిషా నక్షత్ర మూలమంత్రము:**

క్షత్రస్యరాజావరుణో$_2$ధిరాజః। నక్షత్రాణాగ్ం శతభిష గ్వసిష్ఠః।
తాదేవేభ్యః కృణుతో దీర్ఘయాయుః।శతగ్ం సహస్రా బేషజాని ధత్తః
యజ్ఞంనో రాజా వరుణ ఉపయాతు। తన్నో విశ్వే అభిసంయతు దేవాః
తన్నో నక్షత్రగ్ం శతబిష గ్జుషాణం। దీర్ఘమాయుఃప్రతిరద్భేషజాని॥
శతభిషా నక్షత్రాధిష్ఠాన దేవతాం ఇన్ద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తి
పత్నీపుత్ర పరివారసమేతం ఇన్ద్రం మావాహయామి స్థాపయామి పూజయామి

**శతభిషా నక్షత్ర అధిదేవత ధనిష్ఠ:**

అష్టౌదేవా వసవస్సోసమ్యాసః। చతస్రోదేవీ రజరా శ్రవిష్ఠాః।
తేయజ్ఞం పాన్తురజసః పరస్తాత్।సంవత్సరీణమమృతగ్గ్ స్వస్తి।
యజ్ఞం న్నః పాన్తువసవః పురస్తాత్। దక్షిణతో$_2$భియన్తు శ్రవిష్ఠాః।
పుణ్యన్నక్షత్ర మభిసంవిశామ। మానో అరాతి రఘుశగ్ంస్యాగన్న్॥
శతభిషా నక్షత్రా అధిదేవతాంఅష్టవసూన్ సాంగం సాయుధం సవాహనం
సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం అష్టవసూన్ మావాహయామి స్థాపయామి పూజయామి॥

**శతభిషా నక్షత్ర ప్రత్యధిదేవత పూర్వభాద్ర:**

అజఏకపా దుదగాత్పురస్తాత్। విశ్వాభూతాని
ప్రతిమోదమానః। తస్యదేవాః ప్రశవం యన్తిసర్వే
ప్రోష్ఠపదాసో అమృతస్య గోపాః। విభ్రాజమాన
స్సమిధాన ఉగ్రః। ఆ$_2$న్తరిక్ష మర్హద గన్యామ్।
తగ్ం సూర్య న్దేవమజయేక పాదమ్। ప్రోష్ఠప
దాసో అనుయన్తిసర్వే॥ శతభిషా నక్షత్ర
ప్రత్యధిదేవతాం అజయేకపాదం సాంగం సాయుధం సవాహనం సశక్తి
పత్నీపుత్ర పరివార సమేతం అజయేకపాద మావాహయామి స్థాపయామి పూజయామి॥

## 140. కేతునక్షత్ర మూల మంత్రములు

కేతువు అశ్వని, మఖ, మూల నక్షత్రములకు అధిపతి అందువల్ల నక్షత్రముల మంత్రములు ఈ క్రింద ఇస్తున్నాము.

**అశ్వని నక్షత్ర మూలమంత్రములు:**

తదశ్వినా వశ్వయుజోపయాతామ్। శుభఙ్గమిష్ఠౌ సుయ
మేభిరశ్వైః। స్వం నక్షత్రగ్ం హవిషాయజన్తౌ। మధ్వా సంపృ
క్తౌ యజుషాసమక్తౌ। యౌదేవానాం భిషజాహవవ్తా
హౌ। విశ్వస్యదూతా వమృతస్యగోపౌ। తౌనక్షత్ర
జుజుషాణో పయాతామ్। నమోఽశ్విభ్యాం కృణు మోశ్వయుగ్భ్యామ్॥

అశ్వనీ నక్షత్రాధిష్ఠాన దేవతా అశ్వనౌ సాంగం సాయుధం సవాహనము సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం అశ్వినావాహయామి స్థాపయామి పూజయామి॥

**అశ్వనీనక్షత్ర అధిదేవత రేవతి:**

పూషా రేవత్య న్వేతి పన్థామ్। పుష్టి పతీ పశుపా వాజబస్త్యౌ।
ఇమానిహవ్యా ప్రయుతా జుషాణా। సుగైర్నోయానై రూపయాతాం
యజ్ఞమ్। క్షుద్రాన్ పశూన్ రక్షతురేవతీనః। గావోనో
అశ్వాగ్ం అన్వేతుపూషా। అన్నగ్ం రక్షన్తౌ బహుధా
విరూపమ్। వాజగ్ం సనుతాం యజమానాయ యజ్ఞమ్॥

అశ్వనీ నక్షత్ర అధిదేవతాం పూషణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం పూషణ మావాహయామి స్థాపయామి పూజయామి॥

**అశ్వనీ నక్షత్ర ప్రత్యధిదేవత భరణి:**

అపపాప్మానం భరణీర్భరన్తు।
తద్యమోరాజా భగవాన్ విచష్టామ్।
లోకస్యరాజా మహతోమహాన్హి। సుగన్నఃపన్థా
మభయఙ్కృణోతు। యస్మిన్నక్షత్రే యమేతిరాజా।
యస్మిన్నేన మభ్యషించంత దేవాః। తదస్య చిత్రగం।

హవిషా యజామ। అపపాప్మానం భరణీర్భరన్తు॥

అశ్వనీ నక్షత్ర ప్రత్యధి దేవతాం యమం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం యమమావాహయామి స్థాపయామి పూజయామి

**మఖా నక్షత్ర మూల మంత్రము:**

ఉపహూతాః పితరోయే మాఘసు। మనోజవసస్సుకృత స్సుకృత్యాః।

తేనో నక్షత్రే హవ మాగమిష్ఠాః। స్వధాభిర్యజ్ఞం ప్రయతం జుషంతాం।

యే అగ్నిదగ్ధాయె౽నగ్నిదగ్ధాః। యే౽ముంలోకం పితరః క్షియంతి

యాగ్శ్చ విద్మయాగ్ం ఉచన ప్రవిద్మ। మఘాసు యజ్ఞగ్ం సుకృతం జుషతాం॥

మఖా నక్షత్రధిష్ఠాన దేవతాం పితౄణాం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివార సమేతం పితౄణాం మావాహయామి స్థాపయామి పూజయామి॥

**మఖా నక్షత్ర అధిదేవత మంత్రము:**

ఇదగ్ం సర్పేభ్యో హవిరస్తుజుష్టమ్। ఆశ్రేషాయేషా మనుయన్తి

చేతః। యే అన్తరిక్షం పృథివీంక్షియన్తి। తేనస్సర్పా

సో హవమాగమిష్ఠాః। యేరోచనే సూర్యస్యా

పిసర్పాః। యేది వందేవీ మనుసఞ్చరన్తి। యేషా

మాశ్రేషా అనుయన్తి కామమ్। తేభ్య స్సర్పేభ్యో మధుమజ్జుహోమి॥

మఖానక్షత్రాధిదేవతాన్ సర్పాన్ సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం సర్పాన్ మావాహయామి స్థాపయామి పూజయామి॥

**మఖా నక్షత్ర ప్రత్యధిదేవత పూర్వఫల్గుని (పుబ్బ) :**

గవాంపతిః ఫల్గునీనామసిత్వమ్। తదర్యమన్ వరుణ

మిత్ర చారు। తన్త్వావయగ్ం సనితారగ్ంసనీనామ్।

జీవాజీవన్తముపసం విశేమ। యేనేమావిశ్వాభువనాని

సంజితా। యస్యదేవా అనుసంయన్తి చేతః। అర్యమా

రాజా౽జరస్తు విష్మాన్। ఫల్గునీనా మృషభోరో రవీతి॥

మఖానక్షత్రప్రత్యధిదేవతాం అర్యమ్ణం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీ
పుత్ర పరివార సమేతం అర్యమ్ణమావాహయామి స్థాపయామి పూజయామి॥

**మూలనక్షత్ర మూల మంత్రము:**

మూలం ప్రజాంవీరవతీం విదేయ। పరాచ్యేతునిర్ఋతి పరాచా॥
గోభిర్నక్షత్రం పశుభిస్సమక్తం। అహర్భూయాద్యజమానాయ మహ్యాం।
అహర్నో అద్య సువితే దధాతు। మూలం నక్షత్ర మితియ ద్వదంతి।
పరాచీం వాచానిర్ఋతింనుదదామి। శివం ప్రజాయై శివ మస్తుమహ్యాం॥
మూలానక్షత్ర అధిష్ఠాన దేవతాం ప్రజాపతిం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం ప్రజాపతి మావాహయామి స్థాపయామి పూజయామి॥

**మూలనక్షత్ర అధిదేవత జ్యేష్ఠ :**

ఇన్ద్రో జ్యేష్ఠా మనునక్షత్రమేతి। యస్మిన్వృత్రం వృత్రతూర్యేతతార।
తస్మిన్వయ మమృతన్దుహానాః। క్షుధన్తరేమ దురితిం దురిష్టిమ్।
పురన్దరాయ వృషభాయ ధృష్ణవే। అషాఢాయ సహమానాయ మీఢుషే।
ఇన్ద్రాయ జ్యేష్ఠా మధుమద్దుహానా। ఉరుం కృణోతు యజమానాయలోకమ్॥
మూలానక్షత్ర అధిదేవతాం ఇన్ద్రం సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం ఇన్ద్రమావాహయామి స్థాపయామి పూజయామి॥

**మూల నక్షత్ర ప్రత్యధిదేవత పూర్వాషాఢ:**

యాదివ్యా ఆపః పయసాసంబభూవుః। యా అన్తరిక్ష ఉతపార్థి వీర్యాః।
యాసామ షాఢా అనుయన్తి కామమ్। తాన ఆపశ్శగ్గ్ స్యోనా భవన్తు।
యాశ్చ కూప్యాయాశ్చ నాద్యాస్సముద్రియాః।
యాశ్చ వైశన్తీ రుతప్రాస చీర్యాః।
యాసామషాఢా మధుభక్షయన్తి।
తాన ఆపశ్శగ్గ్ స్యోనాభవన్తు।
మూల నక్షత్ర ప్రత్యధిదేవతాః అపః సాంగం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం అపః ఆవాహయామి స్థాపయామి పూజయామి.

## 141. లింగతో భద్రమండలం

కాలసర్ప దోషమునకు మహాపాశుపత హోమము చేయడం ఒక ప్రక్రియ. ఈ హోమము చేయడానికి ముందు సర్పసూక్త సహిత మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేయాలి. ఆ తరువాత లింగతో భద్రమండలి ఏర్పరచాలి లింగతో భద్రమండలి లేకుండా మహాపాశుపత హోమం చేయరాదు. అన్ని రకములైన పూజలకు, సర్వతోభద్రమండలి ఏర్పరుస్తారు. శైవ సంబంధమైన హోమములకు వివిధపాశుపతాది హోమములకు లింగతో భద్రమండలి ఏర్పరుస్తారు.

మహాలింగానికి ఆవృతంగా శ్రీభద్రకాళీ సమేత వీరభద్రస్వామి

మొదటిక్రమంలో - 8 శివలింగాలు అష్టదిక్కులకు

రెండవ క్రమంలో - 12 శివలింగాలు ద్వాదశఆదిత్యులు

మూడవ క్రమంలో - 24 శివలింగాలు త్రిశూలములు

నాల్గవ క్రమంలో - 400 శివలింగాలు తాండవేశ్వరులు

ఐదవ క్రమంలో - 8 శివలింగాలు అష్ట భేతాళులు

ఆరవ క్రమంలో - 4 శివలింగాలు నాల్గువేదములు

ఏడవ క్రమంలో - 16 శివలింగాలు షోడశ ద్వారపాలకులు

ఎనిమిదవ క్రమంలో - 16 శివలింగాలు సపత్నిసహిత అష్టమూర్తులు

తొమ్మిదవక్రమంలో - 25 శివలింగాలు పంచబ్రహ్మలు

పదవ ఆవరణలో - 56 శివలింగాలు అష్ట మూర్తులు

పదకొండవ ఆవరణలో - 9 శివలింగాలు నవగ్రహాలు

పన్నెండవ ఆవరణలో - 28 శివలింగాలు సప్తపర్వతాలు, సప్తరుషులు, సప్త నదులు, సప్త సముద్రాలు

పదమూడవ ఆవరణలో - 6 శివలింగాలు, షట్ తారకలింగాలు

పదనాల్గువ ఆవరణలో - 2 శివలింగాలు, గంగా, పార్వతి

పదిహేనవ ఆవరణలో - 11 శివలింగాలు ఏకాదశ రుద్రాలు

పదహారవ ఆవరణలో- 1 శివలింగము దక్షిణామూర్తి

వాయువ్యంలో 1 చండేశ్వరుడు, 1 చిత్రగుప్తుడు, యముడు, గణపతి , 4 శివలింగాలు, 1 మహాలింగము - అదనపు శివలింగములతో కలిపి చంద్రకళ

– మధ్యస్థాపిత శివలింగముతో కలిపి మొత్తం 1116 శివలింగాలు ఇక్కడ మండపారాదన ముఖ్యమైనది. మహా లింగసహితముగా లింగతో భద్రమండలి ఏర్పరచి పాశుపతహోమములు చేయవలెను. సర్పదోషనివారణార్ధం, ఏ పాశుపతహోమమైన విధి విధానంగా చేయాలి. దీనివల్ల సమస్యలు తీరును.

## 142. జాతక కాలసర్పవలయంలో రాహుకేతు ప్రభావములు

1) ప్రథమసప్తమ (1,7) స్థానాలలో రాహుకేతువులు అనగా రాహువు 1వస్థానంలో ఉంటే కేతువు 7వ స్థానంలో ఉంటాడు. కేతువు 1వ స్థానంలో ఉంటే రాహువు 7వ స్థానంలో ఉంటాడు. ఇలా వీరు 1,7వ స్థానంలో ఉన్నప్పుడు ఆజాతకునికి వ్యతిరేక ఆలోచనలు కలుగుతాయి. కులాంతర మతాంతర, దేశాంతర వివాహములు కలుగుతాయి. మరియు తనకంటే వయస్సులో బాగా తేడా ఉన్నవారితో వివాహము, వివాహము అయిన తరువాత ఆభర్త లేదా భార్య స్వభావము బయటపడుతుంది. వివాదాలు, విడాకులు, బహుళవివాహాలు, అక్రమసంబంధాలు, మానసిక అశాంతి అనుకున్న పనులలో ఆలస్యం జీవితం చాలా నిధానంగా నడుస్తుంది. వ్యతిరేఖ ఆలోచనలు అప్పులు చేస్తారు. వీటివల్ల ఆనారోగ్యం కలుగును. ఆత్మహత్యలు కూడా చేసుకుంటారు. వడుదుడుకు స్వభావం కలిగి ఉంటారు.

2) ద్వితీయఅష్టమ (2,8) స్థానాలలో రాహుకేతువులు అనగా రాహువు 2వ స్థానంలో ఉంటే కేతువు 8వ స్థానంలో ఉంటాడు. కేతువు 2వ స్థానంలో ఉంటే రాహువు 8వ స్థానంలో ఉంటాడు. ఇలా ఉంటే కుటుంబంలో అలజడులు, కుటుంబంలో కలతలు, విచ్ఛిన్నం, గొడవలు జరగడం, భార్యాభర్తల మధ్య విరోధము, విడాకులు, పగప్రతీకారములు, కోర్టుకు వెళ్ళడం, ధనము ఖర్చుఅవడం, దీర్ఘకాలిక రోగములు, గ్యాస్, ఎలర్జీలు, నరాల బలహీనత, మానసిక అశాంతి, మూత్రపిండముల వ్యాధులు రావడం జరుగుతాయి.

బాల్యం నుండే జాతకుడు కష్టాలు పడటం తల్లిదండ్రుల నిర్లక్ష్యం కష్టపడిపైకి వద్దాము అని అనుకుంటే ఆదరించేవారు ఎవరు ఉండరు. వ్యసనములకు బానిసకావడం సంపాదించిన డబ్బు అంతా కోల్పోవడం ప్రేమలో వంచన జరగడం, వివాహములు ఆలస్యం కావడం. విద్యలో రాణింపు లేకపోవడం. వృత్తిలో బాధలు కలుగుతాయి. కొంతమంది వివాహములు కాకపోవడం, అతికామము (లేదా) నపుంసకుడిగా జీవించడం.

3) తృతీయ నవమ(3,9) స్థానాలలో అనగా రాహుకేతువులు 3,9 లేక 9,3 స్థానాలలో ఉంటారు. దీనివలన ఆ జాతకుడు సోదరులకు, సోదరికి, ఈ జాతకునికి మరియు ఈ జాతకుని తండ్రికి ఎక్కువ కష్టాలు పడతారు. తండ్రి, సోదరులకు, సోదరికి సహాయము చేస్తాడు కాని ఈ సోదరసోదరీమణులు అనగా కొడుకు, కూతుర్లు తండ్రిని మోసం చేయటం అని అర్థం. ఈ జాతకుడు మోజగాళ్ళుగా, రౌడీలుగా, వ్యసనాలకు బానిసలుగా అన్యాయంగా ధనార్జన చేస్తారు. కుటిలబుద్ధితో ప్రవర్తిస్తారు. వ్యాపారాలు నష్టం కలిగిస్తాయి. అన్నదమ్ముల ఆస్తులు కోర్టుల పాలవుతాయి.

4) చతుర్ధదశమ (4, 10) స్థానాలలో రాహుకేతువులు ఉంటే అనగా జన్మలగ్నం నుండి 4, 10 స్థానాలల్లో రాహుకేతువులు (లేదా) కేతురాహువులు ఉన్న జాతకుడు ఏ వృత్తిలో నిలకడగా ఉండలేడు. మనస్తత్వం కూడా మారుతుంది. ఎంతవయస్సు వచ్చినా అభివృద్ధి సాధించలేరు. జీవితంలో స్థిరపడలేరు ధనము విపరీతంగా ఖర్చువుతుంది. ఏ ఉద్యోగంలో చేరినా కొంతకాలానికి వివాదాలవల్ల మానేస్తారు. ఏవ్యాపారం చేసినా నష్టమే కలుగుతుంది. వీరి ధనము అంతా లగ్జరీ ఖర్చులు చేస్తారు. వాహనాలు, సెల్‌ఫోన్లు కొంటారు. తల్లితో కొడుకి మరియు కూతర్లకు గొడవలు జరుగుతాయి. కన్నతల్లిని వేధిస్తారు. ధనముకోసం బెదిరిస్తారు. ఆమె ఆస్తిపాస్తులు, నగలు కాజేస్తారు. తల్లిదండ్రులకు మందులు ఇప్పించకపోవడం, దూషించడం భయాందోళనలకు గురి చేయడం. ఎప్పుడు ఏదో ఒక భయాందోళనలో ఉంటారు. కంగారు ఎక్కువ ఏకొంచెం ఆరోగ్యం బాగాలేకపోయినా కంగారుపడతారు. వ్యసనాలు ఎక్కువగా ఉంటాయి. స్థలము (లేక) ఇల్లు కొంటే అవి వివాదాలలో చిక్కుకొని కోర్టులకు వెళ్లడం జరుగును. ఎవరైన ఆక్రమించడం వాహనాలు కొంటే ప్రమాదములలో చెడిపోతాయి.

5) పంచమ ఏకాదశ (5,11) స్థానాలలో రాహుకేతువులు అనగా 5, 10 స్థానాలల్లో రాహుకేతువులు (లేదా) కేతువు రాహువులు ఉంటే సంతాన నష్టము, గర్భస్రావము, సంతానము లేకపోవడం ఈ జాతకులు ఎంత చదివినా మర్చిపోవడం పరీక్షలలో తప్పడం విద్యలో సీట్లు పొందలేకపోవడం, కాంపిటీటివ్ పరీక్షలలో విజయం సాధించలేకపోవడం, పరీక్షలు రాయలేకపోవడం, అనారోగ్యం వల్ల విద్యలో వెనుకబాటుతనం, వృత్తిలేక ఉద్యోగంలో విఫలము అవడం, ప్రయాణంలో ఇబ్బందులు కలగడం. వృత్తిలో వేదింపులు ఉద్యోగాలు కోల్పోవడం జరుగును.

6) షష్ఠమ, ద్వాదశ (6,12) స్థానాలలో రాహువుకేతువులు 6, 12 లేక 12, 6 స్థానాలలో ఉంటారు. శత్రువులు ఎక్కువగా ఉంటారు. కుటుంబంలో అందోళనలు ఎల్లప్పుడు ఏదోఒక ఆందోళనలు ఇంటిలో పగలు ప్రతీకారాలు కక్ష్యలు కార్పణ్యాలు ఇంట్లో భార్యాభర్తలు పిల్లలు తిట్టుకోవడం అరవడం, రాక్షసుల్లాగా ఆయుధాలు పట్టుకోవడం, పళ్ళుకొరకడం భీభత్సవాలు సృష్టించడం. అప్పులు చేయడం, దీర్ఘకాలికరోగాలు ఎప్పుడు అనారగ్యోంతో బాధపడుటం, మానసిక అశాంతి, ధనరాబడి కంటే పోవడం ఎక్కువగా ఉ ండటం, ఎవరికి డబ్బులు ఇవ్వకపోవడం, ఇతరులను మోసం చేయడం, బంధువులు ఓర్చలేకపోవడం బంధువులు స్నేహితులు శత్రువులుగా మారడం జరుగును.

## 143. పూర్వప్రకాశిత కాలసర్పయోగము, ఫలితములు, స్వరూపము

జాతక చక్రమంలో రాహువు మరియు కేతువు గ్రహముల మధ్య రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని గ్రహములుంటే దానిని కాలసర్పయోగము అంటారు. ఇక్కడ రాహువు యొక్క స్థానము వైధిక వాంజ్ఞయ ఆధారంగా దక్షిణదిశలో ఉంది. దానికి ఎదురు దిశ అయిన ఉత్తరములో కేతువు ఉంటారు. ఇక్కడ రాహువు కేతువుల మధ్యలో ఆరుగ్రహములుండి మిగిలిన ఒక్క గ్రహము బయట ఉంటే అది రాహువు అంశకంటే ఎక్కువగా ఉన్నా కాలసర్పయోగము భంగపడును. రాహువు మరియు కేతువు గ్రహముల మధ్య సప్తగ్రహములుండి మరియు రాహు లేక కేతువు జన్మలగ్నంలో ఉంటే దానిని పూర్వ ప్రకాశిత కాలసర్పయోగము అవుతుంది. గోచారంలో కూడా కాలసర్పయోగం ఉన్న ఆటంకములు జరుగును.

**పూర్వ ప్రకాశిత కాలసర్పయోగ ఫలితములు:**

1) ఎంతో శ్రమకూర్చిన ఫలితము లేకపోవడం
2) జీవితంలో అన్ని ఆలశ్యంగా జరగడం
3) శత్రువులు ఎక్కువగా ఉండటం
4) చికాకులు, మానసిక అశాంతి
5) వైవాహిక జీవితంలో అపశ్రుతులు
6) దీర్ఘకాలిక రోగములు కలుగును.

## పూర్వ ప్రకాశిత కాలసర్పయోగస్వరూపము

| చంద్రుడు | ల<br>రాహువు | | |
|---|---|---|---|
| శుక్రుడు | | | |
| గురువు | | | |
| రవికుజ<br>బుధుడు | శని | కేతువు | |

| ల<br>కేతువు | | | |
|---|---|---|---|
| గురువు | | | |
| శుక్రుడు<br>బుధుడు | | | |
| చంద్రుడు | రవి<br>కుజుడు | శని | రాహువు |

పైవిధంగా పూర్వప్రకాశిత కాలసర్పయోగము ఉండును.

## 144. వైవాహిక జీవితము పై కాలసర్పయోగ ప్రభావము

వివాహము జీవితంలో అతి ముఖ్యమైనది. జ్యోతిష శాస్త్రములో వివాహము గురించి బాగా విశ్లేషించారు. వివాహస్థానము అనగా సప్తమస్థానమును విశ్లేషించవలెను. జాతకంలో కుజుడు 2, 4, 7, 8, 12 స్థానాలలోను మరియు జన్మలగ్నంలోను కుజదోషము ఉండకూడదు. శుక్రుడు, షష్ఠమ, అష్ఠమ,

వ్యయస్థానాలల్లో ఉండకూడదు. జాతకంలో వివాహస్థానమును పరిశీలించేటప్పుడు 2, 5, 7, 8, 12 భావములను పరిశీలించవలెను. ముఖ్యంగా సప్తమస్థానాధిపతి, సప్తమంలో ఉండే గ్రహం, కుజ, శుక్రులను పరిశీలించవలెను. అష్టమస్థానము మగవారికి ఆయుష్షు, అదే అష్టమభావం స్త్రీలకు మాంగళ్యస్థానమును సూచించును. 2, 7, 8, 12 స్థానాలలో పాగ్రహములు ఉండరాదు. వైవాహిక జీవితం సంతోషంగా ఉండాలంటే 7వ ఇంటి అధిపతి 6వ ఇంటిలో గాని, షష్ఠమాధిపతి అష్టమంలో గాని, సప్తమంలో గాని ఏ జాతకంలో గాని శుక్రుడు పాపగ్రహములతో కలవకూడదు. పాపగ్రహములు 8వ ఇంటిలో ఉండకూడదు. అలాగే 2వ ఇంటిని పాపులు చూడకూడదు. 7వ ఇంటికి రెండువైపుల పాపులున్నచో వివాహజీవితంలో కష్టాలు వస్తాయి. కుటుంబంలో కలతలు సంభవిస్తాయి.

కర్కాటక, సింహ, కుంభలగ్నాలకు ఆరవస్థానములో శుక్రుడు దోషంలేదు. జాతకంలో కుజశుక్రుల కలయిక మంచిదికాదు. కుజుని వలన శుక్రుడు బలహీనపడితే విపరీతమైన గొడవలు, సుఖసంతోషాలు లేకపోవడం, చాలాకాలము ఎడబాటు 5వ ఇంటి అధిపతి, 7వ ఇంటి అధిపతుల మధ్య చెడు దృష్టి ఉంటే జీవితకాలం అంతా బ్రహ్మచర్యం సూచిస్తుంది. 7వ ఇంటిలో రవి రాహువుతో కలిస్తే స్త్రీల సాంగత్యం వల్ల ధననష్టం కలుగుతుంది. 4వ ఇంటి నందు, 7వ ఇంటినందు, 12వ ఇంటినందు పాపులు ఉంటే జాతకుడు భార్యాపిల్లలను కోల్పోవటం జరుగుతుంది. జన్మలగ్నాధిపతి 7వ ఇంటినందు శుభుల సంబంధం కలిగి ఉంటే జీవిత భాగస్వామి గౌరవప్రదమైన కుటుంబానికి చెందును.

జన్మలగ్నంలో గాని ఏడవ ఇంటిలో గాని చంద్రుడు ఉంటే నవాంశ లగ్నము సింహము అయితే జాతకుని భార్య గొడవలు చేయునది అవుతుంది. 7వ ఇంటిలో శుక్రుడు బలంగా ఉంటే వివాహనంతరం మంచి భాగ్యముతో పాటు అన్ని విధములైన సంతోషకరమైన వైవాహిక జీవితము లభించును. వివాహ విషయాలు పరిశీలించటానికి కళత్రకారకుడైన శుక్రుడు, ఏడవ ఇల్లు, ఏడవ ఇంటి అధిపతులపై ఆలోచన చేయవలెను.

**సప్తమం (7)లో :**

**రవి:** వివాహము ఆలస్యము అవడం, గర్వము, స్థిరచిత్తము కల భాగస్వామి లభించును.

**చంద్రుడు:** దయ, ఊగిసలాడు స్వభావము కల జీవిత భాగస్వామి రావడం, సంసార పక్షము

**కుజుడు:** గొడవల మనస్తతత్వము, అహంకారం, గర్వం, అధికారం చలాయించే భాగస్వామి లభించును. అపార్థాలు, విడాకులు సంభవించును.

**బుధుడు:** తొందరగా ఆలోచించగల తీక్షణమైన జీవిత భాగస్వామి లభించును.

**గురువు:** మంచి జీవిత భాగస్వామి, సాధారణంగా సుఖప్రదమైన వివాహజీవితం.

**శుక్రుడు:** శుక్రుడు బలంగా ఉంటే సుఖప్రదం లేకపోతే ఎక్కువ కలహాలు, ఇతర స్త్రీలపై మక్కువ కలిగి ఉండటం

**శని:** భార్యాభర్తల మధ్య ఎక్కువ వయస్సు తేడా ఉండటం లేదా వాల్లు విడివిడిగా ఉండటం సంతోషం లేని వైవాహిక జీవితం

**రాహుకేతువుల:** గొడవవలు, విడాకులు, దుఃఖం కలిగించే పరిస్థితులు.

స్త్రీజాతకములో ఎనిమిదవ ఇల్లు ప్రాముఖ్యత సంతరించుకొన్నది. స్త్రీకి ఎనిమిదవ ఇంట పాపులు ఉండరాదు. స్త్రీకి అష్టమంలో పాపులుంటే కుజుడు ఉంటే వివాహనంతరం తక్కువ కాలంలో వైధవ్యం 8వ ఇంటిలో శని ఉంటే వైవాహిక జీవితం చప్పగా ఆకర్షణ రహితంగా ఉంటుంది. ఏడవ ఇంటిలో చంద్రుడు, శనితో కలిసి ఉంటే స్త్రీకి పునర్వివాహము అవుతుంది. అష్టమంలో ఏగ్రహము ఉండకపోవడం మంచిది. ఏడవ (7) ఇల్లు ద్విస్వబావ రాశి అయి అక్కడ శుక్రుడు పాపులతో కలసిగాని ఉంటే తప్పని సరిగా ఒకటి కంటే ఎక్కకవ వివాహాలు అవుతాయి.

జన్మలగ్నాధిపతి, సప్తమాధిపతులు దగ్గరగా ఉంటే చిన్నవయస్సులో వివాహము జరుగుతుంది. శుభులు జన్మలగ్నమందు, ద్వితీయ, సప్తమములో ఉన్నచో చిన్న వయస్సులో వివాహము జరుగును. సప్తమంలో ఉండే గ్రహము, సప్తమాధిపతి గ్రహదశ, సప్తమాన్ని చూస్తున్న గ్రహదశలలో అంతర్దశలలో వివాహము జరుగును. వైవాహిక జీవితంలో భార్యాభర్తల మధ్య కాలసర్పయోగము ఉంటే ఏమవుతుంది. భర్త జాతకములో కాలసర్పయోగము ఉంది అనుకుందాం భార్యజాతకములో కాలసర్పయోగము ఉంది అనుకుందాం ఇద్దరికి కూడా రాహుకేతు మహర్దశలలో కాని అంతర్దశలలో కాని జీవితంలో అనేక ఇబ్బందులు కలుగుతాయి. భార్యాభర్తలు విడిపోవడం, కోర్టులు ఎక్కడం, వాహనప్రమాదములు బయట గొడవలు వల్ల ఇంట్లో తగాదాలు వింత వ్యాధులు మరణములు సంభవించును. ఇద్దరు కూడా మరణములు సంభవించును. ఇద్దరు కూడా ఆదోషాలకు నివారణ చేసుకొని చక్కగా జీవితాన్ని సాగించవచ్చు. వీరు ఆందోళన చెందకుండా పరిష్కార

ములు చేసుకొనవలెను. సమానంగా వివాహపొంతనములలో సర్పదోషం, కాలసర్పదోహషములు లేకుండా చేసుకోవడం మంచిది. ఒకరికి ఉండి ఒకరికి లేకపోయినచో పరిహారములు చేసుకొని వివాహము చేసుకొన వచ్చును. ఆందోళన చెందవలసిన పనిలేదు.

## 145. ఛాయాగ్రహముల ప్రత్యేకత

రాహువు కేతువులను ఛాయగ్రహములు అని అంటారు. చీకటి కూడా ఒక కాంతి చీకటిలో కూడా చూడగల్గిన వస్తువులు కలవు ఆ చీకటియే ఛాయ, ఛాయకు ప్రభావం లేదని అని అంటారు కాని వాస్తవంకాదు. ఛాయననుస రించి వెలుగువలె అయస్కాంత ప్రభావం తీవ్రంగా ఉంటుంది. ఛాయగ్రహ ములకు విశిష్ఠస్థానము కలదు. కాంతి ఛాయారూపంలో ఉండి సర్పాకార ములో అనగా వంకర వంకరలు ఉంటాయి. అనగా ఛాయా గ్రహాలను రాహు కేతువులు సర్పాకారంలో ఉంటాయి.

గ్రహములలో ఎనిమిదవది రాహువు గ్రహము శిరోప్రాధాన్యము గల రాహువు శరీరము కేతు రూపముగా ఉన్నది. అంటే ఒకే వ్యక్తి శిరస్సు ఒకరూపముగానూ, మిగిలిన శరీరము మరొక రూపముగానూ ఉండి రాహువు, కేతువు నామములతో వ్యవహరించబడును. ఈ రాహు కేతువులు ఎల్లప్పుడు వీరిమధ్యదూరము 6 రాశులు అనగా $180^0$లలో ఉంటుంది. వీరు తమ శక్తియుక్తులతో గ్రహమండలంలో స్థానమును సంపాదించు కొన్నారు. దేవతల వేషమును ధరించి అమృతమును తాగవలెనని కాంక్షతో దేవతల మధ్య కూర్చుని అమృతమును సేవించి శ్రీమహావిష్ణువు ఆగ్రహము నకు గురియై ఆయన చక్రాయుధముచే శిరము ఖండింపబడి అమృత స్పర్శవలన శిరము మరియు మొండెము వేరు వేరు దిక్కులకు పడి పోయినవి. తరువాత బ్రహ్మను మెప్పించి గ్రహమండలంలో ఆధిపత్యం సంపాదించారు. అంతరిక్షములో గ్రహకక్షలలో రవి, కుజుల యొక్క మధ్యక భాగమున, రవికి సమీపంగా ఈ రాహువు కక్ష్య దీర్ఘవృత్తిలో ఉంటుంది. శని తరువాత మందగమనం గల గ్రహము కేతువు ఈ గ్రహము భచక్రమునందు గ్రహముల వరుసలో తిరుగుతారు. మధ్యభాగము నందున్న సూర్యమండలమునకు నైరుతి దిగ్భాగంలో శూర్పాకరాము కలిగిన నల్లని కాంతి కలిగి సింహాము వాహనములో ఉండి దక్షిణముఖుడై కృష్ణసర్పాకృతి కలిగి మహాబయంకరుడై విషజ్వాలలు చిమ్మెడి ఐదుముఖములు కలిగి బయటకు వచ్చిన పళ్లు, వెడల్ప యినముఖములు, తీక్షణమైన కళ్ళు, పొడవైన నాలుకలు కలిగి

దంష్ట్రాకరాళవదనుడనే స్థారకనామధేయుడైన ఈ రాహువును అన్నిగ్రహ ములు సర్వ దేవతలకు అమితమైన భయము ఈ గ్రహమును తమోగ్రహము అని అంటారు.

**రాహువుకు చాలా నామములు కలవు అవి:**

1) స్వర్భానువు 2) సైంహికేయుడు 3) విధుతుడు 4) ధూమ్రుడు 5) నాగరూపుడు 6) చాయారూపుడు 7) పంచశీర్షుడు 8) సోమశత్రువు 9) ధ్విజిహ్వుడు 10) కరాళాస్యుడు 11) బలి 12) అగోచరుడు 13) శాంభవుడు 14) పాతాళగామి మొదలగునామములు కలవు.

ఈ రాహుగ్రహానికి కుడివైపు గోదేవత అధిదేవతగానూ, ఎడమవైపున సర్పదేవత ప్రత్యధిదేవతగాను ఉన్నారు. రాహువుకు దూమ్ర, దర్శ అను ఇద్దరు భార్యలు ఉన్నారు. వీరిలో ధూమ్ర కాల స్వరూపమునకు ప్రతిరూపము దర్శ (రెండవభార్య) తిధ్యంతర పర్వస్వరూపిణిగా అవుతుంది. ఆ రాహువు విష్ణు వరప్రసాది, దుర్గాదేవి అనుగ్రహ పాత్రుడు, ఉపాసకుడు, చతుర్భజములు కలిగి ఖడ్గ, చర్మ వరదాభయములు ధరించినవాడు. మానవ సర్పశరీరములు ధరించినవాడు. రాహుకేతువులు కొన్ని గంటలపాటు అప్పుడప్పుడు రవి, చంద్రులను పీడిస్తుంటారు. దీనివల్ల సూర్యగ్రహణము, చంద్రగ్రహణములు ఏర్పడును. రాహువుకు ఇతర నామములు అసుర, ఫని, తమ, అహి, చత్రి, ధ్వంత, పంక, కుండలి, భోగి, ఉపప్లవ, ఉపరాగ, కాకయోదర, సింహికాసుత అన్న పేర్లు కలవు.

**కేతువుకు అదిష్మాన దేవత గణపతి:**

గణపతి ప్రసన్నం చేసుకుంటే కేతువు అనుగ్రహం కలుగుతుంది. వివిధరకాల గణపతుల అనుగ్రహము కావాలి కేతువుకు. ద్వజ, శిఖి, కృశ, తట, పృచ్ఛ, ఆకచ,అనిల,ఉత్పాత,కబంధ,ధూమ్రకాయ, బ్రహ్మపుత్ర, మృత్యుపుత్ర, విషగర్భ,వైజయంత అను పేర్లు కలవు. ఈ కేతువు దూమ్రరూపంలో అనగా పొగరూపంలో, ఒకమంచురూపంలో దట్టమైన పొగరూపంలో ఉంటాడు. సూర్య మండలమునకు వాయువ్యభాగంలో ద్వజాకారము కలిగిన పొగకాంతి కలిగి గ్రద్ధవాహనముపై ఉండి దక్షిణముఖుడై సర్పాకృతి కలిగి ఉంటాడు.

## 146 నిర్ధిష్ట కాలసర్పయోగము

కాలసర్పయోగము అంటే ఏమిటి? అసలు దాని స్వరూపము ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానము ఏమిటి? చాలామంది రాహువు, కేతువుల మధ్య

సప్తగ్రహములు  ఉంటే దానిని కాలసర్పయోగము అవుతుంది. అని అందరికి తెలుసు. కాని దాని స్వరూపము దగ్గర పొరపాటు చేస్తున్నారు. రాహుకేతువుల మధ్యలో సూర్య, చంద్ర, కుజ, గురు, శుక్ర,శని ఇత్యాధి గ్రహములు ఉంటే కాలసర్పయోగము స్పష్టమగును. రాహుకేతువులు ఎల్లప్పుడు వక్రగతిలోనే ఉంటాయి.

<table>
<tr><td>రాహువు</td><td></td><td></td><td></td></tr>
<tr><td>శుక్రుడు</td><td colspan="2" rowspan="2">జాతక చక్రము</td><td></td></tr>
<tr><td>గురువు</td><td></td></tr>
<tr><td>చంద్రుడు<br>కుజుడు<br>బుధుడు</td><td>రవి<br>లగ్నం</td><td>శని</td><td>కేతువు</td></tr>
</table>

పైన ఉదాహరణగా తీసికొన్న జాతకచక్రములో రాహువు, కేతువుల మధ్య అన్యగ్రహములు ఉన్నాయి. మీనరాశి నుండి కన్యారాశిలోపు సప్తగ్రహములు ఉన్నాయి. అనగా మీనంలో రాహువు, రాహువు భ్రమణం మీనం నుండి కుంభం, మకరం, ధనస్సు, వృశ్చికం, తుల, కన్యా, రాశులవైపు ఉంటుంది. కేతువు భ్రమణం కన్యారాశి నుండి మీనరాశులవైపు ఉంటుంది. అన్యగ్రహము వీటి మధ్య ఉండటం వల్ల నిర్ధుష్ట కాల సర్పయోగం ఏర్పడింది.

| కేతువు | | | |
|---|---|---|---|
| శుక్రుడు | జాతక చక్రము | | |
| గురువు | | | |
| చంద్రుడు కుజుడు | రవి లగ్నం బుధుడు | శని | రాహువు |

పైన 2వ ఉదాహరణలో జన్మకుండలిలో రాహువు భ్రమణం కన్యారాశి నుండి సింహ, కర్కాటకం, మిధునం, వృషభం, మేషం, మీన రాశుల మధ్య అన్యగ్రహములు (సప్తగ్రహములు) లేకుండా ఉన్నాయి. ఇట్టి స్థితిలో కాలసర్పయోగము అవదు పైరూపములో ఉన్నది కాలసర్పయోగము కాదు. రాహువు భ్రమణమును బట్టి కాలసర్పయోగము కాదు. రాహువు భ్రమణమును బట్టి కాలసర్పయోగము సూచించవలెను. పైన జాతకకుండ లిలో కాలసర్పయోగము లేదు ఇలాంటివి అన్నీ పరిశీలించి కాలసర్ప యోగమును విశ్లేషించవలెను.

## 147. సైంటిఫిక్ పరంగా కాలసర్పయోగము

రాహుకేతువుల మధ్యమ సప్తగ్రహములు ఉంటే దానిని కాలసర్పయోగము అంటారు. ఈ కాలసర్పయోగములో చాలారకాలు ఉన్నాయి. చాలామంది జ్యోతిష్యులు, రాజకీయనాయకులు, పారిశ్రామిక వేత్తలు, సినిమానటులు, డాక్టర్లు, లెక్చరర్లు, ఇంజనీర్లు, చార్టర్డ్ అకౌంట్లు, లాయర్లు మొదలగు అన్ని రంగాలలో ఉన్న వారికి కాలసర్పయోగము ఉన్నది గదా వీళ్ళందరు మంచి అభివృద్ధిసాధించారు గదా అని ప్రశ్నలు వేస్తారు. దానికి కారణాన్ని విశ్లేషించలేకపోతున్నారు (జ్యోతిష్యులు) కాలసర్పయోగం ఉన్న జాతకులకి నిర్ధిష్టంగా కాలసర్పయోగం ఉందా? అని ఆలోచించట్లేదు మరియు కాలసర్ప యోగము ఉన్నా జాతకంలో మంచి యోగాలు ఉంటే కాలసర్పయోగం విఫలమవుతుంది. ఆవిషయాన్ని గమనించాలి. డిగ్రీల ప్రకారం కాలసర్ప

యోగమును ఆలోచించాలి. కాలసర్పయోగస్వరూపము క్రింద ఉదాహరణగా చూడండి.

| రాహువు<br>కుజుడు<br>చంద్రుడు | | | |
|---|---|---|---|
| | జన్మ కుండలి | | |
| గురువు | | | |
| శుక్రుడు | రవి<br>బుధుడు | శని<br>లగ్నం | కేతువు |

**గ్రహము - డిగ్రీలు - నక్షత్రము**

కుజుడు - $3^0-40'$ - ఉత్తరాభాద్ర 1వ పాదం

చంద్రుడుల - $6^0-52'$ - ఉత్తరాభాద్ర 2వ పాదం

రాహువు - $29^0-10'$ - రేవతి 4వ పాదం

పైన విషయములు పరిశీలిస్తే రాహువు డిగ్రీల కంటే కుజుడు, చంద్రుడు డిగ్రీలు తక్కువగా ఉన్నాయి. రాహువు డిగ్రీలు తగ్గుతూ ఉంటుంది. రాహువు భ్రమణం కుజచంద్రులవైపు వస్తుంది. అనగా రాహు అంశలకంటే కుజచంద్ర అంశలు తక్కువగా ఉండాలి. ఇలా ఏగ్రహములు అయిన రాహుకేతువుల కంటే తక్కువ డిగ్రీలలో ఉండాలి. ఇది నిర్ధిష్ట కాలసర్పయోగము.

| | రాహువు గురువు | | చంద్రుడు |
|---|---|---|---|
| | జాతక చక్రము | | శుక్రుడు |
| | | | రవి లగ్నం బుధుడు |
| | | కేతువు | శని |

**గ్రహము - డిగ్రీలు - నక్షత్రము**

చంద్రుడుల - $14^0$-$10'$ - భరణి 1వ పాదం

రాహువు - $6^0$-$50'$ - అశ్వని 3వ పాదం

పై విషయములు పరిశీలిస్తే రాహువు డిగ్రీల కంటే గురువు డిగ్రీలు ఎక్కువగా ఉన్నాయి. రాహువు కంటే గురువు అంశలు ఎక్కువగా ఉన్నాయి. ఇది నిర్ధిష్ఠమైన కాలసర్పయోగము కాదు కాలసర్పయోగము భంగము అయినది, విఫలమైనది. ఇలాంటివి ఎన్నో పరిశీలనచేసి కాలసర్పయోగమును నిర్ధారించవలెను.

## 148. నాగదేవత వ్రతములు

నాగదేవతలకు సంబంధించినవి చాలా వ్రతములు, పండగలు కలవు. చాలామాసములలో ఒకరోజు సర్పమునకు ఇష్టమైన రోజు ఉంటుంది. ఆరోజున మనము భక్తితో పూజచేయవలెను. వైశాఖ, భాద్రపద, శ్రావణ, మార్గశిర, కార్తీక, ఫాల్గుణ మాసములలో పండగలు జరుపుకొంటారు.

మొట్టమొదట శ్రావణమాసములో పంచమి (శుక్ల)ని నాగపంచమిగా వ్యవహరిస్తారు. ఆరోజున నాగదేవతను ఆరాధిస్తారు. పుట్టలో పాలుపోసి, నైవేద్యం పెడతారు. షోడశోపచారములు చేస్తారు.

నాగపంచమి రోజున జరపవలసిన విధులను హేముద్రి స్కాందపురాణములో ప్రభాస ఖండములో వివరించారు. పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పాడు. ఓ పార్వతీ శ్రావణమాసమునే శుక్ల పంచమి రోజున ద్వారములకు ఇరువైపుల పేడతో (ఆవు) సర్పబొమ్మలను చిత్రీకరించి పూజించవలెను. శ్రావణశుద్ధ చవితిరోజున ఉపవాసము ఉండి. ప్రక్కరోజు అగు పంచమి రోజున బంగారంతో గాని, వెండితో గాని, కర్రతో గాని మట్టిదోగాని ఐదుపడగల పామును చేసుకొని కుంకుమతో గాని, పసుపుతో గాని, చందనముతో గాని, ఐదు(లేక) ఏడు పాముల చిత్రరేఖలు గీయవలెను. విధిప్రోక్తముగా గంగాజలంతోను, పంచామృతముతోను, గన్నేరు,సంపెంగ, జాజిమున్నగు పూలతోను, నాగేంద్ర స్వామిని పూజించవలెను. తరువాత ఘృతపాయసమోదకములతో బ్రాహ్మణులను సంతృప్తి పరచవలెను. ఆరోజున పాలు, పాయసములు నైవేద్యముగా పెట్టవలెను. ఆరోజు పగలు గాని, రాత్రిగాని భూమిని త్రవ్వరాదు.

ఇలాగే పంచమినాడు ఒక వ్రతము కలదు అది భవిష్య పురాణమున నాగదష్టవ్రతము కలదు. ఈ వ్రతము గురించి హేమాద్రి చెప్పినాడు.

**సుమంతు ఉవాచ:**

నాగద్రష్టో నరో రాజన్ ప్రాప్య మృత్యుంవ్రజ త్యధః।
అధో గత్వా భవేత్సర్పో నిర్విషో నాత్ర సంశయః॥

**శతానీక:**

నాగదష్టః పితా యస్య భ్రాతరో దుహితాఽపిచ
మాత పుత్రోఽధవా భార్య కుర్యాత్కిం తద్వదస్యమే।
మోక్షాయ తస్య విప్రేంద్ర దానం వ్రత సంపోషణం
భూమి హే ద్విజ శార్దూల యద్భవే త్తత్కరోమ్యహమ్॥

**సుమంతు:**

ఉపోష్యా పంచమీ సమ్యక్ నాగానాం బలవర్ధనీ,
సమైకమేకం యావచ్ఛ విధానం శ్రుణు భారత
శ్రావణే మాసి పంచమ్యాం శుక్లపక్షే నరాధిప
సాపి పుణ్యతమా ప్రోక్తా గ్రాహ్యా సా గతికామ్యయా

రాజా। పాముకాటు తిన్న నరుడు మరణించిన తరువాత పాతాళలోకమునకు పోయి విషరహితుడై సర్ప జన్మ పొందును. ఈ విషయములో సందేహము లేదు.

ఈ విషయాన్ని సుమంతుడు వివరించగా, శతానీక మహారాజు మిగుల విచారపడి సర్పము కాటువేస్తే తల్లి, తండ్రి, కొడుకకు, కుమార్తెలు, భార్య, సోదరులు వీరందరి మోక్షప్రాప్తికి ఏమి చేయాలి? ఏ వ్రతము ఆచరించాలి? ఏ ఉపవాసము చేయాలి? విప్రేంద్రా! అని ప్రశ్నించెను? పంచమి పర్వదినము నాగులకు విశేషమైనది. చవితిరోజున ఉపవాసము నుండి శ్రావణ శుక్లపంచమి రోజున విశేషముగ పూజలు చేయవలెను. ఆపంచమి పుణ్యమైనది. సర్గతిదాయిని అని సుమంతుడు తెలిపినారు.

నాగపంచమి రోజున శిరఃస్నానమాచరించి దేవాలయాలలో సర్పములకు గంగాజలంతో మరియు పంచామృతములతో గాని అభిషేకము చేసి వస్త్రములు, యజ్ఞోపవీతములు వేసి షోడశోపపూజలు చేయవలెను. ఈ నాగదేవతలు అశ్వత్థ నారాయణ వృక్షము యందు ఉండును. ఈ విగ్రహములకు పాలు, కొబ్బరి, అన్నము, పాయసము నైవేద్యము పెట్టెదరు. సాయంకాలము చెట్లకు ఊయలలు వేసికొని ఊగెదరు.

నాగపంచమికి రెండు కథలు ప్రాధాన్యతను సంతరించుకొన్నాయి.

ఒకగ్రామములో రైతు ఉండేవాడు. అతను పొలమును దున్నుతుండగా నాగలి గుంతలోకి దిగబడినది. ఆ గుంటలో నాగుపాము పిల్లలకు గాయములు అయ్యాయి. ఎలాగాయాలు అయినవి అని చూడగా నాగలికి నెత్తురు మరకలు కలవు. ఆవేశముతో ఆరైతు ఇంటికి వెళ్ళి అతని కుటుంబములోని అందరిని కరచి వేసెను. కాని అంతటితో సర్పము యొక్క ఆవేశం చల్లారలేదు. ఆరైతు యొక్క కూతురు వేరే ఊరిలో నివశిస్తుంది. ఆసర్పము వారి ఇంటికి కూడా వెళ్ళెను అక్కడ ఆరైతు కూతురు నాగదేవతను పూజించుచుండెను కనుక ఆ సర్పము పూజ ముగిసే వరకు వేచియుండెను. ఈలోగ పూజ నిమిత్తము తొమ్మిది నాగవంశములను వ్రాసిన పీఠముపై నున్న చందనపు గిన్నెలో పడగముంచి ప్రక్కనున్న ప్రాలనుత్రాగి, పేలాలను మింగెను. దానితో సర్పము ఆవేశం తగ్గెను. రైతుకూతురు ధ్యానమునుండి కనులు తెరవగానే ఎదురుగా నాగపాము ఉన్నది. నీవెవరి కూతురవు? అని ప్రశ్నించెను. అమె తెలియజేయగా, తానామె తల్లిదండ్రులను, అన్నదమ్ములను చంపేసాను అని చెప్పినది. రైతుకూతురు చింతించి, వారిని మరలా బ్రతికించమని కోరగా, ఆ నాగదేవత ఆ రైతుకూతురికి అమృతము ఇచ్చెను. ఆ అమృతమును ఆమె తన తండ్రి ఇంటికి పరుగెత్తి వెళ్లి మరణించిన వారి నోట్లో అమృతము వేసి బ్రతికించుకొనెను. ఈ సంఘటన జరిగిన నాటి నుండి శ్రావణ శుద్ధ పంచమి రోజున పొలములను దున్నరు.

**రెండవ కథ:**

పూర్వము ఒక గ్రామములో బ్రాహ్మణుడు ఉండేవారు. అతనికి ఏడుగురు కుమారులు వారి భార్యలు ఐతే కోడళ్ళు అందరు పుట్టింటికి వెళ్ళారు. కాని చివరి కోడలుకు వారి బంధువులు లేరు. ఆమె నాగరాజుకు పరమ భక్తురాలు, కనుక ప్రతిరోజు నాగేంద్రస్వామిని పూజిస్తుంది. ఆమె భక్తికి ఆదిశేషుడు కరుణించి ఆదిశేషుడు ఒక వృద్ధ బ్రాహ్మణుని రూపము ధరించి ఆ కోడలు మామగారి యొద్దకు వచ్చి తాను మేనమామని అననియు, ఆమెను తన ఇంటికి పంపవలెను అని కోరెను. ఇంతకాలం మీ మేనమామ ఏమయ్యెనని మామగారు ఆశ్చర్యపడసాగెను. ఆ ఇంటి కోడలు అత్తగారితో విసుగెత్తిపోయి అతడు తన మేనమామయే అని మామగారిని ఒప్పించెను. తరువాత ఆ వృద్ధుడు ఆ కోడలిని పిలుచుకొని వెళ్ళి కొంతదూరము పోయిన తర్వాత తన నిజరూపము ధరించి తన పడగపై ఎక్కించుకొని నాగలోకమునకు పోయెను. ఆమె కొంతకాలం ఆదిశేషుని ఇంట బంధుమిత్రులతో పాటు నివశించెను. ఆమెను ఎవరు కరవగూడదు అని నాగరాజు శాసించెను. కొంత కాలము తర్వాత అధిశేషుని భార్య ప్రసవించెను. పాము పిల్లలు అన్నియు ఇంటిలో ఉన్నవి. బ్రాహ్మణకోడలు ఒకరోజు బరువైన ఇత్తడి దీపమును పట్టుకకొని వెళ్లుతుండగా దారికి అడ్డముగా తిరుగుతున్న పాముపిల్లలను చూసి భయపడి దీపాన్ని జారవిడచినది. పిల్లలు అందరికి గాయాలు అయినవి. మరికొంతకాలానికి ఆదిశేషుడు ఆమెను అత్తగారింటికరి పంపివేసెను. తరువాత శ్రావణమాసము వచ్చెను. ఆశ్రావణ శుక్లపంచమి రోజున. ఆబ్రాహ్మణస్త్రీ ఒకపీటపై నాగులు రూపములు గీసి పూజించెను. ఆరోజు వికలాంగులైన పాముపిల్లలు మేము ఎలా వికలాంగులైనాము అని తల్లిని అడిగారు అందుకు తల్లి వివరించింది. అందుకు ఆగ్రహించిన సర్పములు ఈ బ్రాహ్మణస్త్రీ ఇంటికి కాటువేయడానికి పొంచివున్నాయి. కాని ఆబ్రాహ్మణస్త్రీ వికలాంగులైన సర్పములను రక్షించమని ఆపరమేశ్వరుడని వేడుకొన్నది. అందుకు ఆ సర్పము కరుణచూపి. ఆనైవేధ్యాన్ని తిని పాలగిన్నెలో రత్నహారమును వదిలివెళ్లెను. ఆరత్నము వల్ల ఆమె సకల ఐశ్వర్యములతో తులతూగెను. ఇలాగే సంవత్సరంలలో సర్పములకు అనేక పర్వదినములు వస్తాయి అవి:

1) వైశాఖ శుక్లచవితిరోజున నాగచతుర్ధిని జరుపుకొంటారు. ఆరోజున సుబ్బారాయుని పూజిస్తారు. అందువల్ల సర్పభయము ఉండదు.

2) శ్రావణ పౌర్ణమినాడు సర్పబలి, తదితరకార్యక్రమములు చేయాలి. ఒక కుండలో పేలపిండిని పోసుకొని దానిని ఉట్టిలో పెట్టుకొని గరిటతో "సర్పదేవ జనేభ్యస్స్వాహా" అని హోమము చేయవలెనని స్మృతికౌస్తుభకారుడు తెలిపినాడు. "శక్యస్థదర్వీకలశావాదాయ కలశనిహిత సక్తుభిర్దర్వీం పూరయత్వా" అని విధించినాడు.

3) భాద్రపద శుద్ధ పంచమి రోజు నాగదష్టోద్ధరణ పంచమీ వ్రతము. భవిష్యోత్తర పురాణమున చెప్పబడినది. దీనినే శాంత పంచమీవ్రతమని భవిష్యపురాణ ములో ఉన్నది.

4) మార్గశిర శుద్ధపంచమినాడు నాగపూజ, ఇది
"దక్షిణాత్యానాం ప్రసిద్ధా" అని ధర్మసింధుకారుడును,
శుక్లా మార్గశిరే పుణ్యా శ్రావణేయాచ పంచమీ,
స్నానదానైర్బహుఫలా నాగలోకప్రదాయినీ॥
అని స్కాందపురాణములో ఉన్నది.

5) పాల్గుణ శుద్ధ పంచమినాడు అనంత పంచమీవ్రతమును చేస్తారు. ఇది స్కాందపురాణప్రభావస ఖండమున తెలుపబడినది. ఈ వ్రతమునకు కథ కూడా ఉంది.

సుమంతుడు శతానీకుని కిట్లు చెప్పెను. రాజా! నాగపంచమి విశిష్టమైనది. సర్పములకు ఆనందము కలుగజేయునది. పంచమి సర్పములకు పండుగ వాసుకి, తక్షకుడు, కాలీయుడు, మణిభద్రుడు, దృతరాష్ట్రుడు, ఐరావతుడు, కర్కోటకుడు, ధనంజయుడు మొదలగు సర్పములు ప్రాణులకుభయమిచ్చి సదాప్రాణములు కాపాడెను. మనము పంచమి రోజున సర్పములను అభిషేకించిన ఆ సర్పములు మానవులను కాపాడుతాయి. తల్లి శాపము వలన సర్పములు కోపంతో రగిలిపోతుంటాయి. వాటిని పాలతో అభిషేకిం చిన శాంతి కలుగును. తల్లి ఎందుకు శపించెను? దాని గురించి శతానీకుడు ప్రశ్నించగా సుమంతుడు చెప్పినాడు.

పూర్వము సముద్రము నుండి అశ్వరాజమగు ఉచ్చైశ్రవము జన్మించెను. ఆ గుర్రము తెల్లనిది. ఆ గుర్రమును నాగమాతయగు కద్రువ చూచి తన సవితియగు వినతితో సముద్రము నుండి ఈ అశ్వరత్నమును చూచితివా అని ప్రశ్నించెను. తెల్లని గుఱ్ఱమునకు నల్లని తోక అనియనెను. వినత ఆ మాటలు విని నవ్వి, ఈ గుర్రము అంతటా తెల్లనిదే నల్లనిదికాదు, ఎర్రనిదికాదు. నీకు దానితోక నల్లగా

ఎట్లాకనిపించెను? అని మందలించెను. అని ఇద్దరు పందెం వేసుకొన్నారు. నీవు దానితోక నల్లదని చూపిన నేను నీకు దాసిగా నుందును. చూపనిచో నీవు నాదాసి కాగలవు అని వినత సమాధానమిచ్చెను. తరువాత కద్రువ కుట్రపన్నెను. తనకుమారులను పిలిచి ఉచ్చైశ్రవముతోకను నలుపు చేయండి. వినతను ఓడింతుము అని కోరెను. వారందులకు అంగీకరించలేదు. దానికామె క్రోధసమా కులయై కొంతకాలమునకు జనమేజయుడను రాజు ఇతర దుష్కరమగు సర్ప యాగం చేసినాడు. ఆయాగములో పడి కాలిపోవాలి అని శపించెను. అని శపించ గానే కద్రుపుత్రులందరు చింతాక్రాంతులైయుండగా లోకపితామహుడగు బ్రహ్మ ప్రత్యక్షమై శ్రావణశుక్లపంచమినాడు సర్పము ఆగిపోవును. మీకు నందుడు అను వాడుకలుగుతాడు. వానివలన పంచమి "ఆనందపంచమి"గా మారును అని బ్రహ్మ చెప్పినాడు. కనుకనే రాజా! ఈ పంచమి సత్పురుషుల కిష్టమైనది.

నాగపంచమిలో చైత్రశుద్ధ పంచమినాడు నాగులకు విశేషమైన పూజచేస్తారు. దీనిని స్మృతికీస్తుభకారుడు తెలిపినారు. దేవీపురాణములో ఉన్నది.

"పంచమ్యాం పూజయేన్నాగా ననంతాద్యాన్మహోరగాన్,

క్షీరం సర్పిస్తు నైవేద్యం దేయం సర్వసుఖావహమ్॥"

హేమాద్రి గణపతి గమనపూజలో భాగమనినాడు మత్స్యపురాణమున ఈ నాగప్రతిమ లక్షణమిట్లు చెప్పబడినది.

"నాగశ్చైవతు కర్తవ్యాః ఖడ్గఖేటకధారిణః

అధః సర్పాకృతి స్తేషాం నాభేరూర్ధ్వం తుమానిషీ,

ఫణాశ్చ మూర్ధ్నికర్తవ్యాః ద్విజిహ్వా బహవో2_సమాః॥"

నాభికి దిగువ సర్పాకృతియు, నాభికి పైన మానుషాకృతియు గలవిగా సర్పమూర్తులను రచించవలెను. ఫణములను బేసి సంఖ్యలో తలపై కల్పింపవలెను. ఖడ్గము, డాలు వీనిచేత నుంచవలెను.

నాగదేవతల పుట్టుకల గురించి అథర్వణ వేదములలో వ్రాయబడినది.

యే అగ్నిజా ఓషధిజా అహీనాం యే అప్సుజా విద్యుత అబభ్రువుః।

యేషాం జాతాని బహుధా మహాంతి తేభ్య స్సర్పేభ్యో నమసా విధేమ॥

పై సూక్తములను బట్టి సర్పములు భూమినుండి, నీటినుండి, అగ్నినుండి, ఔషదులనుండి, విద్యుత్తుల నుండి పుట్టును. భూవ్యాంతరిక్ష పాతాళదేవలోకాదులలో ఉన్నట్టుగా భావించవలెను.

పరిధ్యామివ సూర్యోజూహీనాం జనిమాగమ్।
రాత్రీజగదవాన్యద్దం సాత్తేనా తే వరయే విషమ్॥
అవశ్వేతపదాజహి పూర్వేణ చాపరేణచ।
ఉదప్లుతమివ దార్వహీనా మురసం విషం వారుగ్రమ్॥
పై శ్లోకములు సర్పనివారణ సూక్తములు గా తెలపబడినవి.

## 149. మాసాధిత్య సర్ప దోషములు

1) ఆ చైత్ర మాసమునందు మొదటి రోజున సూర్యుడు ఉదయించినపుడు ఆ సూర్యభగవానుడి రథాన్ని కాలసర్పం సర్పరూపమగు వాసుకిగా అధిరోహించును. “ధాతా” నామధేయంలో గల బ్రహ్మ రోహిణి నక్షత్ర జనన జాతకులకు అధిపతి అగుచున్నాడు. రోహిణీ నక్షత్రమునందు జన్మించిన వారు ఆదిత్యుడను భగవానుని “భానవే నమః” అను మంత్రమును జపించి అర్పించవలెను. సర్పదోషమున్న వారు కాలసర్పాన్ని వాసుకీ సర్పరూపముగా ఆరాధించి పూజించాలి. ప్రతి ఆదివారము రోహిణి నక్షత్రము నందు జన్మించినవారు పాలు త్రాగి ఉపవాసము ఉండవలెను. సాధకుడు ఎవరనైనను చైత్రమాసమునందు ఉపవాసము ఉండవలెను.

2) “ఆర్యమా” అను నామధేయంతో వైశాఖ మాసంలో సూర్యభగవానుడిగా స్తుతింప బడును. ఈ వైశాఖ మాసమందు. “కచ్చవీర” నామంతకాలసర్పం సూర్యభగవానుని రథమును అధిరోహించును. “ఆర్యమా” అను సూర్యుడు. ఉత్తర ఫల్గుని జాతకులకు అధిపతి అగుచున్నది. ఈ నక్షత్ర జాతకులు “తపనాయనమః” అను మంత్రము జపించి అర్పించవలెను. “అర్యమా సూర్యభగవానుడికి” నెయ్యి మినపప్పు బెల్లంతో వండిన పదార్థములను నివేదించవలెను. ద్రాక్ష పండ్లను నీటితో అర్ఘ్యమివ్వవలెను. ఉత్తరఫల్గుణి నక్షత్రములో పుట్టినవారు పిత్రుశాపము గల వారుగా జన్మించుతారు. పిత్రుశాపం గల ఉత్తర ఫల్గుణి వారుగా జన్మించుతారు పిత్రుశాపం గల ఉత్తర ఫల్గుణి నక్షత్ర జాతకులు పితృదేవతలకు జప అర్ఘ్యదానముల ద్వారా శాప నివృత్తి చేసుకొనవలెను. పితృ శాపమును పోగొట్టుకొందురు. అపనామ మంత్రముచేత “అర్యమా” అనుగ్రహముతో వర్ధిల్లుతారు.

మఖా నక్షత్ర జాతకులకు కూడా పితరులు అధిదేవతలు. మఖా నక్షత్ర జాతకులు గూడా అర్యమాను పూజించి అర్పించవలెను. ఈ ఆరాధనతో మిత్రప్రాప్తి సత్సంతాన వృద్ధియగును. “కచవీర” రూపంలో కాలసర్పాన్ని

ఆరాధించిన శుభములు, పొందుదురు. మిత్రప్రాప్తి సంతానప్రాప్తి కలిగి పితృశాపము తొలగును.

3) "మిత్ర" నామధేయుడై జ్యేష్ఠ మాసమందు సూర్యభగవానుడు రూపంలో ఉదయిస్తూన్నాడు. తక్షక రూపంలో కాలసర్పము. సూర్యభగవానుడి రథాలను అధిరోహిస్తున్నాడు. అనూరాధా నక్షత్రమందు జనన మొందిన వారలకు అధిపతి మిత్రాదిత్యుడు అగుచున్నాడు మిత్రాదిత్యుడను "మిత్రాయనమః" అనుమంత్రముతో అనూరాధ నక్షత్రజాతకులు జీవితాంతం ఆరాధిస్తూ ఉండాలి జ్యేష్ఠ మాసంలో ఇతర సాధకుడు మిత్రాధిత్యుని ఆరాధించవలెను. ఈ ఆరాధ్యునకు, పెరుగు, పప్పు, బెల్లముతో వండిన తీపి పదార్థములను సత్తుపిండి నివేదన నొనర్పవలెను. బియ్యం పప్పు పెరుగు మామిడి పండు దానంగ ఇవ్వవలెను. అనూరాధ నక్షత్ర జాతకులు సర్పదోషము కలిగినవారు కాలసర్పాన్ని తక్షక నామంతో ఆరాధించి పూజించాలి.

4) సూర్య భగవానుడిని వరుణుడు అంటారు. ఆషాడమాసమునందు ఉదయించి సూర్యభగవానుడి రథాన్ని కాలసర్పం సహజన్యరూపంలో అధిరోహిస్తుంది. పూర్వాషాడ శతభిషం ఈయన అదిపతి అగుచున్నాడు. శతభిష, పూర్వాషాఢ నక్షత్ర జాతకులు "రవయేనమః" అను మంత్రముతో జపించి ఆరాధించాలి. వరుణాదిత్య ప్రత్యామయముగానే "రవయేనమః" అనుమంత్రోచ్ఛారణ చేత ధ్యానించడమౌతుంది. ఇతర సాధనాలు ఆషాఢమాసమునందు వరుణాదిత్యుని ధ్యానించవలెను. పాలు అటుకులు బెల్లము మిశ్రమం చేసి అట్టి పదార్థమును నివేదనగా సమర్పించవలెను" జాపత్రజాజికాయ అర్ఘ్యరూపమున నీళ్ళతో వదలవలెను. విప్రులకు దధ్యోజనము పెట్టి తాంబూల దక్షిణాలను వస్త్రముతో బాటు సమర్పించవలెను. సర్పదోషముకల వారు – ఆషాఢ మాసమునందు ఆదివారమురోజున మిరియాలు మూడు మాత్రం సేవించి కఠిన ఉపవసించవలెను.

కాలసర్పాన్ని వరుణాధిత్యుడను తత్‌మంత్ర జపధ్యానములు నొనర్చదగును. ఈ విధముగా ఆచరించిన వారికి దారిద్ర్యబాధలు తొలుగుటయే గాక ఆరోగ్యము కలిగి శత్రుబాధ తొలుగును. ఆదిత్యహృదయము పారాయణము నొనర్చిన విశేషఫలితమును పొందవచ్చును.

5) "ఇంద్ర" సూర్యనారాయణుడిని "ఇంద్ర" పదముతో ఆరాధించవలెను. శ్రావణ మాసములో ఉదయించే సూర్యరథమును. కాలసర్పం "ఇలాపుత్ర"

నామధేయంతో అధిష్ఠించుతున్నది. ఈ భూమిమీద ఆధ్యాత్మిక విద్య, యోగ ధ్యానాదికములన్నియు "ఇంద్రాదిత్యుడిచేత" సృష్ఠించబడినవి విశాఖ, జ్యేష్ఠ జనన జాతకులకు "ఇంద్రాదిత్యుడు"ని, ప్రధానదేవతా ఉపాసకుడు అవుతాడు" ఇంద్రాయనమః" అను మంత్రంతో శ్రావణమాసమందలి ఆదివారములలో, ఉప్పులేని భోజనము చేసి" ఇంద్రాయనమః" మంత్రధ్యాన జపముచేసి అర్ఘ్యమొదలినవారికి విద్యా ఐశ్వర్యములు కలుగుతాయి "ఇంద్రాదిత్యునకు" గభస్తయేనమః" అనుమంత్రముద్వారా ఎఱ్ఱగన్నేరుపూలు జలముచేత అర్ఘ్యప్రధానచేసి పూరి పాయసం సత్తుపిండి నైవేద్యం అర్పించవలెను. ఈ విదముగా ఇంద్ర సూక్త పఠనముచేసిన విశేషఫలితము పొందుదురు.

విశాఖ, జ్యేష్ఠ్యాజననజాతకులు "ఆదిత్యుడిని" సూర్యాష్ఠకమును జీవిత మున్నంతవరకు ప్రధాన అధిష్ఠాధిపతిగా ధ్యానించుచుండిన విశేష శుభముల చేత అలరారుచుందురు. కాలసర్పదోషము కలవారు కూడా "ఇలాపుత్రనాగ" రూపంలో ఆరాధించాలి. ఇతర సాధకులు శ్రావణమాసమందు ఇలా పుత్ర నాగులను ఆరాధించి ధ్యానించవచ్చును. సర్పసూక్తము పారాయణం జపధ్యాన హోమార్ఘ్యములు కూడా విశేషశుభములు నొనర్చును.

6) "వివస్వాన్" అంటే అగ్ని భాద్రపదమాసమునందు ఉదయించే సూర్యభగవాను డిని "వివస్వాన్" గా అందురు. కాలసర్పం ఇతని రథమును 'శంఖపాల" నామధేయంతో అధిరోహించబడుతుంది. ఈయన కృత్తికా నక్షత్రమునందు జన్మించిన వారలకు అధిపతి, యముడు, మనువు అను ఈ ఇరువురును "వివస్వాధిత్యునకు" పుత్రులు, యమునా అనే కుమార్తెను కూడా కలిగినారు. వారు భరణీ నక్షత్ర జన్మించినవారికి యముడు అధిపతి "వివస్వాదిత్యుదే" యముడు "యమాయనమః" అనుమంత్రమును భాద్రపదమాసము వండి గుమ్మడికాయతో సహా "యముడను వివస్వాదిత్యునకు" నివేదనము సమర్పించవలెను. మన్యువు అను హనుమంతుడు సూర్యభగవానుడి ద్వాసకల విద్యలు గ్రహించి బుద్ధియశః జ్ఞానములు పొంది నవబ్రహ్మగ జగత్తునందు గణతుకెక్క చిరంజీవిగా నుండినాడు. నాగదోషం గల వారు కాలసర్పాన్ని శంఖపాల నాగదోషముగా భావించి కలుగుతాయి. ఏసాధకులైనను భాద్రపద మాసమందలి భానువారమునందున ఈ ఉపాసనాచేస్తూ పైకనబరచిన నివేదనాలు చేత ఆయురారోగ్య ఐశ్వర్య ప్రాప్తి కలుగ గలదు. శ్వేతార్కగణపతిని

గణపతి అధర్వ సూక్తము చేత అర్చించిన ఈదోషములు తొలగును - ఐశ్వర్యప్రాప్తి - ఆరోగ్యప్రాప్తి - కలుగును.

7) "పూషా" ఆశ్వీజమాసమునందు పూషా రూపంలో సూర్యభగవానుడు ఉదయించి ప్రకాశింపబడుతాడు. కాలసర్పం "ధనుంజయ" నామధేయంతో పూషారూపంలో ఉదయించి సూర్యనారాయణుడి రథమును అధిరోహించుతాడు. సకల జీవులను (పూషానో ఇహతాధివాది) పోసించుతాడు. "పూషా" ఆదిత్యుడు. ఆహారమునకు పశువులకు అధిపతి 'హిరణ్యరేతసే నమ' అను మంత్రముచేత ఆశ్వీయుజమాసము నందలి ప్రతి రవివారమునందున "పూషా" ఆదిత్యుని పూజించవలెను. పంచదార "దానిమ్మపండు" "పూషా"ఆదిత్యుని పూజించవలెను. పంచదార "దానిమ్మ పండు" చెఱకు గడలను నైవేద్యముగా నివేదిన నొనర్పదగును. రేవతినక్షత్ర మందు జన్మించిన జాతకులకు పూషాదిత్యుడు అధినాథుడు అగుచున్నాడు. వీరుకూడా జీవితాంతం పూజించిన శుభవిశేషములు కలుగును.

విప్రులకు వివేషించి బియ్యం పంచదార ఆజ్యమును ఇవ్వవలెను. రేవతీనక్షత్ర మందు జన్మించినవారు సర్పదోషమున్న వారు ఈ కాలసర్పాన్ని "ధనుంజనియ నామంతో" నామం స్మరిస్తూ అర్పణమొనరింపదగును. ఆశ్వీజ మాసమునందున సాధకులెవరైనను. పూషాదిత్యుని పూజించవలెను. ఈ మాసమునందు. దుర్గాసప్తశతిని పారాయణమొనర్చుతూ విప్రులకు దానధర్మ ములతో వస్త్రదానమొనర్చిన రోగవిముక్తుడై ఐశ్వర్యప్రాప్తి ఈ శత్రుజయము కలుగును.

8) "పర్జన్య" రూపంలో కార్తీకమాసమునందు ఉదయించు సూర్యనారాయునిడిని "పర్జన్యుడంటారు" ఐరావతనాగ" రూపంలో కాలసర్పం సూర్యనారాయణుడి రథమును అధిరోహించుతుంది. 'పర్జన్య' మేఘములందు మిళితమై తన కిరణముల ద్వారా వర్షమును కురిపించుతాడు. పర్జన్యనామంతో వేనసారమునందు పిలువ బడుతున్నాడు.

కార్తీక రవివారమందున అగస్త్య పుష్పములతో అపరాజితారూపంలో పర్జన్యుడిని ధూపదీపనైవేద్యములతో సంతృప్తిపరచాలి. "పర్జన్యుడిని" చెరుకురసం బెల్లంతో చేసిన బూరెలు నివేదించవలెను. ఈ నైవేద్య పదార్ధములు. భోజన దక్షిణ తాంబూలాదులతో బ్రాహ్మణులను సంతుష్ఠులను జేసిన తనవల్ల గాని సూర్యదేవాలయమందు ఆవునెయ్యితో వెలిగించిన దీపదానములను చేసిన

అజ్ఞానందకారములు తొలగి ఆరోగ్యముతో బాటు సకల ఐశ్వర్యములు కలుగును.

పూర్వాషాఢ నక్షత్రమునందు జననమొందిన జాతకులకు "పర్జన్యుడే" అధిపతి యగుటచే పర్జన్యుడిని పూజించవలెను. ఏవిధముగా సర్పదోషమున్నవారు ఎవరైనను, కాలసర్పాన్ని "ఐరావతనాగ" దేవతను. పూజించవలెను సాధకులు ఉపవసించపబడినవారు విశేష భోగములు అనుభవింతురు.

ఈ మాసమునందుపై వాటినిననుసరిస్తూనే కార్తీక దామోదరుడిని ఆరాధిస్తూ సుబ్రహ్మణాష్ఠకమును పారాయణం విశేష శుభం.

9) "అంశుమాన్" సహద్రాదిత్య అంశుమాన్" అనురూపంలో (మాసే మార్గశ్రేష్ఠ) సూర్యభగవానుడి మార్గశీర్షమాసమునందు ఉదయించును. మహాశంఖనాగ రూపంలోను కాలసర్పం సూర్యభగవానుడి రథాన్ని అధిరోహించుచున్నాడు. ఈయన వాయువు రూపంలో సకల జీవులకు వాయువును ప్రసాదిస్తూ జీవకోటికి ప్రాణదాత అవుతున్నాడు ఈ మార్గశిర మాసమునందు "అంశు మానాదిత్యుడిని" మార్గశిర మాసమునందలి ప్రతి ఆదివారము రోజున బెల్లం నెయ్యితో వండిన అన్నపాయసమును కొబ్బరికాయను అంశుమానాదిత్యుడికి నివేదించవలెను. "అంశుమానాదిత్యుడు" స్వాతినక్షత్ర జనన జాతకులకు అదిపతి అగును స్వాతి నక్షత్ర జాతకులు జీవిత పర్యంతం పూజించుచుండిన శుభములు కలుగుచుండును.

నాగదోషములుగల స్వాతినక్షత్ర జాతకులు మహాశంఖ నాగరూపంలో భావించి అర్పించుచుండవలెను. ఇతరసాధకులు మార్గశీర్షమాసమునందు "అంశుమాన్ ఆదిత్యుని" పూజించిన మంచిది శుభములు కలుగును.

10) "భగ" భగాదిత్యుడు సర్వసంపదలతో జగత్ అంతయు వ్యాపించబడినది. పుష్యమాసమందు ఉదయించే ఆదిత్య భగవానుడిని "భగ" అని పిలుస్తారు భగాదిత్యుడు అష్ఠఐశ్వర్యాలు ధర్మ యశఃకీర్తి జ్ఞానవైరాగ్యాలు ప్రసాదించ గలవాడైనాడు. కాలసర్పం ఈయన రథమును "కర్కోటకనాగ" రూపంలో అధిరోహించబడినది చతుర్విధఫల పురుషార్థములు రవిచంద్ర శివ దయాదర్మప్రేమ గుణమోక్షవిలువలను ప్రసాదించేవాడు పుబ్బా(పూర్వఫల్గుణి) నక్షత్రాధి ప్రధాత ఇది శుక్రనక్షత్రం. ఈనక్షత్ర జనన జాతకులు ఈజాతకులు ఏగ్రహములు అనుకూలించక పోయిన హీనస్థితిపొందినను. ఈ నక్షత్రగ్రహాధి

పతి శుక్రగ్రహముగుటచేత వీరి ద్వారా లోకానికి కొంతమంచిని ప్రసాదించే వారుగా ఉంటారు. వీరు అధర్మ ప్రవర్తనలో కొన్ని జన్మలు గడిపిన భగాదిత్యఆరాధన చేసి అర్చించే కాలసర్పాన్ని కర్కోటక నాగరూపంలో అర్చించి అనుగ్రహాన్ని పొంది లోకజనులకు హితమును చేయగలవారుగా ఉందురు. సకల జీవులకు శుభములు కలుగజేయు "భగాదిత్యుడు" పుబ్బానక్షత్ర జాతకులనే గాక ఇతర సాధకులకు కూడా పుబ్బానక్షత్ర జాతకులనే గాక ఇతరసాధకులకు కూడా "విష్ణవేనమః" అను మంత్రముచేత అర్పించి సజ్జలు నిమ్మకాయలు నీళ్ళ అర్ఘ్యమివ్వవలెను. పుష్యమాసమంతయు ఇతని ఆరాధించవలెను. మృగశిరా నక్షత్ర జాతకులు "భగాదిత్యుడిని" పూజించవలెను. ఇతరసాధకులు భగాదిత్యుడిని ఆరాధించవలెను. నైవేద్యంలో నువ్వులతో కలిపిన బియ్యంవండి నివేదించి. బ్రాహ్మణులకు భోజన వస్త్రదక్షిణాలు తాంబూలాలు సమర్పించి విశేష ఫలితములు పొందవలెను.

11) "త్వష్టాదిత్యుడు" మాఘమాసమునందు సూర్యోదయుడిని "త్వష్టా" అంటారు. ఇట్టి సూర్యభగవానుడి రథాన్ని కాలసర్పం "కంబలనాగ"రూపముగా అధిరోహించబడుతుంది. మాఘమాసంలో "త్వష్టాదిత్యుడు" శిల్పిగా ప్రకృతినందలి వనస్పతి పోషకుడై జీవులకు ప్రసాదిస్తున్నాడు. త్వష్టాదిత్యుడే విశ్వకర్మ ఈవిశ్వకర్మయగు దేవశిల్పి ఔషధాలకు వనస్పతులకు అధిదేవత అయినాడు. మాఘశుద్ధ షష్ఠీలు తిథినాడు ఉపవాసముండి. రాత్రి దేవాలయాలలో నిద్రించి ప్రాతః కాలమునందు లేచి సప్తమి తిథి యందు పునఃపూజించి బ్రాహ్మణులకు భోజనదానదక్షిణ తాంబూలాదులు నొసంగి వ్రతవిమోచనమును చేసుకొనవలెను. చిత్తా నక్షత్ర జాతకులకు త్యష్ఠాదిత్యుడు అధిప్రధాత ఇబ్బందికరంగా జీవితం గడిపేవాడు మాఘమాసమందు ఈవ్రతం చేసి ఒక సంవత్సరం పాటు వ్రతం జేస్తూ, సూర్యభగవానుని రథయాత్ర చేయాలి. (ప్రతివారం వ్రతం చేయాలి) సూర్యభగవానుడిని రత్నాభరణములతో అలంకరించి పూజించవలెను. సమస్త ఔషదులకు (మూలికలకు) అశ్వని దేవతలు అధిపతులైనారు. అశ్వనీ నక్షత్రానికి అధిపతులు అశ్వనీ దేవతలు.

చిత్తా-అశ్వనీ నక్షత్రజనన జాతకులు 'తృష్టా ఆదిత్యుడిని" ఆరాధించు తాంబూలములు ఇవ్వ ఆశీర్వచనము పొందాలి. ఇతరులెవరైనను 'తృషాదిత్యుని సంవత్సరాంతం ఆరాధించిన ధనప్రాప్తి-ఆరోగ్య ప్రాప్తి కలుగుతుంది.

12) “విష్ణు” అంటే ధాతువు “విష్” అనగా ప్రకాశించటం కాలసర్పం “అశ్వతరనాగ” రూపమై ఫాల్గుణ మాసమందు ఉదయించే సూర్యభగవంతుడు రథమును అధిరోహించబడుతుంది.

ఫాల్గుణ మాసమందు తేజోవంతుడై సూర్యభగవానుడు ఉదయించి సృష్టి అణువణువున ఫాల్గుణ మాసమందలి జీవులకు రక్షణ కల్పిస్థాడు. ఫాల్గుణ మాసమందు విష్ణురూపమైన ఆదిత్యుని పూజించాలి. వయోవ్రతం చేయాలి. శ్రావణ నక్షత్రానికి విష్ణు ఆదిత్యుడు అధిష్ఠాన వీరు జీవితాంతం విష్ణువును ఆరాధించాలి. ఈ నక్షత్రజాతకులు సర్పదోషానికి లోనైవారు. కాలసర్పాన్ని అశ్వతరనాగరూపంలో ఆరాధించి పూజించాలి. ఇతరజాతకు “విష్ణు” ఆదిత్యుని, రూపంలో అర్చించాలి. ఇతరసాధకులు విష్ణు ఆదిత్యుని ఫాల్గుణ మాసములో పూజించి అర్చించాలి.

ఏ నక్షత్రమందు జన్మించిన జాతకులు పైవిదానములు విధివిధానముగా పాటించి ఆయా మంత్రజపతప అనుష్ఠానాదిక వైదిక విధానములు చేసుకుని. క్షీరతర్పణాది హోమములు ఆశీర్వచములు పొందినచో తత్ దోషపరిహారములు అగుటయే గాక సూచనమేరకగా అరిష్ఠములు తొలగి జ్ఞాన, సకలైశ్వర్య విద్యా ఆరోగ్యది శుభములు పొందుదురు.

## 150. కాలసర్పదోషనివారణకు మంగళ చండీ ధ్యానస్తోత్రము

జాతక చక్రమంలో రాహువు భ్రమణం వైపున సప్తగ్రహములు, ఆ సప్తగ్రహములు కేతువు వెనుక భాగంలో ఉంటే నిర్ధుష్ఠకాలసర్పయోగము అంటారు. ఈ యోగనివారణకు మంగళచండీని ధ్యానము చేయవలెను. మంగళము అనగా శుభము, చండీ అనగా ప్రతాపము, మంగళుడు అనేరాజు చండీదేవిని పూజించడం వల్ల ఆదుర్గా అమ్మవారికి మంగళ చండీదేవి అనే పేరు వచ్చింది. దుర్గాదేవి మారు రూపమే మంగళచండీదేవి జాతకంలో సర్ప, కాలసర్పదోషము ఉన్నవారు ఈ మంగళ చండీదేవి పూజించవలెను.

**ధ్యానము:**

దేవీం, షోడశవర్షీయాం, శశ్వత్ సుస్థిర యౌవనామ్, బింబోష్ఠీం, సుదతీం, శుద్ధాం, శరత్పద్మనిభాననామ్, శ్వేతచంపకవర్ణాభాం, సునీలోత్పలోచనాం, జగద్ధాత్రీంచ, ధాత్రీంచ సర్వేభ్యః సంపదామ్, సంసారసాగరే ఘోరే జ్యోతిరూపాం సదాభజే॥

**మహాదేవువాచ:**

రక్షరక్ష జగన్మాతదేవి మంగళచండికే, హారికే, విపదాంరాశేః హర్ష మంగళకారికే, హర్షమంగళదక్షేచ, హర్షమంగళదాయికే, శుభే, మంగళదక్షేచ, హర్షమంగళదాయికే, శుభే మంగళచండికే, మంగళే,మంగళార్హేచ, సర్వమం గళ మంగళే, సతాం మంగళదేదేవి, సర్వేషాం మంగళాలయే, పూజ్యు మంగళ వారేచ, మంగళా భీష్టదేవతే, పూజ్యేమంగళ భూపస్య, మనువంశస్య సంత తమ్, మంగళాధిష్ఠాతృదేవి, మంగళానాంచ మంగళే, సంసారమంగళా ధారే, మోక్షమంగళదాయినీ, సారేచ మంగళాధారే, పారేచసర్వకర్మణామ్, ప్రతి మంగళవారేచ పూజ్యే, మంగళ సుఖప్రదే, స్తోత్రేణానేన శంభుశ్చస్తుత్వా మంగళచండికామ్, ప్రతిమంగళ వారేచ పూజాం దత్వా గతః శివః

## 151. నారాయణబలి

జన్మాంతర శాపదోషములతో బాటు పితృదేవతల శాపము కాలసర్పదోషము నివృత్తికి ప్రాయశ్చిత్త కర్మలందు నారాయణబలి ముఖ్యమైనది. సర్వవిధ శాపదోష ములు ఈ నారాయణ బలి ద్వారా నివృత్తి కాగలవు ఈ కల్పము పరిశిష్ఠ స్మృత్యధి కారము ననుసరించి కౌస్తుభాది గ్రంథాది ఆనారముగా తెలుపబడినది.

దేవాలయ నదీతీరములందున శుక్ల ఏకాదశిరోజున చేయుటకు నిర్ణయించు కొని ములను సంవత్సర అయన ఋతు పక్షతిధి వార నక్షత్రములను చెప్పుకొని – మమ వంశవృద్ధి ప్రతిబంధక ప్రేతస్య ప్రేతత్వ నివృత్యర్థం నారాయణ బలిం కరిష్యే సంకల్పము చెప్పుకొని తదుపరి మంటపమునందు విధిగా పూర్వ రెండు కలశములు స్థాపించిన కలశములందున బంగారు ప్రతిమలను ఉంచి విషు వైవస్వతయముని నావాహనముచేసి పురుష సూక్తముచేత యమాయసోమ అను మంత్రముచేత విష్ణువైవస్వత యమునిని షోడశోపచారపూజల చేత పూజించ వలెను.

కొందరు బ్రహ్మ విష్ణు శివ యమ ప్రేతలను (5) ఐదు కలశములుంచి నందు ఆవాహానచేసి పూజింతురు. వీరికి తూర్పు రేఖనందు దక్షిణాగ్రముగా దర్భలుపరచి దర్భలపై తిలలు ఉదకమును వదలి (దర్భస్యోపరి ఏతత్ తిలోదకము పతిష్ఠతు అనుమంత్రముచే వదలవలెను) శుంధంతాం విష్ణురూపే ప్రేతః దక్షిణ సమాప్తిగాఉదకమును పదిస్థానములందు వదలవలెను. మధుఘృత తిల యుక్తముగా పదిపిండములను చేసి ధర్భలపైన కాశ్యపగోత్ర దేవదత్తప్రేత విష్ణుదైవత అయంతే పిండః అపసవ్యముతో దక్షిణాముఖమునుండి ఎడమకాలు మణచి

(మడచి) తర్జనీ అంగుష్ఠ వ్రేళ్ళమధ్య నుండి ఒక్కొక్క పిండమును కాశ్యపగోత్ర దేవతదత్త ప్రేత విష్ణుదైవత అయంతే పిండః అంటూ వదలవలెను లేదా ఉ ంచవలెను. ఈ ప్రకారము పది పిండములను క్రమముగా దర్భలపైనుంచి సవ్యముచే గంధాదులచేత పార్వణము జరిపి ప్రణపొంతము చేసి విసర్జించవలెను.

తదుపరి ఈరాత్రియందే శ్వః కరిష్యమాణ శ్రాద్ధే క్షణః క్రియతాం ఒకరు లేదా ఇద్దరుగాని ఐదుగురు గాని బ్రాహ్మణుల నియంత్రించి ఉపవాసముతో జాగరణచేయించి మరుసటి దినమునందు అపరాహ్ణమందున విష్ణువును పూజించి విష్ణురూపుడైన ప్రేతను గాని బ్రహ్మ విష్ణు శివ యమలను ఉద్దేశించి ఏకోధిష్ఠ విధిచే పాదప్రక్షాళనము మొదలు తృప్తి ప్రశ్న పూర్తి చేసి రేఖాకరణము మొదలుకొని యవనేజనము పర్యంతము మంత్రము అక్కరలేకుండా చేసి, విష్ణవే బ్రహ్మణే శివాయ యమాయ పరివారాయచ అని నామమంత్రముచే నాలుగు పిండములిచ్చి విష్ణు రూపమందు ప్రేతను ద్యానించుచూ కాశ్యపగోత్ర దేవదత్త విష్ణురూప ప్రేత అయంతపిండః అని ఐదవపిండమునిచ్చి అందుగుణవంతుడు శ్రేష్టుడని తోచిన బ్రాహ్మణునికి ప్రేతబుద్ధిచే ఆభరణ వస్త్రాదులను యిచ్చి అందరకు నమస్కారములు చేయవలెను.

భవంతః ప్రేతాయతి అంజలి కుర్వంతు అని ప్రార్థించిన పైని వారు పవిత్రములు ధరించి కుశతిల తులసి జలాంజులను ప్రేతాయ కాశ్యప గోత్రాయ విష్ణురూపిణేయం జలాంజలిః అని ఇవ్వవలెను.

అనేన నారాయణేన బలినాగవాన్ విష్ణురమందేవదత్తం పాప మర్త్వాం కరోతు అని బ్రాహ్మణులచేత తాను పలికించి విడువవలెను. తర్వాత స్నానముచేసి భుజించ వలెను.

ఏ విధముగా నైనను ఐదు కలశములందు బ్రహ్మ విష్ణు శివయను ప్రేతలను స్వర్ణరౌప్య తామ్రలోహముయగు ప్రతిమలందును దర్భప్రతిమయందు క్రమముగా పూజించి అగ్నిని ప్రతిష్ఠించి శ్రీపితమైన చరుక్రను పురుషసూక్తముచే నారాయణునికి పదియారు ఆహుతులను వేసి పది పిండములనంతరమందు పురుషసూక్తములచేత అభిమంత్రించి నభిషేకము చేయునది విష్ణ్వాదులు నలుగురికి బలిదానము చేయునది

మరుసటి రోజు ఏకోద్ధిష్ఠ విధినా శ్రాద్ధ పంచకం కరిష్యే. అని సంకల్పించు కొని ఐదుగురు బ్రాహ్మణులకు ఆద్యాది పిండదానాంతరం చేసి తర్పణాధికము చేయవలెను. మిగతా తదంగవిధానము పైవిధముగానే తెలియవలెను.

## 152. నారాయణబలి (హేమాద్రి)

కాలసర్పయోగ ప్రాయిశ్చితార్థము, వివిధ శాపనివృత్తికి నారాయణబలి అవసరనము.

ఆచమ్య- దేశకాల సంకీర్త్య-సంభూత దోషపరిహారార్థం, ఔర్థ్వదేహిక సంప్రదానత్వ యోగ్యతాసిద్ధ్యర్థం నారాయణబలిం కరిష్యే అని సంకల్పము.

మండపమును తయారు చేసికొని ఐదు కలశములను ఆవాహనము చేయవలెను. అవి బ్రహ్మ, విష్ణువు, శివుని, యముని కలశములు మరియు సిద్ధి పొందిన యతి ఆత్మను (ప్రేత) కలశములను పెట్టవలెను. మరియు వారి ప్రతిమలను యతిని దర్భలతోనే చేయవలెను. బ్రహ్మను వెండితోను, విష్ణువును బంగారంముతోను, రుద్రునుని రాగితోను, యమునని ఇనుముతోను, లేదా అన్నియు బంగారముతో చేయించవచ్చును. పురుష సూక్తముతో షోడశోపచార ముల పూజించవలెను. విష్ణురూపుడైన యతిని (ప్రేతను)స్మరించుచు నామ గోత్రములు చెప్పుచు తేనె, నెయ్యి, తిలలతో పది పిండములను చేసి, యజ్ఞోప వీతముగానే ఉండి .......... గోత్ర........... శర్మన్........(ప్రేత) విష్ణురూప! అయంతే పిండ ఉపతిష్ఠతామ్ అని పిండప్రధానము చేసి పురుషసూక్తముతో అభిమంత్రించి, దానితోనే శంఖోదకము పోయుచు అభిషేకించవలెను. "__________ శర్మాణం__________గోత్రం విష్ణురూపం తర్పయామి" అనవలెను మరియు పురుష సూక్తముతో తర్పణము చేయవలెను. హోమము కూడా చేయవలెను. పురుషసూక్తములోని ప్రతి ఋక్కునకు "నారాయణాయేదం నమమ" అని హోమము చేయవలెను. బ్రహ్మాది పంచదేవతలకు బియ్యంతో స్వయం పాకం వంటివి చేసి దేవతలకు బలిని సమర్పించవలెను.

శ్లో॥ "బ్రహ్మవిష్ణు మహాదేవా యమశ్చైవ సకింకరః।

బలిం గృహీత్వా కుర్వంతు యతేశ్చాపి (ప్రేతస్యచ) శుభాం గతిమ్"॥

అన్నిదేవతలకు వివిధ ఫలములు, పంచదార (చక్కెర) తేనె, బెల్లము, నెయ్యిని నివేదించవలెను. పిండములను పూజించి నీటియందు వేయవలెను. రాత్రి 9 లేక 7 లేక 5 గురు బ్రాహ్మణులను నియంత్రించి కర్త ఉపవాసముతో జాగారము చేసి తిరిగి ఉదయం విష్ణువాదులను పూజించి "ఏకోదిష్ట విధినా శ్రాద్ధపంచకం కరిష్యే" అని సంకల్పించి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను స్మరించుచు

విప్రులను కూర్చోబెట్టి ప్రేతస్థానములో గూడా విష్ణుస్మరణముతో విప్రుని ఉంచి పాద్య ఆవాహనము చేయవలెను. త్రిమూర్తులకు యమునికి అన్నంతో చేసిన పిండములు పెట్టి ప్రేతనామ గోత్రములు స్మరించుచూ విష్ణునామముతో పంచమ పిండమును పెట్టి పూజించి దక్షిణాదులిచ్చి పంచమస్థానమునున్న విప్రుని విశేషముగా దక్షిణాదులిచ్చి సంతోషపరచి, ఆ బ్రాహ్మణులచేతనే "ప్రేతాయ ఇదం తిలోదకము పతిష్ఠతాం" అనుచూ తర్పణము చేయవలెను. తరువాత కర్త భోజనము చేయవలెను.

## 153. ఛిన్నమస్తాదేవ్యష్టోత్తరము మరియు విశ్లేషణ

**శ్రీ పార్వత్యువాచ:**

నామ్నాం సహస్రం పరమం ఛిన్నమస్తాప్రియం శుభం।

కథితం భవతా శంభోస్సద్యశ్శత్రునికృంతనమ్॥

పునః పృచ్ఛామ్యహం దేవ కృపాం కురు మమోపరి।

సహస్రనామ పాఠే చ అశక్తోయః పుమాన్ భవేత్॥

తేన కిం పఠ్యతే నాథ తన్మే బ్రూహి కృపామయ।

**శ్రీసదాశివ ఉవాచ:**

అష్టోత్తర శతం నామ్నాం పఠ్యతే తేన సర్వదా॥

సహస్రనామ పాఠస్యఫలం ప్రాప్నోతి నిశ్చితమ్

ఓం-అస్యశ్రీఛిన్న మస్తాదేవ్యష్టోత్తర శతనామస్తోత్ర మహామంత్రస్య-

సదాశివఋషిః-అనుష్టుప్ఛందః, శ్రీఛిన్నమస్తా దేవతా - మమ సకలసిద్ధి ప్రాప్తయే జపే వినియోగః

ఓం ఛిన్నమస్తా మహావిద్యా మహాభీమా మహోదరీ।

చండేశ్వరీ చండమాతా చండముండప్రభంజనీ॥

మహాచండా చండరూపా చండికా చండఖండినీ।

క్రోధినీ క్రోధజననీ క్రోధరూపా కుహూః కళా॥

కోపాతురా కోపయుతా కోపసంహార కారిణీ।

వజ్రవైరోచనీ వజ్రా వజ్రకల్పా చ డాకినీ॥

డాకినీ కర్మనిరతా ఢాకినీకర్మపూజితా।
డాకినీసంగనిరతా ఢాకినీప్రేత పూరితా॥
ఖట్వాంగధారిణీ ఖర్వా ఖడ్గఖర్పరధారిణీ।
ప్రేతాసనా ప్రేతయుతా ప్రేతసంగవిహారిణీ॥
ఛిన్నముండధరా ఛిన్న చండవిద్యా చ చిత్రిణీ।
ఘోరరూపా ఘోరదృష్టిః ఘోరరావా ఘనోదరీ॥
యోగినీ యోగనిరతా జపయజ్ఞపరాయణా।
యోనిచక్రమయీ యోనిర్యోనిచక్రప్రవర్తినీ॥
యోనిముద్రా యోనిగమ్యా యోనియంత్ర నివాసినినీ।
యంత్రరూపా యంత్ర మయీ యంత్రేశీ యంత్రపూజితా॥
కీర్త్యా కపర్దినీ కాళీ కంకాళీ కలిహరిణీ।
ఆరక్తా రక్తనయనా రక్త పానపరాయణా॥
భవానీ భూతిదా భూతిర్భూతధాత్రీ చ భైరవీ।
భైరవాచారనిరతా భూతభైరవసేవితా॥
భీమా భీమేశ్వరీ దేవీ భీమనాదపరాయణా।
భవారాధ్యా భవమతా భవసాగరతారిణీ॥
భద్రకాళీ భద్రతనుర్భద్రరూపా చ భద్రికా।
భద్రరూపా మహాభద్రా సుభద్రా భద్రపాలినీ॥
సుభవ్యా భవ్యవదనా సుముఖీ సిద్ధసేవితా।
సిద్ధిదా సిద్ధినివహా సిద్ధా సిద్ధనిషేవితా॥
శుభదా శుభ శుద్ధా శుద్ధసత్త్వా శుభావహా।
శ్రేష్ఠా దృష్టిమయీ దేవీ దృష్టిసంహార కారిణీ॥
శర్వాణీ సర్వగా సర్వా సర్వమంగళకకారిణీ।
శివా శాంతా శాంతిరూపా మృడానీ మదనాతురా॥
ఇతి తే రథితం దేవీస్తోత్రం పరమదుర్లభం।
గుహ్యాద్గుహ్యాతరం గోప్యం గోపనీయం ప్రయత్నతః॥
కిమత్ర బహూనోక్తేన త్వదగ్రే ప్రాణవల్లభే।
మారణం మోహనం దేవి హ్యుచ్చాటన మతః పరమ్॥
స్తంభనాదిక కర్మాణి బుద్ధయస్సిద్ధయోపిచ।
త్రికాలపఠనాదస్య సర్వే సిద్ధ్యంత్యసంశయః॥
మహోత్తమం స్తోత్రమిదం వరాననే మయేరితం నిత్యమనన్య బుద్ధయః
పఠంతియే భక్తియుతా నరోత్తమా భవేన్న తేషాం రిపుభిః పరాజయః॥

ఇతి ఛిన్నమస్తాదేవ్యష్టోత్తర శతనామస్తోత్రమ్

రాహుగ్రహమునకు ఛిన్నమస్తాదేవీ అంతరిక్షదేవత రాహుగ్రహమునకు గోవు అధిదేవత, సర్పము ప్రత్యధిదేవత అదిష్ఠానదేవతలు దుర్గాదేవి ఆరుద్ర, స్వాతి శతభిష నక్షత్రములలో జన్మించినవారు మరియు సర్ప దోషము, అసంపూర్ణకాలసర్పదోషము, సంపూర్ణకాలసర్పదోషము, వివిద కాలసర్పదోషము లలో జన్మించినవారు రాహుదశ, అంతర్ధశ జరుగుతున్నవారు జాతకచక్రంలో రాహువునీచ పడినవారు. గురువు రాహువులు కలిసినవారు శుక్రరాహువులు కలిసినవారు, శనిరాహువులు కలిసినవారు జన్మలగ్నమునందు రాహువు ఉన్నవారు. వ్యయమందు రాహువు ఉన్నవారు, అష్ఠమరాహువు లేదా శని, కుజగ్రహముల కలయిక కలవారు. గురురాహువు కలయిక వలన ఏర్పడు గురుచండాల యోగము, పనిరాహువుల కూటమి మరియు సంఖ్యాశాస్త్రము ప్రకారం 4,13,22 తేదీలల్లో జన్మించినవారు, డాక్టర్సు, రసయానశాస్త్ర నిపుణులు, ఆర్గానిక్ రసాయనశాస్త్ర పండితులు, భూగర్భ, మత్స్యశాఖ, ఫైబర్ టెక్నాలజీ, ప్లాస్టిక్కు, రబ్బరు, తారు, పెట్రోల్, కిరోసిన్, ఎలక్ట్రానికక్స్, టైర్లు, రిఫ్రిజిరేటర్లు, ఆయిల్ ఇంజన్లు, టైనింగ్ టెక్నాలజీ, మొలాసిస్, లిక్విడ్‌గ్యాస్, ఎలక్ట్రానిక్స్ అప్లయెన్స్, మొదలగు ఉద్యోగులు వ్యాపారులు ఈమెను ఆరాధించవలెను మరియు ఈమెను ఆయుర్వేదవైద్యులు, మూలికవైద్యులు బదనికలు, యక్షిణసాధనలు చేసేవారు కూడా ఆరాదించవలెను.

ఈ అమ్మవారు ఖండించబడిన కరం నుండి త్రివిధ రక్తపు ధారలు చిమ్ముతున్నట్లుగా తంత్రశాస్త్రంలో చిత్రీకరింపబడినది. ఈ రక్తాన్ని ఈమె అనుచరగణాలైన ఢాకినీ, వారుణీ దేవతలు గ్రోలుతున్నట్లుగా చెప్పబడినది. ఈమె మానవాకారంలోని పరుశురాముని తల్లియైన రేణుకాదేవిగా ఉద్భవించింది.

ఈమెక చండీమహాదేవి కూడా అని తంత్రశాస్త్రం చెబుతుంది. దొంగ తనాలు, దోపిడీలు,కుట్రలు,దాడులు హఠాత్తుపరిణామాలు కలుగుతాయి. ఆధ్యాత్మిక శక్తులను పాడుచేస్తాయి. ఈదేవతను భక్తితో పూజించిన అన్ని శుభములు కలుగును.

## 154. శ్రీ ధూమావతీ స్తోత్రము విశ్లేషణ

**ఈశ్వర ఉవాచ:**

ఓం ధూమావతీ ధూమ్రవర్ణా ధూమ్రపానపరాయణా।
ధూమ్రాక్షమథినీ ధన్యా ధన్యస్థానానివాసినీ।
అఘోరాచార సంతుష్టా అఘోరాచార మండితా।
అఘోరామంత్ర సంప్రీతా అఘోరమనుపూజితా।
అట్టాట్టహాసనిరతా మలినాంబర ధారిణీ॥

వృద్ధా విరూపా విధవా విద్యాచ విరళద్విజా
ప్రవృద్ధిఘోణా కుముఖీ కుటిలా కుటిలేక్షణా
కరాళీ చ కరాళాస్యా కంకాళీ శూర్పధారిణీ
కాకధ్వజరథారూఢా కేవలా కఠినా కుహూః।
క్షుత్పిసాసార్దితా నిత్యా లలజ్జిహ్వా దిగంబరీ॥
దీర్ఘోదరీ దీర్ఘరవా దీర్ఘాంగీ దీర్ఘమస్తకా।
విముక్తకుంతలా కీర్త్యా కైలాసస్థానవాసినీ॥
క్రూరా కాలస్వరూపా చ కాలచక్రప్రవర్తినీ॥
వివర్ణా చంచలా దుష్టా దుష్ట విధ్వంసకారిణీ॥
చండీ చండస్వరూపా చ చాముండా చండనిస్వనా।
చండవేగా చండగతి శ్చండముండ వినాశినీ।
చండాలినీ చిత్రరేఖా చిత్రాంగీ చిత్రరూపిణీ।
కృష్ణా కపర్దినీ కుల్లా కృష్ణరూపా క్రియావతీ॥
కుంభస్తనీ మదోన్మత్తా మదిరాపానవిహ్వలా।
చతుర్భుజా లలజ్జిహ్వా శత్రుసంహార కారిణీ॥
శవారూఢా శవగతా శ్మశాన స్థానవాసినీ ।
దురారాధ్యా దురాచారా దుర్జన ప్రీతిదాయినీ ॥
నిర్మాంపాచ నిరాహార ధూతహస్తా పరాన్వితా ।
కలహాచ కలిప్రీతా కలికల్మషణాశినీ ॥
మహాకలస్వరూపా చ మహాకాల ప్రపూజితా ।
మహాదేవప్రియా మేధా మహాసంకట నాశినీ ।
భైరవీ భువనా భీమా భారతీ భువనాత్మికా ॥
భారుండా భీమనయనా త్రిణేత్రా బహురూపిణీ ।
త్రిలోకేశీ త్రికాలజ్ఞా త్రిస్వరూపా త్రయీతమః॥
త్రిమూర్తిశ్చ తథా తన్వీ త్రిశ క్తిశ్చ త్రిశూలినీ।
ఇతి ధూమామహత్ స్తోత్రం నామ్నామష్టశతాత్మకమ్।
కారాగారే రిపుగ్రస్తే మహోత్పాతే మహాభయే ॥
ఇదం స్తోత్రం పఠేన్మర్త్యో ముచ్యతే సర్వసంకటైః।
గుహ్యాద్గుహ్యతరం గుహ్యం గోపనీయం ప్రయత్నః ॥
చతుష్పదార్థందం నృణాం సర్వసంపత్రదాయకమ్॥

కేతుగ్రహమునకు ధూమావతీదేవీ అంతరిక్షదేవత కేతుగ్రహమునకు చిత్రగుప్తుడు అధిదేవత. బ్రహ్మప్రత్యధిదేవత అధిష్ఠానదేవతలు శ్రీమహాగణపతి అశ్వని, మఖ,మూల నక్షత్రములలో జన్మించినవారు మరియు కేతుదశ, అంతర్దశలు

జరుగుచున్నవారు జాతక చక్రంలో కేతువు నీచపడిన వారు జన్మలగ్నంలో కేతువు, అష్టమం లో కేతువు ఉన్నవారు పంచమంలో, చతుర్థంలో కేతువు ఉన్నవారు, కాలసర్పయోగం ఉన్నవారు సంఖ్యాశాస్త్రము ప్రకారము 7, 16, 25 తేదీలలో జన్మించిన వారు విపరీతమైన దీర్ఘకాలిక రోగములు కలవారు యావజ్జీవ కారా గారము, మరణశిక్ష మొదలగు శిక్షలు పడుతుందనే భయపడేవారు. అర్థంకాని సమస్యలకు, గ్రహాంతరయానం చేసేవారు. రాకెట్లు ప్రయోగించేవారు, కళాకారులు (సినిమాయాక్టర్సు) మెకానికల్ లేదా మిషను సంబంధ సర్వక్రియలకు ఈమెను ఆరాధించవలెను. ఈమెను ఆరాధన చాలా కష్టతరమైనది. ముఖ్యంగా ఈ ఆరాధన గరువు ద్వారా మాత్రమే సిద్ధి పొందాలి. సిద్ధులు, యోగులు అవధూత స్థాయికి చెందిన వారు మాత్రమే ఉపాసించగలరు.

## 155. అఘోరాస్త్రము

**ఈశ్వర ఉవాచ:**

1. అస్త్రయాగః పురాకార్యః సర్వకర్మసు సిద్ధిదః మధ్యేపూజ్యం వాద్యస్త్రం వజ్రాదీస్పూర్వతః క్రమాత్
2. పంచచక్రం దశకరం రణాదౌ పూజితం జయే। గృహపుజా రవిర్మధ్యే పూర్వాద్యాః సోమకాదయః
3. సర్వ ఏకాదశ స్థాస్తు గృహాః స్యుర్గ్రహపూజనాత్। అస్త్రశాంతిం ప్రపక్ష్యామి సర్వోత్పాత వినాశనమ్.
4. గ్రహరోగాదిశమనీం మారీ శత్రు విమర్దినీమ్। వినాయకోపతస్తిఘ్న మఘో రాస్త్రం జపేన్నరః
5. లక్షం గ్రహాది నాశః స్యాదుత్పాతే తిలహోమకమ్। దివ్యేలక్షం తదర్ధేన వ్యోమజోత్పాత నాశనమ్.
6. ఘృతేన లక్షపాతేన ఉత్పాతే భూమిజేహితమ్। ఘృత గుగ్గులు హోమేచ సర్వోత్పాతాది మర్దనమ్.
7. దూర్వాక్షతాజ్య హోమేన వ్యాధయో౽థ ఘృతేనచ। సహస్రేణతు దుఃస్వప్నా వినశ్యంతిన సంశయ
8. అయుతాద్గ్రహ దోషఘ్నొ జవాఘృత విమిశ్రితాత్। వినాయకార్తి శమన మయుతేన ఘృతస్యచ.
9. భూతవేతాళ శాంతిస్తు గుగ్గులోరయుతేన చ। మహావృక్షస్య భంగేతు వ్యాలకంకే గృహేస్థితే.

10. అరణ్యానాం ప్రవేశేచ దూర్వాజ్యాక్షత హోవనాత్। ఉల్కాపాతే భూమికమ్పే తిలాజ్యేనా హుతాచ్ఛివమ్.
11. రక్తస్రావే తుశీ వృక్షాణామయుతాద్ధుగ్గులోః శివమ్। అకాలే ఫల పుష్పాణాం రాష్ట్ర భంగేచ మారణే.
12. ద్విపదాదేర్యదా మారీలక్షార్ధాచ్చ తిలాజ్యతః। హస్తిమారీ ప్రశాంత్యర్థం కరిణీ దంతవర్ధనే.
13. హస్తిన్యాం మదదృష్టౌచ ఆయుతాచ్ఛాన్తిరిష్యతే। అకాలే గర్భపాతేతు జాతం యత్ర వినశ్యతి.
14. వికృతాయత్ర జాయన్తే యాత్రాకాలేఽయుతం హునేత్। తిలాజ్య లక్షహోమస్తు ఉత్తమా సిద్ధిసాధనే.
15. మద్యమాయాం తదర్ధేన తత్పాదాదదమాసుచ। యథా జపస్తథా హోమః సంగ్రామే విజయో భవేత్. అఘోరాస్త్రం జపేన్నృస్య ధ్యాత్వా పంచాస్య మూర్జితమ్.

ఇత్యాది మహాపురాణే ఆగ్నేయేఽఘోరాస్త్రాది శాంతికల్ప నిరూపణం

నామైకవింశత్యధిక త్రిశతతమోఽధ్యాయః

సమస్త కర్మలు తొలగించుటకు సర్వసిద్ధి ప్రదమగు అస్త్రయాగము చేయవలెను. మధ్య భాగమున శివుడి అస్త్రమును పూర్వ దిక్కుల యందు క్రమముగ ఇంద్రాది దిక్పాలకుల అస్త్రములను పూజించవలెను. శంకరునకు ఐదు ముఖములు పదిహస్తములున్నవి సూర్యాది నవగ్రహములను ఉంచి గ్రహపూజ చేయవలెను. గ్రహపూజచేయుట వలన గ్రహములన్నియు ఏకాదశ స్థానమునందున్న లాభరూప ఫలమును ఇచ్చును. సమస్త ఉత్పాతములను నశింపచేయు అస్త్రములు కలవు. ఇది గ్రహరోగాదులను మారి శత్రు భయములను తొలగించును. వినాయకుని వలన కలిగిన బాధలను తొలగించును. మానవుడు లక్ష పర్యాయములు అఘోరాస్త్రము జపించినచో గ్రహములు నశించును. దివ్య ఉత్పాతము కలిగినప్పుడు అర్ధ లక్ష హోమములచే విఘ్నశాంతి కలుగును అరణ్య ప్రవేశము చేయవలసినప్పుడు కూడా ఇలాగే చేయవలెను. ఉల్కాపాతముగాని, భూకంపములుగాని కలిగితే తిలఘృత హోమము చేసినచో మేలు కలుగును. రాష్ట్రమునకు ఆపదవచ్చిన

(అరిష్టములు)చో తిలమిశ్రమ ఘృతముతో అర్ధ లక్ష హోమములు చేయవలెను. తొమ్మిదినెలలు నిండక (గర్భపాతమైనను) పుట్టిన వెంటనే శిశువు మరణించును వికృతాంగములు (అవయవలోపం) గల శిశువు జన్మించిన సమయమునకు పూర్వమే శిశువు జన్మించిన సమయమునకు పూర్వమే శిశువు జన్మించినను పది వేల హోమములు చేసిన దోషము పోవును. సిద్ధి సాధించుటకు తిల చేయవలెను. లక్ష ఆజ్యాహుతులు చేసినచో భూమి జోత్పాతములు నశించును. గుగ్గులు మిశ్ర ఘృతమును హోమము చేసినచో అన్ని ఉత్పాతములు నశించును. దూర్వలు అక్షతలు ఆజ్యము. హోమము చేసిన సర్వరోగములు నశించును. ఘృతముతో సహస్రహోమము చేసినచో దుస్స్వప్నములు నశించును, ఇందు సంశయము లేదు. 10వేల హోమములు చేసినచో గ్రహదోషములు తొలగును. యవఘృత హోమముచే వినాయక బాధలు తొలగును. పదివేల ఆజ్యహోమములు పదివేల గుగ్గులం హోమములు చేసినచో భూతప్రేత శాంతికలుగును. ఏదైన మహావృక్షము పడిపోయినను ఇంటిలో సర్పశవము వచ్చినను ఘృత, అక్షతల హోమముల మిశ్రమములగు ఘృతముతో ఒక లక్షహోమములు చేయవలెను. అర్ధలక్షహోమ ములు చేసినచో మధ్యమ సిద్ధియు ఇరువది ఐదువేల హోమము చేసినచో అధమ సిద్ధియు కలుగును. జపాను సారముగ హోమము చేసినచో యుద్ధము నందు విజయము చేకూరును. తేజాశ్శాలియగు పంచముఖుని ధ్యానించుచు న్యాస పూర్వకముగ అఘోరాస్త్ర జపము చేయవలెను. ఈ విషయమును పరమేశ్వరుడు వివరించినారు.

## 156. అథ దిక్పాలాది స్నానమ్

**అగ్నిరువాచ:**

1. సర్వార్థ సాధనం స్నానం వక్ష్యేశాంతికరం శృణు। స్నాపయేచ్చ సరిత్తీరే గృహాన్విష్ణుం విచక్షణః.
2. దేవాలయే జ్వరార్త్యాదౌ వినాయక గ్రహార్దితే। విద్యార్థినో హ్రదేగేహే జయకామస్య తీర్థకే.
3. పద్మిన్యాం స్నాయాజ్జాతో యస్యావినశ్యతి.
4. పుష్పార్థినాంచ పుష్పాఢ్యే పుత్రార్థినాంచ సాగరే। గృహసౌభాగ్య కామానాం సర్వేషాం విష్ణుసన్నిధౌ. వైష్ణవే రేవతీ పుష్యే సర్వేషాం స్నానముత్తమమ్।
5. స్నాన కామస్య సప్తాహం పూర్వముత్సాదనం స్మృతమ్.

6. పునర్నవాం రోచనాం చ శీతాంగం గురుణీత్వచమ్। మధూకం రజనీద్వేచ తగరం నాగకేసరమ్. అంబరీం చైవ మంజిష్ఠాం మాంసీయాసకకర్దమైః।

7. ప్రియంగు సర్షపం కుష్ఠం బలాం బ్రాహ్మీంచ కుంకుమం పంచగవ్యం సక్తుమిశ్రం ఉద్వర్త్య స్నానమాచరేత్।

8. మండలే కర్ణికాయాంచ విష్ణుం బ్రహ్మాణమాచరేత్

9. దక్షే వామే హరం పూర్వం పత్రే పూర్వాదికేక్రమాత్। లిఖేదింద్రాది కాన్దేవాన్సాయుధాన్సహబాంధవాన్.

10. స్నానమండల కాన్దిక్షు కుర్యాచ్చైవ విదిక్షుచ। విష్ణు బ్రహ్మేశ శక్రాదీంస్తదస్త్రాణ్యర్చ్య హోమయేత్.

11. ఏకైకస్య త్వష్టశతం సమిదస్తు తిలాన్వృతమ్। భద్రః సుభద్రః సిద్ధార్థ కలశాః పుష్టివర్ధనాః

12. అమోఘః చిత్రభానుశ్చ పర్జన్యోఽథ సుదర్శనః। స్థాపయేత్తు ఘటానే తాన్సాశ్వి రుద్ర మరుద్గణమ్.

13. విశ్వేదేవాస్తథా దైత్యావసవో మునయస్తథా। ఆవేశయన్తు సుప్రీతాస్తథాన్యా అపిదేవాతాః।

14. ఔషధీర్నిక్షిపేత్కుంభే జయన్తీం విజయాం జయామ్। శతావరీం శతపుష్పాం విష్ణుక్రాంతాపరాజితామ్.

15. జ్యోతిష్మతీమతి బలాం చందనోశీరకేసరమ్। కస్తూరికాచ కర్పూరం వాలకం పత్రకం త్వచమ్.

16. జాతీఫలం లవంగం చ మృత్తికాం పంచగవ్యకమ్ భద్రఫీఠే స్థితం సాధ్యం స్నాపయేయుర్ద్విజాబలాత్.

17. రాజాభిషేక మంత్రోక్త దేవానాం హోమకాః పృథక్। పూర్ణాహుతిం తతో దత్త్వా గురవే దక్షిణాం దదేత్.

18. ఇంద్రోఽభిషిక్తో గురుణాపురా దైత్యాంజఘానహ। దిక్పాల స్నానం కథితం సంగ్రామాదౌ జయాదికమ్.

ఓం నవగ్రహాయ సర్వ శత్రూన్మ మసాధయఽసాధయ

మారయ మారయ ఆసోం ఆసోం మం ఋం చుం ఓం శం వాం కీం ఓం స్వాహా।

అనేనార్క శతైరర్చ్య శ్మశానే తునిధాపయేత్.

భూర్జేవా ప్రతిమాయాంవా మారణాయ రిపోర్గ్రహాః

ఓం కుంజరీ బ్రహ్మాణీ। ఓం మంజరీ మాహేశ్వరీ।

ఓం వేతాళీ కౌమారీ । ఓంకాలీ వైష్ణవీ । ఓం అఘోరా

వారాహీ । ఓం వేతాలీ ఇంద్రాణీ ఊర్వశీ। ఓం వేతాళీ

చండికా । ఓం జయానీ యక్షిణీ । నవమాతరో హేమమ

శత్రుం గృహ్ణత. గృహ్ణత భూర్జేనామ రిపోర్లిఖ్య శ్మశానే పూజితే మ్రియేత్.

పై శ్లోకముననుసరించి గృహములకు, శ్రీమహావిష్ణువునకు నదీతీరమున స్నానము చేయవలెను. జర్వము మరియు రోగపీడాదులకు, వినాయక మరియు గ్రహబాధలకు దేవాలయమునందు స్నాననము చేయవలెను. విద్యయందు అనుకూలతకు జలాశయమునందుగాని ఇంటినందున గాని స్నానము చేయవలెను. విజయము కలగాలంటే తీర్థజలము స్నానము చేయవలెను. గర్భస్రావముతో బాధపడుతున్న స్త్రీకి పుష్కరిణిలో స్నానము చేయవలెను. పుట్టినవెంటనే శిశువు మరణిస్తూ ఉంటే స్త్రీకి అశోక వృక్ష సమీపమున స్నానము చేయవలెను. రజోదర్శనము కోరు స్త్రీలు పుష్పములతో నిండిన వలనమునందు స్నానము చేయవలెను. మిత్రులను కోరు స్త్రీలు సముద్రమునందు, సౌభాగ్యము కొరకు స్త్రీలు గృహమునందు స్నానము చేయవలెను. పైన స్నానములన్నియు విష్ణుప్రతిమ పెట్టుకొని రేవతి, పుష్యమి, శ్రవణ నక్షత్రములందు స్నానము చేయుట ఉత్తమ స్నానము చేయువారు పునర్నవ, గోరోచనము, శతాంగము, గురుణి, బెరదు, మధూకము, రెండు విధములగు పసుపు, తగరము, నాగకేసరము, అంబరి, మంజిష్ఠ, జతామాంసి, యాసకము, కర్దమము ప్రియంగువు, తెల్లఆవాలు, కుష్ఠము, బలబ్రాహ్మి కుంకుమము, సక్తువులు కలిపిన పంచగవ్యములు వీటిని నలిపి (దంచి) శరీరమునకు రాసుకొని స్నానము చేయవలెను.

ఆతరువాత తామపత్రముపై పద్మమండలము ఏర్పరిచి దాని కర్ణికయందు శ్రీమహావిష్ణువును పూజించవలెను. కుడిభాగమున బ్రహ్మను, ఎడమప్రక్కన మహారుద్రుడిని అనగా ఉత్తరము వైపు బ్రహ్మను, మధ్యలో విష్ణువును దక్షిణవైపు శివుడిని పూర్వాది దిగ్ధళములందు ఆయుధ పరివారాది సహితులగు దిక్పాలకులను ఉంచవలెను. పూర్వదిశయందు, ఆగ్నేయాది విదిక్కులయందును ఎనిమిది స్నానమండలములను ఏర్పరచవలెను. ఆ మండలములపై ఆయుద సహితులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, ఇంద్రాదులను అర్చించి, వారికి హోమము చేయవలెను.

ఒక్కొక్క దేవతకు 108 ఆహుతులు, సమిధులతోను, తిలలతోను, ఘృతముతోను చేయవలెను. పిదపభద్ర,సుభద్ర, సిద్ధార్థ, పుష్టివర్ధన, అమోఘ, చిత్రభాను, పర్జన్య సుదర్శనములను ఎనిమిది కలశములను స్థాపన చేసి వాటిపై, అశ్వని, రుద్ర మరుద్గణ, విశ్వేదేవ, దైత్య, వసుదుర్గా, మునులను ఇతరదేవతలను ఆవాహనము చేసి పూజించవలెను. ఆ ఎనిమిది కలశములలో (పూజించక ముందే) జయంతి, విజయ, జయ,శతావరి, శతపుష్ప, విష్ణుక్రాంత, అపరాజిత, జ్యోతిష్మతి, అతిబలచందన, ఉశీర, కేసర, కస్తూరి, కర్పూర, వాలక, పత్రక, త్వచజాతీక్రాంత, లవంగములను, మృత్తికను, పంచగవ్యములను వేయవలెను అతరువాతే ఎనిమిదికళశములను పూజించవలెను. పిదప యజమానిని భద్ర పీఠముపై కూర్చుండబెట్టి స్నానము చేయవలెను. బ్రాహ్మణులు మంత్రోచ్చారణతో స్నానము చేపించవలెను. రాజ్యాభిషేక మంత్రములలో చెప్పబడిన దేవతలకు వేరువేరుగా హోమము చేయవలెను. పిదప పూర్ణాహుతి ఇచ్చి గురువునకు దక్షిణ ఇవ్వవలెను. హోమమునకు ముందు బృహస్పతి, ఇంద్రునకు అభిషేకము చేయవలెను. ఇవన్నీ చేస్తే విజయములు లభించును.

"ఓం నవగ్రహాయ" మొదలు స్వాహా వరకు ఉన్న మూలోక్త మంత్రమును భూర్జ పత్రముపై కాని నవగ్రహ ప్రతిమపై గాని వ్రాసి వంద జిల్లేడు పూవులతో పూజించి ఆయంత్రమును శ్మశానమున పాతినచో గ్రహములు శత్రువును నాశనము చేయునది.

"ఓం కుంజరీ" మొదలు గృహ్ణాత వరకు ఉన్న మూలోక్త మంత్రమును భూర్జపత్రముపై వ్రాసి శత్రు పదవస్థానమున శత్రునామము వ్రాసి శ్మశానమునందు ఆ మంత్రమును పూజించినచో శత్రువు నశించును అని అగ్ని దేవుడు చెప్పెను.

## 157. పాశుపతి శాంతి మరియు రుద్రశాంతి

**ఈశ్వర ఉవాచ:**

వక్ష్యే పాశుపతాస్త్రేణ శాంతి జాపాది పూర్వతః। పాదతః పూర్వనాశోహి ఫడన్తం చాపదాదినుత్.

ఓం నమో భగవతే మహాపాశుపతాయ అతులబల

వీర్య పరాక్రమాయ త్రిపంచ నయనాయ నానా రూపాయ

నానాప్రహరణోద్యతాయ సర్వాంగ రక్తాయ భిన్నాంజన

చయ ప్రఖ్యాయ శ్మశాన వేతాళ ప్రియాయ సర్వవిఘ్న

సతృంతనరతాయ సర్వసిద్ధి ప్రదాయ భక్తానుకంపినే
అసంఖ్య వక్త్రభుజ పాదాయ తస్మై సిద్ధాయ వేతాల విత్రాసినే
శాకినీ క్షోభ జనకాయ వ్యాధి నిగ్రహకారిణే పాప భంజనాయ
సూర్యసోమాగ్ని నేత్రాయ విష్ణుకవచాయ ఖడ్గవజ్ర హస్తాయ
యమదండ వరుణ పాశాయ రుద్రశూలాయ జ్వల జిహ్వాయ
సర్వరోగ విద్రావణాయ గ్రహనిగ్రహ కారిణే దుష్ట
నాగక్షయ కారిణే ఓం కృష్ణ పింగలాయ ఫట్ హుంకారా
స్త్రాయ ఫట్ వజ్ర హస్తాయ ఫట్ శక్తయే ఫట్ దండాయఫట్
యమాయ ఫట్ ఖడ్గాయ ఫట్ నైర్పతాయ ఫట్ వరుణాయ
ఫట్ వజ్రాయ ఫట్ పాశాయ ఫట్ ద్వజాయ ఫట్ అంకుశాయ
ఫట్ గదాయై ఫట్ కుబేరాయ ఫట్ త్రిశూలాయ ఫట్
ముద్గరాయ ఫట్ చక్రాయ ఫట్ త్రిశూలాయ ఫట్
ముద్గరాయ ఫట్ చక్రాయ ఫట్ పద్మాయ ఫట్ నాగాస్త్రాయ
ఫట్ ఈశానాయ ఫట్ ఖేటకాస్త్రాయ ఫట్ దండాయ ఫట్
ముండాస్త్రాయ ఫట్ కంకాలాస్త్రాయ ఫట్ పిచ్ఛికాస్త్రాయ ఫట్
క్షురికాస్త్రాయ ఫట్ కంకాలాస్త్రాయ ఫట్ పిచ్ఛికాస్త్రాయ ఫట్
గణాస్త్రాయఫట్ సిద్ధాస్త్రాయ ఫట్ పిలిపిచ్ఛాస్త్రాయ ఫట్
గంధర్వాస్త్రాయ ఫట్ పూర్వాస్త్రాయ ఫట్ దక్షిణాస్త్రాయ
ఫట్ గందర్వాస్త్రాయ ఫట్ పూర్వాస్త్రాయ ఫట్ దక్షిణాస్త్రాయ ఫట్
వామాస్త్రాయ ఫట్ పశ్చిమాస్త్రాయ ఫట్ మంత్రాస్త్రాయ ఫట్
శాకిన్యస్త్రాయ ఫట్ యోగిన్యస్త్రాయ ఫట్ దండాస్త్రాయ ఫట్
నమోస్త్రాయ ఫట్ మహాదండాస్త్రాయ ఫట్
నాగాస్త్రాయ ఫట్ అఘోరాస్త్రాయ ఫట్ కామదేవాస్త్రాయ ఫట్
పురుషాస్త్రాయ ఫట్ అఘోరాస్త్రాయ ఫట్ కామదేవాస్త్రాయ ఫట్
సద్యోజాతాస్త్రాయ ఫట్ హృదయాస్త్రాయ ఫట్
మహాస్త్రాయ ఫట్ గరుడాస్త్రాయ ఫట్ రాక్షసాస్త్రాయఫట్

దానవాస్త్రాయ ఫట్ క్ష్రౌం నరసింహాస్త్రాయ ఫట్

త్వష్ట్రస్త్రాయ ఫట్ సర్వాస్త్రాయ ఫట్ నఃఫట్ వః ఫట్

సః ఫట్ ఫః ఫట్ మః ఫట్ స్త్రీఫట్ ఫేఃఫట్

భూః ఫట్ భువః ఫట్ స్వః ఫట్ మహః ఫట్ జనః ఫట్

తపః ఫట్ సత్యం ఫట్ సర్వలోక ఫట్ సర్వపాతాళ ఫట్ సర్వ

తత్త్వ ఫట్ సర్వప్రాణ ఫట్ సర్వనాడీ ఫట్ సర్వకారణ ఫట్

సర్వదేవ ఫట్ హ్రీం ఫట్ శ్రీం ఫట్ హ్రూం ఫట్ స్రుం ఫట్

అం ఫట్ లాం ఫట్ వైరాగ్యాయ ఫట్ మాస్త్రాయ ఫట్ కామాస్త్రాయ ఫట్

క్షేత్ర పాలాస్త్రాయ ఫట్ హూంకారాస్త్రాయ ఫట్ భాస్కరాస్త్రాయ ఫట్

చంద్రాస్త్రాయ ఫట్ విఘ్నేశ్వరాస్త్రాయ ఫట్ గౌః గాఫట్ ఖ్రోం క్రీం ఫట్, హ్రూం హ్రౌం ఫట్

భ్రామయ భ్రామయ ఫట్ సంతాపయ సంతాపయ ఫట్ ఛాదయ ఛాదయ ఫట్ ఉన్మూలయ ఉన్మూలయ ఫట్ త్రాసయ త్రాసయ ఫట్ సంజీవయ సంజీవయ ఫట్ విద్రావయ విద్రావయ ఫట్ సర్వదురితం నాశయ నాశయ ఫట్

సకృదావర్తనాదేవ సర్వవిఘ్నాన్వి నాశయేత్। శతావర్తేన చోత్పాతాన్రణాదౌ విజయోభవేత్.

ఘృతగుగ్గులు హోమాచ్చ అసాధ్యానపిసాధయేత్। పఠనాత్సర్వ శాంతిః స్యాచ్ఛస్త్ర పాశుపతస్యచ

ఇత్యాది మహాపురాణే ఆగ్నేయ పాశుపతశాంతి వర్ణసంవాయ ద్వావింశత్యధిక ద్విశతతమో౽ధ్యాయః.

పై శ్లోకములో చెప్పిన విధముగా పాశుపతాస్త్ర మంత్రముతో శాంతి పూజలు నిర్వహించవలెను. పై మంత్రమును అంశిక పారముగాని జపముగాని చేసినచో పాపము నశించును. "ఓం నమో భగవతే మొదలు "సర్వదురితం నాశయ నాశయ ఫట్" వరకు దీనిని ఒకసారి చదివినచో అన్ని విఘ్నములు తొలగిపోవును. వందసార్లు చదివినచో ఉత్పాతములు నశించును. యుద్ధాదులందు జయము కలుగను. నెయ్యితో భొగ్గులు కలిపి ఈ మంత్రముతో హోమము చేసినచో అసాధ్యకార్యములు కూడా సాధించవచ్చును. ఈపాశు

పతాస్త్ర మంత్రముచే అన్ని పాపములు నశించును. ఈ విషయమును పరమేశ్వరుడు వివరించినారు.

## 157. రుద్రశాంతి

ఈశ్వర ఉవాచ:

1. శివ శాంతిం ప్రవక్ష్యామి కల్పాఘోర ప్రపూర్వకమ్; సప్తకోట్యధిపో ఘోరో్బ్రహ్మ హత్యాద్యఘార్దనః
2. ఉత్తమాధమసిద్ధీనామాలయో౽ఖిల రోగనుత్; దివ్యాన్తరిక్షభౌమానా ముత్తత్పాతానాం విమర్ధనః
3. విషగ్రహ పిశాచానాం గ్రసనః సర్వకామకృత్; ప్రాయశ్చిత్తమఘౌఘార్తౌ దౌర్భాగ్యార్తి వినాశనమ్.
4. ఏక వీరన్తు విన్యస్య ధ్యేయః పంచముఖఃసదా– శాంతికే పౌష్టికే శుక్లో వశ్యే౽థ పీతకః
5. స్తంభనే ధూమ్ర ఉచ్చాట మారణే కృష్ణ వర్ణకః। కర్షణః కపిలో మోహే ద్వాత్రింశద్వర్ణమర్చయేత్
6. త్రింశల్లక్షం జపేన్మంత్రం హోమం కుర్యాద్దశాంశతః। గుగ్గులామృతయుక్తేన సిద్దే సిద్దే౽ థ సర్వకృత్.
7. అఘోరాన్నాపరో మంత్రో విద్యతే భుక్తిముక్తికృత్
8. ఆ బ్రహ్మచారీ బ్రహ్మచారీ అస్నాతః స్నాతకోభవేత్
9. ఆ ఘోరాస్త్ర మఘోరన్తు ద్వావిమౌ మంత్రరాజకౌ। జపహోమార్చనాద్యుద్ధే శత్రుసైన్యం విమర్ధయేత్.

మనము కల్పాఘోర శివశాంతిని గురించి తెలుసుకుందాము. అఘెర శివుడు ఏడు కోట్ల గణములకు అధిపతి బ్రహ్మహత్యాది పాపములను నశింపచేయును. ఉత్తమాధమసిద్ధులను ఇచ్చువాడు సమస్త రోగములను పోగోట్టును భౌమదివ్య అంతరిక్ష ఉత్పాతములను మర్ధించును. విషగ్రహ పిశాచములను కూడ మ్రింగి వేసి సకల కామములను పూరించును. చెడుపీడలను పోగుట్టుటకు దుర్భాగ్య దుఃఖ వినాశమగు ప్రబల ప్రాయశ్చిత్తరూపుడు ఏకవీరమును సర్వాంగన్యాసము చేసి సర్వదా పంచముఖధ్యానము చేయవలెను. శాంతిక పౌష్టికములందు శివుడు

శుక్లవర్ణుడు. వశీకరణమున రక్తవర్ణుడు. స్తంభన కర్మయందు పీతవర్ణుడు ఉ చ్చాటన మారణ కర్మలందు ధూమ్రవర్ణుడు ఆకర్షణమున కృష్ణవర్ణుడు మోహన కర్మయందు కపిలవర్ణము కలవాడు. 32 అక్షరములు వేదోక్తములగు అఘోర శివునిరూపము అందుచే అట్టి అఘోర శివునిపూజించవలెను. ఈవేదోక్త మంత్రము లను 30 లక్షల జపము చేసి గుగ్గులు మిశ్ర ఘృతముతో దశాంశ హోమము చేసినచో సాధకుడు మంత్రసిద్ధి పొంది సిద్ధార్థుడగును. అతడు అన్ని సాధిస్తారు. అఘోర మంత్రమును మించిన మంత్రము వేరొకటి లేదు అనటంలో అతిశయోక్తి లేదు. ఈమంత్రమును జపించటము వల్ల వివాహము జరుగును. అస్నాత కుస్నాతకుడగును. అఘోర మంత్రము, అఘోరాస్త్రము ఈ రెండు మంత్రరాజ ములు ఏ ఒక్కదానినైనను జప హోమములు చేసినచో యుద్ధములో శత్రువులను తరిమి కొట్టుదురు. ఈ విషయములన్ని అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీపరమేశ్వరుడు స్వయంగా వివరించినారు.

## 158. సర్వశాంతి

<u>ఈశ్వర ఉవాచ:</u>

1. ఓం హ్రూం హంస, ఇతిమంత్రేణ మృత్యురోగాది శామ్యతి। లక్షాహుతి భిర్దూర్వాభిః శాంతిం పుష్టిం ప్రసాధయేత్

2. అథవా ప్రణవేనైవ మాయయావా షడానన। దివ్యాన్తరిక్ష భౌమానాంశాంతి రుత్పాత వృక్షకే.

3. ఓం నమోభగవతి గంగే కాలికాలి మహా కాలికాలి మాంస శోణిత భోజనే రక్తకృష్ణ ముఖి వశమానయ, మానుషాన్ స్వాహా।

4. ఓం లక్షం జప్త్వాదశాంశేన హుత్వాస్యాత్సర్వ కర్మకృత్।

5. వశంనయతి శక్రాదీన్మా నుషే ష్వేషు కాకథా

6. అంతర్ధాన కరీవిద్యా మోహినీ జృంభణీతథా। వంశంనయతి శత్రూణాం శత్రుబుద్ధి ప్రమోహినీ.

7. కామధేనురియం విద్యాసప్తదా పరికీర్తితా। మంత్రరాజం ప్రవక్ష్యామి శత్రుచౌరాది మోహనమ్. మహాభయేషు సర్వేషు స్మర్తవ్యం హరపూజితమ్ । లక్షం జప్త్వాతిలైర్హోమః సిద్యేదుద్ధారకం శృణు. ఓం హాలేశూలే ఏహిబ్రహ్మసత్యేన విష్ణుసత్యేన రుద్రసత్యేన రక్షమాంవాచేశ్వరాయ స్వాహా. దుర్గాత్తారయతేయస్మా త్తేన దుర్గాశివామతా। ఓంచండ కపాలిని దంతాన్

కిటికిటి క్షిటిక్షిటి గుహ్యేఫట్ హ్రీం, అనేన మంత్రరాజేన క్షాలయిత్వాతు తండులాన్.

8. త్రింశద్వారాణి జప్త్వాని తచ్చోరేషు ప్రదాపయేత్। దంతశ్చూర్ణాని శుక్లాని పతితాని హి శుద్ధయే.

9. ఓం జ్వలల్లోచన కపిల జటాభార భాస్వర విద్రావణ త్రైలోక్య డామర డామర ధర ధర భ్రమభ్రమ ఆ కట్ట ఆకట్ట తోటయ తోటయ మోటయ మోటయ దహ దహ పచ పచ ఏవం సిద్ధరుద్రోజ్ఞాపయతి యదిగ్రహోపగతః స్వర్గలోకం దేవలోకంవా ఆరామ విహారాచలం తథాపి.

10. తమార్తయిష్యామి బలింగృహ్ణ గృహ్ణ దదామితే స్వాహేతి।

11. క్షేత్రపాల బలిందత్వా। గ్రహోన్యాసాద్వశం వ్రజేత్। శత్రవో నాశమాయాన్తి రణేవైరిగణక్షయః

12. హంసబీజన్తు విన్యస్యవిషన్తు త్రివిధం హరేత్। అగురుచందనం కుష్ఠం కుంకుమం నాగకేసరమ్.

13. నఖంవై దేవ దారుంచ సమంకృత్వాథ ధూపకః। మాక్షికేణ సమాయుక్తో దేవవస్త్రాది ధూపనాత్

14. వివాదే మోహనే స్త్రీణాం మండనే కలహే శుభః। కన్యాయా వరణే భాగ్యే మాయామంత్రేణ మంత్రితః

15. హ్రీం రోచనా నాగపుష్పాణి కుంకుమంచ మనః శిలా। లలాటే తిలకం కృత్వాయం పశ్యేత్సవశీ భవేత్.

16. శీతావర్యాస్తు చూర్ణంతు దుగ్ధపీతంచ పుత్రకృత్। నాగ కేసర చూర్ణంతు ఘృత పక్వన్తు పుత్రకృత్.

17. పాలాశ బీజ పానేన లభతే పుత్రకం తథా।

పై శ్లోకమును అనుసరించి “ఓం హ్రూం హంసః” అను మంత్రముచే అపమృత్యు దోషములు మరియు రోగములు పోవును. ఈ మంత్రముతో ఒకలక్షదూర్వాహోమములు చేసిన శాంతి పుష్టి లభించును. లేదా కేవలం ప్రణవమునుగాని. మాయా భీజమును (హ్రీం) గాని జపించుటచే దివ్యాంతరిక్ష భౌమ ఉత్పాతములు శమించును. “ఓం నమోభగవతి” మొదలు స్వాహా॥ వరకు ఉన్న మూలోక్త మంత్రమును లక్షజపముచేసి దశాంశ హోమములు

చేస్తే సర్వకర్మలను సాధించును. ఇంద్రాష్టదిక్పాలకులను కూడా వశము చేసుకొనవచ్చును. ఈ విద్య రహస్యము అయినది మోహింపజేయునది. శతృబుద్ధి స్తంభింపచేయునది. శత్రువును మిత్రునిగా మార్చునది. ఈ కామధేనువు విద్యా, సప్తవిధములు శతృవు, చోరులను మోహింప జేయునది. ఈశ్వరునకు ప్రీతిపాత్రమైనది. సర్వాభయములయందు పఠించదగినది.

ఈ మంత్ర రాజమును చెప్పెదెను. దీనిని లక్షజపించి తిలహోమమును చేసిన మంత్రసిద్ధి అవుతుంది. మంత్రవిధానము చెప్తున్నాను.

"ఓం హలే" మొదలు స్వాహా" వరకు ఉన్నమూలమంత్రము దుర్గ దుర్గము నుండి తరింపచేయటం వల్ల అమే కాపేరు వచ్చింది. ఈమె మంగళప్రదురాలు "ఓం హ్రీం చండకపాలిన" మొదలు ఫట్ హ్రీం వరకును ఉన్న మూల మంత్రమును జపించి బియ్యము కడిగి వాటిని ఈ మంత్రముతో ముప్పై పర్యాయములు అభిమంత్రించి వాటిని దొంగలకు పంచి పెట్టినచో అబియ్యము తినగానే వారి తెల్లని దంతములు  ఊడిపోవును వారు చౌర్య పాప  విముక్తులగుదురు.

"ఓం జ్వలల్లోచన మొదలు తేస్వాహా" అను మూలమంత్రముతో క్షేత్రపాలునకు బలి ఇచ్చిన న్యాసము చేసినచో గ్రహము వశమగును. శత్రువులు నశింతురు. రణభూమి యందు శత్రువులు హతులగుదురు. విష బీజన్యాసముచే మూడు విధములుగు విషయములను లేదా విఘ్నములను హరించవచ్చును. అగురచందన, కుష్ఠ, కుంకుమ, నాగ, కేసర, నఖదేవదారువులను సమ ప్రమాణమున గ్రహించి నూరి ధూపము వేయవలెను. దినిలో తేనె కలిపి దాని సుగంధముతో శరీరమును వస్త్రాదులను ధూపితము చేసినచో వివాదస్త్రీ మోహనము శృంగారము కలహము మొదలగు సమయము నందు శు భఫలము లభించును. కన్యావరణ, భాగ్యోదయ సంబంధి కార్యములందు కూడా సాఫల్యము లభించును.

మాయ మంత్రము (హ్రీం) చే అభిమంత్రించిన రోచన నాగకేసర కుంకుమ మన శ్శిలలతో తిలకము ధరించి ఎవరినైన వశము చేసుకోవచ్చు. శతావరి చూర్ణమును పాలతో కలిపి త్రాగినచో పుత్రులు కలుగుతారు. నాగకేసర చూర్ణమును నేతిలో కలిపి తిన్నను పలాశబీజములను నూరి త్రాగినను పుత్రులు  కలుగును.

## 159. అఘోరాస్త్రమంత్రము

1. ఓం ఉత్తిష్ఠ చాముండే జంభయ జంభయ మోహయ మోహయ అముకం వశమానయ వశమానయ స్వాహా
2. షడ్ వింశాసిద్ధవిద్యాసా నదీతీరమృదాస్త్రియమ్
3. కృత్వోన్మత్తరసేనైవ నామాలిఖ్యార్కపత్రకే। మూత్రోత్సర్గం తతః కృత్వా జపేత్తా మానయే త్రిస్సయమ్.
4. ఓం క్షుం సః వషడ్. మహామృత్యుంజయో మంత్రోజప్యాద్ధోమాచ్చ పుష్టికృత్।
5. ఓం హంసః, హ్రూం హం, సః, హ్రః, సౌం, స్యైః।
6. మృతసంజీవనీ విద్యా అష్టార్ణా జయకృద్రణే.
7. మంత్రా ఈశాన ముఖ్యాశ్చ ధర్మకామాది దాయకాః।
8. ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వ భూతానామ్.బ్రహ్మణాశ్చాధి పతిర్బ్రహ్మ శివోమే౽స్తు సదాశివోమ్
9. తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్
10. ఓం అఘోరేభ్యో౽థ ఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యస్తు సర్వతః సర్వేభ్యః సర్వశర్వేభ్యో నమస్తేస్తు రుద్రరూపేభ్యః।
11. ఓం వామదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమః రుద్రాయ నమః కాలాయనమః కలవికరణాయ నమో బల వికరణాయ నమో బలాయ నమో బల ప్రమథనాయ నమః సర్వభూత దమనాయ నమో మనోన్మనాయ నమః
12. ఓం సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయ వైనమః
    భవే భవేనాతిభవ భవస్వమాం భవోద్భవాయ నమః
13. పంచ బ్రహ్మాంగ షట్కంచ వక్ష్యే౽హం భుక్తిముక్తిదమ్।
14. ఓం నమః పరమాత్మనే పరాయ కామదాయ పరమేశ్వరదాయ
    యోగాయ యోగసంభవాయ సర్వకరాయ కురు కురు సత్యసత్యభవ
    భవోద్భవ వామదేవ సర్వకార్యకర పాపప్రశమన సదాశివ ప్రసన్న నమో౽స్తుతే స్వాహా.

15. హృదయం సర్వార్థదంతు సప్తత్యక్షర సంయుతమ్।

16. ఓం శివః శివాయ నమః శివః; ఓం హృదయే జ్వాలిని స్వాహా శఖా; ఓం శివాత్మక మహా తేజః సర్వజ్ఞ ప్రభురావర్తయ మహాఘోర కవచ పింగల నమః

17. మహాకవచ శివాజ్ఞయా హృదయం బంధ బంధ ఘూర్ణయ ఘూర్ణయ చూర్ణయ చూర్ణయ సూక్ష్మ వజ్రధర వజ్రపాశ ధనుర్వ్రజా శనివజ్ర శరీర మమ శరీర మనుప్రవిశ్య సర్వదుష్టాన్ స్తంభయ స్తంభయ హూమ్

18. అక్షరాణాన్తు కవచం శతం పంచాక్షరాధికమ్

19. ఓం ఓజసే నేత్రం ఓం ప్రస్ఫుర ప్రస్ఫుర తనురూప చట చట ప్రచట ప్రచట

కట కట వమ వమ ఘాతాయ ఘాతాయ హుం హుం ఫట్ అఘోరాస్త్రమ్.

ఇత్యాది మహాపురాణే ఆగ్నేయ షడంగా ఘోరాస్త్రవర్ణనం నామ

త్రయో వింశత్యధిక త్రిశతతమోఽధ్యాయః

పై శ్లోకముననుసరించి "ఓం ఉత్తిష్ఠ" మొదలు "స్వాహా" వరకు ఉన్న మూలమంత్రము ఇరువది అక్షరముల సిద్ధ విద్య నదీ తీరము నందలి మట్టితో లక్ష్మీమూర్తి చేసి తత్తువుల రసముతో మందార పత్రముపై ఇష్టస్త్రీ నామమును వ్రాయవలెను తరువాత మూత్రోత్సర్గము చేసి ఈ మంత్రమును జపించినచో అభీష్టస్త్రీ వశమవుతుంది. ఓం జూం ("క్షుం సః వషట్") ఇది మహామృత్యుంజయ మంత్రము దీనిజప హోమములు పుష్టి కార్యములు "ఓం హం సః హ్రూం హుం సః హ్రః సౌస్కైః" యీ అష్ట వర్ణ మృత సంజీవని విద్యరణము నందు జయము నిచ్చును ఈశానాది మంత్రములు కూడా దర్మకామాది దాయకములు "ఈశానః మొదలు భవోద్భవాయునమః" యను వరకును ముల్లోకములు ఐదు ఈశానాది మంత్రములు ఇప్పుడు భుక్తిముక్తి మూలములగు పంచబ్రహ్మ యొక్క ఆరు అంగములు సూచించారు. "ఓం నమః" పరమాత్మనే మొదలు "తే స్వాహా" వరకు ఉన్న 77 అక్షరముల హృదయ మంత్రము మనోరథములను ఇచ్చును "ఓం శివ శివాయనమః" ఇది శిరో మంత్రము ఓం శివ హృదయే జ్వాలీ స్వాహా శిఖాయై వషట్ ఇది శిఖామంత్రము ఓం శివాత్మక మొదలు "స్తంభయహూం" వరకు ఉన్నవి

ఒకనూరు ఐదు అక్షరముల కవచ మంత్రము ఓం ఓజసే యనునది నేతమంత్రము ఓం "ప్రస్ఫుర మొదలు "హుఫట్" వరకును ఉన్నది ఇది అఘోరాస్త్ర మంత్రము.

## 160. సమస్త గ్రహశాంతి కల్పము

1. రుద్రశాంతిం ప్రవక్ష్యామి శివాం సర్వార్థసాధనీమ్। పుత్రార్థం గ్రహనాశార్థం విషవ్యాధి వినష్టయే
2. దుర్భిక్షమారీ శాంత్యర్థే దుఃస్వప్న హరణాయచ । బలాది రాజ్య ప్రాప్త్యర్థం రిపూణాం నాశనాయచ.
3. అకాలఫలితే వృక్షే సర్వగ్రహ విమర్దనే। పూజనేతు నమస్కారః స్వాహాన్తో హవనే తథా.
4. ఆప్యాయనే వషట్కారం పుష్టౌ వౌషణ్ని యోజయేత్ । చకార ద్వితయస్థానే జాతి యోగన్తు కారయేత్.
5. ఓం రుద్రాయ చతేఓం వృషభాయ నమః అవిముక్తాయ అసంభవాయ, పురుషాయచ పూజ్యాయ ఈశానాయ పౌరుషాయ పంచచోత్తరే విశ్వరూపాయ కరాలాయ వికృతరూపాయ అవికృతరూపాయ.
6. నికృతౌ చాపరేకాలే అప్పుమాయాచ నైర్రుతౌ। ఏక పింగలాయ శ్వేతపింగలాయ కృష్ణపింగలాయ నమః
7. మధు పింగలాయ నమః మధుపింగలాయ నియతౌ అనంతాయ ఆర్ద్రాయ శుష్కాయ ప్రయోగణాయ
8. కాలతత్త్వే కరాలాయ వికరాలాయ । ద్వొమాయాతత్త్వే । సహస్రశీర్షాయ సహస్ర వక్త్రాయ సహస్ర కరచరణాయ చరణాయ సహస్ర లింగాయ। విద్యాతత్త్వే। సహస్రాక్షాద్విన్యసేద్దక్షిణే దలే।
9. షడ్రుద్రాయేశతత్త్వేతు వహ్నిపత్రే స్థితా గుహ।
10. భూతపతయే పశుపతయే ఉమాపతయే కాలాధిపతయే।
11. సదాశివాఖ్యతత్త్వే షట్ పూజ్యాః పూర్వదలే స్థితాః
12. ఉమాయై కురూప ధారిణి ఓం కురు కురు రుహిణి రుహిణి।
13. రుద్రోऽసి దేవానాం దేవానాం దేవ దేవ విశాఖ హనహన దహదహ పచపచ మథమథ తురుతురు

14. అరుఅరు సురుసురు రుద్రశాంతి మనుస్మర కృష్ణపింగళ అకాల పిశాచాధిపతి విశ్వేశ్వరాయ నమః శివతత్త్వే కర్ణికాయాం పూజ్యౌతూమా మహేశ్వరౌ
15. ఓం వ్యోమవ్యాపినే వ్యోమ రూపాయ సర్వవ్యాపినే
16. శివాయ అనన్తాయ అనాథాయ అనాశ్రితాయ శివాయ శివతత్త్వేనవ పదాని వ్యోమవ్యాప్యభిధాస్యహి.
17. శాశ్వతాయ యోగపీఠ సంస్థితాయ నిత్యం యోగినే
18. ధ్యానాహారాయనమః. ఓం నమః శివాయ సర్వప్రభవే
19. శివాయ ఈశాన మూర్ధాయ తత్పురుషాది పంచ వక్త్రాయ।
20. నవపదం పూర్వదలే సదాఖ్యే పూజయేద్గుహా।
21. అఘోర హృదయాయ వామదేవ గుహ్యాయ సద్యోజాత
22. మూర్తయే ఓం నమో నమః గుహ్యాతి గుహ్యాయ గోప్త్రే
23. అనిధనాయ సర్వయోగాధి కృతాయ జ్యోతీ రూపాయ।
24. అగ్ని పత్రే హోమతత్త్వే విద్యాతత్త్వే ద్వేయామ్యగే।
25. పరమేశ్వరాయ చేతనా చేతన వ్యోమన వ్యాపినే ప్రథమ
26. తేజస్తేజః మాయాత త్త్వేనైర్ఋతే చ కాలతత్త్వే ౽థ
27. వారుణే। ఓం ధృధృ నానా వాం వాం అనిధన నిధనోద్భవ
28. శివ సర్వ పరమాత్మన్ మహాదేవ సద్భావేశ్వర మహాతేజః
29. యోగాధిపతే ముంచ ముంచ ప్రపథ ప్రమథ ఓంసర్వ ఓంసర్వ ఓం భవ ఓం భవ
30. ఓం భవోద్భవ సర్వభూత సుఖప్రద
31. వాయుపుత్రే౽థ నియతౌ పురుషే చోత్తరేణ చ ।
32. సర్వసాన్నిధ్యకర బ్రహ్మ విష్ణు రుద్రపర అనర్చిత
33. అస్తుతస్తుత సాక్షిణ సాక్షిణ తురుతురు పతంగపింగపతంగ పింగజ్ఞాన జ్ఞాన
34. శబ్ద శబ్ద సూక్ష్మ సూక్ష్మ శివ శివ సర్వప్రద సర్వప్రద ఓం నమః
35. శివాయ ఓం నమోనమః శివాయ ఓం నమో నమః
36. ఈశానే ప్రాకృతే తత్త్వే పూజయేజ్జుహుయాజ్జపేత్। గ్రహరోగాది మాయార్తి శమనీ సర్వసిద్ధికృత్.

ఇత్యాది మహాపురాణే ఆగ్నేయ రుద్రశాంతి వర్ణవం నామ చతుర్వింశత్యధిక త్రిశతతమోఽధ్యాయః.

సర్వార్థ సాధకమగు మంగళకరమైన రుద్రశాంతి వివరాణత్మకంగా తెలుసుకుద్దాం. పుత్ర ప్రాప్తి గ్రహ బాధ నివారణకు, విషవ్యాధులకు, దుర్భిక్షములకు, దుస్స్వప్న నివారణకు రాజ్య ప్రాప్తికి ఇలాంటివి కలుగుటకు రుద్రశాంతిని ప్రయోగించవలెను. వృక్షములు సరి అయిన సమయంలో ఫలాలు ఇవ్వుటకు సమస్తగ్రహబాధలను తొలగుటకు ఈశాంతి చేయవలెను. మంత్రమునందు నమః చేర్చవలెను హోమముయందు స్వాహా చెప్పవలెను. తృప్తియందు వషట్‌ను పుష్టికరము యందు వౌషట్‌ను చేర్చవలెను. మంత్రమునందు రెండుచోట 'చ' ఉన్న చోట ఆవశ్యకతాను సారముగ "నమః" 'స్వాహా" మొదలగునవి చేర్చవలెను. "ఓం రుద్రాయ మొదలు "అవికృత రూపాయ" వరకును మూలక్తోము రుద్రశాంతి మంత్రము ఉత్తర పర్తి కమలదళమున నియతి తత్త్వము పశ్చిమమున కమలదళమున కాలతత్త్వము నైబుతి స్థానమున దళమున మాయతత్వము ఉండును. వీటి యందు దేవతలను పూజించవలెను. ఏకపింగళాయ, శ్వేతపింగళాయ, కృష్ణపింగళాయ, మధుపింగళాయ, మదుపింగళాయ నమః, నియతితత్త్వమునందు పూజించవలెను అనంతాయ, ఆర్ద్రాయ, శుష్కాయ, పయోగణాయమని, కాలతత్వమునందు కరాళాయ, వికరాళాయయని మాయాతత్త్వమునందు పూజించవలెను. దక్షిణ దళమునందున్న విద్యాతత్త్వమును "సహస్ర శీర్షాయ" మొదలు "సహస్రలింగాయ" వరకు చెప్పి పూజించవలెను. అక్కడే ఏకజటాయ మొదలు షడ్రుద్రాయ వరకు షడ్విధ రుద్రుల పూజ చేయవలెను. ఆగ్నేయదళమున ఉన్న ఈశ తత్వమున భూత పతయే పశుపతయే ఉమాపతయే కాలాధిపతయే నమః చెప్పి పూజ చేయవలెను. పూర్వ దళమునున్న సదాశివతత్త్వము నందున్న ఆరువురిని "ఉమాయై" మొదలు "విశ్వేశ్వరాయ నమః" వరకును ఉన్న మంత్రములతో పూజించవలెను. కర్ణికలను నున్న శివతత్త్వముపై ఉమా మహేశ్వరుని ఓం వ్యోమ వ్యాప్తినే మొదలు శివాయ వరకును ఉన్న వేదోక్త మంత్రముతో పూజించవలెను. శివతత్త్వమున వ్యోమవ్యాపి అనుపేరు గల శివుని నవపదముల పూజించవలెను. తరువాత యోగపీఠముపై నున్న శివుని నవపదయుక్త నామములు చెప్తూ అర్చన చేయవలెను "శాశ్వతాయ" మొదలు పంచవక్త్రాయ వరకును ఉన్న మూలోక్తము మంత్రము తరువాత "సత్" అను పేరుగల పూర్వ దళము నందు "అఘోర హృదయము" మొదలు "జోతిరూపాయ" వరకును మూలోక్త మంత్రముతో శివున్ని పూజించవలెను. ఆగ్నేయము నందున్న ఈశతత్త్వమునందు దక్షిణమునం

దున్న విద్యాతత్త్వమునందును "పరమేశ్వరాయ" మొదలు "తేజ" వరకున్న మంత్రముతో పరమేశ్వరున్ని పూజించవలెను. నైఋతి యందున్న కాల తత్త్వమునందును పశ్చిమ దిక్కునందున్న కాలతత్త్వ నందును "ఓంధ్రుధ్రు" మొదలు "సుఖప్రద" వరకును ఉన్న వేదోక్తమంత్రములతో పూజచేయవలెను. వాయువ్య ఉత్తరదళము లందున్న నియతి పురుషులను "సర్వసాన్నిధ్యకర" మొదలు "నమోన్నమః" వరకున్న వేదోక్తమంత్రముతో పూజించవలెను. ఈశాన్యమునందున ప్రాకృత తత్త్వమునందు కూడా జపహోమములు చేయవలెను. ఈ రుద్రశాంతి గ్రహభాధలను రోగాలను నశింప చేయును.

## 161. వాస్తవకాలసర్పయోగము

కాలసర్పయోగము అంటే ఏమిటి? అసలు దానిస్వరూపము ఏమిటి? ఈ ప్రశ్నలకు సమాధానము ఏమిటి? చాలామంది రాహువు, కేతువుల మధ్య సప్తగ్రహములు ఉంటే దానిని కాలసర్పయోగము అవుతుంది అని అందరికి తెలుసు. కాని దానిస్వరూపము దగ్గర పొరపాటు చేస్తున్నారు. రాహుకేతువుల మధ్యలో సూర్య, చంద్ర, కుజ, గురు, శుక్ర, శని ఇత్యాధి గ్రహములు ఉంటే కాలసర్పయోగము స్పష్ఠమగును రాహుకేతువులు ఎల్లప్పుడు వక్రగతిలోనే ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| రాహువు | | | |
| శుక్రుడు | జాతక చక్రము | | |
| గురువు | | | |
| చంద్రుడు<br>కుజుడు<br>బుధుడు | రవి<br>లగ్నం | శని | కేతువు |

పైన ఉదాహరణగా తీసుకొన్న జాతకచక్రములో రాహువు, కేతువుల మధ్య అన్యగ్రహములు ఉన్నాయి. మీనరాశి నుండి కన్యారాశిలోపు సప్తగ్రహములు

ఉన్నాయి. అనగా మీనంలో రాహువు, రాహువు భ్రమణం మీనం నుండి కుంభం, మకరం, ధనస్సు, వృశ్చికం, తుల, కన్యా, రాశుల వైపు ఉంటుంది. కేతువు భ్రమణం కన్యారాశి నుండి మీనరాశుల వైపు ఉంటుంది. అన్యగ్రహములు వీటి మధ్య ఉండటం వల్ల నిర్ధుష్టకాలసర్పయోగం ఏర్పడినది.

| కేతువు | | | |
|---|---|---|---|
| శుక్రుడు | జాతక చక్రము | | |
| గురువు | | | |
| చంద్రుడు కుజుడు | రవి లగ్నం బుధుడు | శని | రాహువు |

పైన 2వ ఉదాహరణలో జన్మకుండలిలో రాహువు భ్రమణం కన్యారాశి నుండి సింహ, కర్కాటకం, మిధునం, వృషభం, మేషం మీన రాశుల మధ్య అన్యగ్రహములు (సప్తగ్రహములు) లేకుండా ఉన్నాయి. ఇట్టిస్థితిలో కాలసర్పయోగము అవదు పైరూపములో ఉన్నది కాలసర్పయోగము కాదు. రాహువు భ్రమణమును బట్టి కాలసర్పయోగము సూచించవలెను. పైన జాతక కుండలిలో కాలసర్పయోగము లేదు. ఇలాంటివి అన్ని పరిశీలించి కాలసర్పయోగమును విశ్లేషించవలెను.

## 162. డిగ్రీలలో కాలసర్పయోగము

గ్రహములన్నియు రాహుకేతువుల మధ్య నుండుట ఇది కాలసర్పయోగము మరియు రాహు కేతువుల సమిష్ఠి యోగము. రాహుకేతువులు వెనకకు నడుచు గ్రహములగుటచేత రాహువు యొక్క దంష్ట్రాయుత వక్రము ముందువైపున నుండును. అందువలన రాహువునకు ముందును కేతువుకు వెనుకను, ఉన్నప్పుడు మాత్రమే కాలసర్పయోగమని అందురు. దానికి వ్యతిరేకమున కేతువు ముందును రాహువునకు వెనుకను గ్రహములు ఉ

న్నప్పుడు అపసవ్య కాలసర్పయోగము ఏర్పడును. మొదట దానిని రాహు కేతువుల మధ్యస్థమనియు, రెండవ దానిని కేతురాహువుల మధ్యస్థమనియు అందురు.

రెండవది మొదటి దాని యంత దోషయుక్తము కాక పోవచ్చును గాని దోష రహితము మాత్రము కాదు ఇతర యోగములు బలంగాయున్నప్పుడును జన్మలగ్న, అరూఢ లగ్న, ఉపపద, కారకాంశ లగ్నములన్నీ గాని వీనిలో కొన్నిగాని ఆగ్రహముల మధ్య పడకపోయినప్పుడును. ఆయోగదోషము కొంత తగ్గును. కాలసర్పయోగమున్న కొన్ని జాతకములు బాగా యోగించుటకు మంచి యోగములు లేక రాజయోగములు లేక పరివర్తనయోగములు ఉండటం వల్ల మరియు రాహు కేంద్రమునందును కేతువు 3,11 స్థానములందు ఉన్నప్పుడు యోగ కారకులుగా కాలసర్పయోగము పరాభూత మగుచున్నది. అన్యగ్రహ సంబంధములే కూడ రాహుకేతువులు ఆయాభావములనందున్న ప్పుడు సామాన్యంగా ఉండు ఫలితములు కలుగును.

## కాలసర్పయోగ ప్రభావము తగ్గటానికి కారణములు

1. జన్మలగ్నాధిపతి ఉచ్ఛ స్థానమునందు ఉండటము
2. జన్మలగ్నమందు ఉచ్ఛగ్రహము ఉండటము
3. జన్మలగ్నమునకు గాని లగ్నాధిపతికి గాని శుభార్గళముపట్టుట
4. చంద్రునకు దురు దురా యోగము ఏర్పడటము
5. గ్రహమాలికా యోగము గాని పదమాలికా యోగం కలుగుట
6. ఆ రాహు కేతువులున్న నక్షత్రమందే ఏదైన శుభగ్రహ ముండి అదే రాశి యందుండుట
7. చంద్రునకు తృతీయమున శుక్రుడు ఉండుట వలన.
8. శుభగ్రహములు నాలుగును పాపంబంధం లేక రెండు జతలుగా నుండుట మూడుగ్రహములు స్వక్షేత్రమునందుగాని రెండు గ్రహములు ఉచ్ఛయందు గాని ఉంచుట
9. పదములన్నియు యేదొక గ్రహముతో కలసి యుండుట లేదా గ్రహములన్నియు యేదొయొక పదము నందు ఉండుట.

10. గజకేసరియోగం, చంద్రమంగళయోగం, బుధాదిత్యయోగం పంచానన యోగముల వలన పై యోగముల వలన ప్రభావం తగ్గును.

రాహువు మిక్కిలి పాపి ఇతడు ఎవరితో కలిసినను ఆగ్రహమకారత్వమునకో లేదా ఆభావ కారకత్వమునకో తప్పకుండ చెడు చేస్తాడు.

రాహుకేతువులు ఎప్పుడు ఏరాశి యందైనను సమాన భుక్తి కలిగి యుందురు కనుక అందురాహువు ఆత్మ కారకుడగుటకు కూడా అవకాశము కలిగినది. వీరు ముఖ్యంగా తాము నిలచియున్న స్థానములను బట్టి కలసిన గ్రహములను బట్టియు శుభపాప ఫలితముల వలన ఇచ్చుదురు.

కేతువు ద్వితీయమునందు ఉన్నప్పుడు రాహువు వ్యయమునందు ఉన్నప్పుడు పాపార్గళమునకు బలమెక్కువ చరకేతర రాశియందున్నపుడు మాత్రమే కేతువుని పాపునిగా తీసికొనవలెను. చరరాశియందున్నపుడు శుభునిగా గ్రహించవలెను.

కాలసర్పయోగమును డిగ్రీలలో చూడవలెను.

డిగ్రీలలో ఎందుకంటే. ఒక జాతకమును పరిశీలిస్తే లగ్నకుండలి ఎలా ఉండాలి? ఎలా లగ్నకుండలి డిగ్రీలలో ఏర్పడితే కాలసర్పయోగం ఏర్పడు తుంది.

జన్మకుండలి 12 రాశులలతో ఏర్పడును ఒక్కొక్క రాశికి $30^0$, 12 రాశు లకు $360^0$ అవుతుంది.

రాహువుకేతువులు ఎల్లప్పుడు $180^0$ల దూరంలో ఉంటారు. రాహుకేతువులు మధ్యలో 5 రాశులు ఉంటాయి.

కాలసర్పయోగమునకు ఉదాహరణలు

ఉదాహరణ 1

| | | | |
|---|---|---|---|
| | రాహువు | రవి | గురువు |
| | రాశి కుండలి | | లగ్నం శుక్రుడు శని |
| | | | చంద్రుడు |
| | | కేతువు | గురువు బుధుడు |

పై పేర్కొన్న లగ్నకుండలిలో రాహువు భ్రమణం మీనరాశివైపు ఉంది. కాని కేతుభ్రమణం కన్యారాశివైపు ఉంది. రాహువు భ్రమణం వైపు గ్రహములు ఉంటేనే కాలసర్పయోగము అవుతుంది. పై ఉదాహరించిన కుండలిలో లేదు

ఉదాహరణ 2

| | | | |
|---|---|---|---|
| శుక్రుడు | లగ్నం | | రాహువు గురువు |
| రవి బుధుడు | రాశి కుండలి | | |
| కుజుడు శని | | | |
| కేతువు చంద్రుడు | | | |

గ్రహము - డిగ్రీలు

గురువు - $6^0-10'$ రాహువు - $16^0 - 24'$

చంద్రుడు - $8^0 -20'$ కేతువు - $22^0 - 22'$

పై విషయాన్ని పరిశీలిస్తే రాహు డిగ్రీల కంటే గురువు తక్కువ డిగ్రీలలో ఉండటం కేతువు డిగ్రీల కంటే చంద్రుడు తక్కువ డిగ్రీలలో ఉండటం మరియు రాహువు భ్రమణం వృషభ రాశివైపు ఉండటం వల్ల ఇది సరియైన కాలసర్పయోగం అవుతుంది.

## 163. ద్వాదశ కాలసర్పయోగముల ఫలితములు విశ్లేషణ

**<u>అనంతకాలసర్పయోగము యొక్క ఫలితవిశ్లేషణ</u>**

జన్మలగ్నంలో రాహువు సప్తమం కేతువు ఉన్నచో దానిని అనంతకాలసర్ప యోగము అంటారు.

**<u>ఫలితములు:</u>**

1. అనుకున్న పనులు జరగక పోవటము
2. జీవితములో అన్ని విషయములలో చాలా ఆలస్యంగా జరగడం
3. ఏమి జరగక పోవడము
4. చదువు, వివాహము, సంతానము విషయాలలో ఆలస్యంకావడం
5. మానసిక ఆందోళనలు
6. అన్నదమ్ముల, అక్కచెల్లల సమ్యలు వీరిమీద పడటం
7. వివాహము జరిగితే విడిపోవడం (లేదా) భార్యభర్తల మధ్య గొడవులు
8. ఏ విషయాలు జరగకపోవడం
9. అన్ని విషయములలో అసంతృప్తి
10. ఏ పని చేయకపోవడం (లేదా) చేయాలి అని అనిపించకపోవడం.

**<u>2. కుళిక కాలసర్పయోగఫలిత విశ్లేషణ:</u>**

జన్మలగ్నమునుండి ద్వితీయంలో రాహువు అష్ఠమంలో కేతువు ఉన్నచో దానిని కుళికకాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1. ఈ కాలసర్పయోగము ధనము, వాక్కు కుటుంబము, ఆరోగ్యము, ఆయుష్షు మీద ప్రభావము చూపును.

2. కుటుంబములో సమస్యలు, గొడవలు జరగడం
3. కుటుంబములో విడిపోవడం
4. ఎవరైన మాట్లాడితే గొడవలు జరగడం
5. చెడు వాక్కులు రావడం
6. మరణగండములు కలుగును
7. ఆరోగ్యము దెబ్బతినును
8. ఆయష్షు తరిగిపోవును
9. అనారోగ్యము కలుగును

**3. వాసుకి కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:**

జన్మలగ్నము నుండి తృతీయంలో రాహువు నవమంలో కేతువు ఉన్నచో దానిని వాసుకి కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1. సోదరుల మధ్య వైరము ఏర్పడుట
2. సోదరులకు అనారోగ్యము ఏర్పడుట
3. ఉద్యోగములో బాధలు
4. ఉద్యోగము ఊడిపోవుట
5. ప్రమోషన్‌లో ఆటంకములు
6. ధనము ఖర్చుకావడం
7. గృహస్థ జీవనంలో కాఠిన్యత

**4. శంఖపాల కాలసర్పయోగ ఫలితవిశ్లేషణ:**

జన్మలగ్నము నుండి చతుర్థంలో రాహువు దశమంలో కేతువు ఉన్నచో దానిని శంఖపాల కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) వాహనములు, గృహములు కొనుటలో జాప్యం జరగడం లేక అసలు కొనలేకపోవడం

2) మాతృ సౌఖ్యం తక్కువ

3) తల్లికి అనారోగ్యము

4) విద్యలో ఆటంకము

5) వ్యాపారంలో నష్టాలు కలగడం

6) ఉద్యోగంలో లాభం లేకపోవడం

7) తండ్రికి అనారోగ్యము

8) వృత్తిలో అనుకూలత లేకపోవడం

**5. పద్మకాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:**

జన్మలగ్నము నుండి పంచమంలో రాహువు ఏకాదశంలో కేతువు ఉన్నచో దానిని పద్మకాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) గర్భాశయములో లోపం కలుగుట

2) గర్భము పోవుట

3) సంతానము కలుగకపోవటం

4) విచిత్రమైన వ్యాధులు రావడం

5) ధనము ఖర్చు కావడం

6) లాభం కంటే నష్టం కలగడం

7) వ్యసనముల వల్ల భారీనష్టములు

8) బాల్యం నుండే బాధలు కలగడం

9) వ్యాపారంలో (వృత్తి) నష్టం కలుగును

**6. మహాపద్మకాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:**

జన్మలగ్నము నుండి షష్ఠమంలో రాహువు ద్వాదశంలో కేతువు ఉన్నచో దానిని మహాపద్మకాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) దీర్ఘకాలిక రోగములు
2) తీవ్ర అనారోగ్యము
3) శతృవుల పీడ కలుగును
4) శతృవులతో గొడవలు
5) బంధువులు, స్నేహితులు శతృవులుగా మారడం
6) మానసిక ఆందోళనలు మానసిక ప్రశాంతత లేకపోవడం
7) గృహము నందు అసంతృప్తి
8) ధనము ఖర్చు అవుతుంది
9) అప్పులు ఎక్కువగా ఉండటం
10) ధనము వస్తుంది. అంటే అప్పులు ఎదురు చూస్తుంటాయి.
11) వృద్ధాప్యంలో కష్టములు కలగడం

**7. తక్షక కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:**

జన్మలగ్నము నుండి సప్తమంలో రాహువు లగ్నంలో కేతువు ఉన్నచో దానిని తక్షక కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) మనస్సు చంచలంగా ఉండటం
2) పనిమీద ధ్యాసలేకపోవడం
3) భార్యాభర్తలు విడిపోవడం
4) పీటల మీద పెళ్ళిల్లు ఆగిపోవడం
5) విడాకులు కావడం
6) పరస్త్రీ సంగమం
7) నిశ్చితార్థము తరువాత పెళ్లిళ్లు ఆగిపోవడం
8) జీవిత భాగస్వామితో సమస్యలు
9) పుత్రసంతానం లేదని బాధపడటం

## 8. కర్కోటక కాలసర్పయోగఫలిత విశ్లేషణ:

జన్మలగ్నము నుండి అష్టమంలో రాహువు ద్వితీయంలో కేతువు ఉన్నచో దానిని కర్కోటక కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) ఎంత కష్టపడినా ఫలితం లభించదు
2) దీర్ఘరోగములు, కలుగును
3) శస్త్రచికిత్సలు జరుగును
4) అకాలమరణములు
5) విపరీతమైన ధన నష్ఠం కలుగును
6) గొంతు వ్యాధులు కలుగును.
7) జీవితంలో అన్ని ఆల్యంగా జరుగును.

## 9. శంఖచూడ కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:

జన్మలగ్నము నుండి నవమంలో రాహువు తృతీయంలో కేతువు ఉన్నచో దానిని శంఖచూడ కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) సోదరులతో విరోధం
2) గృహములో బాధలు కలుగును
3) ధనము నందు అసంతృప్తి కలుగును
4) దేవునియందు భక్తి లేకపోవడం
5) అవమానాలు, కలగడం
6) గౌరవమర్యాదలకు లోటుకలుగును
7) వృత్తి (ఉద్యోగము, వ్యాపారము, వ్యవసాయం) లో అధికంగా శ్రమించినా నష్ఠం కలుగును.

## 10. పాతక కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:

జన్మలగ్నము నుండి దశమంలో రాహువు చతుర్థంలో కేతువు ఉన్నచో దానిని పాతక కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) వృత్తిలో తీవ్ర అసంతృప్తి
2) వృత్తిలో ప్రతికూల ఫలితాలు
3) వాహనముల మీద ప్రమాదములు
4) వాహనములు గృహములు అమ్ముట
5) తల్లి దండ్రులు దూరముగా నుండటము
6) మిత్రులు ద్రోహము చేయుట

## 11. విషక్తకాల కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:

జన్మలగ్నమునుండి ఏకాదశములో రాహువు పంచమంలో కేతువున్నచో దానిని విషక్తి కాలసర్పయోగము అందురు.

**ఫలితము:**

1) సంతాన నష్టము కలుగును
2) స్వల్ప సంతానము కలుగుట
3) కోర్టు వ్యవహారములో తలదూర్చుట
4) నేత్ర, చెవి సంబంధ రోగములు
5) మిత్రులతో తగాదాలు
6) పరస్థలములో నివసించుట
7) వ్యాపారములో చిక్కులు కలుగుట

## 12. శేషనాగ కాలసర్పయోగ ఫలిత విశ్లేషణ:

జన్మ లగ్నము నుండి ద్వాదశంలో రాహువు షష్ఠమంలో కేతువు ఉన్నచో దానిని శేషనాగ కాలసర్పయోగము అందరు.

**ఫలితము:**

1) విపరీత దన నష్టము
2) శత్రువుల పీడ

3) దీర్ఘకాలిక రోగములు

4) కోర్టు వివాదాలు

5) ప్రాణభయము

6) అందరితో విరోదములు

7) అవమానములు కలుగును

## 164. శశిమంగళయోగము

శశి అనగా చంద్రుడు మంగళ అనగా మంగళప్రదమయిన వాడు కుజుడు అని అర్ధం. అందువలన శశిమంగళయోగము అందురు (లేక) చంద్రమంగళ యోగము అని అంటారు. ఈ యోగమును లక్ష్మీయోగము అని కూడా పిలుస్తారు.

చంద్రుడు, కుజుడు ఇద్దరు కలసి మేష, వృషభ, వృశ్చిక, మకర రాశులలో ఉంటే చంద్రమంగళయోగము అవుతుంది. ఈ ఇద్దరి కలియిక కూడా కర్కాటకంలో కూడా చంద్రమంగళయోగం ఏర్పడును.

1) వృషభ లగ్న జాతకులు వృషభలగ్నంలో చంద్రుడు దానికి కేంద్రమయిన వృశ్చికంలో కుజుడు ఉంటే విశేషమైన శశిమంగళయోగం ఏర్పడును.

2) కర్కాటక లగ్నజాతకులు కర్కాటలగ్నంలో చంద్రుడు దానికి కేంద్రాలు అయిన సప్తమంలో అనగా మకరంలో కుజుడు ఉంటే మరియు దశమంలో అనగా మేషంలో కుజుడు ఉంటే శశిమంగళయోగం ఏర్పడును.

3) వృశ్చికలగ్న జాతకులు వృశ్చికలగ్నంలో కుజుడు దాని కేంద్రమయిన మేషంలో చంద్రుడు ఉంటే విశేషమైన శశిమంగళయోగం ఏర్పడును.

4) మకరలగ్నజాతకులు మకరలగ్నంలో కుజుడు దానికి కేంద్రాలు అయిన సప్తమంలోను (7) మరియు చతుర్ధంలోను (4) కర్కాటక, మేషంలోను చంద్రుడు ఉంటే కూడా శశిమంగళయోగం ఏర్పడును.

<u>ఈ క్రింది విషయములననుసరించి నిర్ణయము చేయవలెను</u>

1) చంద్ర, కుజులు పాపగ్రహములతో కలసి ఉండకూడదు. శుభగ్రహసంబంధ మైన ఉండవలెను

2) పూర్ణ చంద్రుడై ఉండవలెను అనగా శుద్ధఏకాదశి మొదలు బహుళ పంచమి వరకు (లేక) రవి నుండి చంద్రుడి అంతరము $120^0$ నుండి $240^0$ వరకు ఉండును.

3) అస్తంగత దోషములు ఉండరాదు

4) షడ్బాలాలను బట్టి యోగాలను నిర్ణయించవలెను.

5) ఉచ్ఛలో ఉంటే గ్రహాలను బలమే గాని నవాంశల అదే గ్రహం నీచంలో ఉంటే మాత్రం ఆబలం పోతుంది.

6) ఉచ్ఛలో ఉన్న గ్రహం వక్రించినా బలం పోతుంది.

7) ఈ యోగము చంద్ర, కుజ దశలలో గాని అంతర్ధశలలో గాని ఈ యోగము ఫలించును.

పై విషయములు సంపూర్తిగా నున్నచో చంద్రమంగళ యోగము ఫలితమివ్వగలదు.

<u>చంద్ర కుజ గ్రహకారకత్వాలను పరిశీలిద్దాం</u>

**చంద్రుడు:** ఐశ్వర్యము, యశస్సు, తల్లి, శీతజ్వరము, జలం, మనస్సు, తపస్సు, శరీరం, శరీరధారుడ్యము, ధాన్యము, వస్త్రము, గృహనిర్మాణములు, ప్రజాకార్యములు, విద్యాదూరదేశాగమనము, స్త్రీ బంధువులు మానసిక సుఖం

**కుజుడు:** పదవీ అధికారం, పరాక్రమం, నాయకత్వం, కోర్టు, సోదరులు, బంధుద్వేషం, శత్రువృద్ధి, విదేశ గమనం భూసంపాదన, వ్యాపారం వల్ల ధనలాభం, బంగారం, తర్కశాస్త్రం, వ్యవసాయంలో లాభం, మిలటరీ ఉద్యోగాలు చంద్ర కుజుల గ్రహలక్షణములు పరిశీలిద్దాం.

**చంద్రుడు గ్రహలక్షణములు:** వైశ్యజాతి, స్త్రీగ్రహం, వాయువ్యదిక్కునకు అధిపతి, కర్కాటకం స్వక్షేత్రం, వృషభంలో ఉచ్ఛ, వృశ్చికం నీచ రవి, బుధులు, మిత్రులు, కుజుడు, గురువు, శుక్రుడు, శనిసములు, శత్రువులలేరు. చంద్రుడు ఒక్కొక్క రాశిలో 2 1/2 రోజు లేక 60 గంటల పాటు ఉండును. చంద్రుడు కర్కాటకంలో $0^0$–$30^0$ వరకు స్వక్షేత్రం, వృషభంలో $3^0$ వరకు ఉచ్ఛ, $4^0$ నుండి $20^0$ వరకు మూలత్రికోణం వృశ్చికంలో $13^0$ వరకు నీచ చంద్రుడు నందనామ సంవత్సరం కార్తీక శుద్ధ చతుర్ధ శికృత్తికానక్షత్రం

**కుజుడు గ్రహలక్షణములు:** క్షత్రియ జాతి, పురుష గ్రహం, దక్షిణదిక్కుకు అధిపతి, మేషం స్వక్షేత్రం, మకరం ఉచ్ఛ, కర్కాటకం నీచ, రవి, చంద్ర, గురు మిత్రులు, శుక్ర, శనిసములు, బుధుడు శత్రువు కుజుడు ఒక్కొక్క రాశిలో 45 రోజులు లేక 1 1/2 నెలల పాటు ఉండును. కుజుడు మేష, వృశ్చికంలో $0^0$–$30^0$ వరకు స్వక్షేత్రం, మకరంలో $28^0$ వరకు ఉచ్ఛలో ఉ

